శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము

## ఐదవప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితులగు

"కావ్యస్మృతితీర్థ"

జనమంచి శేషాద్రిశర్మచే రచింపఁబడి



చెన్నపురి :

'వావిళ్ల' ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1927.




# సద్వాంఛ

పుణ్యపూరుషులారా! శ్రీకృష్ణావతారతత్త్వమున నైదవ ప్రకరణ మించుక వేళ నతిక్రమించియే వెలువడియె. కారణ మందఱకు సువిదితమే. ఈప్రకరణమున మహాముని యష్టావక్రునిచరిత్రశేషము, బృందావనమున శ్రీకృష్ణపరబ్రహ్మామానందమున నివసింప నచ్చట నామహానుభావుని దర్శింప నాసురిమునియు శ్రీశంకరుఁ డరుదెంచి గోపికాజననిరాకృతులై సద్వీపముల భగవత్సేవకై నివసించుట, శ్రీరామావతారమున వరములందినవారెల్ల గోపికలయి గోకులమునఁ బుట్టుట, బ్రహ్మమోహినీసంవాదము, శంకరదర్పవిమోచనము, అహల్యోద్ధారకపరమాత్మచరిత్రము, కంసునకు దుస్స్వప్నములు తోఁచుట, పురోహితవచనము ననుసరించి యతఁడు ధనుర్యాగముచేయఁబూనుట, శ్రీకృష్ణాదుల నాహ్వానించుపొంటె నక్రూరుని బంపుట, అతఁడు మహానందమంది పయనమగుట, రాసమండలమున రాధ దుస్స్వప్నములం గాంచి పరితపించుట, శ్రీకృష్ణుఁడు భీతివాపి రాధకు యోగతత్త్వముల నుపదేశించి శతవత్సరవియోగమును దెల్పుట, అక్రూరుఁడు గోకులమున కరుగుట, భగవంతుని వర్ణించుట, శ్రీకృష్ణబలరాములు మధుర

కరుగఁ దలంచుట లోనగుకథ లీప్రకరణమునఁ గలవు. గోపికల చరిత్రములు ప్రధానములు. భగవన్మహిమము నవియే తెల్పును. శ్రీకృష్ణుని యపారశక్తిని గనఁబఱచుట కవి ముఖ్యతమములు. గర్గసంహితనుండి యనేకవిషయము లిందుఁ జేర్పఁబడినవి. ముందుముందు పద్మపురాణమునుండియు నవీనకథ లిందుఁ జేర్పఁబడును. కొన్నికొన్నితావులఁ గథాసారమును గూర్చి చేయుచర్చ లనవసరములుగాఁ దోఁపకమానవు. కాని పామరులకు శ్రీకృష్ణతత్త్వమును జక్కఁగాఁ దెల్పుటకే నాయీ ప్రయత్నముగాన నవి వలయుననియే నాభావము. ఇప్పటి నాయూహ ననుసరించి యీగ్రంథము పదిప్రకరణములకంటెఁ దక్కువగా ముగింపఁజాలననియే తోఁచెడిని. ఇంతదనుకనుండు ధనసహాయసంపత్తి చాలదు. మహాశయు లేఁబదిమందియైనఁ గ్రొత్తపోషకులుగాఁ జేరుట, చందాదారు లేఁబదిమంది చేరకుట యను నీరెండుకార్యములు సాగినఁగాని యీకార్యము సాగింపఁజాలను. నావంటియల్పజ్ఞునిచే నీమహాకార్యమును సాగించుటయే యుదారచిత్తుల గొప్పఁదనము. కావున నించుక చేయూఁతయొసఁగఁ బ్రార్థించెదను. ఈ వేసవిదినములలో నించుక సంచరణముసల్పి మహాశయుల దర్శింప నవకాశము కలదుగాని తొలుతఁజేసిన శపథమున కది విరుద్ధముగాన శ్రీకృష్ణపరమాత్మకృపనే నమ్మి యూరకుండువాఁడ. అనంతపురము, హిందూపురము, ననుస్థలముల నామిత్రులు క్రొత్తపోషకులం జేర్చిరి. ఈశ్వరానుగ్రహమును మహాశయులసాయమును

నమ్మి యున్న వాఁడను. ఉదారచిత్తులు పరోపకృతిస్వభావులు నగు మ. రా. శ్రీ, బీ. పి. దేవరాజులు నాయఁడుగారు పోషకద్రవ్యముగాక యిరువదియైదురజతముద్రికల విరాళ మిప్పించి తమ యౌదార్యమును భగవద్భక్తిని దేటపఱచిరి. వారికి శ్రీపరాత్పరుఁడు రాధామాధవుఁ డాయురారోగ్యభాగ్యములఁ బ్రసాదించుఁగాక. పుస్తకభాండాగారాధిపతులు తఱచుగమూల్యరహితముగను, సగము మూల్యమునకుఁ బంపఁగోరుచుందురు. బహుజనద్రవ్యముగాన వారే నాయీపూన్కి కెక్కువసాయము చేయవలసియుండును. ఉత్తరమండలముల భాండాగారములు పెక్కులుగలవు. అవెల్ల దీనికిఁ దోడ్పడుఁగాక యని యాశించుచున్నాఁడను. ఈకార్యమునకు నా ప్రార్థనము లేకున్నను బోషకులను గూర్ప నలువురు బద్ధకంకణులయియున్నవారు. అట్టి మహాశయులకు నాకృతజ్ఞత వెనుకఁ దెల్పుకొందును. మఱియు నాకెంతయు సాయముచేయఁబూని యీగ్రంథము ముద్రించుటకును నలువురకుఁ దెలుపుటకును గంకణముగట్టుకొన్న దిగంతవిశ్రాంతయశోధురంధరులు పరోపకృతిపరాయణులు మ.రా.శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారును, కాశీనాథుని నాగేశ్వరరావుగారునని విన్నవించుకొనుచున్నాఁడను. వ్రాఁతయందు నాలోపముల నన్నింటిని క్షమింపఁ బండితాఖండలుల వేఁడుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు భక్తజనాంఘ్రిసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

# పోషకులు.

## శ్రీకృష్ణావతారతత్త్వమును బోధించు పుణ్యపురుషులు.

---

### కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.
,, విరూరు పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడర్.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి. ఏ., బి. యల్.
,, కాకూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. యల్.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్.
,, బి. పి. దేవరాజులునాయడుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. యల్.
,, సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.
,, కే. సూర్యనారాయణరావుగారు, ప్లీడర్.
,, భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పత్తి రాఘవులు శ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, దేవతి పిచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వేంకటేశము శ్రేష్ఠిగారు.

మ. రా. శ్రీ. మల్లెంకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.
,, మాలేపాటి చిన్న వెంగన్న శ్రేష్ఠిగారు.
,, అన్నలూరు శేషగిరిరావుగారు.
,, మాలేపాటి వీరయ్యశ్రేష్ఠిగారు.
,, డబ్ల్యు. శ్యామయ్యగారు.
,, బి. శేషగిరిరావుగారు.
,, యాదాటి వేంకటసుబ్బయ్యశాస్త్రిగారు.
,, శ్రీకంఠము నరసింహయ్యగారు.
,, వేమగంటి శ్రీనివాసయ్యగారు, బి. ఏ., ఎల్. టి.
,, పి. వీరభద్రరావుగారు.
,, పుష్పాల వేంకటస్వామినాయడుగారు.
,, కాట్రపాటి చలపతిరావుగారు.
,, బొందలగుంట వేంకటనారాయణరావుగారు.
,, ఆర్. గోవిందరావుగారు, బి. ఏ., తహసీల్ దార్.
శ్రీమతి. తలుపుల వేంకటసుబ్బమ్మగారు.
మ. రా. శ్రీ. బచ్చు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, సకలా వేంకటసుబ్బయ్యగారు.
,, చిల్లా వేంకటకొండయ్యగారు.
,, వీరబోయిన కొండయ్యగారు.
,, మాకం జంగంశ్రేష్ఠిగారు, చీమలపెంట. [పల్లె.
,, గంగవరము, వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారి
,, పి. సీతారామయ్య పంతులుగారు, ఎమ్. ఏ., మండలాధికారులు.
,, సగరం గురురావుగారు, బి. ఏ., ఆఫిషియల్ రిసీవర్, యెంత్తురుపై ఎస్టేటు, వీరకేరళము.

## కామలాపురము.

మ. రా. శ్రీ. బచ్చురాఘవయ్యశ్రేష్ఠిగారు.
,, జి. సుబ్బరావుగారు.
,, రాణువ ఫణిరావుగారు.
,, హనుమగుత్తి. చెంచిరెడ్డిగారు, గ్రామమునిసిప్.

## వల్లూరు.

మ. రా. శ్రీ. సముద్రాల రామస్వామిగారు.
,, బెస్తవేముల నరసయ్యశ్రేష్ఠిగారు.
,, తంగటూరు చెన్నయ్యశ్రేష్ఠిగారు.
,, వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుఁడు సుబ్బయ్య శ్రేష్ఠిగారు. [గారు.
,, పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠిగారు,ఆరణిపోలేపల్లి సుబ్బయ్యశ్రేష్ఠి

## ఎఱ్ఱగుంట్ల.

మ. రా. శ్రీ. ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు, కరణము.
,, ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు.
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లము సూరయ్యగారు.
,, పేర్ల నాగిరెడ్డిగారు.
,, ఏ. శ్రీనివాసులునాయడుగారు.
,, శంకరయోగి సుబ్బరావుగారు, నిరుజువ్వి.

## పులివెందుల.

మ. రా. శ్రీ. మద్దాల బోగాది శ్రేష్ఠిగారు, వేములకొత్తపల్లి. [పల్లి
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, వేం
,, పుల్లగూర వేంకటశేషయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి.

## ప్రొద్దుటూరు.

మ. రా. శ్రీ. కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు.
,, వంగిపురము శ్రీనివాసాచార్యులుగారు, బి. ఏ, ప్లీడరు.
,, సి. నరసరామ శాస్త్రిగారు, బి. ఏ., ప్లీడరు.
,, యం. రామస్వామయ్యగారు, ప్లీడరు.
,, రావులూరు సుబ్బరావుగారు, డిప్టీ నాజరు.
,, ఉప్పలూరు భద్రయ్యగారు.
,, డి. రాజశేఖరకవిసింహులుగారు, శతావధానులు.

## రాజంపేట.

మ. రా. శ్రీ. ఆర్కాటు పరశురామరావుగారు, యం. యల్. సి., నెంద [లూరు.
,, ఏచూరుచెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము.
,, నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట.
,, పిడతల చిన్నవేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు.
,, అచ్యుతన్నరామచంద్రరావుగారు, టంగుటూరు.

## సిద్ధవటము.

మ. రా. శ్రీ. చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లి
,, గోపవరము గోపాలురెడ్డిగారు, గోపవరము.
,, యాదాళ్ల వేంకటరామయ్యశ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లె.

## రాయచోటి.

మ. రా. శ్రీ. కోట బాలయ్యకుమారుడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు,
నీలకంఠ రావుపేట.

మ. రా. శ్రీ. రేవులూరు సిద్దయ్యశ్రేష్ఠిగారు, కస్తూరిరాజుగారిపల్లె.
,, చిన్నబయ్యన్నగారి లక్ష్మన్నగారు, ఎఱ్ఱదొడ్డిపల్లె.
,, కుర్నూతుల వేంకటరమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె.
,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, నూలివీడు.
,, పుల్లగూర బాలసుబ్బయ్యదత్తకుమారుఁడు పిచ్చయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

## అనంతపురమండలము, హిందూపురము.

మ. రా. శ్రీ. దొంతి భీమయ్యగారు.
,, కట్టా అయ్యగారి గుండయ్యశ్రేష్ఠిగారు.
,, మాకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు.
,, సేగు బుచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, గోరంట్ల వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.
,, ఆర్. వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.
,, పి. ఆదినారాయణయ్యశ్రేష్ఠిగారు.
,, కరణము కృష్ణరావుగారు, చేవినహళ్లి.
,, శ్రీరాము తిమ్మయ్యశ్రేష్ఠిగారు.
,, పెద్ద నరసప్పగారి హనుమంతుగారు.
,, రెడ్డిపల్లె అప్పారావుగారు, కొడిగిపల్లె.
,, ఈడిగి ఆంజనప్పగారు.

## అనంతపురము.

మ. రా. శ్రీ. వెలమకూరు ఆత్మారామప్పగారు, పినాకినీముద్రాక్షరశాలాధికారులు.
,, హట్టి శివరావుగారు, ప్లీడరు.
,, పులమతి ఆదిమూర్తిరావుగారు, ప్లీడరు.

మ. రా. శ్రీ. జి. భద్రయ్య శ్రేష్ఠిగారు.
,, జి. రామయ్యశ్రేష్ఠిగారు.
,, బి. వేంకటప్పగారు.
,, ఏ. జి. కృష్ణారెడ్డిగారు, గ్రామమునిసిప్.
,, ఐ. ఓబుళేశప్పగారు.
,, పైడి. లక్ష్మయ్యగారు, అచ్చంపల్లి.

## గుత్తి.

మ. రా. శ్రీ. పి. యం. శ్రీనివాసయ్యంగారు, బి. ఏ., ఎం. ఎల్.
డిస్ట్రిక్టు మునిసిపు.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడర్.
,, వై. రామస్వామిగారు, బి. ఏ., ప్లీడర్.
,, జి. యం. హనుమంతురావుగారు, భూస్వాములు.
,, వై. శేషప్పగారు, ప్లీడరు.
,, వై. కొండలరావుగారు.
,, సి. సుందరరామయ్యగారు, హెడ్ క్లర్కు, మునిసిపుకోర్టు.
,, ఆర్కాటు గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.
,, సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు.
,, కోవూరు వేంకటరావుగారు, పెన్షనర్.
,, నిట్టూరి లక్ష్మీనారాయణరావు. బి. ఏ., ప్లీడరు.
,, తరిమెల సుబ్బారెడ్డిగారు, తరిమెల.
,, జంబులపాడు పెద్దవేంకటప్పగారు, ధర్మపురి.
,, కానుగోవి. కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూ ఇన్స్పెక్టరు.
(ఇప్పటినివాసము, అవుకు)

## బళ్లారి మండలము.

మ. రా. శ్రీ. విట్టా శేషప్ప శ్రేష్ఠిగారు, ప్రజాసంఘకార్యదర్శులు.
,, రావుసాహేబు, జే. పాపయ్యశ్రేష్ఠిగారు.
,, అయ్యాగారి బుస్సెట్టిగారు, కణేకల్లు.
,, ఏ. భీమరావుగారు, వ్యాపారస్థులు, ఆదవాని.

## కందనూలుమండలము.

మ. రా. శ్రీ. ఖాదర్ బాదర్ అంబాజీరావుగారు. నంద్యాల.
,, అవధానము వేంకటనరసయ్యాగారు, ఉయ్యాలవాడ.

## నెల్లూరుమండలము.

మ. రా. శ్రీ. వెలంపల్లి రామకృష్ణమ్మగారు.
,, ములుమూడి లక్ష్మీనరసింహయ్యాగారు.
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు.
,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె.
,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కుల్లూరు.

## గుంటూరు మండలము.

మ. రా. శ్రీ. అక్కేనప్రగడ లక్ష్మీనారాయణరావుగారు. బి. ఏ., బి. ఇ.,
డిస్ట్రిక్టు బోర్డు ఇంజనీయర్ గారు.
,, మారుటూరు పుండరీకాక్షుఁడుగారు, వట్టిచెరుకూరు.

## గోదావరి మండలము.

మ. రా. శ్రీ. కలిదిండి వేంకటరాజుగారు. రాజమహేంద్రవరము.
,, శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్, జమీం
దారుగారు, ఏలూరు.

మ. రా. శ్రీ. బొడ్డు మల్లికార్జునరావుగారు. బాపిరాజుగారు, ఏలూరు.
,, గిరిగె మాణిక్యముగారు.
,, ఏ. యస్. స్వామిగారు.

## విశాఖపట్టణ మండలము.

మ. రా. శ్రీ. మాడుగుల వేంకటప్పారావుగారు, జమీందారులు,
బొంతలకోడూరు.

## గంజాము.

మ. రా. శ్రీ. పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము.

## చెన్నపురము.

మ. రా. శ్రీ. వి. యస్. నరసింహాచార్యులుగారు, బి. ఏ., బి. యల్.
,, కట్టా. జోగయ్యగారు.
,, పి. విజయరాఘవులు శ్రేష్ఠిగారు, పెరియమెట్టు.
,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆదెప్పనాయనివీధి.

# విషయసూచిక.

శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము.

## అయిదవప్రకరణము.

శ్లో. అగ్రే దీర్ఘతరోఽయమర్జునతరుస్తస్యాగ్రతో వర్తనీ
సా ఘోషం సముపైతి తత్పరిసరే దేశే కళిందాత్మజా,
తస్యాస్తీరతమాలకాననతలే చక్రం గవాం చాలయన్
గోపః క్రీడతి దర్శయిష్యతి సఖే పంథానమవ్యాహతమ్.

గోధూళిధూసరితకోమలగోపవేషం
గోపాలబాలకశతైరనుగమ్యమానమ్,
సాయంతనే ప్రతి గృహం పశుబంధనార్థం
గచ్ఛంతమచ్యుతశిశుం ప్రణతోఽస్మి నిత్యమ్. ౪౪

అరణ్యానీమార్ద్రస్మితమధురబింబాధరసుధా
సరణ్యా సంక్రాంతైస్స్నపది మదయన్వేణునినదైః,
ధరణ్యా సానందోత్పులకముపగూఢాంఘ్రికమలః
శరణ్యానామాద్యస్స జయతు శరీరీమధురిమా. ౪౫

శ్రీకృష్ణకర్ణామృతము. ౨ ఆ.

ఆర్యమహాశయులారా! శ్రీకృష్ణావతారతత్త్వమున నాల్గవప్రకరణమున భగవంతుని దివ్యకథలఁ జదివి ముదమందితిరి.

లోకమున నాస్తికప్రాయు లగువారును, ఆస్తికాభాసులును భగవంతునియం దారోపించుదోషములు నిరాధారములని, మఱియు నీర్ష్యాకల్పితములని, ఇంకను గేవలాజ్ఞానకల్పితములని, వెండియు గ్రంథపఠనాభావదోషద్యోతకములని తెలిసికొంటిరి. సంసారమహాసాగరమును దాఁటింప మహానౌకవంటిదికదా శ్రీహరిచరిత్రము. అట్టిదానియందు దోషముల నారోపించుట పాపహేతువనియు నెఱింగితిరి. పూర్వజన్మమునఁ జేసిన పాపములకుఫలము భగవద్దూషణరూపమునఁ గనఁబడుచుండునని యు సిద్ధాంతము చేసితిరి. భాగీరథివలె వినిర్మలమగు శ్రీకృష్ణపరమాత్ముని దివ్యచరిత్రామృతమును గ్రోలినఁగాని యీ సంసారతాపములు తీఱవనియు నెఱింగియే యుందురనియు నానమ్మకము. అట్టి మీకు నింకను భగవల్లీలలఁ జదువ నాసక్తియుండునని తలంచెదను. భగవల్లీలలు వినుకొలఁదిని శ్రోత్రవియగుచుండును. కావుననే వినవలయుననియే భక్తులు కుతూహలపడుచుందురు. ఇఁకఁజాలు ననుతృప్తి యేభక్తులకును గలుగదు.

శ్లో. బ్రహ్మన్ విష్ణుకథాః పుణ్యా మాధ్వీర్లోకమలాపహాః
కోను తృప్యేత శృణ్వానః శ్రుతజ్ఞో నిత్యనూతనాః. ౨౦
శ్రీమద్భాగవతము. ౧౦ స్కం. ౬౨ అధ్యా.

క. భూషణములు చెవులకు బుధ
తోషణము లనేకజన్మదురితౌఘవిని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమనుగుణభాషణముల్. పోతనకవి.

అన్నట్లు భక్తజనకల్పవృక్షము లగుభగవద్గాథల విని యింకఁ జాలుననిపల్కువాఁ డెవ్వఁ డుండును ? భక్తుఁడు కాక యుండువాఁ డుండునేమో? కావున నింకను భగవత్కథల వ్రాయుటకు నా లేఖినియుఁ దత్వరపడుచున్నది. నామదియు నెట్లు వ్రాసినను శ్రీపరమేశ్వరువిలాసములు తృప్తికరములుగనే యుండునని సంతసపడుచున్నది. అందేమిలోపములున్నను ఇక్షు ఖండమునుబోలె సాధువులు గ్రహించి మన్నింతురని యానం దించుచున్నయది. కాఁబట్టి శ్రీకృష్ణునిచరిత్రమును గ్రమము గా వ్రాయ దొరంకొనియెదను.

భక్తులారా! నాల్గవప్రకరణాంతమున రాసమండలదర్శ నార్థ మమరు లరుదెంచిరనియు నవ్వల నష్టావక్రముని శ్రీకృష్ణుని దర్శింప ముక్తినొసంగెననియు వ్రాయఁబడినది. దీనిచే రాస మండలమన నేదియో రాసక్రీడయన నెట్టిదో తెలిసికొన వచ్చును. రాసక్రీడచే శ్రీ కృష్ణుఁడు జారశిఖామణియన్న తెలివి తక్కువప్రసంగము దూరమగుటయేగాక భగవంతుఁడు శ్రీకృ ష్ణుఁడే యన్నతత్త్వము స్పష్టమైనది. ఆ క్రీడంజూడ దేవత లరు దెంచిరని యుండుటచే నది భగవంతుని యానందస్థానమనియు, నందుండు భగవంతుని దర్శించినచో సకలాపత్తులు తొలఁగున నియు నందులకే దేవతలు తమతమకాంతలంగూడి యరుదెంచిర నియుఁదెలిసికొనఁ దగువిషయము. రాసమండలాధిష్ఠాత్రి రాధాం బ. గోలోకాధినాయిక యీ రాధాదేవియే. శ్రీ భాగవతమున రాధాప్రస్తావము లేదనియు, నందుచే రాధ భగవంతుని నెడఁ

బాయని లక్ష్మిగాదనియు నామెయు నలుగురిలో నొకతెయన్న ట్లొకగోపికయనియు వాదింతురు. శ్రీకృష్ణావతారమున రుక్మిణియే లక్ష్మియనియుఁ 'దక్షిణభార్య' లుంపుడుకత్తియలవంటి వారనియు వారిభావము.

"రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని"

యనుసూక్తి వారిపాలిటికి వేదవాక్యము. రాధాదేవి గోలోకముననుండు శ్రీకృష్ణభగవంతునకుఁ బ్రాణప్రియయని యు,ఆమెయే మూలప్రకృతియనియు, తదంశమే వైకుంఠమున లక్ష్మీరూపమున వెలసెననియుఁ, దదంశైకదేశమే రుక్మిణి యనియు వారు తెలిసికొనుట మేలు. ఈవిషయమును శ్రీదేవీ భాగవతము పద్మపురాణము నారదపురాణము బ్రహ్మావైవర్త పురాణము లోనగునవి స్పష్టపఱచుచున్నయవి. ఇంతియకాక శ్రీరాధాసహస్రనామములు పూజాపద్ధతియు బహుపురాణ సమ్మతముగఁ గన్పట్టెడిని. మంత్రశాస్త్రమని వాడఁబడు నథర్వ వేదమందు శ్రీరాధామంత్రము, తదుపదేశపద్ధతి, పూజా పద్ధతి, పురశ్చరణరీతి మొదలగునవి కన్పట్టెడిని. ఇట్టివి రుక్మిణి విషయమునఁ గానరావు. దీనిచే రాధ మూలప్రకృతియే యని స్పష్టమగుచున్నది. ఈమార్గము ననుసరించి శ్రీలీలాశు కులు, జయదేవుఁడు,నారాయణతీర్థులు లోనగుమహానుభావులు భగవంతు నారాధించి కృతకృత్యులైరి. జనార్దనచైతన్యులు లోనగుసాధుప్రవరులు భక్తవర్యులైరి. వారిం దలంచియైన రాధ యన నేమియో తెలిసికొనవచ్చును. ముందుముం దీపుస్త కమున శ్రీరాధాంబికాచరిత్రమును బఠింపఁగలరు. రుక్మిణి రాధ

కంటె దక్కువయనియు రాధ రుక్మిణికంటె వేయిమడుంగు లెక్కువ యనియుఁ జెప్పనెంచిన దేవానాంప్రియులలో నేనొక్కఁడనుగాను. సీతారాధారుక్మిణులకభేదమును జెప్పఁబూను వారలలో నే నగ్రగణ్యుఁడను. కావున నిట్టి తుచ్ఛబుద్ధులను వదలి భగవంతు నారాధింపవలయును. కొందఱకు రాధాదేవి యందు భక్తియుండవచ్చును. కొందఱకు రుక్మిణియందు భక్తి యుండవచ్చును. కాని తక్కినవారిని దూషింపరాదు. భగవంతుని పత్నులలో నిట్టి భేదబుద్ధియుండిన నిఁక వీరికి సమత్వమేకాలమున నలవడును. అది యలవడకున్న నిఁక వారెట్లు తరింతురు ? తరించుట కల్లయే. ఇంతతో నిది ముగియలేదు. అట్టివారికి జన్మాంతరమున మనుజత యలవడునా యనుసంశయము కలుగుచున్నది. అక్కటా ! ఈభేదబుద్ధి యేనాఁటికి నశించునో ఆనాఁటి కిట్టికువాదములు నశించును. భక్తి నిష్కల్మషముగఁ బాదుకొనును. అది పాదుకొనిన సాధువులన్నమాట సార్థకమగును.

మఱికొందఱు భగవదవతారములలోఁ దారతమ్యము కలదందురు. కొన్నియవతారము లుత్తమము లందురు. కొన్ని మధ్యమము లందురు. కాని యధమములు కొన్ని కలవనిమాత్ర మనరు. ఇదియే వారిబుద్ధిచమత్కృతి యని మన మానందింపవచ్చునుగాని వారిని దూషింపరాదు. ఏలన, అట్టివార లపరిపక్వజీవు లనఁబడుదురు. వారికి సత్కర్మానుష్ఠానముతొలిజన్మమునఁ జాలఁదక్కువ యని వారివాదమే సాక్ష్యమిచ్చును. కావున

వారివాదమును మనము తూలనాడక వారికి హితముపదేశింప వలయును. అదియ మనము చేయఁదగుపని. సంస్కారము మంచిది కానున్న వారేమి చేయుదురు. వారి నాక్షేపించి లాభమేమి? వారిసంస్కారమును మనము మార్పఁ జాలుదుమా? అదిశక్యమా? కావున వారింగూర్చి చింతించుట మేలు. ఈచింత వారి కించుకయుపకారముచేయును. దాన మనకుఁ బుణ్యలాభము కలదు.

ఇఁక నీవిషయమున సారమేమి? అన్న ప్రశ్నమున కించుక సమాధానము వ్రాసెద. ఒక్కొక్కపురాణ మొక్కొక్కవిషయమును ప్రధానముచేసికొని భగవచ్చరిత్రమును దెల్పును. శ్రీభాగవతమున శ్రీకృష్ణచరిత్రము చాలస్వల్పముగ నున్నది. ఆకొలఁదిలో రుక్మిణీదేవిని బ్రధానముగాఁజేసి భక్తిని బోధించును. ఇతరవిషయములందు సమగ్రములుగాఁ జెప్ప వీలులేదు. సత్యభామ లోనగువారిచరిత్రము లించుక గలవుకదా. అట్లే రాధాంబికాచరిత్ర మేల చెప్పఁబడలేదని ప్రశ్నింపవచ్చును? రాధాదేవి తక్కినభార్యలవంటిదికాదు. ఆమె పరదేవి, మూలప్రకృతి, శ్రీదేవి యనునామముల విరాజిల్లుచుండును. కావున నామెమహిమమును బ్రత్యేకించి వచింపవలసియుండునేకాని నలుగురిలోఁ గలిపి వచింపరాదని శ్రీభాగవతభావమని వీరు గ్రహింతురుగాక. ఆమెచరిత్రమును, వేలువేలుపురాణములు సమగ్రముగా వర్ణించినవి. సర్వోన్నత తదీయమహిమమును వివరించి కృతకృత్యతం గాంచినవి. కావున భాగవతమున నీకథ

లేదే యని విచారింపఁబనిలేదు సావధానముగా నితరపురాణములఁ బఠింపుఁడు. వ్యాసరచితపురాణములలో నొక్కటి యుత్తమమని వేఱొకటి యధమమని భావించి వ్యాసునియందు నైచ్య మారోపింపకుఁడు. పురాణములన్నియు నొకతత్త్వమునే తెలుపుననియు, వివిధకర్మములు చేసినవారికిఁ దగినట్టు లవి బోధించుచుండుననియు, నన్నింటి సారము దేవతాసమత్వమే యనియుఁ బరిగ్రహింపుఁడు. దానఁ గృతకృత్యతనొందఁగలరు. అంతియగాని యందును మనకుఁగల క్రూరబుద్ధిని జొప్పించి వేఱు వేఱుమార్గములనియు, నుత్తమమధ్యమాధమ విభాగము కలదనియు నూహింపకుఁడు. దాన మీకుఁ దరణోపాయము కడుంగడు దూరమగును. అట్టికువాదము మీకే యపకారము చేయును. కావున మీమేలును బాడుచేసికొనకుఁడు. పరులదూషించుట యెవరికి హానియో మీరే యోజించుకొనుఁడు. అది మీకే చెడుగుఁగూర్చును. కావునఁ జెట్టుగొట్టి దాని క్రిందఁ గూర్చుండఁ బ్రయత్నింపరాదు. ఆపిదప మీయిష్టము.

ఆర్యమహాశయులారా! ఇఁకఁ బ్రకృతకథాభాగమును విన్నవించెదను. సావధానమనస్కులరు గండు. శ్రీకృష్ణమూర్తి రాసమండలమున విహారముసల్పిన పిదప శ్రీరాధాంబికతోఁ గూడియుండ నచ్చటి కష్టావక్రముని భగవంతుని సందర్శించి తనువు వదలెననియు, నాతని తేజము శ్రీకృష్ణునియందుఁ గలిసెననియు మీకు విశదమేకదా. తరువాత భగవంతుఁ డేయే య

ద్భుతకార్యము లొనరించెనో యాలకింపుఁడు. ప్రతిగాథను జదివి యంతతోఁ దృప్తినొందక దానినుండి మనమేమి నేర్చుకొనఁదగునో యూహించి యద్దాని నభ్యసించి కృతకృత్యులు గావలయు నని వేడుచున్నాఁడను.

## అష్టావక్రమునిపూర్వచరిత్రము.

*అష్టావక్రముని దేహమును వదలినంతనే యాదేహము నుండి యత్యద్భుతతేజస్సొండు వెడలి యందందుఁ దిరిగితిరిగి శ్రీకృష్ణపాదారవిందద్వంద్వమున విలీనమయ్యెను. అంత శ్రీకృష్ణమూర్తి యామునితనువును దనవక్షస్థలమున నిడికొని ప్రీతిమెయి సంస్కారము చేయఁబూనెను. అంతలో నతనిభక్తిని దలంచి బోరున దుఃఖించెను అది కేవలమనుష్యనిరోదనముఁ బోలియుండెను. అవ్వలఁ దనబాహువులచే నాలింగన మొనరించినట్లు గాఢపీడనము చేయుచుండెను. కొలఁదినిమేషములలో శ్రీహరి కరవిమర్దనమున నాతనువునుండి పరిశుద్ధభస్మము వెడలసాగెను. ఆమునివరుఁ డఱువదివేలవర్షములు నిరాహారుఁడై తీవ్రతప మొనరించినందున రక్తమాంసాస్థులు లేక యాతనువు చర్మమాత్రావశిష్టముగ నుండెను. జఠరాగ్ని యాదేహమును మాంసాస్థివిహీనముగ నొనరించియే యుండెను. బాహ్యజ్ఞాన

* ఈచరిత్రము శ్రీకృష్ణజన్మఖండము 30 వ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది. ఇందు నారదముని ప్రశ్నించువాఁడు. నారాయణమూర్తి కథను దెలుపువాఁడని యెఱుంగలయు. ఈగాథ బ్రహ్మబ్రహ్మాండ విష్ణు శ్రీభాగవత దేవీభాగవత హరివంశములందుఁ గానరాదు.

మించుకంతయు లేక హరిపాదాబ్జనిరతచిత్తుఁడై యుండిన యా మునితనువు పరమపవిత్రమైనదికదా. కావుననే శ్రీకృష్ణుఁ డద్దాని నిం గౌఁగిలించుకొనెను. పిదపఁ జందనదారువులఁ జితిని జేర్పించి హరి యాతనువు నందుంచెను. అగ్నికృత్యము నొనరించి యించుకవిచారించుచు నిలువఁబడెను. హవ్యవాహుఁడు సర్వతస్సంవ్యాప్తజ్వాలలనాతనువును దహించెను. ఆజ్వాలలం గాంచి శ్రీకృష్ణమూర్తి క్షణకాలము మూర్ఛనొందెను. ఆతనువు భస్మము కాఁగా దేవత లానందించిరి. పూలవానఁ గురిపించిరి. దాని కెల్ల రచ్చెరువందిరి. అట్టితఱి దివ్యరత్నఖచితవిమాన మొండు దివినుండి యరుదెంచెను. దానినిండ భక్తవరులగు పార్షదు లుండిరి. వారిరూపములు శ్రీకృష్ణునింబోలి యుండెను. ఆవిమానము గోలోకమునుండియే యరుదెంచినది. రథమునుండి దిగి పార్షదులు రాధామాధవులకు నమస్కరించి సూక్ష్మదేహమున నలరారుమహర్షిని దద్రథమునఁ గూరుచుండఁజేసి భగవదాజ్ఞ నొంది గోలోకమునకుం బోయిరి.

మునివరుఁడు గోలోకమున కరుగ బృందావనవినోదముల నుబ్బి తబ్బిబ్బగు నారాధాంబ విస్మయావిష్టహృదయయై జగదీశ్వరుంజూచి ప్రాణనాథా! సర్వావయవములు వికృతిం గాంచియుండ మిక్కిలి పొట్టిగానుండుట నతికుత్సితుండుగాఁ గనఁబడుచున్న యీమునీ యెవ్వఁడు? ఈయన తనువునుండి భస్మము వెల్వడనేల? ఈముని తేజస్సు నీపాదారవిందముల విలీనమయ్యెనే, ఏల? దివ్యవిమానారూఢుఁడై యీపుణ్యపురు

షుఁడు గోలోకమున కరిగెఁగదా. ఎట్లు? స్వాత్మారాముఁడ వగు నీకుఁ గన్నీరు ప్రవహింపనేల? అశ్రుపూర్ణనయనముల నీవు సంస్కారమొనరించితివి కదా ఏటికి? ఈవృత్తాంతమునెల్ల వివరించి వచింపుమీ యని ప్రశ్నింప మధుసూదనుఁడు నవ్వి పూర్వకాలమున జరిగినకథను దనప్రాణప్రియకుఁ దెలుప నెంచి యిట్లు పలికెను. ప్రాణేశ్వరీ ! అష్టావక్ర మునిచరితము వినఁదగినది. ఇది జగద్విఖ్యాతింగాంచినదియే కాన మునుముందు నీవు పండితులవలన వినఁగలవు. అష్టావక్రముని భువనత్రయవిఖ్యాతచరిత్రుఁడు. తత్కీర్తిచే జగంబులెల్ల నావృతములే యని యెఱుంగుము.అనవిని రాధికయించుక యాగ్రహ ముప్పతిల్ల నిరుత్సాహము పల్లవింప శుష్కకంఠోష్ఠతాలుకయై భగవంతుని జూచి యిట్లు ప్రశ్నించెను. స్వామీ! దప్పిగొన్నవానికిఁ బాలకడలిచేఁ దృప్తిగలుగదు. గోష్పాదమంతమడువులో నీరు త్రాగినఁ దృప్తికలుగక మానదు. వేదములకు వేదవక్తలకు బ్రహ్మకు జనకుండవు. మహావిష్ణుఁడవు. ఈశ్వరుఁడవు. ఇట్టి నీవుండఁగా మఱెవ్వఁడు నాకుఁ దెలుపఁ గలఁడు? అని యాగ్రహము కలిసినట్లు పలుక శ్రీపరమాత్మ విని సంతృప్తినొంది రహస్యము,వచియింపకదాఁపఁదగినదియునగుచరిత్రమును దెలుపక తప్పదని యిట్లుపలికెను.ప్రాణనాయికా! పురాతనేతిహాసము నాలకింపుము. దానిని వినినవారి పాపములు పటాపంచలగును. పూర్వము నాయంశమున జగత్తంతయు వ్యాపించి జలాకీర్ణమయియుండెను. శ్రీమహావిష్ణువునాభిపంకజమునుండి

జగద్విధాత యుదయించెను. ఆబ్రహ్మకు మానసపుత్రులు నల్వురు గలిగిరి. మనస్సునసంకల్పించిన మాత్రమున నుదయించువారు మానసపుత్రు లనంబడుదురు. వారెల్ల శ్రీమన్నారాయణపరాయణులు. బ్రహ్మతేజస్సుచేఁ బ్రజ్వలించువారు. పంచవర్షప్రాయులగుశిశువులు. చూచువారికి వారజ్ఞులవలె దిగంబరులుగా నుండువారు. బాహ్యజ్ఞానవిహీనులు. బ్రహ్మతత్త్వవిశారదులు. సనక, సనంద, సనాతన, సనత్కుమారు లని వారిపేరులు. ఇట్లుప్పతిల్లిన నల్వురుపుత్రులనుజూచి బ్రహ్మ పుత్రకులారా! నాయానతి శిరసావహించి సృష్టియొనరింపుఁ డనియె. ఆమాటల నంగీకరించి వారు సృష్టికార్యమునఁ బ్రవర్తిల్ల నంగీకరింపక నన్నుంగూర్చి తపస్సు చేయఁబోయిరి.

వారిట్లు తపస్సుచేయ వేటొండుచోటి కరుగ బ్రహ్మ పుత్రులవిషయమై విమనస్కుఁడయ్యెను. దేవీ! తండ్రియానతి నాచరింపనిపుత్రుఁడు జనకునకు దుఃఖము నొసఁగువాఁడేకదా! పరమేష్ఠి యంత నూరకుండక తనయవయవములనుండి తపోధనులగుపుత్రులఁ బుట్టించెను. వారు జన్మమువలననే వేదవేదాంగవేత్తలు. బ్రహ్మతేజస్సుచే వెలుంగువారు. అత్రి, పులస్త్యుఁడు, పులహుఁడు, మరీచి, భృగువు, అంగిరసుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు, వోఢువు, కపిలుఁడు, ఆసురి, కవి, శంకువు, శంఖుఁడు, పంచశిఖుఁడు, ప్రచేతసుఁడు అని వారిపేరులు. వీరు పద్నాలుమంది. ఈ పుత్రకులు తండ్రియగు బ్రహ్మశాసనమును దలఁదాల్చి చాలకాలము తపంబొనరించి సృష్టియొనరించిరి. భార్య,

లంగూడి సంసారమును సాగింపఁబూనిరి. వారికందఱకుఁ బుత్త్రులు పౌత్త్రులును గల్గిరి. ప్రాణేశ్వరి! ఈ మునులపుత్త్రులను భ్రాత్రులను దెలుపుకథ నట్లుంచెదను. అది యనంతము. దానినిపుడు చెప్పనవసరములేదు. ప్రకృతగాథ మనోహరమైనది. పుణ్యవంతమునగు. బ్రహ్మపుత్త్రులలోఁ బ్రచేతసుండనువానికి నసితుండనుకొడుకుదయించెను. అతఁడు మునిపుంగవుఁడయ్యెను. ఆముని సకళత్త్రుఁడై దివ్యవర్షసహస్రములు తపస్సానరించెను. అతనికిఁ గొడుకు కలుగఁడయ్యెను. కావున విసికియాముని ప్రాణత్యాగముచేయ సిద్ధపడియెను. అతనికిఁ దెలివిగఅపుట కొక్కయశరీరిణివాక్కు వినఁబడియెను "ఓమునీ! ఏల ప్రాణముల వదలెదవు? త్వరగా నీశ్వరుసన్నిధానమున కరుగుము. శంకరు నాశ్రయించి మంత్రమును బడయుము. ఆమంత్రాధిదేవతను విధిగా నుపాసించిన నీ కామె ప్రసన్నురాలగును. శీఘ్రుంబ ప్రత్యక్షమగును. అదేవ్యనుగ్రహమున నీవు కోరినతనయుఁడు కలుగును. సత్యము" ఈయాకాశవాక్కులు వినఁబడఁగనే యాముని శంకరుసన్నిధికిం బోయెను.

శివలోకము యోగులకుంగూడ నగమ్యము. నిరామయము. మహర్షిజనసేవ్యము. అట్టిశివలోకమునకాముని భార్యం గూడిపోయి యోగివలె శంకరుని స్తోత్త్రముల నారాధించి ప్రీతుంజేసెను. చేతులుజోడించెను. భక్తిచే మస్తకమును వంచెను. శరణుగోరితి ననెను. శంకరుమ్రోల నిలుచుండెను. దీనుఁడై కన్నీరుమున్నీరుగాఁ బ్రవహింపఁ బులకాంచితవిగ్రహుఁడై

గంధమాదనమునఁ దపమొనరింపఁబోయినముని జితేం ద్రియుఁడై నన్నుంగూర్చి వర్షములనేకములు నిష్ఠమెయిఁ దపం బొనరించెను. ఆ మునిని దపోనిరతునిగా నెఱింగి రంభయను నచ్చరమిన్న వాంఛించెను. ఆ మహర్షియు సుందరాంగుఁడు శాం తుఁడు. రెండవమన్మథుఁడాయనునట్లుండు వాఁడు. నిర్జనమగు నా వనమున నారంభ తత్సన్నిధిం జేరి త్రిలోకములమోహింపఁజేయఁ జాలువేషమున నామునీంద్రుతో నిట్లు స్వాభిప్రాయమును దెలిపెను. మునిచంద్రా! కామినీజాతికి మనోహరమగు నా యీ వాక్యము నాలకింపుము. ఈ కఠినతపస్సునుమాని సుఖ మునొసంగు నన్నుఁ బరిగ్రహింపుము. నీవు సుందరాంగులలో సుందరాంగుఁడవు. నేనో వరారోహాలలో నుత్తమురాలను. నేర్పటియగుయువతికి నేర్పటియగు పురుషుఁడు లభించుట దుర్లభము. అట్టివారి సమసంగమము ప్రశస్తతరము. భూలోక మున రాజులు స్వర్గసుఖములఁ బడయఁగోరి యజ్ఞములు చేయు దురు. స్వర్గభోగహేతువులము మేమే కదా! భోగసారమనఁ గా మేమే. సుఖసాధనములు నాయవయవములు. నామోము పంకజమే యనవలయు. హాస్యభ్రూభంగసహితమగు నాముఖ మును దిలకించి యెవ్వఁడు మోహము నొందఁడు? స్త్రీరసము సుఖసారము. మునులకుంగూడఁ గోరఁదగినది. రసికాసుఖసంభో గము నిర్జనమగువనమున లభించుట దుర్లభముసుమీ. దేవ తగాని, మానవుఁడుగాని, గంధర్వుఁడుగాని, రాక్షసుఁడుగాని స్త్రీసుఖము నెఱుఁగనివాఁడే యైనచో నాతఁడు మదనునిచే

వంచింపఁబడినవాఁ డనఁబడు. ఏజితేంద్రియుఁడు రహస్యస్థలమున లభించి తన్నుఁగోరినకాంతను దిరస్కరించునో వాఁడు దేహరోమకూపసంఖ్యాసంవత్సరములుకుంభీపాకమనునరకమున నివసించును. ఇదిసత్యము. అట్టిపురుషుఁడు స్త్రీహత్యాపాతకము నొందుటయేగాక తచ్ఛాపమున నశించును. సృష్టికర్తయగు బ్రహ్మ మోహినీశాపమున జగత్త్రయమునం దెచ్చటనైనను బూజ్యుఁడు కాఁడయ్యెను. తన్నుఁగోరివచ్చిన పుంశ్చలి నేపురుషుఁడు త్యజించునో అట్టిపురుషుని నాపుంశ్చలి క్రీఁగంటఁ జూచినచో నాచూపుచే సకలబంధుక్షయంబగు. ఆ రోషమునకుఁ బారముగలదా? మునీంద్రా! పుంశ్చలి రసికు నందఱిలోఁ బ్రియునిగా భావించును. అట్టికామిని నాతఁడు త్యజించినయెడల నాతని నాతన్వి వధింప సమర్థురాలగును. కామినీహింసాజనితపాపము దురంతము. ప్రతిజన్మమునను బాధించును. దయాహీనుఁడై యెవ్వఁ డట్టిపనిఁజేయునో వానికన్నఁ బాపాత్ముఁ డుండఁడు.

ఓమునిశ్రేష్ఠా! ధ్యానమును వదలుము. తపస్సునకు ఫలమగు నీ నన్నుఁ బరిగ్రహించి సుఖములఁ బొందుము. నేను రహస్యస్థలమున నీకు దొరకితిని. అట్టి నన్నుఁ బరిగ్రహింపుము. చిరకాలము సుఖింపుము. అని రంభ వాక్చమత్కృతిమీఱఁ బలికెను. ఆమునియు నారంభావాక్యముల నాలకించి భయాకులుఁ డయ్యెను. తపస్సున కిది భంగమని తలంచెను. శాపమునకు వడఁ

కెను. హితమై యథార్థమై నీతిసారమై పరిణామసుఖావహమై యలరారువాక్యముల నిట్లు పలికెను.

దేవలముని రంభకు నీతులఁ దెలుపుట.

రంభా! వేదసారమనఁదగు వచనమును దెలిపెద. ఆల కింపుము. తపస్వులగు బ్రాహ్మణులకుఁ గలధర్మోచితమగునాచా రము ముఖ్యము. యుక్తకాలమున స్వభార్యయందు రతసుఖము ననుభవించుట ధర్మమే యగును. ఈధర్మ మీలోకముననే గాక ఎల్లలోకములందును బ్రవర్తిల్లుచుండును. బ్రాహ్మణక్షత్రియ వైశ్యులలో నెవఁడు పరభార్యాసక్తి నొందునో యాతనియింట నొల్లక లక్ష్మీదేవి యాగ్రహాపరవశురాలై పరుగిడును. అట్టివాఁ డీలోకమున నతినింద్యుఁ డగును. స్వకర్మములనైన నాచరింప నర్హుఁడు కాఁడు. పరలోకమున నంధకూపమనునరకమున వర్ష శత మాపాపాత్ముఁడు వసించును. ఏకాంత తన్నుఁ బతిగా వాంఛించి వచ్చునో దానిని బరిగ్రహించుట గృహస్థులకు ధర్మముగాని తపోనిరతులకుఁ గాదు. కామినీత్యాగమందు దో షము శాపమనుభవించుటయు గృహస్థులకే గాని మునులకుఁ గాదు. బ్రహ్మ సృష్టికర్తయయ్యును విరక్తుఁడు కాఁడు. కళత్ర వంతుఁడే యగును. ఆబ్రహ్మ వనితను ద్యజించినఁ బాపము నను భవించును. మేమో సంత్యక్తకళత్రులము. కాఁబట్టి మావంటి వారల కట్టిపాపము అంటదు. ఏవాఁడు స్వభార్యను బరిత్యజించి పరస్త్రీని బరిగ్రహించునో అట్టివాఁడు యశోధనాయుస్సులఁ

బోఁగొట్టుకొనుటయ గాక జీవన్మృతుఁ డనఁబడు. ఎవ్వని కీలోకమున యశస్సు లేదో వానిజీవితము నిష్ఫలము. తపస్వికత్వాధికసంపద లేల ? రాజ్య మేటికి? సుఖముతోఁ బనియేమి? నేను నిష్కాముఁడను. వృద్ధుఁడను. ఇట్టి నాతో నీకేమి ప్రయోజనము గలదు ? తల్లీ! సురుచిరవేషభూషితుని సుందరుని, ప్రాయమున విజృంభిఁగువానిని గోరుకొనుము. అని యుపన్యసించి దేవలముని యూరకుండెను.

రంభ యామునిపలుకులు విని క్రోధపరవశురా లయ్యెను. అంతతో నూరకుండక యధరపల్లవము కంపింపగా నిట్లు పలికెను. సుందరచంపకవర్ణముగలిగి కందర్పునిఁ గ్రిందుసేయు రూపమలారఁగాఁ దపఃప్రభావమున సశ్రీకుఁడై సువేషుఁడగు నీవంటిపురుషుఁడే స్త్రీజాతికి సమ్మతుం డగు. అట్టినిన్ను వదలి మఱియేపురుషుని గోరుదును ? కోరఁదగినవాఁ డెవ్వఁడుండును? పుంశ్చలియై స్మరాతురయగు నీరంభ నిన్ను వదలి యెట్లు జీవింపఁ గలదు? కావున నోమునిచంద్రా ! కామానలమున దహింపఁ బడు నన్నుఁ ద్వరగాఁ బరిగ్రహింపుము. నీవలన నాకామము నశింపకుండుఁ గాక! ఏనుఁగు రంభావృక్షమును నశింపఁజేయునట్లు నీవంగీకరింపకున్న మదనుఁడు నన్ను నశింపఁజేయును, నీవు వేదవిద్వర్యుఁడవు. ఐనను నన్నుఁ బరిగ్రహింపనిచో నాశాపమును బొందక తప్పదు. నన్నుఁ గాని నా ఘోరతమశాపమును గాని బరిగ్రహింపక తప్పదు. యోజించుకొనుము. నవశృంగారపీయూషపానము దొరకదేని నాప్రాణములు నశించును. మన

స్సు దహింపఁబడును. స్వాంతర్దుఃఖముచే నెవ్వఁడు శపించునో ఆశాపము వృథగాదు. ఇది సత్యము. అట్టిశాపమును మరల్ప జగత్పతియగువిధాతయు సమర్థుఁడు కాఁడు.

ఆ మాటలు విని ద్విజవర్యుఁడు ధ్యానతత్పరుఁ డయ్యెను. మౌనమునూని యొక్కమాటయైనను బలుకకుండెను. అది చూచి రంభ కోపసంరంభమున నిట్లు శపించెను. వక్రచిత్తుఁడా! బ్రాహ్మణుఁడా! నావాంఛితమును దీర్పవైతివి. కావున నీయవయవము లన్నియు వక్రము లగుఁగాక. నీశరీర మంజనాకృతిఁ దాల్చుఁగాక. రూపయౌవనములు చెడుఁగాక. లోకమున నీశరీర మతివికృతాకృతిం దాల్చి గర్హింపఁబడఁగలదు. నీవింతకు ముందొనరించిన తపంబెల్ల నశింపఁగలదు. ఇది సత్యము. అని శపించి యారంభ కామలోకమునకుం బోయెను. ఎంతకాలమునకును దేవలుఁడు శ్రీహరిపదమును జూడఁజాలక పోయెను. శ్రీహరిపాదారవిందదర్శనాభావమున నుత్తలపాటొంది తన యవయవములు వికృతములగుటం జూచి పూర్వపుణ్యము నశించు టెఱింగి యిఁక జీవింపరాదను నిశ్చయమున నగ్నికుండమున నతిఘోరశోకవేగమునఁ బడ నుంకించెను. ఓరాధాదేవీ! అత్తఱి నేఁ బ్రత్యక్షమై దివ్యజ్ఞాన మొసంగి ధర్మపద్ధతిని బోధించి వర మొసంగితిని. శాపభీతి దురపిల్లునామునివరు నాశ్వాసించితిని. దాన శాంతుఁ డయ్యెను. ఆముని యవయవము లెనిమిదియు వికృతములగుటం జూచితిని. అష్టావక్రుఁ డనునామకరణ మొనర్చితిని. ఆపేరు పెట్టుట నాకుత్సాహముగనే యుండెను.

ఆమీఁద నిమ్ముని నాయానతిని శిరసావహించి సత్వ రంబ మలయద్రోణి కరుదెంచి యఱువది వేలవత్సరములు నిరుపమతపం బొనరించెను. ఆతపంబు కొనసాగిన పిదప మద్భక్తుఁడగు నీతఁడు నన్నుఁ గూడఁ గల్గెను. రాధాదేవీ! సర్వప్రపంచప్రళయమందును నాభక్తుఁడు నశింపఁడు. చిరకాలతపమూనుటచే జఠరాగ్ని ప్రజ్వరిల్ల నాహారలేశము లేమి నీమునియవయవములు భస్మపూర్ణంబులయ్యెను. మలయద్రోణినుండి నన్నుఁ జూడ వచ్చినకతన నే నితనికి సంస్కార మొనర్చితిని. అష్టావక్రునితుల్యుఁడగు భక్తుఁడింకొకఁడు కానరాఁడు. ఈవఱకు భూతలమునఁ బుట్టలేదు. ముందు పుట్టఁబోఁడు. ఇట్టిమహాత్ముఁడు బ్రహ్మకుఁ బ్రపౌత్రుఁడు తపోనిష్ఠుఁడు నగు నీమహాముని నిష్కల్మషుఁడయ్యుఁ బుంశ్చలీశాపంబున బ్రహ్మపూజ్యుఁడు కాని చందంబున నిట్టిదుస్థ్సితిని గొంతకాల మనుభవించెను. సుందరీ! ఇది యష్టావక్రమునిచరిత్రము. విస్తరించి వచించితిని. ఇది మిగులరహస్యము. పరమపవిత్రమగు నీచరిత్రమును వింటివి. ఇంక నేమి వినఁ గోరెదవు? అని రాధాంబను జూచి శ్రీకృష్ణమూర్తి ప్రశ్నించెను.

పాఠకులారా! అష్టావక్రమునిచరిత్రమును జదివితిరి. దీనియం దొక్క యద్భుతవార్త యిమిడియున్నది. దాని నాలకింపుఁడు. భగవంతుఁడు భక్తవరుఁడగునమ్మునిం గౌఁగిలించుకొని యక్కారణముననే యతనికి ముక్తి ననుగ్రహించెను. ఇదియొకచిత్రవార్త గాదు. ఆముని తనువు భస్మప్రాయ మగు

టయు విచిత్రము కాదు. దానిం గాంచి రాధాదేవి ప్రశ్నించు టయు విస్మయకారణము కాదు. తన్ను నమ్మినవారిని గృతకృత్యులనుగా నొనరించుట భగవంతునకు నైజము. శ్రీరామావతారమునఁ బక్షిమాత్రుఁడగుజటాయువునకు సంస్కారము లొనరింపలేదా? క్రూరరాక్షసుఁడగు విరాధునకు ముక్తి ననుగ్రహింపలేదా? శబరి నుత్తమలోకమునకుఁ బంపలేదా? అట్టి కరుణాళువు ముని ననుగ్రహించుట గొప్పయని మనమచ్చెరు వొందనక్కఱలేదు. బ్రహ్మమానసపుత్రులగు సనకసనందసనాతనసనత్కుమారులు తండ్రియానతిమెయి సృష్టికార్యమునఁ బ్రవర్తిల్లక భగవంతునిగూర్చి తపస్సు చేయఁబోయిరనునది యించుక విచిత్రము.

"పితుర్దుఃఖాయ ప్రభవేత్పుత్రశ్ఛేదవచస్కరః." 31. శ్లో.

అన్నసూక్తిని మీఱినపుత్రుని లోకమునఁ గుపుత్రుఁ డందురు. పైనల్వురు జనకునాజ్ఞ మీఱినను జగత్పూజ్యులే యైరి. ఏల? లోకధర్మములు లోకాతీతప్రవర్తకుల కన్వయింపవు. సామాన్యధర్మములు జ్ఞాననిష్ఠుల బాధింపఁజాలవు. ధర్మమతిక్రమించిరని యట్టివారిని మన మాక్షేపింపరాదు. ధర్మచ్ఛేదభీతి వారికి నుండదు. వారిది సకలభూతసమదృష్టి. మన దృష్టి యట్టిది కాదు. భిన్నదృష్టి యగు. కావున లోకాతీతులు ధర్మ మతిక్రమించినను దీనిని మించినధర్మము నాశ్రయింతురు. దానిముం దీధర్మములు నిలువఁజాలవు. కావునఁ దండ్రిమాట మీఱి రన్నయపవాదమునకు సనకసనందాదులు పాత్రులు

కారు. భగవదారాధనము ప్రధానమైనవారి కితరధర్మములు పాటింపవలసినపని లేదు. కాని సామాన్యులుమాత్రము ధర్మముల మీఱరాదు. వేషము మునివేషము. చర్యలు తుచ్ఛములు. ఐనచో వారు రెంటికింజెడిన రేవణలే యగుదురు.

రంభ మునిని శపించెనన్నవార్తయే యీకథయందద్భుతావహ మనందగు. రంభచెప్పిననీతులు త్రోసివేయఁదగినవి కావు. మునిచెప్పినపల్కులు త్యజింపఁదగినవి కావు. ఇవ్వి రెండును సమాచరించుటకర్హములనుట యెట్లు? అనునదియే ప్రశ్నము. రంభ మునిని గాంచి మోహపరవశురాలయ్యెను. తనవాంఛ నతఁడు తీర్పకయున్న మృతినొందుదునని యూహించెను. కావునఁ దదుచితరీతిఁ బల్కెను. పుంశ్చలి యన స్వేచ్ఛాప్రవర్తకురాలనిభావము. అట్టివనిత తనప్రాణరక్షణమున కనువగుధర్మములఁ జెల్పుమాటలం బల్కెను. దానిప్రాణములనిల్పుటయు ధర్మమే కాని యవి సామాన్యమానవులు పాటింపఁదగినది కాని జ్ఞానులు పాటింపఁదగినధర్మము కాదు. పుంశ్చలి పరభార్య కాదు. తత్సంగమము పాపహేతువు కాదని వచింప వలనుపడదు. అది దాసివంటిది. ఎవరియధీనమున నెన్నిదినము లుండునో యంతవఱకు వానికది స్వత్వము వంటిది. ఇది సద్గృహస్థుల కాచరింపఁదగినధర్మము కాదు. సదా వనితాలంపటులగు నలసుల కాచరింపఁ దగుపద్ధతి యనవచ్చునేమో? అట్టిపుంశ్చలి శపించినచో నాశాపము మునినెట్లుబాధించెనని యడుగవచ్చును. పూర్వజన్మమున మహర్షి యెద్ది

యో తుచ్ఛమగు పాప మాచరించియుండును. అది యీజన్మ మునఁ బుంశ్చలీద్వారా యీతనికి శాపరూపమునఁ బొడకట్టెను. బుద్ధిపూర్వకముగ నొనరించినపాప మనుభవమునకు రాకమానదు. ఎన్నిమాటలు చెప్పిన నది యనుభవింపక తప్పించుకొన సాధ్యము కానిది. కావుననే రంభ శపించెదనని పలుకఁ జాలెను. కర్మమనునది బలవత్తరము. భగవత్స్వరూపమే యన వచ్చును. అది యేరూపముననైనఁ బొడకట్టవచ్చును. రంభకు శాపమిచ్చుయోగ్యత కలదా యన్న లేదనియే చెప్పవచ్చును. అట్టిశక్తి యవ్వనితకే యుండిన రావణు నేల శపింపరాదు? రావణుఁడు రంభద్వారా దుష్కర్మము ననుభవించునట్టి కార్య ములను జేసియుండలేదు. కావుననే రంభ శపింతునని యనఁ జాలకపోయెను. కాఁబట్టియే

"గహనా కర్మణో గతిః."

యని భగవంతుఁ డాజ్ఞాపించెను. కర్మసిద్ధాంత మన్నింటి కంటెఁ బ్రబలమైనది. దాని నిందింప సాధ్యము కాదు. తెలివి తక్కువచే దానిని దూషింతురుగాని దానికి లోఁబడక యెవ్వఁడేఁ బ్రవర్తింపఁ జాలఁడు. త్రిమూర్తులనఁబడు మహానీయులే కర్మఫలముల ననుభవించుచుండ నిఁకఁ దక్కినవారిమాట లెక్కింపనేల? కావున నష్టావక్రముని ప్రాగ్జన్మకృతపాపకర్మ మును రంభశాపరూపమున ననుభవించి యవ్వలఁ దనసత్కర్మ ఫలముగా శ్రీకృష్ణపరబ్రహ్మాదయకుఁ బాత్రుఁడై యపవర్గము నొందెను. కాఁబట్టి కర్మములనాచరింపనేల యని యలసులు

పలుక వారిమాటల నాదరింపక సత్కార్యముల నాచరించి భగవదనుగ్రహపాత్రులు కావలయును. కర్మత్యాగమునకన్నఁ బాపకార్యము లేదని చెప్పుట కనుమానమొంద నవసరము లేదు. ఏమానవుఁడు గాని యెట్టిదుష్కార్యముల నాచరించి యుండినను సత్కార్యముల నాచరించియుండినచో భగవద్భక్తి కలుగును. దాన నాపాపఫలముల ననుభవించినను ముక్తిమార్గము దొరకును. కేవలదుష్కార్యములనే యాచరించియుండిన భక్తిమార్గమే యతనికి రుచింపదు. కాఁబట్టి సంసారసాగరమును దరింపఁజేయునది భక్తినౌకయే. ఆమహానౌక నాశ్రయించినచో నది ముంచదు. ఎట్టి విపరీతకాలమునందును సాగరమును దాఁటించును. ఎట్టిదుష్కార్యమహావాతము దానిని బాధింపఁజాలదు. కావున నేలాటిద్రవ్యవ్యయమును గల్పింపక నిస్సమానమై సుఖదాయకమై సులభమై తగు భక్తిమార్గము నాశ్రయించి భగవంతుని జూడఁ బ్రయత్నింపుఁడు. మతవైషమ్యముల బాటించి భగవద్ద్రోహముల దూషించి మహత్తరసత్కార్యముల నొనరించినట్లు భావించి చెడక సర్వరూపుఁడు పరమేశ్వరుఁడని ఘోషించుచునుపనిషద్వాక్యముల నాశ్రయించి భగవత్కైంకర్యము చేయుటకన్న నుత్తమమార్గము లేదు. ఇంతట నీవిషయము నుజ్జగించి తర్వాతిభగవచ్చరిత్రమును వ్రాసెదను.

భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు బృందావనమున రాసమండలవిహారము సల్పి అష్టావక్రముని నుద్ధరించినతరువాతివృ

త్తాంత మతివిచిత్రము. పవిత్రతమము. బృందావన మనునది గోలోకమునఁగల శ్రీకృష్ణపరమాత్మవిహారవనము. అదియే మర్త్యలోకమున శ్రీహరి కనువగు విహారమునకై యమరి యుండెను. అందే రాసమండలమును గలదు. ఈవిషయము ముందే వ్రాయఁబడినది. ఆరాసమండలవిహారానంతరము శ్రీరాధాకృష్ణులు గోపికలు నొకచోట నుండ నష్టావక్రముని వచ్చుటయు నతనికి భగవంతుఁడు ముక్తినొసంగుటయుజరగెను. పిదప భగవంతుఁ డేలీల మెలఁగె నన్నవిషయమే యిట ముఖ్యము. ఆచరిత్రమున నొకయద్భుతవార్త కలదు. దాని నిట వ్రాసెదను.

## ఆసురిముని వృత్తాంతము.

* భగవంతుఁడు శ్రీహరి గోపీగణములం గూడి రాధాదేవీసహితుఁడై రాసక్రీడాదివినోదముల వారలకానందమును

---

* ఇయ్యది గర్గసంహితయందు రెండవదగు బృందావనఖండమున నిరువదిరెండవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది. గర్గసంహిత పురాణము గాదు. కాని యిది ప్రమాణమే యని శ్రీభాగవతమునం గలదు. గర్గముని యదుకులపురోహితుఁడు. ఒకనాఁడు నందునింజూడ గర్గముని రాఁగాఁ దనతనయులంజూపి నందుఁడు సంస్కారము లొనరింపుమని ప్రార్థించెను. ఈవిషయము దశమస్కంధమున నెనిమిదవ యధ్యాయమున నున్నది. ఆశ్లోకము లెవ్వియనిన.—జ్యోతిషామయనం సాక్షాద్యత్తజ్జ్ఞానమతీంద్రియం, ప్రణీతం భవతా యేన పుమాన్ వేద పరావరం. ౫. త్వం హి బ్రహ్మవిదాం శ్రేష్ఠస్సంస్కారాన్ కర్తుమర్హసి, బాలయోరనయోః నృణాం జన్మనా బ్రహ్మణో గురుః. ౬. గర్గాచార్యః. యదూనామహామాచార్యః

గల్పించెను. గోలోకమునుండి వచ్చిన గోపికలు కొందఱుండిరి. వారలు గాక భగవన్మాయచే బృందావనమందలి* యోషధులు గోపికాకృతులం దాల్చి వారిలో నుండిరి. కాని యిందు వ్రజగణముననుండువార లెవరో బృందావనౌషధులు గోపికలవలె నుండ నవ్వార లెవరో యెవ్వ రెఱుంగఁజాలరు. ఆలతావిశేషములు చిత్రవర్ణముల నలరారుచు గోపికాకృతులలర భగవంతుంగూడి విహరింప శ్రీహరియు బృందావనేశ్వరుఁడు కావున నసంగుఁడయ్యుఁ దత్సంగతిం గోరువాఁడువలె విహరించెను.

---

ఖ్యాతశ్చ భువి సర్వతః, సుతం మయా సంస్కృతం తే మన్యతే దేవకీసుతమ్. ౭.........బహూని సంతి నామాని రూపాణి చ సుతస్య తే, గుణకర్మానురూపాణి తాన్యహం వేద నో జనాః. ౧౬. ఆధాస్యత్యేవ వశ్రేయో గోపగోకులనందనః, అనేన సర్వదుర్గాణి యూయమంజస్తరిష్యథ. ౧౭. పురానేన వ్రజపతే సాధవో దస్యుపీడితాః, అరాజకే రక్ష్యమాణా జఘ్నుర్దస్యూన్ సమేధితాః. ౧౮. తస్మాన్నందాత్మజోఽయం తు నారాయణసమో గుణైః, శ్రియా కీర్త్యానుభావేన గోపాయస్వసమాహితః. ౨౧. ఇత్యాదులు కలవు. వీనిం బట్టి యాలోచింప గర్గముని శ్రీకృష్ణుఁడు పరమేశ్వరుఁడని కనుఁగొనినట్లు స్పష్టము. ఆగర్గమునియే యీసంహిత నుపదేశించెను. కావున శ్రీకృష్ణచరిత్రమునఁ గలరహస్యముల నీసంహిత ప్రతిపాదింపఁజాలియుండును. కాఁబట్టి యద్దానినుండి కొన్నిరహస్యవిషయముల నిందు వ్రాసెదను. ఈభాగము రాజునకు నారదుఁడు చెప్పెనని గ్రహించవలయును.

* బృందావనే చౌషధయో లీనా జాతా మహేశ్వరాత్, తాస్సర్వాశ్చాంగనా భూత్వా యూథీభూత్వా సమాయయుః. లతాగోపీసమూహేన చిత్రవర్ణేన మైథిల, రేమే బృందావనే రాజన్ హరిర్బృందావనేశ్వరః. అని మూలము.

ఆయమునాతీరమెల్లఁ గదంబవృక్షాచ్ఛాదితము. మందమారుత సంచారమనోహరము. ఆతటమున వెదురుజొంపములు నిండి యుండును. న్యగ్రోధద్రుమములు క్రిక్కిఱిసియుండును. పులిన తలము లందందు నయనానందజనకంబులై కనుపట్టుచుండును. అట్టితావుల శ్రీకృష్ణభగవంతుఁడు రాధాదేవింగూడి రాసక్రీడాజనితశ్రమ మపనయింప నూహించినట్లు విశ్రమించెను. ఆ మహాత్మునిచుట్టును గోపిక లుండిరి.

ఆకాలమున నాపరమాత్మను దర్శించుచుఁ గృతార్థుల మైతిమన్ని దేవతలు వీణావేణుప్రముఖవాద్యనాదముల నారాధించిరి. ఆధ్వనులతోఁబాటు గోపికాసంగీతనినాదములును, గలిసి దిక్కులఁ బిక్కటిల్లెను. ఆవల దేవతలు పుష్పవృష్టిఁ గురియించిరి. జయజయధ్వనుల నొనరించిరి. హరిచరిత్రమును బాడిరి. తద్యశోగీతముల వినుతించిరి. కొందఱు గోపికలు కంఠ మెత్తి రాగములఁబాడసాగిరి. కొందఱు నృత్తంబుల భగవంతు నారాధించిరి. కొందఱు పూదేనియల శ్రీహరి కొసంగిరి. కొందఱు సురుచిరరసఫలముల శ్రీహరికిఁ ద్రాగనిచ్చిరి నూపురధ్వనులు, తాళములు కాఁగా మఱికొంద ఱాడిరి. కొందఱు నాట్యవిశేషముల భావభేదములఁ గనఁబఱచిరి. కొందఱు బల వంతముగా శ్రీకృష్ణుని ముద్దిడుకొనిరి. కొందఱు పాదారవిందముల సేవించిరి. యోగిదుర్లభములగు శ్రీపరమాత్మబాహువులను బట్టుకొని మఱికొంతమంది కాంతలు నృత్యమొనర్చిరి. పరమాత్మయు వారి నానందింపఁజేయుచుఁ దన్నుఁదా మఱచి

యుండెను. లతలహారములుగాఁ దాల్చి శ్రీకృష్ణున కట్టి యలంకారములఁ బెట్టి కొందఱుమందయానలు సంతోషించిరి; భగవంతుఁ డాయాయివిధంబుల వారినెల్ల నానందింపఁజేయుచుఁ దాను వారింగూడి వినోదించుచుండినట్లు నటించుచుండెను.

అత్తఱిఁ గొంద ఱంగనలు శ్రీకృష్ణునివలె వేణునాదము చేయసాగిరి. కొందఱు పాడసాగిరి. కొందఱు నర్తనముచేయసాగిరి. కొందఱు నవ్వసాగిరి. కొందఱు సేవింపసాగిరి. కొందఱు శ్రీహరియెదుటం గూరుచుండి యోగివలెఁ దనమానసవీధియందు శ్రీహరిని జూచుచుండిరి. కొందఱు శ్రీహరివలె వేషమును ధరించిరి. కొందఱు రాధాంబిక నారాధించిరి. కొందఱు రాధామాధవుల నిరువురను బూజించి పరమానందము నందిరి.* కొందఱు శ్రీకృష్ణమూర్తిని లతలయందును వృక్షములయందును భూమ్యాకాశములందును దిగ్విదిక్కులయందును జూచుచు దనయందు నుండఁ గాంచి విస్మయమునొందుచు మౌన మూనియుండిరి. † ఈరీతి నారాసమండలమున గోపికలందఱు సంపూర్ణమనోరథలై భక్తవత్సలుఁడు గోవిందుఁడై యలరారు సర్వేశ్వరుని సేవించిరి. ‡ ఆభగవంతునిప్రసాదము

---

*కాశ్చిల్లతాసు వృక్షేషు భూమ్యాం ఖే విదిశాసుచ, పశ్యంత్యశ్రీశపతిం దేవం స్వస్మిన్ వా మౌనమాస్థితాః. అని మూలము. †ఏవం రాసే గోపవధ్వః సర్వాః పూర్ణమనోరథాః, బభూవు రేత్య గోవిందం సర్వేశం భక్తవత్సలమ్. అని మూలము. ‡తత్ప్రసాదస్తు గోపీనాం ప్రాప్తో రాజన్ మహామతే, జ్ఞానినామపి నాస్త్యేతత్కర్మిణాం తు కుతశ్చ నః-అని మూలము.

వారికెల్ల లభించినది. అట్టి యనుగ్రహము జ్ఞానులకుంగూడ దుర్లభము. ఇంకఁ గర్మరతుల కది యెక్కడిది? ఇట్లు గోపికలందఱు పరమేశ్వరుంగూడి మహానందము ననుభవించుచుండిరి.

శ్రీకృష్ణపాదారవింద చింతనాసక్తమానసుండగు నాసురి యనుముని మహత్తరతపం బొనరింపఁగోరి నారదపర్వతము నందు మౌనియై తపోనిష్ఠ నుండెను. ఆముని తనహృదయకమల కర్ణికారమున శ్రీకృష్ణుని జ్యోతిర్మండలాంతర్వర్తినిగా నిలుపు కొని రాధాసంయుతునిగా భావించుచు ధ్యానించుచుఁ జిర కాలమునకు రాధామాధవుని సమాధిని దర్శించెను. దానఁ బర మానంద మనుభవించుచునుండెను. ఇట్లు కొంతకాలము సాగె ను. ఒక్కనాఁటిరాత్రి భగవంతుని ధ్యానింప శ్రీహరి కనఁబడక పోయెను. కారణమేమని యమ్ముని మరలమరల ధ్యానింపసా గెను. కాని యెన్నిమాఱులు ధ్యానించినను భగవద్దర్శనము కాలేదు. కాఁబట్టి యమ్ముని ఖిన్నుఁడయ్యెను. అంతట నమ్ముని సమాధిని జాలించి శ్రీహరిని దర్శింపఁగోరి బదరీషండమండితం బగు నారాయణాశ్రమమునకుం బోయెను. అందు నమ్మునికి దర్శనమొదవ దయ్యెను. దానికి విస్మయంపడి యమ్ముని లోకా లోకపర్వతమునకుం బోయెను. అందును సహస్రశీర్షుం డగపడక పోయెను. అందున్న పార్షదప్రవరుని గాంచి భగవంతుఁ డెక్క డనున్నవాఁడని ప్రశ్నింప మేమెఱుంగమని యతఁడు నందున్న యితరులు బదులుచెప్పిరి. దాన నమ్ముని మఱింత ఖిన్నుఁ డయ్యె ను. అంతట నూరకుండక సాగరోత్తమం బనం బరఁగు క్షీర

సముద్రమునవలరు శ్వేతద్వీపమునకుంబోయి యందనంతుని పైఁ బవ్వళించియుండు భగవంతునింగానక చింతాసాగరనిమగ్న చిత్తుండై యందు శ్రీపతిని సేవించుపార్షదులఁ బ్రశ్నింప నెందుఁ బోయెనో మెఱుంగమని పలుక మిగుల విచారపడుచు నింకే మి చేయుదు? ఎందుఁ బోవుదును? ఎట్లు భగవద్దర్శనము లభించును? అనువిచారము తోడఁ బట్టుదల వదలక వైకుంఠ మునకుం బోయి యచ్చటం గూడ శ్రీదేవీసహిత నారాయణుం జూడంజాలక యందుండి గోలోకమున కరిగి బృందావననికుంజమునందును బరాత్పరుం జూడఁజాలక శ్రీకృష్ణవిరహాతురుండై యమ్ముని భగవంతుఁ డెచ్చోటి కేగెనని పార్షదులను బ్రశ్నింప వారు వామనబ్రహ్మాండమున నుండునని పల్కిరి. పృశ్నిగర్భ మెందు గల్గెనో యందుండుననియుఁ దెల్పిరి. ఆమాటలు విన్నంతనే కొండంతయాశతో వామనాండమునకుం బోయి యందుండు శ్రీహరిం జూడలేక కైలాసమునకుం బోయెను. అందు శ్రీకృష్ణధ్యానపరాయణుండగు శంకరుని దర్శించి నమస్కరించి మహాదేవా! బ్రహ్మాండమంతయుఁ దిరిగితిని. వైకుంఠ గోలోకముల విశేషించి పరిశీలించితిని. ఎందుఁగాని శ్రీకృష్ణపరమాత్మదర్శన మొదవదయ్యెను. సర్వవేత్తవు కాన నాస్వామి యెందుండునో యెఱింగించి ననుఁ గృతార్థునిగా నొనరింపుమాయని యభ్యర్థించెను. మహాదేవుఁ డామునివరువచనముల విని ఆసురిమునీ! నీవు కడుంగడు ధన్యుఁడవు కృష్ణభక్తుఁడవు. నీకుంగుదిరినభక్తి యవ్యాజము. భగవద్దర్శనేచ్ఛచే మిగులనా

యాసంపడితివని యేనెఱింగితిని. సకాములగుమునులాపరతత్త్వ మును దర్శింపఁజాలరు. కర్మేంద్రియగోచరుండు కాఁదగునా? అది నిర్గుణతత్త్వముగదా? సముద్రమున నత్యంతదుఃఖితుఁడగుహంసముని నుద్ధరింపఁ ద్వరపడిపోయెను. ఆమహానుభావుఁడు శ్రీకృష్ణుఁ డిపుడు బృందావనమున సఖీజనపరివృతుఁడై రసికేశ్వరుం డనఁబడుచు రాసక్రీడసలుపుచున్నవాఁడు.-ఈరాత్రి ఆఱునెలల కాలముగలదిగా నామహామహునిచేఁ జేయంబడినది. తన్మాయచే నిది యిట్లగుట యొక వింతగాదు. నేను నిపుడే యామహాత్ము దర్శింపఁబోయెద. నీవును రమ్ము. మనోరథము ఫలించును. అని హితముపదేశించెను.

పాఠకమహాశయులారా! ఆసురిమునిచరిత్రమును బఠించితిరి. ఇందత్యద్భుతవిశేషములు గలవు. వాని వినుండు. రాసక్రీడయం దనేకకోట్లగోపిక లుండినట్లు తెలుపఁబడినది. ఇది కేవల మసంగతమని సామాన్యదృష్టికిం గన్పడును. ఇంచుక సూక్ష్మదృష్టిని బరిశీలించిన నది సహజమే యని పొడకట్టును. గోలోకమునుండి భగవత్సేవార్థ మవతరించిన గోపికలు కొందఱు గలరు. వారు రాధాదేవిం గూడి రాసమండలము నలంకరించిరి. గోలోకమున నున్నవారెల్ల నవతరించినఁ గాని యాక్రీడసాగదు. రాసమండలము భగవత్పూజాచక్రమని ముందే తెలిపితిని గదా. ఆచక్రదళములయం దుండఁదగినంతమంది యధిదేవతలు కావలయును. అందఱుండినఁ గాని చక్రకోణములు దేవతాపరివృతములు కాఁజాలవు. దానివైభవ మనుపమానము. అట్టిచక్ర

మున నలరుచున్న గోలోకనాయకుని శ్రీకృష్ణుని దర్శింప నింద్రాదులు మహర్షులు యక్షగంధర్వప్రముఖులు దేవకాంతలు వారు వీరననేల యూర్ధ్వలోకమునఁ గలవారెల్ల సంభ్రమమున నిలిచి యుండిరి. బ్రహ్మాదులు లాతాండవసమ్మోదరసనిమగ్నులై భక్తులనుద్ధరింపఁ బూనియున్న యాకృష్ణపరమాత్మను గన్నులారఁ గాంచి కృతార్థులగుటకుఁ బూని నిలుచుండిరి. అట్టితరుణమున భగవంతుఁడు రాసమండలమును నింపఁ దలఁచెను. ఆపరమపురుషుని తలంపమోఘము కదా. తదిచ్ఛామాత్రముననే రాధాంబ బృందావనలతలనెల్ల గోపికలుగా నొనరించెను. ఇదియొక స్వల్పకార్యము. తద్దేవీమానసవీధి నిది యిట్లు కావలయునని యూహాపోడసూపినంతనే లతలు గోపికాకృతులం దాల్చి రాసమండలమున నిండియుండెను. ఆకారణముచేతనే లతాంగులని స్త్రీలకు నామధేయము పాటిల్లెనని యూహింపుఁడు. భగవదిచ్ఛ యప్రతిహతము. దానికి మించినపని వేఱొకటి యుండదు. భగవదిచ్ఛ యనఁ బ్రకృతి. ఇటుఁ బ్రకృతి రాధానామమున నలరెడిని. పురుషుఁడు శ్రీకృష్ణుఁడు. ఇపు డీపురుషుఁడు సగుణబ్రహ్మమన వ్యవహరింపంబడును. ఈప్రకృతిపురుషుల సమావేశమున నఖిలబ్రహ్మాండము లుప్పతిల్లునన నీక లతలు గోపికలగుట యొక తుచ్ఛకార్యము. దీన సందియమందఁదగిన విషయమే లేదు. ఈసిద్ధాంతము క్రొత్తది కాదు. శ్రీశంకరాచార్యమత మిదియే శ్రీరామానుజాచార్యులు గూడ శ్రీపరత్వమును సాధించిరి. ఇది

సర్వజనసమ్మతము. లోకమున నిది కనఁబడును. చక్రవర్తి మంత్రిమూలమున శాసించును. మంత్రి రాజశాసనమును వెలిపుచ్చును. దాన లోకవ్యవహారము సాగును. కాఁబట్టి పరమపురుషుఁ డగు శ్రీకృష్ణమూర్తి తనయిచ్ఛారూపిణి యగు రాధాంబ ద్వారా ప్రపంచమును నడపును. అట్టి పరమపురుషసందర్శనమునకంటెఁ బరమపురుషార్థము వేఱుగ నుండునా? కాఁబట్టి యిందఱుగోపికలు గలరా? వీరెల్లఁ బరపత్నులు గదా? వీరితోఁ జేరుట జారత్వలక్షణము కాకపోవునా యని సందియ మందకుఁడు. ఇదియంతయు భగవద్విడంబనము. భగవదిచ్ఛచే నారాసక్రీడ యాఱునెలలకాలము సాగెను. అంతవఱకుఁ దెల్లవాఱకుండెను. అనఁగా మనుష్యమానమున నాఱునెలలకాలము నాలుగుయామములుగాఁ బరిగణింపఁబడె నని తాత్పర్యము.

ఇఁక నాసురిమునికి భగవంతుఁ డేల దర్శన మీయలేదన్న విషయమున నాలుగుమాటలు వ్రాసెదను. సర్వత్ర నిండియుండు పరాత్పరుఁ డేల యమ్మునికి దర్శనమీయఁడన్న శంక నొందఁ బనిలేదు. బృందావనమున విహరించుటయందు భగవంతున కెక్కువ ప్రీతి కలదు. అందు దర్శనమొసంగి రక్షింపఁదగిన పుణ్యాత్మకుల కితరస్థలముల దర్శనమీయఁ దలంపఁడు. ఒకొక్కపుణ్యకర్మమున కొకొక్కతావున దర్శనమిచ్చుట పరమాత్మునకు వాడుక. అట్టి నిరతిశయానందజనకమై ప్రకృతి ప్రక్కన రూపమును దాల్చియుండ దేవ

తలు దర్శించి యానందించుచుండ బ్రహ్మాదులు కృతార్థుల మైతి మని వినుతించుచుండ నట్టితఱి నామహామునికి దర్శనమీయఁ దలంచెనని యూహింపుఁడు. ఇంతియ గాదు. ఆసురిముని మనోదార్ఢ్యమును బరిశీలింపఁగోరెను. ఎందుఁబోయి వెదకి నను గనఁబడకపోయెఁ గదా యని యుత్సాహము తగ్గ మానుకొనునా? దృఢభక్తిం బూని దర్శనమగువఱకుఁ బ్రయత్నము సల్పునాయని పరిశీలించి దర్శనమొసంగక పోయెను. ఆతనిమనోనిశ్చయము భగవంతునకుఁ దెలియదా యని ప్రశ్నింపరాదు. లోకశిక్షార్థమే యీపరీక్షగాని వేఱు గాదు. ఇట్టియుత్తమగాథం బఠించితిరి. భగవంతునియందు దృఢభక్తి కుదిరినఁగాని తత్కారుణకుఁ బాత్రులము కాఁజాలమని నమ్మి త్రికరణశుద్ధిగా భగవంతు నారాధింపుఁడు. తద్దివ్యనామస్మరణము నొనరింపుఁడు. దేవతాంతరదూషణము చేయకుఁడు. అది యిష్టదేవతను దూషించినట్లే యగును. సర్వదేవతాస్వరూపుఁడు కదా భగవంతుఁడు. అట్టిభగవద్రూపముల దూషించినంతకంటె విశేషమగు పాప మేది కలదు? అట్టిదుష్కృత్యము నొనరింపక సర్వశబ్ద వాచ్యుఁడు కృష్ణుఁ డను నమ్మకమునఁ దన్నామస్మరణ మొనరించి తద్రూపమును మనఃఫలకమున నిల్పి ధ్యానింపుఁడు. ఇదియే సనాతనధర్మమార్గము. దీనికి క్షతి కానరాదు. ఉపనిషదర్థ మిదియే. సర్వపురాణసార మిదియే. ఇంతట నీవిషయమును వదలి యవ్వలివృత్తాంతమును వ్రాసెదను.

## ఆసురియు శివుఁడు గోపికావేషముల శ్రీకృష్ణు సేవింప వచ్చుట.

*ఈశ్వరుం డీరీతిగా నాసురిమునికిం దెల్పి యతనిం గూడి పోయి వ్రజమండలముననున్న శ్రీకృష్ణు దర్శింపనెంచి ప్రయాణము సాగించెను. వారిరువురు మనోవేగమునఁ బోవుచుఁ ద్రోవలో దివ్యమహీరుహమనోహరలతావితానమనోజ్ఞంబగు యమునాతీరభూప్రదేశమును జూచుచుఁ బోయిరి. భగవంతుఁ డున్న రాసమండలసమీపమును జేరఁ గల్గిరి. గోలోకముననున్న గోపికలు బెత్తములను జేతులం దాల్చి మహత్తరబలసంయుతలై ద్వారమును గాచుచుండి అతివేగమునఁ బోవు నాశంకరు నాసురిమునిని లోనఁ బ్రవేశింప వలదని యడ్డిరి. ఆద్వారపాలికలతో వారిర్వురు మే మిత్తటి శ్రీపరమాత్మసందర్శనము చేయ నరుదెంచితిమి. కానఁ బో నను జ్ఞ యిండని పల్కిరి. ఆపల్కులు విని యాద్వారపాలికలు మహానుభావులారా! బృందావనమునం దంతట కోటిసంఖ్యలుగా మేమున్నవారము. శ్రీకృష్ణానుమతి శిరసావహించి యీరాసమండలమును రక్షించుచున్నవారము. ఈ రాసమండలమునఁ బురుషుఁ డొక్కఁడే కృష్ణమూర్తియే. రాసవిహారస్థలము పురుషాంతరవర్జితము. గోపికాబృందముతప్ప వేఱొక్కపురుషుఁడేని లోనఁ బ్రవేశింప రాదు. మీమానససరోవరంబుల శ్రీభగవద్దర్శనేచ్ఛ గలదేని

---

*ఈకథ గర్గసంహితయం దిరువదాఱవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది. పురాణములయం దీకథ నాచూచినంతవఱకుఁ గానరాదు. నారదబహుళాశ్వసంవాదమున నీకథ చెప్పఁబడినదని గ్రహింపఁదగు.

గోపీత్వము నొందుఁడు. అపుడు పోనిత్తుము. ఇట్లే భగవదాజ్ఞ యు నుండెడిని. కావున మీకట్టి యిచ్ఛ గలదేని యీమానస సరోవరమున స్నానమొనరించి పరిశుద్ధస్వాంతముల భగవం తుని ధ్యానించుచు గోపీత్వము నాశ్రయింపుఁడు.

అనుద్వారపాలికామృదుతమవచనముల నాలించి శివా సురిమునులిర్వురు నామానససరోవరంబునఁ గ్రుంకి గోపీత్వము నవలంబించి రాసమండలమును బ్రవేశించిరి. సౌవర్ణమయమై పద్మరాగమణిఖచితమై యారాసమండల మెంతో కన్నులపం డువు చేయు చుండెను. కదంబమహీరుహము లెల్లచో నావరిం చియుండెను. మాధవీలత లాభూరుహంబులం జుట్టుకొని గృహావరములవలె నుండెను. వసంతకౌముది యెల్లెడల వ్యా పించి యుండెను. కానఁ జూడఁ గన్నులు రెండు చాలకయుం డెను. శిల్పనైపుణ్య మందే కనఁబడుచుండెను. వృక్షముల యందు బంగరుగొలుసులుగల యుయ్యెలలు వ్రేలాడుచుండెను. యమునానదీజలంబులం గొనితేర నవతరించుఘట్టములు రత్నసో పానవినిర్మితములై యలరారుచుండెను. మయూరకలహంసప్ర ముఖవిహంగవర్యము లందందుఁ గనఁబడుచుండెను. యమునా నీలజలములఁ బ్రతిఫలించిన వృక్షము లాడుచున్నట్టులుండెను. వానిం జూడ రాసనృత్యము నవియు నభ్యసించుచున్నట్టు లుండెను. మండపవీథులు ప్రాంగణస్తంభపంక్తులు నేత్రపర్వ మొనర్చుచుండెను. నిర్మితగృహావరములపై సువర్ణకలశము లెత్తఁబడియుండెను. పలువన్నెలపతాక లెగురుచుండెను. శ్వేతా

రుణపుష్పములు క్రింద దట్టముగఁ జల్లఁబడియుండెను. వానిపై మూఁగియున్న మధుకరముల మధురతరఝంకారములువినవచ్చు చుండెను. వాదిత్రధ్వనులు వినవచ్చుచుండెను. వేయిపత్రము లుగల కమలములనుండి మెల్లమెల్లన వీచువాయువులు హాయిని గోరకయే కల్పించుచుండెను. ఆవాయువులు శీతలములై పరి మళభారమును వహించుచునుండుట వినుతికిం బాత్రము లగు చుండెను.

ఆరాసమండలమున శ్రీకృష్ణుఁడు కోటిచంద్రప్రతీకాశ ముఖమనోహరుఁడై కన్పట్టుచుండెను. హంసగామినిరియై పద్మినీ జాతిస్త్రీలలో మిన్నయగు రాధాదేవి తనప్రక్కన నుండ నాది వ్యసుందరవిగ్రహుఁడు స్తుతింప శక్యముగా కుండెను. స్త్రీరత్న ములు కోటిసంఖ్యలుగాఁ దన్నునావరించి యుండ నమేయ శక్తిని గనఁబఱచుచుండెను.కోటిమన్మథలావణ్యముగలిగిశ్యామ సుందరవిగ్రహుఁడై యాపరమేశ్వరుఁడు వెలయుచుండెను. ఆమహాత్ముని కరారవిందమున మురళియు మేనఁ బీతాంబరము ను గనఁబడుచుండెను. వేత్రమొక్కకరమునఁ బరఁగుచుండెను. శ్రీవత్సాంకము కౌస్తుభహారము వనమాలికయు విరాజిల్లుచుం డెను. క్వణన్నూపురమంజీరకాంచీకేయూరభూషితుఁడై హారకం కణబాలార్కమండలద్వయమండితుఁడై, కోటిసూర్యప్రతీకా శుఁడై యానందనందనుఁ డమందానందము నొసఁగూర్చుచుండె ను. అభీష్టదానదక్షము లగునాహరి క్రీఁగంటిచూపులు యోషి న్మనముల హరించుచుండెను.

ఆదివ్యశ్యామసుందర విగ్రహమును దూరమునుండియే చూచి శంకరుఁడును, ఆసురిమునియుఁ గృతాంజలిపుటులై నమస్కరించి గోపికానికరము చూచుచుండఁగాఁ జెంతకుం బోయి తత్పాదారవిందములు సోఁక నమస్కరించి హర్షవిహ్వల మనస్కులై యిట్లనిరి.మహాత్మా! నీవు పరిపూర్ణుఁడవయ్యు నఖండ

ఆసురిమునిశంకరకృతశ్రీకృష్ణస్తుతిః.

కృష్ణకృష్ణ మహాయోగిన్ దేవదేవ జగత్పతే, పుండరీకాక్ష గోవింద గరుడధ్వజ తే నమః. ౧. జనార్దన జగన్నాథ పద్మనాభ త్రివిక్రమ, దామోదర హృషీకేశ వాసుదేవ నమోఽస్తు తే. ౨. అద్యైవ దేవ పరిపూర్ణతమస్తు సాక్షాద్భూభూరిభారహరణాయ సతాం శుభాయ, ప్రాప్తోఽసి నంద భవనే పరతః పరస్త్వం కృత్వా హి సర్వనిజలోకమశేష శూన్యమ్. 3. అంశాంశకాంశకకలాభిరుతాభిరామ మావేశపూర్ణనిచయాభిరతీవయుక్తః, విశ్వం బిభర్షి రసరాసమలంకరోషి బృందావనం చ పరిపూర్ణతమస్స్వయం త్వరం. ౪. గోలోకనాథ గిరిరాజపతే పరేశ బృందావనేశ కృతనిత్యవిహార లీల, రాధాపతే వ్రజవధూజనగీతకీర్తే గోవింద గోకులపతే కిల తే జయోఽస్తు. ౫. శ్రీమన్నికుంజలతికాకుసుమాకరస్త్వం శ్రీరాధికాహృదయకంఠవిభూషణస్త్వం, శ్రీరాసమండలపతిర్వ్రజమండలేశ బ్రహ్మాండమండల మహీపరిపాలకోఽసి. ౬.

ఓ శ్రీకృష్ణా! మహాయోగివి. గోవిందుఁడవు. జగత్పతివి. పుండరీకాక్షుఁడవు. గరుడధ్వజుఁడవు. ఇట్టి నీకు నమస్కారములు. ఓజనార్దన! నీవు పద్మనాభుఁడవు. వామనుఁడవన నీవే. దామోదరహృషీకేశవాసుదేవనామములు నీకే చెల్లును. ఇట్టినీకు వందనములు. మహాత్మా! దేవాదిదేవా! ఇప్పుడే నీవు పరిపూర్ణస్వరూపుఁడవైతివి. భూమిదగుగురుతరభారమును దీర్ప నవతరించితివి. సత్పురుషులకు శుభములఁ గల్గింప నెంచితివి. ఈరెండుకార్యములు

మహా తేజోవిరాజితుఁడవయ్యు నీబృందావనమున నీగోపికలతో నీరాసమండలమున విహారము నాసక్తితోఁ జేయుచున్నట్లు నటించుచున్న వాఁడవు. నీతేజము సర్వత్ర నిండియున్నయది. ఇపు డిందే నీవుండినట్లు కనఁబడుచున్న వాఁడవు. ఇట్టినీకు వందనములొనరించువారమని యాయిరువురు ప్రార్థించిరి ఆస్తుతులకుఁ దద్భక్తికిని గోవిందుఁడు శ్రీరాధాదేవియు నానందించిరి. అంత మందస్మితము ముఖము నలంకరింప శ్రీకృష్ణపరమాత్మ మేఘగంభీరవాక్కుల వారి కిట్లనియె. మహాత్ములారా! అఱువది వేలసంవత్సరములు నిష్ఠమెయిఁ దపమొనరించితిరి. నాదర్శన మొదవదయ్యెను. మీకేవిషయమునను అపేక్ష లేదు కదా. ఏభక్తుఁడే వాంఛితమును గోరక శాంతాత్ముఁడై శత్రువులు లేక

---

సాగింప నందునిభవనమునఁ బరాత్పరుఁడ వయ్యు నీకు ముఖ్యనివాసభూతమగు గోలోకమును శూన్యముగాఁ జేసి యవతరించితివి. గోలోకనాయకా! ప్రపంచమెల్ల నీయంశములచేతను, అంశాంశములచేతను, తల్లేశములచేతను నిండియున్నది. అట్టియంశాదులచేత నే విశ్వమును భరించియున్నవాఁడవు. రాసమండలము నాసక్తిచే నలంకరించి యున్నవాఁడవు. బృందావనమున నెల్లయెడల నిండియున్నవాఁడవు. గోవర్ధనోద్ధారకా! పరమాత్మస్వరూపా బృందావనమున నిత్యమును విహారము సల్పుచున్నవాఁడవు. రాధామనోనాయకా! వ్రజాంగనాపరిగీయమానయశశ్చంద్రుఁడవై గోవిందుఁడవైయలరునీకు వందనములు. పరమపురుషా! నికుంజపుంజలతావితానమునకు నీవు వసంతర్తువవు. శ్రీరాధాంబా హృదయకంఠవిభూషణమవు. శ్రీరాసమండలనాథుఁడవు. వ్రజమండలపతివి. బ్రహ్మాండమండలమహీపరిపాలకుఁడవు. ఇట్టి నీపాదారవిందములకు నమస్తతు లర్పించువారము.

ఆదివ్యశ్యామసుందర విగ్రహమును దూరమునుండియే చూచి శంకరుడును, ఆసురిమునియుఁ గృతాంజలిపుటులై నమస్కరించి గోపికానికరము చూచుచుండఁగాఁ జెంతకుంబోయి తత్పాదారవిందములు సోఁక నమస్కరించి హర్షవిహ్వలమనస్కులై యిట్లనిరి.మహాత్మా! నీవు పరిపూర్ణుఁడవయ్యు నఖండ

ఆసురిమునిశంకరకృతశ్రీకృష్ణస్తుతిః.

కృష్ణకృష్ణ మహాయోగిన్ దేవదేవ జగత్పతే, పుండరీకాక్ష గోవింద గరుడధ్వజ తే నమః. ౧. జనార్దన జగన్నాథ పద్మనాభ త్రివిక్రమ, దామోదర హృషీకేశ వాసుదేవ నమోఽస్తు తే. ౨. అద్యైవ దేవ పరిపూర్ణతమస్తు సాక్షాద్భూభూరిభారహరణాయ సతాం శుభాయ, ప్రాప్తోఽసి నందభవనే పరతః పరస్త్వం కృత్వా హి సర్వనిజలోకమశేష శూన్యమ్. 3.అంశాంశకాంశకకలాభిరుతాభిరామ మావేశపూర్ణనిచయాభిరతీవయుక్తః, విశ్వం బిభర్షి రసరాసమలంకరోషి బృందావనం చ పరిపూర్ణతమస్స్వయం త్వరం. ౪. గోలోకనాథ గిరిరాజపతే పరేశ బృందావనేశ కృతనిత్యవిహారలీల, రాధాపతే వ్రజవధూజనగీతకీర్తే గోవింద గోకులపతే కిలతే జయోఽస్తు. ౫. శ్రీమన్నికుంజలతికాకుసుమాకరస్త్వం శ్రీరాధికాహృదయకంఠవిభూషణస్త్వం, శ్రీరాసమండలపతిర్వ్రజమండలేశ బ్రహ్మాండఖండల మహీపరిపాలకోఽస్తి. ౬.

ఓ శ్రీకృష్ణా! మహాయోగివి. గోవిందుఁడవు. జగత్పతివి. పుండరీకాక్షుఁడవు. గరుడధ్వజుఁడవు. ఇట్టి నీకు నమస్కారములు. ఓజనార్దన! నీవు పద్మనాభుఁడవు. వామనుఁడవను నీవే. దామోదరహృషీకేశవాసుదేవనామములు నీకే చెల్లును. ఇట్టినీకు వందనములు. మహాత్మా! దేవాదిదేవా! ఇప్పుడే నీవు పరిపూర్ణస్వరూపుఁడవైతివి. భూమిదగుగురుతరభారమును దీర్ప నవతరించితివి. సత్పురుషులకు శుభములఁ గల్గింప నెంచితివి. ఈరెండుకార్యములు

మహాతేజోవిరాజితుఁడవయ్యు నీబృందావనమున నీగోపికలతో నీరాసమండలమున విహారము నాసక్తితోఁ జేయుచున్నట్లు నటించుచున్నవాఁడవు. నీతేజము సర్వత్ర నిండియున్నయది. ఇపుడిందే నీవుండినట్లు కనఁబడుచున్నవాఁడవు. ఇట్టినీకు వందనములొనరించువారమని యాయిరువురు ప్రార్థించిరి ఆస్తుతులకుఁ దద్భక్తికిని గోవిందుఁడు శ్రీరాధాదేవియు నానందించిరి. అంత మందస్మితము ముఖము నలంకరింప శ్రీకృష్ణపరమాత్మ మేఘగంభీరవాక్కుల వారి కిట్లనియె. మహాత్ములారా! అఱువది వేలసంవత్సరములు నిష్ఠమెయిఁ దపమొనరించితిరి. నాదర్శనమొదవదయ్యెను. మీకేవిషయమునను అపేక్ష లేదు కదా. ఏభక్తుఁడే వాంఛితమును గోరక శాంతాత్ముఁడై శత్రువులు లేక

---

సాఁగింప నందునిభవనమునఁ బరాత్పరుఁడ వయ్యు నీకు ముఖ్యనివాసభూతమగు గోలోకమును శూన్యముగాఁ జేసి యవతరించితివి. గోలోకనాయకా! ప్రపంచమెల్ల నీయంశములచేతను, అంశాంశములచేతను, తల్లేశములచేతను నిండియున్నది. అట్టియంశాదులచేతనే విశ్వమును భరించియున్నవాఁడవు. రాసమండలము నాసక్తిచే నలంకరించి యున్నవాఁడవు. బృందావనమున నెల్లయెడల నిండియున్నవాఁడవు. గోవర్ధనోద్ధారకా! పరమాత్మస్వరూపా బృందావనమున నిత్యమును విహారము సల్పుచున్నవాఁడవు. రాధామనోనాయకా! వ్రజాంగనాపరిగీయమానయశశ్చంద్రుఁడవై గోవిందుఁడవై యలరునీకు వందనములు. పరమపురుషా! నికుంజపుంజలతావితానమునకు నీవు వసంతర్తువవు. శ్రీరాధాంబాహృదయకంఠవిభూషణమవు. శ్రీరాసమండలనాథుఁడవు. వ్రజమండలపతివి. బ్రహ్మాండమండలమహీపరిపాలకుఁడవు. ఇట్టి నీపాదారవిందములకు నమస్తుతు లర్పించువారము.

యుండునో వాఁడు నాకు మిత్త్రుఁడు. మీరిరువురు నాకత్యంత మిత్త్రులు. కావున వరమును గోరుఁడు. ఒసంగెదను. అని కరుణ మెయిం బలుక నాశంకరుఁడు, అసురిమునియు శ్రీకృష్ణా! మీ యిరువుర పాదారవిందములకు సదా నమస్కరించు భాగ్యము, బృందావనమున నివాసము, మాకుఁ గృపచేయుము. వేఱొక్కవరము కోరువాంఛ లేదు. మీయిర్వురపాదసేవకంటె వేఱొక్కటి యుత్కృష్టముగాఁ గనఁబడదు. శ్రీరాధామాధవులకు మాకు నమస్కరింతుము.

అని వారు విన్నవింప శ్రీహరి యట్లే యగుఁగాక. అని యాదృతిమీఱం బలికెను. ఆవాక్యము ననుసరించి మనోహర బృందావనమునందు యమునాతటమునందు రాసమండలమండితప్రదేశమునందు శ్రీహరి విహరించిననికుంజపార్శ్వమందు సైకతభాగమునందు వంశీవటవిటపిసమీపస్థలమందు శంకరుండును, అసురిమునియు సదా నివాసమును జేసిరి. తరువాత శ్రీకృష్ణుఁడు, రాధాదేవియు గోపికలును దనచెంతనుండఁగా మదికి నింపుఁబెంచు పద్మాకరమునఁ గుసుమపరిమళములు గుబులుకొనుచుండ మందమారుతములు మదికి హాయిని గల్పించుచుండ మధుకరములుమృదురవము లలర ఝంకారములు చేయుచుండ విహారము సల్పెను. ఆవిహారకాలమున శ్రీరాధామాధవుల దర్శించి దేవతలు పరమానందబంధురతరస్వాంతులైరి.

ఈరాసక్రీడాకాల మొకరాత్రియే. కాని యారాత్రి ఆఱుమాసములకు సమానముగా శ్రీకృష్ణమహిమమున నైనది.

ఆకాలము క్షణకాలముగనే భావించి గోపికలందఱు శ్రీకృష్ణునిం గూడి యానందపరవశ లైరి. అరుణోదయకాలమున నావ్రజాంగనలు తమతమగృహములకు శ్రీకృష్ణునానతిం గొని గుంపులుగాఁ గూడి పరిపూర్ణమనోరథలై చనిరి. నందనందనుఁడు జనకుఁడగునందునిమందిరము నమందానందమునఁ బ్రవేశించెను. శ్రీరాధాదేవియు వృషభానుపురమును బ్రవేశించి తనతండ్రి యింట నుండెను. ఇది శ్రీకృష్ణపరమాత్మ యొనరించినరాసక్రీడ. దేవతలకేని మనోజ్ఞ మనందగు. ఇఁక మానవులమాట జెప్పవలయునా. సకలమంగళాస్పదమగు నీచరితమును భక్తులు పఠింపదగు. భక్తుఁ డేవాంఛలఁ గోరిన నవి దైవానుగ్రహమున ఫలించు.

భక్తులారా! రామావతారమున నాదివ్యమంగళవిగ్రహమును గాంచి మును లెల్ల నీమూర్తినిఁ గౌఁగిలించుకొను భాగ్యము నందకపోతిమని యెంచినటుల, నాభావ మెఱింగి శ్రీరామచంద్రమూర్తితనయవతారసమాప్తికాలమునభవిష్యత్కాలమున శ్రీకృష్ణావతారమున మీకుఁ గలవాంఛలు తీర్పఁజాలుదు ననియుఁ జెప్పినట్లు సూక్తి వినఁబడియెడు నని ముందే వ్రాసి యుంటిని. ఆసూక్తికిం దగినప్రమాణవచనము శ్రీమద్రామాయణమునఁ గానరాదు. ఎందేని గానఁబడకపోవునా యని సంశయించుచుంటిని. క్రమక్రమముగా బురాణములఁ బరిశీలించుకొలందిని గనఁబడవచ్చునన్న జాడలు పొడకట్టుచున్నయవి. ఈగాథయందు విశేషవిషయములు కొన్ని గలవు. అందు శివుఁ

డును, ఆసురిమునియు గోపిక లగుటయే. ఇది తొలుదొలుత విచిత్రముగా దోఁచును గాని చక్కఁగాఁ బరిశీలించినచో నిది చిత్ర మనఁదగ దని తోఁచును.

శివుఁడు ఆసురిమునియుఁ గైలాసమునుండి బయలుదేరిరి. బృందావనమును బ్రవేశించిరి. బృందావనము రాసమండల ప్రధానము. రాసక్రీడ శ్రీ కృష్ణపరమాత్మ కత్యంత ప్రియము. అందుఁబురుషుఁ డొక్కఁ శ్రీకృష్ణుఁడే. తక్కినవారందఱువనితామణులు. వారందఱు తదంశంగతలు. శ్రీకృష్ణుఁడు వారి నానందింపం జేయుచుండును. రాసక్రీడయందు శ్రీరాధాంబ ప్రధానదేవత. ఆమెయిచ్ఛానుసారము మెలఁగువారు పరివారదేవతలు. అందఱి కన్నిరూపులుగా గనఁబడువాఁడు పరమేశ్వరుఁడు. అట్టిచోట నుండు పరాత్పరునిం జూడఁగోరియే దేవతలు మింట నిల్చిరి. మహర్షులు తమతపఃఫలముగా నామండలమున మూర్తీభవించియున్న భగవంతుం డిలకింప వియద్వీధి నివసించిరి. ఆస్థలమున నున్న భగవంతుని దర్శించుట శ్రేష్ఠతమమన నేల యని ప్రశ్న మొక్కండు రావచ్చును. తత్సమాధానము వినఁదగును.

నిర్గుణపరబ్రహ్మము నుపాసింప సాధ్యమే గాదు. అది నామరూపక్రియాశూన్యము. సర్వత్ర నిండియుండునది. భక్తు లుపాసించి కృతకృత్యులు గావలయుననియే ఆతత్వము ప్రకృతి నాశ్రయించును. ఆశ్రయణమనఁగా సేవ్యసేవకభావము కాదు. రూపమును నామమును ధరించుటయని గ్రహింపఁదగును. అత్తఱి నాతత్వము సగుణబ్రహ్మమని చెప్పంబడు.

"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప!"
భగవద్గీత. ౪అ. ౫శ్లో:

అని భగవంతుఁ డర్జునున కుపదేశించెను. ఆజన్మముల నఁగా నసంగుఁడయ్యు లోకసంగ్రహార్థము సంగుఁడగుట యనియే దీనిసారము. అట్టియవతారములే భక్తులకు శరణ్యములు. ధ్యానింప, వినుతింపఁ, బూజింపఁ దగినవి. ప్రకృతింగాడినపుడే పరాత్పరుఁడు భక్తులకు వాంఛల నొసంగఁజాలు. అనఁగా భావమేమి? తాను సాక్షిమాత్రుఁడుగనుండి ప్రకృతికఖిలజగత్కార్యముల నప్పగించు. ఆమె శక్తి యపారము. భగవత్సన్నిధి నేమిచేయఁదలఁచిన నాపనిని జేయఁజాలియుండును. ఆప్రకృతియన నెవ్వతెయొ కాదు. భగవదిచ్ఛయే ప్రకృతియనంబడు. ఏరూపమువలసిన దానిం దాల్పనోపు. దానినారాధించినఁగాని వాంఛితములు ఫలింపవు. భగవంతుఁడుసాక్షిమాత్రుఁడని వేదము లంగీకరించినవి అందఱు నంగీకరించిరి.

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా.
గీత. ౪ అధ్యా. ౬ శ్లో.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
౪ అధ్యా. ౭ శ్లో.

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః,

బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః. ౧౦
యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం,
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః." ౧౧. శ్లో.

అని భగవంతుఁడు గీతాశాస్త్రమున బోధించెను. దీని భావమేమి? నేఁబుట్టుకలేనివాఁడ నైనను నాప్రకృతిని (ఇచ్ఛాశక్తిని) ఆశ్రయించి నామాయచేతనే పుట్టుచున్నాను అను భగవద్వాక్యమునఁ దేలినసారమే పైభావమని గ్రహించుటయే తరణోపాయము.

ఈరాసమండలవిహార మనఁగాఁ బ్రకృతియగు రాధాంబను గలిసి భగవంతుఁడు తదిచ్ఛను దీర్ప నెంచినట్లున్నవాఁడని యెఱుంగఁదగును. అత్తఱి సర్వము శక్తిమయము. ఆప్రకృతి విలాసములఁ గాంచఁగోరియే బ్రహ్మాదిదేవతలంబరమున నివసించి భగవల్లీలలం దిలకించుచుండిరి. అట్టితరుణమున శ్రీహరిని దర్శించినచో భక్తులకు నెఱవేఱనికోర్కె లుండునా? భగవంతుఁడు ప్రకృతివిశిష్టుఁడుగానిచో నేవాంఛితముల నీఁజాలఁడు. కావుననే ప్రకృతిని బరాపరరహస్యయోగిని అని పెద్దలు చెప్పుదురు. ఆజననియే భక్తులకుంగలకోర్కెల భగవంతు నిచ్ఛానుసారముగ నొసంగుచుండును. ప్రకృతిపురుషులకు భేదము ప్రతిపాదించువారును గలరు. కాని పాపము వారిపాండిత్యము భిక్షాటనమునకే కాని తరింప నుపయోగింపదనుట నిక్కము. ప్రకృతిద్వారా భగవంతుఁ డిష్టార్థముల నొసంగువాఁడు. కావుననే శ్రీశంకర భగవత్పాదులవారు సౌందర్యలహరియందు,

శ్లో. "త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ."

అని స్పష్టపఱచిరి. శ్రీమద్రామానుజాచార్యులవారు గూడ భగవత్కారుణ శ్రీదేవీద్వారా ప్రసరించునని తెలిపిరి. శక్తియన్నంతనే పార్వతియని యులికిపడి వైష్ణవులు శక్తిపూజ నీచమందురుగాని వారిగురువులే పరమశాక్తులు. కనుకనే శ్రీప్రధానత్వమును స్థాపించిరి. వారికంటె శాక్తుఁడు వేఱొకఁ డెవ్వఁడు గలఁడు?

ప్రకృతరాసక్రీడయందు రాధాదేవియే మూలప్రకృతి. పరమపురుషుఁడు శ్రీకృష్ణనామమున వెలయువాఁడు ఆరాధయాకాలమున సంగీతవిద్యేశ్వరియగు శ్యామలయై వెలసెను. ఆక్రీడయందు గానమే ప్రధానము. ఆచక్రము గేయచక్రము. వాగ్దేవత లందఱుతదనుచరలు. విరాట్టువొకఁడుతప్ప నచటసర్వము దేవీమయము. అదియే ప్రకృతిపరమవిలాసము. ప్రకృతివిలాసమును గన్నులారఁగాంచుభాగ్య మొదవినఁజాలు ననియే దేవత లందఱు వ్యోమమున నిలిచిరి. ప్రకృతివశంగతుఁడై పరమాత్మఁడు తనసర్వసాక్షిత్వమును వెల్లడించుచుండెను. అట్టితఱి నమ్మహాత్ముని దర్శించిన ముక్తి కరతలామలకము. సగుణబ్రహ్మము నుపాసింపక చేయుఘనకార్యము వేఱొకటి యెట్టివానికిని లేదు. సగుణబ్రహ్మమనఁగాఁ బ్రకృతివిలాసయుతుఁడని సారము.

"తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్"

అనుసూక్తి యనుభవసంసిద్ధము. ఎట్లు రాజదర్శనము మంత్రిమూలమునఁ గాని చేయ శక్యము గాదో యట్లే సర్వవ్యాపకుఁ డగుపరమాత్మ సాక్షాత్కారము ప్రకృతి నుపాసించి తత్కారణమునఁ బాత్రుఁడైనఁ గాని కానేరదు. తలక్రిందులు తపస్సుచేసినను వేఱుమార్గము కానరాదు. ఉపాసకులకిది యనుభవసిద్ధము. కొందఱలసులు వేదాంతులమని మాటలాడు చుందురు. అవి కాలక్షేపమునకుఁ బనికివచ్చునుగాని కార్యకరణక్షమములు కానేరవు. మనోవీధి నిలుపుకొనుట కొక ప్రతిబింబము కావలయు. ఆకృతివిశిష్టమంతయుఁ బ్రకృతివిలాసము. తదుపాసన మనఁగాఁ బ్రకృత్యుపాసనమే. రామకృష్ణాదులఁ బూజించుట యనఁగా రామకృష్ణాదినామధారిణియగు ప్రకృతిని బూజించినట్లే. తెలియకగాని తెలిసిగాని యెట్లు పూజించిన నాపరదేవిపాదారవిందములను జేరును. కావునఁ బనికిమాలిన మతభేదములఁ బాటింపక సకలరూపధరుండుభగవంతుఁడని నమ్మి యేరూపమున నేనామమున నతని భజించినను ఫల మొక్కటియే యని నమ్మి పరమతధర్మముల దూషింపక స్వమతాభిమానమును వీడక భక్తిభరితమానసులై పరాత్పరుంబూజింపవలయును.దాన నే కడతేరుటకు శక్య మగును. సగుణబ్రహ్మము నుపాసించుటలో మతభేదము లేల? సర్వశబ్దవాచ్యుఁడు పరమేశ్వరుఁడు కాఁడందురా? అన వీలున్నదా? అన్నచో నట్టివాఁడు భగవంతుఁ డగునా? కాఁబట్టి దుర్మతములఁబాటించి పూర్వపుణ్యలబ్ధమనుజ

జన్మమును వ్యర్థము చేసికొనక శ్రీకృష్ణపరమాత్మను సర్వదేవతారూపునిగాఁ దలంచి రాధాంబికను బరదేవిగాఁ జింతించి వారిరువురు చేరియుండుతావు పరమపవిత్రమని నిశ్చయించి పూజించి కృతార్థుల రగుఁడు. ఈ రాసమండలమున నుండు పరమాత్మను భక్తాగ్రేసరుండగు లీలాశుకులు.

శ్లో. "యా శేఖరే శ్రుతిగిరాం హృది యోగభాజాం
పాదాంబుజే చ సులభా వ్రజసుందరీణాం,
సా కాపి సర్వజగతామభిరామసీమా
కామాయ నో భవతు గోపకిశోరమూర్తిః. ౨౪.౧౨శ్లో.
అత్యంతబాలమతసీకుసుమప్రకాశం
దిగ్వాససం కనకభూషణభూషితాంగం,
విస్రస్తకేశమరుణాధరమాయతాక్షం
కృష్ణం నమామి మనసా వసుదేవసూనుమ్.౨౪. ౧౯శ్లో.
బృందావనద్రుమతలేషు గవాంగణేషు
వేదావసానసమయేషు చ దృశ్యతే యత్,
తద్వేణునాదనపరం శిఖిపింఛచూడం
బ్రహ్మ స్మరామి కమలేక్షణమభ్రనీలమ్." ౨౪. ౨౧ శ్లో.

అని పరబ్రహ్మమునుగా వినుతించి ధ్యానించి కృతార్థులైరి. గోపికాకాంతల వ్రతమును బాడుచేసినవానిని బరబ్రహ్మముగా ధ్యానించుట సంభవించునా? తెలివిమాలి కథాసారమెఱుంగలేక దురహంకృతిని మాటలాడుటకంటె నూరకుండుట మంచిది. సుస్వాంతులారా! రాసక్రీడావిశేషములు, వాని

భావములు పురాణములు విశేషముగా వెల్లడించినవి. వానిలో నేమూలనైనను గామాతురుఁడు శ్రీకృష్ణుఁడని కానఁగాదు. పరిశీలించుకొలఁదిని బరబ్రహ్మమనియే తెలియవచ్చెడిని. కావున మీరెల్ల రాధామాధవుల ననారతము నియమమునఁ బూజింపుఁడు. ధ్యానింపుఁడు. వినుతింపుఁడు. అదియే కృతార్థులగుటకు మంచిత్రోవను జూపును. రాధాదేవి మూలప్రకృతి. అనఁగా నాదిశక్తి. శ్రీకృష్ణుఁడే ఆదినారాయణుఁడు. వారిరువురొకచోటనుండునట్టితావు పరమపవిత్రము ధ్యానమున భక్తుని మానసము బృందావనము. అందు రాధామాధవులు విహరించుచున్నట్లు ధ్యానించుటయే తపస్సు. అదియే యోగుల ధ్యానపద్ధతి. అట్లుధ్యానించినఁగాని కృతార్థుఁడు కాఁజాలఁడు. బృందావన మనుపేరుగల భూభాగమునకు యాత్రపోయిన లాభము లేదు. అది యజ్ఞులకొఱ కేర్పఱచిన మార్గము. అది ప్రథమసోపానము. దానియందే సదా యాదృతి గల్గియుండుట తరణోపాయము కాదు. విగ్రహార్చనము సదా చేయఁదగినది కాదు. ధ్యానమునకై తొలుదొలుత దానిని జేయఁదగును. ఆవల నాబింబము స్వహృదయకమలకర్ణికాసమాసీనముగాఁ జేసికొనవలయు. ఆపనికిఁ గడంగనిచో నాజన్మమామనుజునకుఁ దొలిజన్మమే కాని కడపటిజన్మము కాదు. మన పెద్దలు సాలగ్రామములఁ బూజింప నియమించుట యందులకే. సాలగ్రామము నిరవయవము. తదాకారధ్యానము చేయఁదగినది. ఇది క్రమక్రమవృద్ధిమార్గము. దానింబాటింపక లోహమయవిగ్రహా

ములఁ బూజించుచున్న ముక్తిమార్గము దూరమున కేగుచుం డును. ముక్తిం గోరువారు విగ్రహార్చనము సదా చేయఁబూనరు. సర్వవ్యాపకునిగా ధ్యానించుట యభ్యసింపవలయును.

"శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప!
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే 33
యత్ జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ!
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి. 34
తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!" ౪౨శ్లో.

గీత. ౪. అధ్యా.

అని శ్రీకృష్ణపరమాత్మ గీతాశాస్త్రమున బోధించినది యోగము కాదా. అట్టిభగవద్వాక్యముల నమ్మి భగవంతు నారాధింపుఁడు. జ్ఞానులు పూజించునట్లు పూజింపుఁడు. ఇంత కంటె విశేషించి చెప్పఁదగిన దేమున్నది ? ఇంక నీవిషయమును వదలి భగవల్లీలల మఱికొన్నింటిని వ్రాయఁబూనెద. అందు నంద వృషభాను లిరువురును గోపకులకు శ్రీకృష్ణుమహిమము నెఱింగించుకథను దెలిపెదను.

## నందవృషభానుగోపసంవాదము.

* భగవంతుఁడు రాసక్రీడ చాలించి యాఱుమాసము

*ఈకథ గర్గసంహితయందు గిరిరాజఖండమున నైదవయధ్యాయము నుండి గ్రహింపఁ బడినదని యెఱుంగఁదగు. ఇదియు నారదబహుళాశ్వ సంవాదమనియుం నెఱుంగనగు.

లంత కాలముగా నొకరాత్రి యుండఁజేసి సకలభక్తులను సంతోషాంబుధి నోలలాడించి దివిజులకుఁ దనయమానుషచర్యలం దెల్పి తాను యథాపూర్వముగా నందనందనుఁ డనఁబరఁగుచు నింటికిం బోయి యుండెను. గోపకులు శ్రీకృష్ణుఁడు గోవర్ధనాచలము నెత్తినది మొదలు సంశయాకులస్వాంతులై యుండిరి. ఒక్కనాఁడు గోపకలు గోపికలు నందునిం గానఁబోయి వినయమునఁ జేతులొగ్గి మహాత్మా! మీవంశమున మున్నెవ్వరును బర్వతమును ధరించినవారు పుట్టరు కదా. గండశిలనైన నీవు ధరింపఁజాలవు. ఏడువత్సరములయీడుగల నీకొమరుఁడు శ్రీకృష్ణుఁడు పర్వతవరము నెత్తి ధరించుట యబ్బురము కాదా! అప్పటినుండి మామనముల నొకశంక గల్గినది. నీకుమారుఁడు గజరాజు కమలము నవలీలఁ బెకలించి శుండాగ్రమున ధరించినట్లు మెట్టదామరను బాలుఁడు విలాసముగాఁ జేతఁబట్టుకొనునట్లు గోవర్ధనమహాపర్వతమును ధరించెను. యశోదాదేవియు నీవును గౌరవర్ణము గలవారు. మీకుమారుఁడు కృష్ణవర్ణము గలవాఁడు. ఇది కులవిలక్షణము. చంద్రవంశమునఁ బుట్టుటచే బలరాముఁడు శ్వేతవర్ణముగ నుండుట యర్హమే. కృష్ణుఁడు కృష్ణవర్ణముగ నుండుట సంశయమున కెడమిచ్చుచున్నది. ఇందలిసత్యమును వచింపుము. వచింపకున్న నిన్ను వదలుకొందుము. గోపకులమున నీశిశువుదయించినది సత్యమా? వచింపకున్న నీకు దోషము కల్గును.

ఇట్లు గోపకులు పలుక యశోదభయవిహ్వాల యయ్యెను.

నందుఁడు గోపకులెల్లఁ గ్రోధరసపరిపూర్ణులై యుంట నెఱింగి యశోద భీతయై యుండుటయుఁ దలంచి వారికిట్లనియె. గోప కులారా! గర్గాచార్యవచనమును మీకు వినిపించెద. సమా హితులరై యాలకింపుఁడు. ఆమాటల విన్నచో మీసంశయ ములు తొలంగు. కృష్ణనామనిర్వచనము తొలుతఁ జెప్పెద. "కకారమునకుఁ గమలాకాంతుఁ డని యర్థము. ఋకారము రాముఁడని యర్థము నిచ్చును. షకారము షడ్గుణపతి యను నర్థ మొసంగును శ్వేతద్వీపనివాసి యనియు దానికర్థము. ణకా రము నారసింహుఁ డనుభావముఁ దెల్పును. అకార మక్షరుఁ డని, అగ్నిభుక్కనియు నర్థమును దెల్పును. విసర్గములు నరనా రాయణు లనుమును లనుభావము వెలిపుచ్చును. ఈకృష్ణశబ్ద మునఁ గలయాయువర్ణములు పూర్ణుఁడని తెల్పుచున్నవి. ఈకా రణమునఁ గృష్ణశబ్దము పరిపూర్ణత్వమును దెల్పెడిని. చతుర్యు గములందును భగవంతుఁడు శుక్లరక్తపీతకృష్ణవర్ణముల వెల యును. ద్వాపరాంతము కలియారంభము నగునీసమయమున శ్రీవారి కృష్ణవర్ణుఁ డయ్యెను. కానం గృష్ణనామము గలిగెను. వసువు లింద్రియములు. దేవతలు చిత్తము ఇట్లు గలిగినమహా త్ముఁడౌట వాసుదేవుఁ డనంబరఁగు. వృషభానుపుత్రికగా రాధ జనించెను. ఆమె కీకృష్ణుఁడే భర్త. కావున రాధాపతి యనునా మధేయ మీకృష్ణునకుఁ బ్రథితం బగు. పరిపూర్ణుఁడై భగవం తుఁడు నగుశ్రీకృష్ణుఁడు బహుళబ్రహ్మాండనాయకుం డగును. గోలోకమున నలరారువాఁడు. ఆభగవంతుఁడు నీకుమారుఁడై

భూభారమును హరింప నవతరించెను. కంసాదిక్రూరదానవుల వధించును. భక్తులను బరిపాలించును. వేదగుహ్యములగు ననంతనామము లీకృష్ణునకుం గలవు. ఒక్కొక్కనామ మొక్కొక్కకార్యవశమునఁ గల్గుచుండును. విస్మయమునొందఁ బనిలేదు."

అని యిట్లు గర్గమహర్షి వచించెను గాన నీపుత్త్రునియం దేశంకలు లేక యున్నాఁడను. వేదవాక్యము, మహర్షివచనము భూతలమునఁ బ్రమాణములు కదా! అని నందుఁడు పలుక గోపకు లిట్లనిరి. మహాముని గర్గాచార్యుఁడు మీయింటికివచ్చి నపుడు నామకరణమహోత్సవము చేయించితివి కదా? అపు డేల మమ్మందఱను బిలిపింప లేదు? శిశువునకు నామకరణము నీయింటనే కదా చేయించితివి? నీకీరహస్యవిషయము తెలిసినపు డేల దాఁచిపెట్టితివి? అనిపలుకుచు నందవచనముల విశ్వసింపక క్రోధపూర్ణమానసులై వృషభానునిపురమునకుం బోయిరి. వృషభానుఁ డింట సుఖముగాఁ గాలమును గడపుచుండెను. గోపాలకు లామహాత్మునిం గని బంధుమర్యాదలఁ బాటించి యిట్లు ప్రశ్నించిరి. వృషభానూ! నీవు జ్ఞాతిముఖ్యుఁడవు. జ్ఞాతిబృందమునుండి నందుని దొలఁగింపుము. అని క్రోధమునఁ బలుకు వారిపలుకులు విని వృషభానుఁ డిట్లనియె. గోపకులారా! నందుని ద్యజించుట కతనియం దేదోషము గలదని యూహింతును? గోపకులమున నందుఁడు వరిష్ఠుఁడు. విశేషించి నాకుం బ్రియుఁడు. ఆమాటలు విని గోపాలకు లిట్టులనిరి.

రాజా! నందుని బరిత్యజింపవేని నిన్ను మేమెల్లఁ బరిత్యజింతుము. నీయింట నొకకన్యక వివాహయోగ్యవయస్సరిత యై యున్నది కదా. ఆకన్యకను దగినవరున కిచ్చి యేల వివాహము చేయకున్నవాఁడవు? సంపన్నద్ధమున విఱ్ఱవీఁగుచున్నవాఁడవు కావున నీయం దీకలుషము గలదు. ఈదినమునుండి జ్ఞాతిపరిగణమునందు నీనామ ముచ్చరింపఁబడదు. వెలుజాతివాఁడవుగాఁ దలంపఁబడుదువు. అది నీకిష్టము లేనిచో నందరాజును త్యజించి జ్ఞాతిబృందమున నుండుము.

అని గోపకులు పట్టుపట్టి పలికిరి. ఆమాటలు విని వారి సంశయమును దొలఁగింప నెంచి వృషభానుం డిట్లు బదులిడెను. గోపాలకులారా! గర్గమునిపలుకులు వినుఁడు. మీశంకలు తొలఁగును. అనేక బ్రహ్మాండనాయకుండు గోలోకనాయకుఁడు పరాత్పరుఁడు శ్రీకృష్ణుఁ డఁట. ఆయనకంటె నేలోకమునందు నధికుఁడు లేఁడఁట. ఆమహానుభావుఁడు నందమందిరమున శిశురూపమున జనించెను. భూభారమును హరించి కంసాదిక్రూరచిత్తుల సంహరించును. బ్రహ్మదేవుని దీనాలాపముల నాలకించి జగతీతలమున నవతరించెను. శ్రీకృష్ణునిపట్టపురాణి గోలోకమున రాధ యనంబరఁగు. నాయింట నారాధాదేవియే పుట్టెనఁట. ఆవిషయము నేనెఱుఁగనఁట. నేను వీరిరువురకు వివాహము చేయరాదఁట. భాండీరవనమున వివాహము సాగునఁట. ఆభాండీరవనము యమునాతీరమున బృందావనముచెంత నున్నదఁట. నిర్జనంబగునావనమున బ్రహ్మ యరుదెంచి శ్రీరాధామాధవులకు

వివాహము చేయునఁట. కావున నాపుత్త్రిక యగు రాధ శ్రీకృష్ణున కర్ధాంగియఁట. గోలోకచూడామణియగు శ్రీకృష్ణునిదేవి యగు నీరాధ గోలోకాధిపత్యమును వహించి యెల్లకార్యములు నిర్వహించునఁట. గోపకులారా! మీరెల్ల గోలోకమునుండి భూలోకమున నవతరించితి రఁట. గోలోకమునందలి గోవులు గోపికలఁట. రాధాదేవియనునది నిటఁ బుట్టిరఁట. ఈపలుకులు గర్గముని యుపదేశించినవి. నూని యీమాటలు తెలిపి తనయాశ్రమమున కరుగ నేనీరాధయందు సంశయమునొందక యున్నవాఁడను. వేదవాక్యము బ్రహ్మమునివచనము భూలోకమునఁ బ్రమాణములు కదా. అని పలికి వృషభానుఁడు గోపకులారా! ఇంకేమి వినఁగోరుదురో తెల్పుఁడని ప్రశ్నించెను.

మహాశయులారా! నందగోపసంవాదమును జదివితిరి కదా. ఇందొక్క విషయము ముఖ్యము. ప్రతిజాతియందును సంశయాత్ములుండకపోరు. గోవర్ధనోద్ధరణము కన్నులారఁగాంచియు శ్రీకృష్ణునిమాయచే మోహితులై గోపకులు కొందఱు ముగ్ధులైరి. కృష్ణవర్ణముగలశిశు వేలపుట్టెనని సంశయించిరి. కృష్ణవర్ణము నీచమైనదని వారిభావము. అంతియకాక తల్లిదండ్రులఛాయ పుత్త్రునకు నుండవలసినదే యని వారిమూఢవిశ్వాసము. ప్రాయశః ఈయూహ సరిపడును. ఆవాదుకను బట్టియే వారనుమానించిరి. యశోదయందుంచుకయు వారికి సంశయము లేదు. కాఁబట్టియే యిట్లగుటకుం గారణ మేమని

వారు నందుని బ్రశ్నించిరి. దీనిరహస్యము తెల్పుమా యని యడిగిరి. రాజకుటుంబము పరిశుద్ధవర్తనము కలది కావలయును నియే కదా వారిభావము. తదనుగుణప్రవర్తనము ప్రజలకు నలవడును.

"సర్వభూతప్రసూతిర్హి బీజలక్షణలక్షితా. 33
యాదృశం తూప్యతే బీజం క్షేత్రే కాలోపపాదితే,
తాదృగ్రోహతి తత్తస్మిన్ బీజం స్వైర్వ్యంజితం గుణైః." 36

మనుస్మృతి. 9 అధ్యా.

మనుస్మృతివాక్యములను వారు నమ్మియుండిరి. రాజకుటుంబము నుదాహరణముగాఁ గైకొని యితరప్రజాకుటుంబముల ప్రవర్తనము వెలయును. కావున నట్టికుటుంబమున బ్రజల కేశంకలు పొడమఁగూడదని వారు నిశ్చయించిరి. కావుననే మనమునఁగలసంశయముల దాఁచుకొనక రాజుతో విన్నవించిరి. దీనిచే నాకాలపుఁబ్రజలయలవాటు లెట్టివని మన మూహింపవచ్చును. నందుఁడాగోపకుల పలుకు లాలకించి కోపమూనక వారట్లు ప్రశ్నించినది యుక్తమే యని యూహించి గర్గాచార్యులు తనకుం దెల్పిన రహస్యవిషయములం దెల్పెను. దాన వారికిఁ దృప్తి కలుగక వృషభానునొద్దకుం బోయి ప్రశ్నించిరి. బంధుసంఘమునుండి యపవిత్రుఁడగునందుని వెలిపెట్టుమని హెచ్చరించిరి. వృషభానుఁడును నందుఁడు చెప్పినమాటలనే గర్గాచార్యోక్తములుగాఁ దెలిపెను. ఇరువు రొక్కరీతిగాఁ దెలిపినందులకు వారించుకశాంతి నొందిరి.

తమకుంగల యాగ్రహమును విడనాడిరి. శ్రీకృష్ణుఁడు పర మాత్మయను నూహ వారిమదిఁ దట్టెను. కావుననే యటనుండి వెడలిపోవక మాటలాడిరి. ముందుముందావిషయము తెలియఁ గలదు. ఈ కథనుండి యాకాలమునఁ బ్రభువులవిషయమునఁ బ్రజలెట్టియభిప్రాయము గలవారై యుండిరో తెలియఁగలదు. రాజకుటుంబము నుదాహరణముగాఁ గైకొనుట యాకాల మునఁగల యుత్తమాచారము. కాఁబట్టియే వారికి రాజభక్తి మెండు. రాజును శ్రీమన్నారాయణమూర్తినిగా భావించు వారు. రాజకుటుంబమున నించుకదోష ముప్పతిల్లినఁ బ్రజలం దఱు దుష్ప్రవర్తకు లగుదురని వారినమ్మకము. అట్టియభిప్రా యము మనుజులయం దుండుటంబట్టియే రాజు జాగరూకుఁడై తాఁ బ్రవర్తింపక తప్పదని నిశ్చయించుకొనును. ద్వాపరాంత మున నే కాక ప్రజలకీభావము త్రేతాయుగమునంగూడఁ గలదు. సీతాపరిత్యాగమునకు హేతు విదియే కదా. లోకాపవా దము ప్రవృత్తివిషయమునఁ గలుగునేమో యని రాజు భీతిల్లు వాఁడు. ఈ నీతి భర్తృహరిమహాకవి నీతిశతకమున

"వాంఛా సజ్జనసంగతౌ పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాయాంవ్యసనంస్వయోషితిరతి ర్లోకాపవాదాద్భయమ్,
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలై
రేతే యేషు వసంతి నిర్మలగుణా స్తేభ్యో నమః కుర్మహే."

అని వెల్లడించిరి. ఏవిషయమున భీతిలేకున్నను లోకాపవాదము వచ్చునేమో యని భీతి యందఱకు నుండవలయును. ఈ నీతి

యీ కథనుండి తేలుచున్నది. ప్రజలు ప్రభుభక్తిగలవారలై యుండిరనియు, రాజకుటుంబప్రవర్తనము నుదాహరణముగా భావించు వారనియుఁ, గాఁబట్టియే రాజపత్నిని దల్లిగను రాజును దండ్రిగను భావించువారనియు స్పష్టమగుచున్నయది. ఇది భారతీయులసనాతనసదాచారము. దీని కేకాలమునఁ గాని భంగము గల్గఁగూడదని భగవంతు నభ్యర్థించుచున్నవాఁడను. ఇఁక నవ్వలివృత్తాంతమును వ్రాసెదను.

## శ్రీహరిపరీక్ష.

*వృషభానునివాక్కుల విని గోపకులు క్రోధమును మాని శాంతచిత్తులై విస్మయమునొంది యిట్లు పలికిరి. రాజా! చక్కని వృత్తాంతము నెఱింగించితివి. ఈ రాధ సత్యముగ భగవంతుని యర్ధాంగలక్ష్మియనియే తోఁచెడిని. కాఁబట్టియే నీ యైశ్వర్యము డిందుపడక యుండెను. ఈ రాధ నీయింట నుదయించినది మొదలు పెక్కుగజములు, హయములు, స్యందనములు, హేమరత్నవిభూషితములగు ధేనువులు పెచ్చుపెరుగుచున్నవి. ఇదంతయు నీరాధాప్రభావముననే యని యిపుడు తోఁచెడిని. నీ యీ యైశ్వర్యమును జూచి కంసుఁడు జంకుచున్నవాఁడు. కాన్యకుబ్జపతియగు భలందనరాజునకు నీవు జామాతవు. కుబేరునిబోలు ధనసంపన్నుఁడవు. నందరాజు నింటనుంగూడ నీకున్నంతధనము లేదు. నందరాజు కృషీవలుఁడు. గోపతియు నగు.

---

* ఈ కథయంతయు గర్గసంహితయందు గిరిరాజఖండమున నాలవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని తెలియవలయు.

అంతియె కాని నీవలె ధనసంపన్నుఁడు కాఁడు. నందరాజపుత్త్రుఁడు పరిపూర్ణుఁడగు హరియేయైన మేము పరీక్షించువిషయమున మాకుఁ దృష్టి నిచ్చుంగాక. మాకు బదులు నీవే పరీక్షింపుము.

అనుయాదవులపలుకులు విని వృషభానుఁడు నందరాజవైభవపరీక్షను జేయ నంగీకరించెను. వెంటనే యొకమనోహరపాత్రమునందు స్థూలతమముక్తాహారములు పెక్కులు, మఱికొన్నిరత్నహారములు నునిచి కుశలులగుదూతలను వానింగొనిపోయి నందరాజున కిచ్చిరండని యాజ్ఞాపింప వారవ్వానిం గొనిచని నందరాజసభామండపమున నాపాత్రముల నునిచి వినయమున నిట్లు పలికిరి. దేవా! వృషభానుఁడు,కోటికోటినిశాకరజ్యోత్స్నవితానము నధఃకరించుముఖలావణ్యముగలిగి, నవకంజనేత్రముల విరాజిల్లు రాధయను తనపుత్త్రికను వివాహయోగ్యరాలనిభావించి వరాన్వేషణము చేయఁదలంచి యుటుకుంబంపెను. నీతనయుఁడు మన్మథసుందరాకారుఁడని గోవర్ధనోద్ధరణబాహుబలశాలియని విని సంతసించి యతని వరునిగా వరియింపఁగోరి యీ కానుకలఁ బంపెను. వరునికై పంపిన యీ యమూల్యహారములఁ బరిగ్రహించి కన్యకకుఁ బంపఁదగువస్తువుల ననుగ్రహింపుము. ఇది మాకులాచారమని మీతో విన్నవింపుమనియెను.

ఆ మాటలు విని నందుఁ డానందపరవశుండై యమూల్యాభరణములం గాంచి వీని యశోదకుఁ జూపంగోరి యంతఃపు

పురమునకుఁ బోయెను. ఆదంపతులాయమూల్యపదార్థములఁ జాలసేపు కన్నులపండువుగాఁ జూచిరి. ఇట్టియమూల్యవస్తువులు మనయింట లేవు. ధనోద్ధతుఁడు కొనిచో లోకులు పరిహాసింతురు. ఇపు డేమి చేయఁదగు. శ్రీ కృష్ణవివాహార్థ మీ వస్తువుల నంపెను గదా. కావున వీనిం బరిగ్రహింపవలసినదే. తరువాత ద్రవ్యమునుగూర్చి యోజింపవలయును. అని యశోదయుఁ దానును యోజించుచుండ భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు వారికి నిజాకృతికనఁబడకుండ నరుగుదెంచి ఆహారములలో నూఱురత్నహారములఁ గైకొని పరుగిడి క్షేత్రములందుఁ దన్ముక్తాఫలములను దనహస్తములఁ జాచి చల్లెను. కృషీవలుఁడు సిద్ధక్షేత్రమున మంచివిత్తనములు చల్లెడు నాచారమును బాటించెను

నందుఁ డంత నాహారముల గ్రహించి లెక్కించి శతము న్యూనము కాఁగా సంశయించి యివి యమూల్యరత్నహారములు. ఇట్టివి మనయింట లేవు. వీనిలో నూఱు తక్కువయైనవి. నలుగురిలో నగుబాట్లగును. కృష్ణమూర్తి యేమైనఁగోరి గ్రహించియుండునా? బలదేవుఁడు తీసికొనియుండునా? వారినడిగిచూచెదఁ గాకయనియూహించి కృష్ణునింబిల్చివత్సా! వీనిం దీసికొంటివా యని యడిగెను. గోవర్ధనోద్ధారకుఁడు నవ్వియిట్లుపలికెను. మనము కృషీవలులము. గోపకులము. విత్తనములనన్నింటిని జల్లి మొలపించువారము. మంచి క్షేత్రమున నీముక్తాబీజములఁ జల్లితిని. అనుమాటలు విని నందుఁడాతనిఁ దిర

స్కరించుచు నాతనిం దోడుకొని యాభూమివద్దరకుం బోయెను. ఆక్షేత్రమున ముక్తాద్రుమములు వందలువందలుగాఁ బొడవుగాఁ బెరిగి కనఁబడియెను. పచ్చనియాకులు చూడఁజూడ వింతగానుండెను. కొమ్మలనిండపూవుల గుత్తులు చూడఁదగి యుండెను. ఆకసమున నక్షత్రములు కనఁబడునట్లు ముత్తెము గుత్తులను నిండ నుండెను. ఆవింత చూచి నందుఁడు శ్రీకృష్ణుని బరమాత్మునిగా నెఱింగి వృషభానుఁడంపినముత్తియములంత స్థూలముగా నుండుటెఱింగి శకటములపై వానిని బదిలముగా నునిచికొని వృషభానుఁడంపినచారుల కవ్వాని నొసంగెను. వానిందీసికొని స్వపురమునకు వారరిగిరి. ఎల్లరు వినుచుండ నందవైభవము నెఱిఁగించిరి. ఆయద్భుతవార్తల విని గోపకు లెల్ల సంశయములు వీడఁగా వృషభానుని వినుతించిరి. రాధ హరికిఁ బత్ని. హరి రాధాప్రాణనాథుఁడు అనియెఱింగిరి. ఆదిన మునుండి రాధామాధవులను గోలోకమునుండి యవతరించిన వారిగా నెఱింగిరి. ఏక్షేత్రమున శ్రీహరి ముక్తాఫలముల బీజములవలెఁ జల్లెనో ఆక్షేత్రమున ముక్తాసరోవర మొక్కఁడు వెలసెను. అది తీర్థరాజ మనంజను. ఎవ్వఁడా పుణ్యసరోవర తీరమున నొక్కమౌక్తికమును దానముచేయునో లక్షమౌక్తిక దాన ఫలము నతండొందును. ఇది గిరిరాజవైభవము.

భారతమాతృసత్పుత్రులారా ! ఇదొక విచిత్రముగాఁ దోఁచుశ్రీహరిలీల. ఇందు భగవంతుఁడు తనసర్వశక్తినుత్త్వ మును బ్రకటించెను. అది మాధవులకుఁ దనమహిమమును దెలిపి

వారి నుద్ధరించుటకే చూపఁబడెను. ముత్తెములు చల్లుట అవి మొలచి వృక్షములగుట పూలగుత్తులు వ్రేలాడుచుండుట ఆగుత్తులయందు స్థూలమౌక్తికములు కన్పడుట యివన్నియు జరగనిపనులు. కేవలమపహాస్యభాజనములని కొందఱు సంశయింతురు. కొంద ఱపహాసింతురు. కాని వారికి భగవత్తత్త్వము తెలియదనుటకంటె మిక్కిలి చెప్పఁబూనను. అఘటనాఘటనసమర్థుఁడు కదా భగవంతుఁడు. భగవంతుఁడు కూడ సాధింపరాని పనులు కలవనుటకంటె వెఱ్ఱితనము వేఱుగానుండదు. మనుష్యమాత్రుఁ డొక్కఁడు మాన్పరాని కుష్ఠురోగమును. క్షణమాత్రమున మాన్పెనఁట. ఆమనుష్యుని భగవంతుఁడు పంపినదూత యనుచున్నారు. ఔషధాదులు లేక మాటలచే రోగము నెమ్మదించుననిన నవ్వువారు నుండకపోరు. ఒక్కమనుష్యుఁ డిట్టియద్భుతకార్య మొనర్చెనన్న నమ్ముమహాత్ములు భగవంతుని యీయద్భుతకృత్యమును నమ్మమనుటయే విచిత్రముగాని భగవంతుఁ డీస్వల్పకార్య మొనర్చుట యద్భుతము కాదు. మనుష్యసాధ్యములుగాని కార్యములు భగవంతునకు నసాధ్యములే యన్న నామాట నిర్మాల్యము. అట్టివానికి భగవత్తత్త్వమున నణుమాత్రమేఁ దెలియదనుట పాపము కాదు.

గోపకుల కీరాజకుటుంబమునఁ గలిగినసంశయము పాపకున్న వారికి సత్ప్రవర్తనము నేర్పుటకే వేఱుమార్గములు లేవు. కావున నొక్కయత్యద్భుతకార్య మొనరించి వారిసంశయమును దొలఁగించిన వారు విగతకళంకు లగుదురు. రాజ్యము

సువ్యవస్థగా నుండును. జనులు రాజభక్తిపరాయణు లగుదురు. వారింజూచి యితరులు నేర్చుకొందురు. దానధర్మమును రక్షించి నట్లగు. అదియే తనయవతారమునకు ఫలము. ఈవిషయ మా భగవంతునకుఁ దెలియకపోదు. ఏపని యేరూపమున నొనరింప వలయునో యామహాత్ముఁ డెఱుంగును. కర్మములు వారివారిని శిక్షించుచుండఁ దాఁజూచుచుండును. శిక్షాస్మృతి తదిచ్ఛయే కదా. సుందోపసుందులసఖ్యము తిలోత్తమ ద్వారా తీర్చెను. రావణాసురుని కామప్రకర్షమును నలకూబరశాపము ద్వారా నిర్మూలించెను. కుంభకర్ణుదుర్వారవిక్రమమును నిద్రారూపముగా నడంచెను. హిరణ్యకశిపుని పరాక్రమాతిశయమును బుత్త్రుని రూపమునఁ బొడచూపకుండఁ జేసెను. ఇట్టు లెన్నివిధము లనో లోకమునకుఁ దనమహిమమును జూపుచున్నను లోకు లింక నెఱుంగకయున్నవా రనేకులు గలరు. అట్టివారిలోఁ గొందఱైన నీశ్రీకృష్ణుని యద్భుతచర్యలఁ దెలిసికొని నిశ్శంకు లగుదురు గాక యని వారక కోరుచున్నవాఁడను. ఇఁకఁ దర్వాతికథ నాలకింపుఁడు.

## గోవర్ధనపర్వతతీర్థప్రశంస.

*గోవర్ధనము పర్వతోత్తమము. అందనేకతీర్థము లుండు. అందు ముఖ్యము లెవ్వి ? అనుశంక బహుళాశ్వునకుఁ గలుగ

* ఇదియుం గర్గసంహిత మూఁడవఖండమున నేడవయధ్యాయమునుండి సంగృహీతము. ఇదియు బహుళాశ్వరాజునకు నారదునకు నైనసంవాదసార మని యెఱుంగఁదగు.

దానిం దీర్పనెంచి నారదుఁ డిట్లు తెలిపెను. గోవర్ధనాచలము సకల పుణ్యతీర్థభాసమానము బృందావనము దానిచెంత నుంట మఱింత ప్రశస్తమయ్యెను. గోపగోపీగోసంరక్షకము. విశేషించి శ్రీకృష్ణునకుఁ బ్రియమైనది. ఏది పరిపూర్ణ బ్రహ్మమునకాతపత్రమయ్యెనో అంతకంటెఁ దీర్థమేది గలదు? ఇంద్రయాగమును నిలిపి సకల గోపజనపరివృతుఁడై భగవంతుఁడేపర్వతమును బూజించెనో దానికన్న మహత్తరమైన దింకొక్కఁడు లోకమున నుండునా? పరిపూర్ణుఁడగు పరమాత్మ శ్రీకృష్ణుఁడు అసంఖ్య బ్రహ్మాండనాయకుఁడు, గోలోకనాయకుఁడు ఏపర్వతమున ననారతము విహారము సల్పుచుండునో అట్టిపర్వతరాజమహిమ మింతయని బ్రహ్మయే వచింపఁ గలఁడా! ఏపర్వతవర్యమున మానసీగంగయు, గోవిందకుండము, చంద్రసరోవరము, రాధాకుండము, కృష్ణకుండము, లలితాకుండము, గోపాలకుండము, కుసుమాకరతీర్థము, శ్రీకృష్ణమౌళి సంస్పర్శమున నేర్పడిన మౌళిచిహ్నశిలయు నలరుచుండునో ఆపర్వతము పుణ్యనిలయమని చెప్పుట కేమిసందియము ? ఒక్కశిలాఫలకమునందు శ్రీకృష్ణమూర్తి చిత్రముల లిఖించెను. కావున నాశిల నేఁటికిని విచిత్రశిలాహ్వయము నొంది విరాజిల్లుచున్నయది. శ్రీకృష్ణుఁడు గోపబాలురం గూడి యేశిలయం దాడుకొనుచు మురళీనినాద మొనరించెనో ఆశిల వాదినీశిలయని పిల్వఁబడుచు మహాపాపముల నశింపఁజేయుచున్నది. ఏస్థలమున శ్రీహరి గోపాలబాలకులం గూడి కందుకక్రీడ సల్పెనో యాస్థలము కందుకమను

కీర్తిని గడించెను. దాని దర్శించిన నింద్రలోకము నొందఁగ లఁడు. భక్తితో నమస్కరించిన ముక్తి దొరకును. శ్రీకృష్ణపాదధూళి యేస్థలమున నంటినదో యాచోటు పరమపవిత్రమనుటకే సందియము లుండునా? ఏచోట శ్రీకృష్ణుఁడు గోపబాలురం గూడియాడుచు వారిశిరోవేష్టనముల హరించినట్లు నటించెనో యాచోటు ఔష్ణీష మనఁబడుచున్నది. అది పాపహరము. ఆస్థలమునందే యొకానొకసమయమున గోపికలు దధివిక్రయించుటకుఁ బోవుచుండఁ దత్పాదనూపురక్వణితము నాలకించి యడ్డగించినట్లు నటించెను. ఆపవిత్రస్థలము భక్తులకు సందర్శింపఁ దగినది.

వేణునాదానందమున నోలలాడు శ్రీకృష్ణుఁడు గోపబాలురం గూడి గోపికలు చనుచుండ నాకుఁ గరదానము చేయుఁడని పలికెను. గోపిక లాపల్కులు పరమేశ్వరుని యభయదానదత్తములని భావించి కృష్ణా! నీవు కుటిలుఁడవు. మార్గమున గోపాలబాలకులం గూడి గోరసమును గ్రోల నాసగొంటివి. తల్లితోడను దండ్రితోడను గంసబంధనమున నునుతుము అన శ్రీకృష్ణుఁ డిట్లు బదులిడెను. సమిత్రబాంధవముగాఁ గంసుని వధింతును. గోవులపై నొట్టుపెట్టి చెప్పుచున్నవాఁడ. యదుపురమునను గిరిరాజభూమియం దిట్లే చేయుచుందును. అని పలికి దధిపాత్రముల బలవంతము లాగుకొని భూపృష్ఠమున సానందుఁడై నందనందనుఁడు బోరగిలఁ జేసెను. అందులకు నాగోపికలు గినిసి యీబాలుఁడు గర్వి. భయరహితుఁడు. నిరంకుశుఁడు.

పురమునఁ బిల్లివలె నుండును. వనమునఁ బ్రబలుఁడు. యశోదకు నందునకు విన్నవింతుము. అని పలుకుచు నచ్చెరువున నిండ్లకుం బోయిరి. కదంబపలాశపత్రముల దొన్నెలుగాఁగుట్టి యాచిక్కని పెరుగును ద్రాగెను. దొన్నెలవంటి ఆకులు గలిగి యావృక్షములు చూడఁబడుచుండును. ఆ క్షేత్రము ద్రోణక్షేత్రమనఁ బ్రథితమయ్యెను. అందు దధిదానముచేసి దొన్నెనిండ దధిని బానముచేసి నమస్కరించిన గోలోకమునకుం బోవ నర్హులగుదురు. ఏచోట శ్రీహరి గోపాలకులతోఁ గన్నులుమూసికొని యాడుకొనెనో ఆచోట లౌకికంబను తీర్థం బేర్పడియె. దాని సేవింపఁదగు. కదంబఖండతీర్థం బొండు కలదు. దాని సేవించిన సత్ఫలంబబ్బు.

ఏచోట రాధాదేవిం గూడి రాసవిహారమును సల్పెనో ఆచోటు శృంగారమండల మనం బ్రథితంబయ్యె. ఏరూపమును ధరించినశ్రీహరిచే గోవర్ధనము ధరింపఁబడినదో ఆశృంగార మండలమును భక్తితో దర్శింప నారూపము కనఁబడును. కలియుగమున నాల్గువేలునాలుగువందలు గతింప నాశృంగారమండలమున గోవర్ధనగుహామధ్యమునుండి వెలువడి యందఱు చూచుచుండ శ్రీహరిరూపము ప్రాదుర్భూతంబగు. ఆవిగ్రహమును దేవదమననామమునఁ బిల్వఁగలరు. గోవర్ధనాచలంబున లీలావిలాసముల నొనరించినరూపము నెవ్వరు నేత్రఫలముగా గనుఁగొందురో వారు కృతార్థులగుదురు. జగన్నాథరంగనాథ ద్వారకానాథులు బదరీనాథుఁడు భారతభూమియందుఁ జను

షోడ్కోణంబుల వెలయుదురు. వారినడుమగా గోవర్ధననాథుఁ డొప్పారుచుండు. పవిత్రమగు భారతక్షేత్రమున నీపంచనాథులు ప్రసిద్ధులు వీరు సద్ధర్మమండపమునకు స్తంభములవంటివారు. ఆర్తత్రాణపరాయణులు. ఈనాథపంచకమును దర్శించిననరుఁడు నారాయణుండే యగు. నల్వురునాథులను దర్శించి దేవదమన నాథుని దర్శింపఁడేని వాఁడాయాత్రాఫలము నందఁడు. ఎవ్వఁ డేని అశక్తుఁడై దేవదమననాథునిమాత్రము దర్శించినచోఁ దక్కిననల్వురునాథులను దర్శించినఫలము నందును. ఐరావత సురభిపాదచిహ్నము లేచోటఁగనఁబడు నాక్షేత్రవరంబునకుం జని భగవంతునకు నమస్కరించిన వైకుంఠలోకప్రాప్తి గలుగును. మహాత్ముఁడగు శ్రీకృష్ణునిహస్తపాదచిహ్నములఁ గాంచి నమస్కరించి భగవంతుని ధ్యానించిననరుఁడు శ్రీకృష్ణుపదమున కేగు.

రాజేంద్రా! ఇవియ గోవర్ధనాచలమునఁ గలపుణ్యక్షేత్రకుండికా తీర్థాయతనములు. ఇవియే గిరిరాజునకంగభూతములు. వీని సేవించినభక్తునకు శ్రీకృష్ణుండు వాంఛితంబుల నొసంగును. వీని సేవించునపుడు దృఢభక్తి గలుగవలయును.

*ఎందేయే క్షేత్రమునకు విఖ్యాతిగలదో యాయంగము

*ఈగాథయుఁ బూర్వఖండమున నెనిమిదవయధ్యాయమునుండి సంగ్రహీతమని యెఱుంగవలయును. గోవర్ధనాద్రి యేయేయంగముల నేయేతీర్థములు గలవో వానిం దెల్పుమని బహుళాశ్వుఁడు ప్రశ్నించెను. దానికీ యధ్యాయమున బదులు చెప్పఁబడినదనియుఁ దెలియఁదగు.

పరమంబని యెఱుంగవలయును. గిరిరాజునకు వరుసగా నంగ
ములుకలవని కల్పింపఁబడలేదు. సర్వగతంబగు బ్రహ్మ మెట్లుం
డునో యట్లే గిరిరాజున కంగము లుండును. విభూతులుగల,
యంగములం దెల్పెద. శృంగారమండలమునకుం గ్రింద గోవర్ధ
నాద్రిముఖము కలదు. అందే భగవంతుఁడు వ్రజవాసులం
గూడి భుజించెనుగదా. మానసీగంగ పర్వతరాజునేత్రములు.
చంద్రసరోవరము నాసిక. గోవిందకుండ మధరోష్ఠము. కృష్ణ
కుండము గడ్డము. రాధాకుండము జిహ్వ. లలితాసరస్సు
కపోలములు. గోపాలకుండము కర్ణములు. కుసుమాకరతీర్థము
కర్ణాంతము. మౌళిచిహ్నశిల పర్వతమునకు లలాటము. చిత్ర
శిల శిరస్సు. వాదనీశిల కంఠము. కందుకకుండము పార్శ్వములు.
ఔష్ణీషము కటిప్రదేశము. ద్రోణతీర్థము పృష్ఠదేశము. లౌకి
కతీర్థ ముదరము. కదంబఖండ మురఃప్రదేశము. శృంగార
మండలమే జీవమునగు. శ్రీపాదచిహ్న మాత్మహాత్మునకు మన
స్సు హస్తచిహ్నము బుద్ధి. ఐరావతపదము పదము.సురభిపాదచి
హ్నము పక్షములు, పుచ్ఛకుండము పుచ్ఛము. వత్సకుండము
బలము. రుద్రకుండము. క్రోధము. శక్రసరోవరము కామము.
కుబేరతీర్థ ముద్యోగము. బ్రహ్మతీర్థము ప్రసన్నము. యమతీర్థ
మహంకారము. ఇవి పర్వతరాజు నంగములు ఇవి సర్వపాపహా
రములు. ఇదియే గిరిరాజవిభూతి. హరివక్షమునుండి లేచిన యీ
గిరిరాట్టు పులస్త్యముని తేజంబున నిట నునుపఁబడినది. తద్దర్శన
మున మనుజుఁడు పునర్జన్మము నొందఁడు.

సాధుమతులారా! ఈ రెండుకథలును స్థూలదృష్టి నాలోచింపఁ బామరులకుగాఁ జెప్పఁబడినట్లు తోఁచును. కాని యించుక సూక్ష్మదృష్టిం బరికించిన ముఖ్యముగాఁ దోఁచును. విశేషార్థము లిందుఁగలవు. ఆస్తికాభాసు లిట్టిగాథలనే ప్రధానముగాఁ దీసికొని యాక్షేపింతురు. కాని వారికి భక్తి స్థిరతఁ గాంచలేదు. ఈగాథయే భక్తిని దెలుపుచుండును. ఎట్లనఁగా నాలకింపుఁడు.

"భావనామాత్రసంతుష్టహృదయా పరమేశ్వరీ."

అని దేవీవిషయమునఁ గనఁబడియెడిని. భగవద్విషయమునఁగూడ నీపద్ధతియే ప్రశస్తము.

శ్లో."యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః." గీతా౪అ ౧౧.

యథా యేన ప్రకారేణ సకామతయా నిష్కామతయా వా యే మాం భజంతి తానహం తథైవ తదపేక్షితఫలదానేన భజామ్యనుగృహ్ణామి. నతుయే సకామా మాం విహాయేంద్రాదీనేవ భజంతే తానహముపేక్ష ఇతి మంతవ్యమ్. యతస్సర్వశః సర్వప్రకారైరింద్రాదిసేవకా అపి మమైవ వర్త్మ భజనమార్గ మనువర్తంతే ఇంద్రాది రూపేణాపి మమైవ సేవ్యత్వాత్. అని శ్రీధరాచార్యులు వ్యాఖ్యచేసిరి.

యే యథా యేన ప్రకారేణ యేన ప్రయోజనేన యత్ఫలార్థితయా మాం ప్రపద్యంతే తాం స్తథైవ తత్ఫలదానేన భజామి అనుగృహ్ణామి. అహమ్ ఇత్యేతత్. తేషాం మోక్షః ప్రత్యనర్థిత్వాత్. నహ్యేకస్య ముముక్షుత్వం ఫలా

ర్థిత్వం చ యుగపత్సంభవతి. అతో యే ఫలార్థినస్తాన్ ఫలదానేన యే యథోక్తకారిణ స్త్వఫలార్థినో ముముక్షవశ్చ తాన్ జ్ఞానప్రదానేన యే జ్ఞానినస్సన్న్యాసినో ముముక్షవశ్చ తాన్ మోక్షప్రదానేన తథా ఆర్తాన్ ఆర్తిహరణేన ఇత్యేవం యథా ప్రపద్యంతే. యే తాం స్తథైవ భజామీత్యర్థః. "తం యథా యథోపాసతే తం తమేవ ఫలం లభతే" ఇతిశ్రుతేః. న పునః రాగద్వేషనిమిత్తం మోహనిమిత్తం వా కించిద్భజామి.సర్వథాపి సర్వావస్థస్య మమేశ్వరస్య వర్త్మ మార్గమనువర్తంతే మనుష్యాః యత్ఫలార్థితయా యస్మిన్ కర్మణి అధికృతాః యే ప్రవర్తంతే తే మనుష్యాః అత్ర ఉచ్యంతే. హేపార్థ,సర్వశః సర్వప్రకారైః. అని శంకరభాష్యము.

దీనింబట్టి చక్కఁగా నాలోచింప భావము ప్రధానమని స్పష్టమగును. ఏక్షేత్రమునకుఁ బోయినను, ఏతీర్థమునఁ గ్రుంకినను నిది తరింపఁజేయును. ఇది భగవత్స్వరూపము అన్ననమ్మకము నునిచిన నా క్షేత్రరూపమున నాతీర్థరూపమున భగవంతుఁడు పవిత్రునిగా నొనరించి వాంఛితముల నొడఁగూర్చును. సకలక్షేత్రములు తీర్థములు పర్వతములు నదులు లోనగునవి భగవత్స్వరూపములు కావన్న దేవానాంప్రియులమాటయటుండనిండు మునులు తపస్సుచేసి భగవంతు నలరింతురు యోగులు హఠయోగాదుల నభ్యసించి పరమేశ్వరు నారాధింతురు. మాంత్రికులు మంత్రపురశ్చరణరూపమున దేవదేవు నుపాసింతురు. యాత్రార్థులు క్షేత్రరూపమున నున్నసర్వేశ్వరుని దర్శింతురు.

వీరందఱు భక్తులేకాని వేఱుకాదు. దృఢభక్తి కుదిరినచో వీరి కందఱికి రక్షకుఁ డొక్కఁడే కాన నందఱుఁ గడతేర్చును. వాంఛలు భిన్నములైనచోఁ దదనుగుణములగుఫలము లొసంగును. వీ రెల్లఁ బరమపురుషార్థమునే కోరినచో నందఱకుము క్తినిచ్చును. భావన ప్రధానముగాని యితరరీతులు ప్రధానములుకావు నియమము లెవరి కేవివచ్చునో వారు తన్నియమముల నవలంబింపవచ్చును. లోకవంచనమునకుం బూనక నిష్కల్మషస్వాంతమున నేవిధమునభగవంతు సేవించినను ఫలము తుల్యము.పిడికెడడుఁకులు కానుక నిచ్చిన కుచేలునకు సహస్రపత్రముల నిరతమర్పించినదుర్వాసునకు సర్వాత్మునిగా భావించిన శుకమహర్షికి, సదా యోగనిరతి నారాధించు దధీచిమునికిఁ బరమేశ్వరుఁడు ప్రసన్నుఁడేకదా! ఏల? ఆరాధించుపద్ధతులు ప్రత్యేకముగాని భక్తి సమానమే. భావనయుఁ దుల్యమే. భగవంతుఁడని విధియుతముగా నారాధించిన శరభంగునకు, ఉచ్ఛిష్టఫలముల నర్పించి సేవించిన శబరికి శ్రీరామచంద్రమూర్తి కటాక్షము సమానమే కదా! వీనినుండి కన్పట్టుతాత్పర్యమేమి ? భక్తిప్రధానమనియే గాని వేఱొకటికాదు.

శ్లో. "పత్రం పుష్పం ఫలంతోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః." ౯అ. ౨౬

పత్రపుష్పాదిమాత్ర మపి మహ్యం భక్త్యా ప్రీత్యాయః ప్రయచ్ఛతి తస్య ప్రయతాత్మనః శుద్ధచిత్తస్య నిష్కామభక్తస్య తత్పత్రపుష్పాదికం తేన భక్త్యోపహృతం సమర్పిత మహం

మశ్నామి ప్రీత్యాగృహ్ణామి. నహి మహావిభూతిపతేః పరమేశ్వరస్య మమ క్షుద్రదేవతానామివ బహువిత్తసాధ్యయాగాదిభిః పరితోష స్స్యాత్. కింతు భక్తిమాత్రేణ? అతో భక్తేన సమర్పితం యత్కించిత్పత్రాదికమాత్ర మపి తదనుగ్రహార్థమేవాశ్నామీతిభావః. అని శ్రీధరాచార్యవ్యాఖ్య. దీనిభావమును బరికించితిరికదా.బహుద్రవ్యమును సంపాదించి యజ్ఞములుచేసిననే నాకుసంతృప్తికలుగుననుమాటకల్ల."భక్తినిరతుఁడై అల్పద్రవ్యమైనను సమర్పించి నన్నుఁ గొల్చువారలందే నాకు మిక్కిలి ప్రీతి. వారి ననుగ్రహించుపొంటె నాపదార్థములఁ బ్రీతిచేఁబరిగ్రహించెదను." అన్న భగవద్వాక్యమున కేమితాత్పర్యము? పదార్థముప్రధానముకాదనియు భక్తిప్రధానమనియుఁ గాక వేఱుతాత్పర్యము కలదని యెవ్వఁడనఁగలఁడు? కావున భక్తిభావనచే నేరీతి నారాధించినను భగవంతుఁడు సంతృప్తుఁడగును. డాంబికారాధనమున నెంతమాత్రము తృప్తినొందఁడు! ఈగీతావాక్యము లన్నియుఁ బై నావ్రాసినభావమునే తెల్పుచున్నయవి. కావునఁ దీర్థయాత్రలు వ్యర్థములనరాదు.

శ్లో. "గంగాగంగేతి యో బ్రూయాద్యోజనానాం శతైరపి,
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం స గచ్ఛతి."

అన్నసూక్తి భావన ప్రధానమని తెల్పుచున్నయదికదా. కాఁబట్టి గోవర్ధనపర్వతమునఁ గలతీర్థములు భద్రదములే. కాని యీచోట భగవంతుఁ డేరూపమున విహరించెనని, దానిని

దలంచుచు నాతీర్థము భగవద్రూపముగనేభావించినచో ముక్తి కాతఁడు పాత్రుఁ డగుననుట నిర్వివాదాంశము.

కొందఱు ఆస్తికాభాసులు మనపూర్వులు పర్వతములను వృక్షములను సర్పములను బూజించువారనియుఁ, గావునఁ బామరులని తూలనాడుచుందురు. ఈపల్కులాడువారే పామరులు. వారికి సమదృష్టి లేదనియు,

"స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత."

యన్న భగవదుక్తి నెఱుంగరనియుఁ జెప్పకతప్పదు. అట్టి యలసులమాటలకుఁ జెవి నర్పింపక పెద్దలమాటలుపాటించుటయే నీతియని మఱియొకతూరి విన్నవించుచున్నాఁడను. ఈ రెండుగాథలుపరమభక్తిని బోధించుచున్నవి. ఇట్టివిషయములు నిరుపయోగకరములనుట మిగులఁ బొరపాటు. భగవంతుఁడు తీర్థరూపుఁడని నమ్మి సేవించిన భగవత్కరుణ కలిగియే తీరును. ఇంతట నీవిషయమును వదలి వేరొకభగవత్కథను వ్రాసెదను.

## గోవర్ధనోత్పత్తి వృత్తాంతము.

* భగవంతునకు గోవర్ధనపర్వతము ప్రీతిపాత్ర మేల యయ్యెనో తెలిసికొనుట ముఖ్యము. ఎన్నియో పర్వతము లుండ గోవర్ధనమునే యేలయెత్తెనో, దానిచెంతను, దానిపై

---

*ఈకథయు గర్గసంహిత మూఁడవఖండమునఁ దొమ్మిదవయధ్యాయము నుండి గ్రహింపఁబడినదియే. శ్రీకృష్ణవక్షస్థలమునుండి పుట్టిన దనుమాట విని బహుళాశ్వభూపతి తద్వృత్తాంతమును జెప్పుమా యని నారదునడుగ నామహాముని యీవృత్తాంతమును జెప్పెనని యెఱుంగునది.

నను ఏల విహరించెనో తెలిసికొనుట చాలముఖ్యము. దానియం దలితీర్థములను బవిత్రస్థలములను గుఱించినకథలు ముందే వ్రా యఁబడియేఁగదా. వీని కన్నింటికాధారమగు గోవర్ధనభూధర వరవృత్తాంతమును వినుఁడు. ఆద్యంతములులేక పురుషుఁడనియు నిర్గుణుఁడనియుఁ బ్రకృతికంటెఁ బరుడనియుఁ, బరిపూర్ణుఁడనియు భగవంతుఁడనియు శ్రీకృష్ణుఁడు వినుతింపఁబడును. ప్రత్యగ్ధాముఁ డని కొందఱు, స్వయంజ్యోతి యని మఱికొందఱు, నిరంతర క్రీడాసక్తుఁ డని యింకను గొందఱు, సాంఖ్యులు కాలరూపుఁ డనియు, యోగులు ఆత్మారాముఁడనియు నెన్నఁబడువాఁడు శ్రీకృష్ణుఁడే.

తొలుదొలుత ననంతుఁ డావిర్భవించెను. ఆతఁడు మహా మహిముఁడు. శ్వేతవర్ణవిభాసమానుఁడు. లోకవందితమై మహా లోక మనఁబడుగోలోకము తదాధారమున వెలయును. ఏయ నంతుని భక్తియుక్తి సంభావించి పునరావృత్తి నొందకుందురో ఆయనంతుఁడు శ్రీకృష్ణుఁడే. అసంఖ్యబ్రహ్మాండపతియైగోలోకాధి పతియు నై మహాప్రభువనంబడుచున్న యాశ్రీకృష్ణునిపాదార విందమునుండి పుట్టినగంగ త్రిపథగామిని యై వఱలెడిని ఆ మహాత్మునివామాంససంభూతయగుకృష్ణానదిసరిద్వరయనఁ బ్రసి ద్ధరాలయ్యెను. శ్రీహరిగుల్ఫములనుండి రాసమండల ముదయ మయ్యెను. హేమరత్నవిభూషితమై దివ్యమై నానావిధ శృంగారనిలయమై యదియొప్పెడిని. శ్రీకృష్ణుని జంఘభాగముల నుండి నికుంజపుంజ మొదవెను. అది సభాప్రాంగణవీథులచే

తను మండపములచేతను బరివేష్టింపఁబడి, వసంతశృంగారమున కాధారమై కూజత్కోకిలసంకులమై, మయూరషట్పదవ్యాప్తమై సరోవరపరిసేవితమై భగవత్ప్రీతిపాత్రమై తనరారుచుండు. శ్రీహరిజానుప్రదేశములనుండి బృందావన ముత్పత్తినందెను. అది సర్వవనోత్తమము. లీలాసరోవరంబొండు భగవదూరుభాగములనుండి ప్రభవిల్లెను పరాత్పరునికటిప్రదేశమునుండి స్వర్ణభూమి జనించెను. అది సర్వరత్నఖచితమై తనరారు పరమేశ్వరునుదరరోమరాజినుండి మాధవీలత లుప్పతిల్లెను. ఆలతలు బహువిధమధురపక్షిగణసంవ్యాప్తములు, భ్రమరఝంకారసంకులములు, మనోహరపుష్పఫలభారవినమ్రములు. కావునఁగులకాంతలవలె స్తుతిపాత్రములయి వెలయు. ఆపరమాత్మనాభిపంకజమునుండి కమలము లుదయించెను. గోలోకమునకవియే యలంకారములని చెప్పనొప్పును. భగవంతునిత్రివళీప్రదేశమునుండి మందగతియు నతిశీతలము నగువాయు వుత్పత్తినొందెను. ఆమహాత్ముని జత్రుప్రదేశమునుండి (మూపురముల సంధిభాగము)మధురాపురియు, ద్వారకానగరము ప్రభవిల్లెను. శ్రీకృష్ణబాహువులనుండి శ్రీదామాదులగు నెనమండ్రు పార్షదు లుదయించిరి. శ్రీహరిమణిబంధములనుండి నందులు, భగవంతునికరాగ్రములనుండి యుపనందులు, శ్రీకృష్ణుబాహుమూలములనుండి వృషభానువులు, మాధవునిరోమకూపములనుండి గోపగణములు, శ్రీపతిమనస్సునుండి గోవులు, వృషభములు ప్రభవిల్లెను. వృషభములు ధర్మధురంధరములని చెప్పంబడు.

పరమేశ్వరిబుద్ధినుండి తృణగుల్మములు,తద్భావమాంసములనుండి తేజస్స్ఫూర్తిగల్గెను. విరజయు నుదయించెను. ఆమెనుండియే శ్రీహరిప్రియ జనించెను. ఆమె లీలావతి యనంబడు. ఆమెయే రాధయని పరికీర్తింగాంచెను. ఆరాధాదేవిభుజములనుండి విశాఖ యనుసఖి కల్గెను. చెలికత్తెలగు గోపికలు రాధాదేవి మాగారునుండి యుత్పత్తినందిరి.

ఈరీతి మధుసూదనుఁడు గోలోకమును నిర్మించెను. నిర్మింపఁబడిన యాలోకమునందు శ్రీరాధాదేవిం గూడి రాజిల్లెను. తాను బరిపూర్ణుఁడయ్యుఁ, బరమాత్మయయ్యు సకలబ్రహ్మాండ నాయకుఁడయ్యుఁ దనప్రకృతియగు రాధంగూడి రాసమండలమున విహరించును. ఆరాసమండలము శృంగారాలవాలము. గోపికామణినూపురక్వణన్నినాదమనోహరము. ముక్తాఫలసందోహనీరంధ్రభూభాగము. మాలతీకుసుమనిర్మిత వితానజాలమనోజ్ఞము. సకల కుసుమ సుగంధ బంధురము. మృదంగతాళవేణునినాదముఖరితము. సరసకంఠగానమృదునాదసంభరితము. ఆరాసమండలమున శ్రీసుందరీబృందపరివేష్టితుఁడై కోటికందర్పసుందరాకారుఁడై వెలయు శ్రీకృష్ణమూర్తిని గాంచి శుభతమకటాక్షములచే భక్తలోకము నానందింపఁజేయు మహానుభావుఁడని మనమున వినుతించుచు రాధ యిట్లు పలికెను.

ప్రాణేశ్వరా! జగన్నాయకా! ఈరాసవిహారమునఁ బ్రసన్నుఁడవైతివేని నామనమునఁ గలయొకవిషయమును విన్నవిం

చెదను. సెలవే. అని ప్రార్థింప నో రాధాదేవీ! నీయిష్టము నడు
గుము. నీమనోగతమును దాఁపకుము. ప్రియురాలా! ఇయ్యఁ
దగనిదైనను నీయందలిప్రీతిచే నొసంగెదను అని వాసుదేవుఁ
డాదరమునఁ బలుక రాధాంబిక పరమానందభరితస్వాంతయై
యమునాతీరమం దలరారుచు నికుంజపుంజమంజుళం బైనబృం
దావనమునందు రాసవిహారము చేయ రహస్థ్సలము నేర్పఱు
పుము. ఇదియ నామనోరథము. ఈవాంఛితమును దీర్పుమని
వేఁడెను. రాధాప్రార్థనము నాలించి యట్లే నిర్మించెదనని భగ
వంతుఁడు పలికి రహోయోగ్యమగు రాసమండలమును నిర్మిం
చుపద్ధతి నాలోచించి తననేత్రారవిందముల హృదయమును
బరికించెను. అప్పుడే గోపికలు చూచుచుండ శ్రీకృష్ణహృదయ
పద్మమునుండి యనురాగాంకురమువలె సకలతేజస్సు వెలువడి
రాసభూమియందు వ్యాపించెను. ఆతేజస్సే పర్వతాకారంబుగ
వృద్ధినొందెను. ఆపర్వతము రత్నధాతుమయము. దివ్యము. దేవ
నదీపరికీర్ణము. దరీజాలసంభరితము కదంబవకుళాశోకముఖతరు
నికరబహువిధలతాజాలపరిజుష్టము. మందారకుందబృందసుంద
రము. సాధుపతత్రికలనాదమనోహరభాగము. బహుయోజనవి
స్తృతము. ఆదిశేషునితనువలె బహుతరాయామము. అంబర
సంవ్యాప్తోత్సేధము. అట్టిపర్వతము, క్షణమాత్రమున నేర్పడి
యెను. దానిం జూడ గజరాజువలెఁ జూడఁబడుచున్నదే యని
తోఁచును. బహుతరశృంగసంఘము లందు వెలయుచుండును.
వానిం జూడఁగా ననేకహేమకలశపరిలసన్మనోహరహర్మ్యము

వలె నుండును. దానిపేరు గోవర్ధనమని పెట్టఁబడినది. కొందఱు శతశృంగపర్వతమనియుఁ బిలుతురు.

ఆపర్వత మభివృద్ధినొందునట్లు భగవంతుఁ డాశీర్వదించెను. అదియే రాధామనస్సమ్మోద మొనఁగూర్చునది యని యెఱుంగవలయును. ఆపర్వత ముదయించి యట్టె పెరుగసాగెను. దానింజూచి గోపికలు తత్తఱపడసాగఁ గోలాహలం బుదయించెను. ఆవిధ మెఱింగి శ్రీహరి హస్తతలంబున దాని నడఁచి పర్వతమా లోకముల నాక్రమింపనేల పెరిగెదవు? ఇఁకఁజాలు, అని భగవంతుఁ డాజ్ఞాపించెను. ఆపర్వతోత్తమము జూచి రాధాదేవి పరమానందభరితురాలయ్యెను. ఆపర్వతముచెంత రాసమండల మను రహస్థ్సలంబున నాదేవి శ్రీకృష్ణునింగూడి విహరించును. రాజా! ఆపర్వతమె యిది. శ్రీకృష్ణనిర్మితము. సర్వతీర్థమయము. ఘనశ్యామము. సురప్రీతిపాత్రము. భారతపశ్చిమతటముననున్న శాల్మలీద్వీపమునడుమ నుండి యీదండికొండ యుత్పత్తినొందెను. ద్రోణాచలమునకు భార్య యనఁదగు చిన్నకొండకుఁ జెంత నిది యుదయమయ్యెను. ఆపర్వతమును బులస్త్యముని కాళిందీతీరమున నుండినమేలనిభగవంతుని వేఁడి తదాజ్ఞచే నిందుండఁజేసెను. ఇది గోవర్ధనోత్పత్తిక్రమము. తొలుదొలుత నీపర్వత మెట్లు వృద్ధినొందఁబూనెనో యది భగవంతునిచే నెట్లాపఁబడెనో యట్లే భూలోకమును జేరినమీఁద భూతలము నావరింపఁబూనఁగా నదియెఱింగి

యింక విస్తృతినొందవలదనిముని శాప మొసంగెను. దాన య థాపూర్వరీతి నీపర్వత మలరారుచుండెను.

మహాశయులారా! ఈచరిత్రమునుండి ముఖ్యవిషయము నొకదాని నెఱుంగుట మంచిది. గోవర్ధనము భగవంతునిహ్లా దయమనియు, ననఁగాఁ దత్ప్రీతిపాత్రమనియుఁ గాఁబట్టియే ఆచోటనే బృందావనము, ఆచోటనే రాసమండలము ఏర్పడి యెను. అనఁగా నాస్థలము మహాపవిత్రము. భగవంతున కానం దభూమియని స్పష్టమగును. సర్వస్థలములు భగవంతున కుప మానములే యైనను, భగవదారాధనము చేయఁ గొన్ని ముఖ్య ములై భక్తుల నుద్ధరింపఁదగినవై యుండును. అందు భగవత్కళ యధికమని తాత్పర్యము. ఆచోటులయందు సమాహితచి త్తులై భగవంతు నారాధించినచో ఫల మల్పకాలముననే కలు గునని సారాంశము. ఇదియే గ్రహింపఁదగినది. కాశ్యాదిమహా క్షేత్రము లీభావముననే పరమపవిత్రములైనవి. అందే భగవం తుఁడుండునని చెప్పుట పామరులకొఱకుఁగాని జ్ఞానులకొఱకుఁ గాదు. జ్ఞానులు "సర్వత్ర సమదర్శినః" అన్నసూక్తికి లక్ష్య భూతులుకదా! అట్టివారికి యాత్ర లవసరములుకావు. ఒక్క క్షేత్రమున భగవంతుఁడుండుననఁగా పరమేశ్వరుని యద్భుత మహిమమును దగ్గించినట్లే యగునుగాని పామరుల కట్లుచెప్పు టచే భక్తి కుదురును. ఈభావముననే మహానుభావులు యాత్రా విధుల నేర్పఱచిరేకాని భగవంతుఁడు సర్వవ్యాపియను నుపని షద్వాక్యముల నెఱుంగకకాదు. ఒక్కరీతివిధు లెల్లవారికిం బనికి

కావు. కర్మసిద్ధాంత మిదియే. దానినిమిాఱ నెవ్వరికిఁ దరము గాదు. బహువిధకర్మములఁ జేయువారల కొక్కరీతి భగవదా రాధనము నిర్ణయించుట పాడిగాదు. కావుననే బహువిధార్చన పద్ధతులు నిర్ణయింపఁబడెను. క్షేత్రములు నిర్ణయింపఁబడెను. ఏ క్షేత్రమున నేవిధముగాఁ బూజించుపుణ్య మెవఁడు చేయు చుండెనో వాని కా క్షేత్రము ఆవిధమగు నారాధనము రుచించును. అందుఁగాని వానిమనస్సు నిలుకడను దృప్తిని గాంచఁజాలదు. అది తెలిసికొనుట సామాన్యులకు శక్యమా? ఎవ్వఁడెవ్వఁ డెట్టిపద్ధతుల భగవదారాధనము చేయఁబూనునో వానివానికర్మ మిట్టిదని మన మెఱుంగవచ్చును. ప్రకృతము శ్రీకృష్ణపరబ్రహ్మ సమారాధనముకొఱకు గోవర్ధనాచలవర్యము, బృందావనము, విశేషించి రాసమండలము నిర్ణీతములని యెఱుంగుట న్యాయ మెఱుంగు తెఱంగు. అందు శ్రీకృష్ణనామాంకితుఁడై యుండుభగ వంతుని ధ్యానించుట, పూజించుట లోనగుకృత్యములు శీఘ్రఫ లప్రదములు. అందే భగవంతుఁ డావహించియుండునని కాదు కాని యాసుస్థలములం బరమేశ్వరునికళ హెచ్చుగానుండును. అంతియగాక యందు విశేషించి రాధాదేవిం గూడి విహరించు చుంబట్టి యది పరమపావనమని చెప్పనొప్పును. రాధాంబయే మూలప్రకృతి. కావునఁ దత్సన్నిధినుండు పురుషోత్తముఁడు ఫల ప్రదాత యనుట సమంజసము. మూలప్రకృతి లేనిచో (అనఁగా నామెంగూడి లోకనిర్మాణేచ్ఛ గల్గుటలేఁగాక) నిర్గుణుఁ డేలాగు ఫలము లొసంగును. ఆయవస్థలో విరాట్టువనం బడుభగవంతు

నారాధించుట ముముక్షువులకే శక్యముగాదన నీకఁ దక్కినవా
రికి శక్యమేకాదు. కొందఱు ప్రకృత్యుపాసనము నంగీకరింపరు.
కాని చతుర్భుజుఁడు మహావిష్ణువందురు. ఆరూపము ప్రకృతివిశి
ష్టమే కాకున్నచో భగవంతునకు రూపనామము లెట్లు వచ్చె
నని వారూహింపరు. వారిమతాభిమానమే వారి నిన్నివిధము
లఁ ద్రిప్పలంబెట్టుచున్నయది. వా రేమియూహించినను జేయుప
నియొక్కటియే కాన ఫలములు గలుగుచుండును. భక్తిదృఢతఁ
గాంచనుగాంచను ఈసిద్ధాంతము మనమునఁ బాదుకొనును.
అజ్ఞానము తొలఁగును. మనపట్టుదల చిత్తక్షోభమే కాని వేఱు
ఫలముల నీఁజాలదని వారి కప్పుడు బోధకట్టును. ఇన్నికష్టముల
ననుభవించియే శ్రీరామానుజాచార్యులవారు శ్రీప్రధానత్వ
మును సిద్ధాంతముచేసిరి. కావున వెఱ్ఱిపట్టుదలకు మదిఁ జోటీ
యక రూపనామక్రియావిశిష్టమంతయుఁ బ్రకృతివిలసితమే
యని భావించి తద్విశిష్టపరమాత్మ నుపాసించి నిర్మలజ్ఞానము
నార్జించి తత్ఫలముగా నిర్గుణుని ధ్యానించుట మంచిదని మఱి
యొకమాఱు హెచ్చరించుచున్నాఁడను.

గోవర్ధనము భగవంతునిహృదయమే. తేజస్సే పర్వతము
గా మార్పునొందినదన్న భగవత్ప్రీతియందు మిక్కుటముగా
వ్యాపించియున్నదను భావము గాక మఱేమిటి? రాసమండల
మనఁగాఁ బ్రకృతిపురుషులసమ్మేళనస్థలము. అదిపరమపావనమను
టయే సమ్మతము. ఆవిషయ మీకథచేఁ జెప్పఁబడినది. రాధా
దేవి రాసమండలమును నిర్మింపుమా యని కోరు టేల యని

ప్రశ్నింపరాదు. ప్రకృతి భగవంతుని నిర్మించునని యేమూర్ఖుఁడు జెప్పుఁడుకదా. భగవంతు నిచ్ఛయేప్ర కృతి. తదనుజ్ఞాతయై సకలబ్రహ్మాండములఁ దృటికాలమున నిర్మించును. పాలించును. సంహారించును. కావున నట్టిప్రకృత్యపరరూపమున నలరారు రాధాంబ భగవదారాధనస్థానము నేర్పఱుపుమా యని వాంఛించుట తప్పని పరికింపరాదు. భక్తవాంఛాపూరణార్థ మేయే కార్యము లవసరములో అవియన్నియు నామెకుఁదెలియనివి కావు. జగన్మాత కదా రాధాంబ. ఏయేభక్తులు రాసమండలవిహారవిశిష్టభగవద్రూపమును ధ్యానింతురో వారి కాస్థలము గమ్యమని తెల్పుటకే యాప్రశ్నమున డిగెను. ఇందేమి సంశయమున కవకాశముగలదో నాకింకను దోఁపకున్నది. ఎల్లప్పుడును దోఁచకుండ భగవంతుఁ డొనరించుఁగాక యని ప్రార్థించుచున్నాఁడను.

శ్రీకృష్ణావతారమున రుక్మిణియే ప్రధానభూతురాలనియు, రాధాదేవియే లేదనియు దీనికి భాగవతమే యుదాహరణమనియుఁ గొంద ఱుద్ఘోషింతురు. భాగవతము మోక్షగ్రంథమని వారిభావము. అట్టిపురాణమున రాధాప్రస్తావ మేల చెప్పఁబడలేదని వారు వాదింతురు. పాపము! వారిదృష్టికి భాగవత మొక్కఁడు మోక్షగ్రంథముగాఁ గన్పడినది. ఆపాటి మోక్షగ్రంథము గానిపురాణములేదని వారెఱుంగరు.. కాఁబోలు? పురాణములన్నియు నించుమించుగా భాగవతమువంటివే. భగవన్మహిమములఁ దెల్పునవియే. భక్తిప్రధానముగాఁ

గథలఁ దెల్పునవియే. పరీక్షిత్తునకు ముక్తిని బ్రసాదించుటకై చెప్పఁబడినదిగానముక్తిప్రతిపాదకగ్రంథమని వారివాదసారము అయ్యో! ఏమి వారివెఱ్ఱి!! ఏభక్తునకో ఏయాపదుద్ధరణమునకో ఆపురాణము చెప్పఁబడుట వారెఱుంగ రనఁగూడునా? కాని వారివట్టిపట్టుదల యిట్టిసిద్ధాంతమును వారిమదిఁజొన్పినదనినా భావము. భాగవతమున నెందుఁగాని రుక్మిణి యప్రతిమానశక్తి కనఁబఱచుకథగలదా. శీలము ప్రధానముగాఁగలదని తెల్పుకథ లుగలవు. రాధాదేవిని దెల్పుపురాణములం బరికింపుఁడు. రాధా సహస్రనామములు, రాధాకవచములు, స్తుతులు, ప్రకృతియే యామె యనునట్టిగాథలు కనఁబడును. ఇవి కేవలకల్పితకథలని చెప్పసాహసించునంతటివి కలవు. ఈపాటియాలోచనము వారి కిం గలుగఁగూడదా. లీలాశుకాదులు రాధానామస్మృతి నొన రించియే తరించిరి. వారినైనఁ దలంపరాదా. ఇట్లనుటచే రుక్మి ణికన్న రాధ యుత్కృష్టురాలని చెప్ప నెంచినట్లు భావింపరా దు. ఒక్కొక్కగ్రంథ మొక్కొక్కవిధమును దెలుపును. కేవల ముక్తికాముఁడగు పరీక్షిత్తునకు శ్రీకృష్ణపరమాత్మచరిత మొక్క టియే శుకమహర్షి తెలిపెను. చతుర్విధ పురుషార్థములు తెలుపు నప్పురాణములు. రాధామహిమమును విశేషించి తెల్పినవి. ఇం దుత్తమమధ్యమాధమవ్యవస్థ యెట్లు? భాగవతమున రాధకన్న రుక్మిణి యధికప్రియురాలని చెప్పఁబడిన భాగము కలదా. రుక్మిణిచరిత్రముకలదుకాని రుక్మిణీమాహాత్మ్యమును ప్రధా నముగా దెలుపుగాథయొక్కటియు నందుఁ గానరాదు. పెక్కు

మందిభార్య లున్నట్లు, నందు రుక్మిణీదేవి ప్రాణప్రియ యని మాత్రమే భాగవతమునఁ గానఁబడియెడిని. రుక్మిణీచరిత్ర ప్రారంభమునందు ఏఁబదిరెండవయధ్యాయమున,

శ్లో. రుక్మకేశో రుక్మమాలీ రుక్మిణ్యేషాం స్వసా సతీ. ౨౨
తాం బుద్ధిలక్షణౌదార్యరూపశీలగుణాశ్రయాం,
కృష్ణస్య సదృశీం భార్యాం సముద్వోఢుం మనో దధే. ౨౮

ఎనుబదవయధ్యాయమునందుఁ గుచేలోపాఖ్యానమందు.

దేవీ పర్యచరద్భైష్మీ చామరవ్యజనేన వై. ౨౩
పర్యంకస్థాం శ్రియం హిత్వా పరిష్వక్తోఽగ్రజో యథా.

ఇందు శయ్యాతలంబున నుండులక్ష్మిని వదలి కుచేలుని గౌఁగిలించుకొనుచున్నాఁడని యంతఃపురమునఁగల వనిత లనుకొను నట్లు కనఁబడియెడిని. శ్రియమ్ అనుమాట యొక్కదాని నాధారముచేసికొని రుక్మిణి లక్ష్మీదేవియే యని చెప్పవచ్చును. దీనిచే బాధయేమియో నాకుఁ దోఁపకున్నది. రాధాప్రస్తావము భాగవతమున లేదన్నమాటచేతనే రాధ విష్ణుపత్ని కాదని చెప్పనగునా? న్యాయమా? కాదుకదా? కావున నిట్టి యసందర్భప్రసంగమువలన లాభములేదు. రాధామాధవనామములు సనాతనములు. దేవీభాగవతమున రాధాదుర్గాసామ్యము ప్రతిపాదింపఁబడినది. ఇట్లు దుర్గారాధల కభేదము ప్రతిపాదింపఁబడఁగా నిఁక విష్ణుపత్నులలోనే యొక రెక్కువ వేఱొక్కరు తక్కువ యను ప్రతిపాదనము వెఱ్ఱితనముగాఁదోఁపకమానదు. భేదబుద్ధియుండునంతవఱకు భగవత్ప్రీతిపాత్రుఁడు కాఁజాలఁడు. అలసులు

ప్రించినను బ్రాజ్ఞు లట్టితుచ్ఛవాదములకుఁ జోటీయరాదు. వక్షః
ందదలు లక్ష్మి విష్ణువక్షస్స్థలాలయగాన నవినాభావసంబంధము
ందందురు. రాధకు లేదందరు. కాని వారి కాశబ్దమునకుసాంప్ర
యసిద్ధార్థమే తెలియదు. రమాసతి విష్ణువు వక్షస్సున నున్న
ంగా నందుఁ గూరుచున్నదనియా భావము. భర్తృహృదయ
మునఁ బాదములు మోపి కూరుచున్న నామె పతివ్రత
గునా? దానియర్థ మదికాదు. హృదయస్వరూపిణియని సా
ము. ఆమె యెఱుంగకుండ శ్రీపతి యేకార్యము చేయఁడని
ాత్పర్యము. ఏలయనఁగా నాశ్రీదేవియే మూలప్రకృతియగు
కదా. కావున నామెయెఱుంగకుండ నేకార్యము సాగనేరదు.
రదేవియిచ్ఛచేతనే బ్రహ్మాండము లొక్కక్షణమున నల
రును. తదిచ్ఛచేతనే వృద్ధినొందు. తదాజ్ఞచేతనే లయించు.
ష్టిస్థితిసంహారము లాపరదేవత యిచ్ఛానుసారముగనే సాగు
ందును. ఆమెయో యెవ్వతయో కాదు. భగవదిచ్ఛయే. ఇట్టు
ండగా నిఁక దుర్వాదముల కవకాశమెక్కడిది ?! అకృత
కృతులకు రాధాదేవి రుచింపకున్న మానెఁ గాని కృతపుణ్యు
సఁ బరదేవియనియే తోఁచును. కాఁబట్టియే భక్తాగ్రగణ్యుఁ
డు లీలాశుకమహర్షి,

రాధా పునాతు జగదచ్యుతదత్తచిత్తా
మంథానమాకలయతీ దధిరిక్తపాత్రే,
తస్యాస్తనస్తబకచంచలలోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్.

అని నుతించి ముక్తికింబోయెను. ఈశ్లోకార్థ మత్యంతమనోహరము. ప్రాతీతికార్థము స్పష్టముగనే తోఁచెడిని అర్థాని మది నునుపకుండుఁడు. విశేషార్థమునే పరికింపుఁడు. భక్తునిభావ మెట్లుండునో యని యూహింపుఁడు. ఈదంపతు లిరువురును బ్రపంచమును బవిత్రముచేయుదురుగాక యని కవి తలంచెను. ఇందుఁ బ్రకృతిపురుషులకృత్యము కన్పట్టెడిని. రాధాంబిక (ప్రకృతి) యతీశ్వరుఁడగు భగవంతునియందే మదినునిచి (అనఁగా వారియాశయ మెట్టిదని కనిపెట్టి యని భావము) వట్టి బానలోఁ బెరుగుచిలుకుటకుఁ గవ్వమును ద్రిప్పుచు (అనఁగా స్థిరముగాని ప్రపంచమును నిర్మింపఁబూనినది యని సారము) నుండెను. భగవంతుఁడును (ఇట దేవః అని కవి ప్రయోగించెను. స్వప్రకాశముచేతనే వెలుఁగువాఁడని భావము) ఆరాధాదేవి పాలిండ్లబంతిపై నాసక్తమగు దృష్టిగలిగి (అనఁగా, కుసుమస్తబకమువంటిప్రకృతి హృదయమును, ఆసక్తితోఁ జూచుచున్నవాఁడై అని తాత్పర్యము. స్తనశబ్దము లక్షణచే హృదయపరము. దీనికే "జహత్స్వార్థలక్షణా" నామము ప్రసిద్ధము. కుసుమకోమలమగు ప్రకృతి హృదయమును జూచుచున్నవాఁడై అని విశేషార్థము) పరధ్యానముతో నెద్దును బాలు పిండుటకై (అనఁగా నన్నింటికిఁ బరుఁడైనతననే తలంచుకొనుచు నసాధ్యకార్యమును జేయ నాజ్ఞాపించునని భావము. అఘటనాఘటనసమర్థుఁడుకదా పరమేశ్వరుఁడు. ఎద్దును ఆవునుగా మార్పఁగలఁడు. ఆవు నెద్దునుగా మార్పఁగలఁడని గ్రహింపఁ

దగు.) కట్టివేయుచున్న శ్రీహరి ప్రపంచమును పావనముచేయు దురుగాక. ప్రసాదదృష్టిచేఁ బాపాత్ముల పాపముల నశింపఁజేయు దురుగాక యని సారతరార్థము.

ఈ యర్థమే భక్తుని భావముగానిచో లీలాశుకుఁ డవి వేకియని స్పష్టమగును. రాధామాధవులు ప్రపంచమును పావనము చేయుదురుగాకయని భక్తుఁడు కోరెను. అనఁగా నెల్లరను భక్తులనుగా ననుగ్రహింపుమా యనుటయే ప్రార్థనాసారము గాని వేఱొకటిగాదు. ఈ శ్లోకమునుండి తెలిసికొనవలసిన విశేష మేమనఁగా భగవంతుఁడు ప్రపంచసృష్ట్యున్ముఖుఁడై ప్రకృతిని వెలువరించును. ఆవలఁ దా సాక్షిమాత్రుఁడై యుండును. మూలప్రకృతి తనయనంతశక్తిచే జగంబుల నిర్మించును. ఆ స్థితియందు దాజననికి బ్రహ్మయని పేరు. జగంబులఁ బాలించును. ఆ స్థితియందు దామెకు విష్ణువని పేరు. జగంబుల సంహరించును. ఆ స్థితియందు దామెకు రుద్రుఁడని పేరు. ప్రకృత్యపర రూపులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులనే లోకులు త్రిమూర్తులం దురు. వారెల్లఁ బ్రకృతికల్పితులే. ఎల్లరకు మూలకారణము ప్రకృతి. ప్రకృతికి మూలకారణము భగవంతుఁడు. అందులకే "కారణకారణం త్వామ్" అని పెద్దలు వినుతించిరి. హేతువుల కన్నింటికి హేతువు భగవంతుఁడని భావము. ఈ యర్థమే పై శ్లోకముచేఁ దెలియఁబడునది. దీని నిశ్చయించిగిననే భక్తుఁడనఁ బడు. లేనిచోఁ గాముకుఁ డనఁబడు. ఇట్టిభక్తులు భగవంతుని పత్నిని రాధానామమునఁ బిలువ రాధపేరే లేదని యనుట

వెఱ్ఱితనముగాక మఱేమిటి? ఇట్టివట్టిపట్టుదలచేఁ దాఁజెడుటయే గాక వేఱొకఫలము కనఁబడదు. ఇహపరసుఖములఁ గలిగింపని పాండిత్య మేల? విష్ణుపత్నులయందే భేదబుద్ధిగలవారికి సహన ముండునని తలంపనగునా. భక్తికి వారిమది నవకాశముగలదా. అదిలేనిచోఁ దరించునుపాయము వేఱొకటి కలదా. తత్ప్రయత్న మొనరింపనిచో నాజనికి లాభముకలదా? లేదనుటకే శంకలులేవు.

కావున భక్తులారా! రాధాదేవి యెవ్వతయో క్రొత్తదిగా భావింపక పండితబ్రువులాడు దురాలాపములఁ జెవియొగ్గి యాలకింపక రాధాదేవింగూడిన మాధవు నారాధింపుఁడు. రుక్మిణీసహితమాధవు నారాధించినఫలము గలుగదా యన కుఁడు. లేదని యేనీచుఁడు ననఁజాలఁడు. ఏనామమైననేమి? రుక్మిణికిని రాధకు భేదముగలదా. శ్రీకృష్ణునకు శ్రీరామునకు భేదముగలదా. విష్ణునవతారములలోఁగూడ భేదముగల దను వారిమాట యిట నుచ్చరించుటయుఁ దగదని నా భావము. ఏజనున కేనామము వాడుకబడునో వాఁడా భగవన్నామమున శ్రీకృష్ణపరమాత్మను ధ్యానింపవచ్చును. అట్లె రాధను బూజింపవచ్చును. ఇదియే సారము. ఇదియే వక్తవ్యాంశము. ఇదియే మంతవ్యము. ఇదియే ముక్తిమార్గము. ఇదియే భక్తులకుఁ గల్పతరువు. ప్రకృత మీవిషయమును వదలెదను. ముందు రాధాదేవింగూర్చి విశేషించి వ్రాయఁదలంచితిని. కావున మీఁదికథను వ్రాయఁబూనెదను.

శ్లో. పల్లవారుణపాణిపంకజసంగివేణురవాకులం
ఫుల్లపాటలపాటలీపరివాదిపాదసరోరుహం,
ఉల్లసన్మధురాధరద్యుతిమంజరీసరసాననం
వల్లవీకుచకుంభకుంకుమపంకిలం ప్రభు మాశ్రయే. ౯
ఆముగ్ధమర్ధనయనాంబుజచుంబ్యమాన
హర్షాకులవ్రజవధూమధురాననేందోః,
ఆరబ్ధవేణురవమాదికిశోరమూర్తే
రావిర్భవంతి మమ చేతసి కేఽపి భావాః. ౧ ఆ. ౧౯ శ్లో.

మహాశయులారా! ఇంతవఱకు శ్రీకృష్ణపరమాత్మ పుట్టుకకు హేతువులు, దేవతలు సాయపడ నవతరించుటయు, భగవదవతారము, తద్బాలక్రీడలు రాసక్రీడయు లోనగు కథలు వ్రాయఁబడినవి. శరద్వేణుగానమున గోపికలెల్లఁ దమతమ పనులుమాని పరుగిడుసందర్భమునఁ బామరులకుం దోఁచు సేవగింపునకుఁ గారణములేదని వ్రాయఁబడినది. ఇఁకముందు శ్రీకృష్ణునిమహిమముల వ్రాయునపుడెల్ల గోపికలవిషయమై కొన్నిశంకలు గలుగవచ్చును. కాఁబట్టి గోపికలయుత్పత్తి చక్కఁగా వ్రాసినఁగాని యాశంకలు తొలఁగవు. ఈవఱకే గోపికలు గోలోకమునుండి యుత్పత్తిఁగాంచిరని చెప్పఁబడినను మఱికొందఱచరిత్రములు వ్రాయుట సమంజసము. కావున నిట గోపికాచరిత్రమును వ్రాసెదను. దీనిచేఁ బామరులకుం గలుగు సందియములు సరికావని తోఁచుట యొక్కటియే ఫలమని యూహింపనగు.

## శ్రుతిరూపగోపికలచరిత్రము.

[1] శ్రుతిరూపలగుగోపికలు గోపకుల సద్వంశమునందుఁ బుట్టిరి. శేషశాయివరప్రభావమున నందపరిపాలితగోకులము వారిపుట్టుకకు నెలవయ్యెను. బృందావనమున లోకమనోహరతమవేషమున నలరారు నందనందనుం గన్నులారఁగాంచి బృందావనాధినాయికయగుబృందాదేవిని దర్శించి వరముల నడుగఁ గోరిరి. బృందాదేవియు వారిభావముల నెఱింగి మీకెల్ల నిష్టసిద్ధి యగుఁగాతమని యనుగ్రహించెను. దానిచే భగవంతుఁడు వారియెడఁ గరుణాయత్తుఁడయ్యెను. వారితో రాసక్రీడసలుపుటకుఁ బ్రతిదినము వారియిండ్లకుఁ దావత్తునని వర మొసఁగెను. ఆవాగ్దానముచొప్పునఁ బ్రతిదినము వారిగృహముల కరుగుచుండెను. ఒకనాఁడు రాత్రియందు రెండుజాములు గడచిన తరువాత రాసవిహారముసలుప నాగోపికలయిండ్ల కరిగెను. [2]వారెల్లఁ దదాగమనమున నత్యంతకుతూహలంబున నుప్పొంగుచు మహత్తరభక్తి నాజగన్నాథుని బూజించిరి. భక్తియుక్తములగు మాటల నాదేవోత్తమునింజూచి పాపధ్వంసకా! నేఁడేల త్వరగా మాయిండ్లకు రావైతివి? ఎపుడెపు డరుదెంతువో యని చకోరములు చంద్రుని రాకం గోరునట్లు కనిపెట్టియుంటిమి.

---

1 ఈకథ గర్గసంహితయందు మాధుర్యఖండము తొలియధ్యాయము నుండి సంగ్రహింపఁబడినది. ఇది బహుళాశ్వునకు నారదునకు జరిగినసంవాద రూపమనియు నెఱుంగునది. 2 పప్రచ్ఛుః పరయా భక్త్యా గిరా మధురయా ప్రభుమ్=అని మూలము.

అట్టి మావాంఛితములఁ దీర్పఁ ద్వరగా రాక మసలుట కేమి హేతువో ఆనతిమ్మాయని వేఁడిరి. వారియాదృతి కెంతయు నానందించి ప్రీతిగలగోపికలారా! ఎవరిమనస్సునం దెవ్వఁడు నిలుచునో వాఁ డాతనికి దూరమందున్నవాఁడు కాఁడు. సదా చెంతనుండినట్లే. ఆకసమున సూర్యుఁడుండును. భూభాగమునఁ గమలములుండును. తెల్లవాఱఁగనే పద్మములు వికసించును. సూర్యుఁ డేకారణముననైనను గనఁబడకున్న నవి పుష్పింపక మానవు. ఏల? వానిహృదయముల భాస్కరుఁడు సదా నిలిచి యుండును. కనుక నవి వికసించును.

ఖాండీరవనమునకు నాగురువగు దుర్వాసుఁడనుముని వరుఁడు నేఁ డరుగుదెంచెను. వారిసేవింపఁబోయితిని. గురువు బ్రహ్మ, గురువు మహేశ్వరుఁడు, గురువు సాక్షాత్కరించినపరబ్రహ్మము. అట్టిగురువునకు నమస్కారము. అజ్ఞానమను నంధకారముగలవానియొక్క నేత్రములు జ్ఞానాంజనశలాకచేఁ జక్కబఱచి కనఁబడఁజేయునట్టి గురువునకు వందనములు. *లోకమున నెవ్వఁడైనను దనగురువును నన్నుఁగా (శ్రీకృష్ణునిగా) భావింపవలయును. ఒక్కప్పుడును దిరస్కరింపరాదు. మనుష్యమాత్రుఁ డీతఁ డనుబుద్ధిచే సేవింపరాదు. గురువు సర్వదేవమయుఁడనియే సేవింపవలయును. కాఁబట్టి నేనును నాగురువగు దుర్వాసునిఁ బూజనములఁ దన్పి వారిపాదపంకజములకు నమ

* స్వగురుం మాం విజానీయాన్నావమన్యేత కర్హిచిత్, న మర్త్య బుద్ధ్యాసేవేత సర్వదేవమయో గురుః॥ ౧౫ శ్లో.

స్కరించి వచ్చితిని. కావున నాలస్యమయ్యెను.దీనికై యింతగాఁ బ్రార్థింపనేల? భాండీరవనమునుండి మీగృహములకు రానాలస్యమగుట కిదియే కారణమని శ్రీహరి పలికెను. ఆమాటలువినిన గోపికలెల్ల విస్మితస్వాంతలయిరి. తలలువంచి కరముల జోడించి యిట్లు విన్నపము చేయసాగిరి. మహాత్మా! నీవు పరిపూర్ణతముఁడవు. అట్టి నీకు దుర్వాసుఁడు గురువని తెలిసికొంటిమి. ఆమహాత్మునిదర్శింప మాచిత్తములు తత్తఱపడియెడిని. ఇపుడు రాత్రియందు రెండుయామము లతిక్రమించినవి. పరమేశ్వరా! ఇపుడు మాకు వారిదర్శనమగునా? పోవుదమన్న నావనమునకు మాగృహములకు నడుమ యమునానది కలదు. అది పూర్ణజలయుతముగ నుండును. అదియొకటి మాకుఁ బ్రతిబంధిక యగునుగదా. నౌక లేక దానిం దరించుటెట్లు? మాకు వారిదర్శన మగుటెట్లు? అని ప్రార్థించిరి. ప్రియురాండ్రగు మీ రెపుడు వాంఛించిన నపుడే పోవ్చును. మీరు యమున దాఁటఁగోరినచో నానదియొద్దునకుంబోయి మార్గమిమ్మని ప్రార్థించునపుడు * శ్రీకృష్ణుఁడు సర్వదోషవివర్జితుఁడగు బాలయతి యగుట నిశ్చయమేని యోయమునానదీ! సరిద్వర యని ప్రఖ్యాతిఁగాంచిన నీవు మాకు మార్గమిమ్ము. అని యడుగుడు. ఈమాటలు వినఁగానే యమునానది నౌకాదులతోఁ బనిలే

---

*యది కృష్ణో బాలయతిస్సర్వదోషవివర్జితః, తర్హి నో దేహి మార్గంవై కాళింది సరితాంవరే-అనిమూలము.

కయే మీకు మార్గమునిచ్చును. సులభముగను శ్రమమునొందక
కయు మీ రెల్లరు దాఁటిపోవచ్చును.

అని శ్రీకృష్ణుఁడు వచింప నాగోపికలందఱు శ్రీహరి యనుమతిని గైకొని మంచిపక్వెరములచేఁ బూజాద్రవ్యములనెల్లఁ బరిగ్రహించి ప్రత్యేకముగా నామునిఁ బూజించుపొంటెఁ బయనమై కాళిందీనదిచెంతకుంబోయి కంఠములవంచి శ్రీహరి యుపదేశించినవాక్యములఁ బలికిరి. ఆపలుకుల విని నంతనే యమునానది వారికి మార్గమిచ్చెను. అత్యంతవిస్మయములఁ బొదలుచి త్తములతో వారాత్రోవనభాండీరవనమునకుంబోయిరి. అందు మహర్షిని గని వలగొని నమస్కరించి చక్కఁగా దర్శించి తమరు కొనిచనిన యాహారపదార్థముల నట నిడిరిఁ అందఱును మహామునీ! నేఁదెచ్చినయాహారమును ముందు గ్రహింపుమని ప్రార్థించిరి. ఇట్లు తమలోఁ దమరు కలహించు నాగోపికలభక్తిలక్షణమును బరికించి మునివరుఁడు విమలవాక్కుల నిట్లు పలికెను. ఓగోపికలారా! నేను బరమహంసాశ్రమమున నున్నవాఁడను. కృత్యముల వదలినవాఁడను. నిష్క్రియుఁడను. కావున మీరే చేతులతో నీయాహారపదార్థముల నానోటిలోఁ బెట్టుఁడు. అనిముఖమును విస్తృతముగ నొనర్చెను. గోపిక లామాటలకుఁ గరము హర్షించి యేఁబదియాఱుభోజనపదార్థములనెల్ల నందఱు నామునినోటఁ గ్రుక్కిరి. త్వరపడి తమరుతెచ్చిన యాహారవస్తువుల నోటనునుచుచుఁ జూచుచుండ నమ్ముని యావస్తువుల క్షుద్బాధ తన్నుఁ బీడించినట్లు

మ్రింగుచుండెను. క్షణమాత్రమున వారుతెచ్చినపాత్రముల న్నియు శూన్యములయ్యెను.

అంత గోపికలు భక్తవత్సలుఁడగు నామహర్షిని శాంత స్వభావునిం గాంచి నమస్కరించి విస్మితలై శిరములువంచి పరి పూర్ణమనోరథలుగాన నిట్లు ప్రార్థించిరి. మునీంద్రా! మే మిచ టికి రాకముందు సంపూర్ణప్రవాహమున నలరునదిని దాఁటు టెట్లనిప్రశ్నించి శ్రీకృష్ణమూర్తిచెప్పినప్రకారమేనదిని బ్రార్థించి మిమ్ము సందర్శింప నిచటికి వచ్చితిమి. మరల నింటి కెట్లు పోఁ గలమనుశంక మమ్ము బాధించెడిని. ఆశంక నడంచి మేమిల్లు చేరువెరవు పరికించి సెలవిండు. నావిని గోపికలారా! ఇటనుండి మీరు సులభముగ నింటికిం జనునుపాయము చెప్పెద. ఆలకిం పుఁడు. యమునానదిచెంతకుం బోయి భక్తిభావమున నోమహా నదీ! దుర్వాసుఁడు దూర్వారసమును ద్రాగి నిరాహారుఁడై వ్రతపరాయణుఁడై జలమునైనఁ గ్రోలక భూతలంబున వర్తిల్లుట నిశ్చయమేని మాకెల్ల మార్గమిమ్ము. నీవు నదీవతంసఖ్యాతిని గాంచితివికదా అని మీరు పలుకగనే కాళింది త్రోవనిచ్చును. అని మునివచియింప విని యాగోపికలు మరల నమ్మునికిం బ్రణ మిల్లి సెలవంది పయనమై యమునదాపునకు వచ్చి మునివచించిన రీతిం బలికిరి. నదియుఁ బూర్వరీతి మార్గమొసఁగెను. వారెల్ల నాత్రోవను నదినిదరించి శ్రీకృష్ణుని చెంతకుంబోయి యచ్చోరు వందుచు రాసమండలము నలంకరించియున్నశ్రీహరితో నిట్లు విన్నవించిరి. శ్రీనాథా! దుర్వాసుని దర్శించితిమి. మీయిరువుర

వాక్యముల ప్రకారము నది మార్గ మొసఁగెను. కాని మాకొ క్క సంశయముగలిగినది. దానిని విన్నవింతుము. గురుశిష్యుల రగు మీయిర్వురు సత్యేతరవాదులే. సంశయములేదు. ప్రభూ! నీవు బాల్యముమొదలు గోపీజనాసక్తుఁడవుకదా. అట్టినీవు బాలయతి వెట్లైతివో? పాపనాశకా! సెలవిమ్ము. మే మొసంగిన యాహారముల మిగులకయుండ మెక్కినదుర్వాసుఁడు దూర్వా రసమును ద్రావి నిరాహారియై యుండు టెట్లు? ఈ రెండువిషయ ములను గన్నులారఁ గాంచుచున్న మాకీసందేహముగలుగుట చిత్రముకాదు. కావున నీశంకను దీర్పుమా యని ప్రార్థించిరి.

గోపికలమనవి నంగీకరించి శ్రీకృష్ణమూర్తి చిఱునగవు తోఁప నిట్లు బదులుచెప్పెను. * గోపికలారా! నేను మమకార

---

*నిర్మమో నిరహంకార స్సమానస్సర్వగః పరః, సదా వైషమ్యరహితో నిర్గుణోఽహం న సంశయః. ౪౫. తథాపి భక్తాన్ భజతో భజేఽహం వై యథా తథా, తథైవ సాధుర్జ్ఞానీయో వైషమ్యరహిత స్సదా. ౪౬. న బుద్ధిభే దం జనయేదజ్ఞానాం కర్మసంగినాం, జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్స మాచరన్. ౪౭. యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః, జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః. ౪౮. నిరాశీర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః, శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం. ౪౯. న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే, తత్స్వయంయోగసంసిద్ధః కాలేనాత్మని విందతి. ౫౦. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః, లిప్యతే న సపాపేన పద్మపత్రమివాంభసా. ౫౧. తస్మాన్మునిస్తు దుర్వాసా బహుభుక్త్వద్ధి తేరతః, న తస్య భోజనేచ్ఛాస్త్యార్ద్రదూర్వారసమితాశనః. ౫౨. అని మూలము. ఇందుఁ గొన్ని శ్లోకములు భగవద్గీతలయందు మూఁడవ నాల్గవ యధ్యాయ ములయందుఁ గన్పట్టెడిని. పురాణములయం దిట్టి శ్లోకములు గన్పట్టుట దోషము కాదు.

ము లేనివాఁడను. అహంకారము నాకు లేదు. సమానప్రీతి యెల్ల రియందునుగలవాఁడను. సర్వవ్యాపకుఁడను. సర్వోత్కృష్టుఁడను. ఏకాలమందుఁగాని వైషమ్యము లేనే లేదు. గుణరహితుఁడను. ఇందులకు సందియము లే లేవు. అట్టులయ్యును భక్తులు నన్నెట్లు సేవింతురో వారి నట్లు ప్రేమింతును. నావలెనే దుర్వాసుఁడు కూడ సాధుమతి. వైషమ్యరహితుఁడు. ఆత్మజ్ఞానముగల సజ్జనుఁడు. కర్మాసక్తులగుమూఢులబుద్ధిని జలింపఁజేయఁగూడదు. ఫలాపేక్ష తనకు లేకున్నను గర్మములను జేయుచు వారిచేతను గూడ సకలకర్మములను జేయించుచు నుండవలయును. ఎట్టివాఁ డొనరించుసర్వకర్మములు కామము, దానికింగారణములగు సంకల్పములు లేనివిగనుండునో అట్టి జ్ఞానమనునగ్నిచే దగ్ధకర్మములుగలవానిని వాస్తవమైనపండితునిగ బ్రహ్మవేత్తలు పలుకుదురు. ఆశావిరహితుఁడై అంతఃకరణము నాత్మను నియమించుకొని యేవిధమగుసంబంధమును దగిలించుకొనక శరీరయాత్రకుపయుక్తములగు కర్మములను జేసినను బాపమునొందఁడు. జ్ఞానముతో సమానమగు పవిత్రవస్తు వీలోకమున లేదు. అట్టి జ్ఞానమును కర్మయోగముచేతను సమాధియోగముచేతను సంస్కరింపఁబడినవాఁడై చిరకాలమునకు దానే తెలిసికొనఁగలఁడు. ఎవ్వఁడు ఫలములయందాసక్తిలేక కర్మములను బ్రహ్మమునం దునిచియాచరించునో వాఁడుతామరాకునునీరంటనట్లు పాపముచే స్పృశింపఁబడఁడు. కావున దుర్వాసుఁడుమీహితము కొఱకు బహుపదార్థముల భుజించెను. ఆతనికి భోజనేచ్ఛ లేదు.

దూర్వారసమాత్రము త్రాగియుండును. అని భగవంతుఁడు పలుక గోపికలెల్ల సంశయములు తొలఁగుట జ్ఞానముగలవారైరి.

మహామతులారా! గోపికలయుపాఖ్యానమును జదివితిరి. కొన్నివిషయము లీగాథనుండి తెలియఁదగినవి కలవు. జగద్గురువు భగవంతుఁడు. దీనికి మతాంతరములు లేవు. అట్టిమహానుభావుఁడు తనకొకగురువు కలఁడని, తద్దర్శనార్థమరుగుట యాలస్యముగావచ్చుటకుఁగారణమయ్యెనని పలికెను. ఇదెందులకు? అసత్యముకాదా యీవాక్యమని ప్రశ్నించువా రుండకపోరు. భగవదవతారము ధర్మసంస్థాపనముకొఱకుఁగదా. ధర్మమనఁగా దనకుఁ దోచినంత దానమిచ్చుటగాదు. చేయఁదగినకృత్యమని ధర్మశబ్దార్థము. అనఁగా నిట్లుప్రవర్తింపవలయునని తా నాచరించి యితరుల కుపదేశించుట భగవంతుఁ డొనరించుపని.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే.
అన్నగీతోక్తియే పైభావమున కుదాహరణము.
భక్తి గురుపూజలేక కుదురదు.

నాద్వైతం గురుసన్నిధౌ.

అన్నసూక్తి యెల్ల రెఱింగినదియే. గురుభక్తియే తపస్సిద్ధికిఁగారణము.

శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన.
అన్నయాగమశాస్త్రోక్తియు నీయర్థమునే ప్రతిపాదించెడిని.
శ్లో. నిషేకాదీని కర్మాణి యః కరోతి యథావిధి,

సంభావయతి చాన్నేన సవిప్రో గురురుచ్యతేః.

మనుస్మృతి. ౨ అ. ౧౪౨

గర్భాధానాదీని సంస్కారకర్మాణి పితురుపదిష్టాని యథాశాస్త్రం యః కరోతి అన్నేన సంవర్ధయతి సవిప్రో గురురుచ్యతే. అని వ్యాఖ్య.

శ్లో. సగురుర్యః క్రియాః కృత్వా వేద మస్మై ప్రయచ్ఛతి.
యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము. ౩౪శ్లో.

యోఽసౌ గర్భాధానాద్యా ఉపనయనపర్యంతాః క్రియాః యథావిధి. కృత్వా వేదమస్మైబ్రహ్మచారిణే ప్రయచ్ఛతి సగురుః. అని మితాక్షరావ్యాఖ్య. గురువును బూజించుట ప్రధానమని వృద్ధిహేతువని పైప్రమాణము లుద్ఘోషించెడిని. ఏదో యొకమంత్రము నుపదేశించినవాఁడు గురువనంబడఁడని తేటపడియెఁగదా. తనజ్ఞానోదయమున కెవ్వఁడు కారకుఁడో అతఁడేగురువనుట స్పష్టము. అన్నముపెట్టి వేదము నుపదేశించినవాఁడే గురువని స్మృతులు తెలుపుచున్నయవి. శిష్యులఁ జక్కనిమార్గమునఁ బ్రవర్తింపఁజేయఁబూననిగురువును శిష్యపాపములు చెందునఁట.

శ్లో. మంత్రిపాపం చ రాజానం పతిం జాయాకృతం తథా,
తథా శిష్యకృతం పాపం ప్రాయో గురుమపి స్పృశేత్.

ప్రాయః అనుటచే గురువాక్యమును వినియు నట్లు ప్రవర్తింపనిశిష్యునిపాపము గురువునంటదని తెలుపును.

లోకాచారములఁ బాటించి తానుగూడఁ బ్రవర్తించిన నెల్లరు నట్లాచరింతురని భగవంతునిభావము. తనగురువుమాట

గోపికలకుఁ జెప్పనేటి కనుప్రశ్నము చేయఁదగదు. గోపికలకుం గల సకలసంశయములను దొలఁగించి తనభక్తురాండ్రనుగా నొనరించుటకదా శ్రీకృష్ణమూర్తిపని. సాధారణముగా భార్య గలవాఁడు విరక్తుఁడుకాఁడని లోకులందురు. పెట్టినంతయాహారమును దినుచున్నవానిని తిండిపోతందురు. అది పొరపాటని తెలుపుటకే యీకథను దాఁగల్పించెను. వేషధారులుగూడ జ్ఞానులవలెఁ బూజింపఁబడుచుందురు. ఎవ్వరిందు నిజముగా నాలోచింప జ్ఞానులనువిషయ మీవిషమపరీక్షవలన శ్రీహరి తెలియఁజేసెను. గోపికలు తన్ను నాథునిగా భావించిరి. వారితోఁదాను బాలయతి నని చెప్పెను. అందఱు కొనిపోయినభక్ష్యముల మెక్కినదుర్వాసుఁడు నిరాహారి ననియెను. ఈరెండును బ్రత్యక్షవిరుద్ధములేకదా యని గోపికలు శంకించిరి. అట్టితఱిఁ దమయాథార్థ్యమును వారికిం దెల్పుట యుక్తముకదా? ఏదృష్టాంతమువలన వారికీశంకలు తొలఁగును! మాటలవలనఁ దొలఁగవు. స్వల్పోదాహరణములవలన నవి పాయవు. గొప్పదృష్టాంతమును గనఁబఱచుట మిక్కిలి మంచిదని భావించెను. రాత్రికాలము. యమునానది భయంకరవేగమునఁ బ్రవహించుచున్నది. దాఁట బూనినవారు నవయువతులు. ఆవఱ కెన్నఁడే నిట్టిదుర్వారనదీవేగమును గాంచినవారుకారు. వారికి గురుదర్శనము చేయునూహను బుట్టించెను. వారు చూడం దమకించిరి. ఈమహానది నడుమనున్నదే యెట్లు దాఁటుదుమని వేఁడిరి. ఈమాటలుచెప్పిన మార్గమిచ్చునని వారికిదెల్పెను. వారప్పుడే

ప్రశ్నింపకుండుటకుం గారణము తత్కాలమున వారిమదుల నుండు గురుదర్శనోత్సాహమేగాని వేఱుకాదు. వారు భగవ ద్వాక్యము నాలకించి త్వరగాఁ బోయిరి. రంగత్తరంగహస్త ములంజూపి తనగాంభీర్యము నెఱిఁగించుచు యమున ప్రవహిం చుచుండెను. వడివడిందిరుగుసుళ్ళ చేఁ జూచువారిగుండె లవియఁ జేయుచుండెను. పొంగిపొంగి ఫేనము నుమియుచు నే నదిగాని నాకు సాటిచేయువారుందురా యని తెల్పుచుండెను. వీనినన్నిం టినింగాంచి యాకాంతలు మఱింత భీతిగాంచిరి. అత్తఱి శ్రీహరి వాక్కులం దెల్పిరి. క్షణమాత్రమునఁ బ్రవాహము వారికి మంచి త్రోవఁ జూపెను. నిర్భయముగా దాఁటిరి. మరలివచ్చిన పుడు దాఁటు టెట్లను సందియము వారికిం గలుగకపోలేదు, కారణమేమన, వారి కట్టిమనశ్శక్తిలేదు. ఆమునిఁ బ్రశ్నించిరి. త్రికాలవేత్తకదా దుర్వాసుఁడు నిరాహారి యని చెప్పఁడనెను. వా రారీతిం బల్కిరి. యథాపూర్వముగా మార్గమిచ్చెను. ఇల్లు చేరినపిదప మెల్లగా శ్రీహరిం బ్రశ్నించిరి. వారలసందియములఁ దొలఁగించునద నదియె యని తలంచెను. చక్కనిమాటలతో వారిశంకలు తీర్చెను. ప్రత్యక్షప్రమాణమునుబట్టి యామాట లను నమ్మిరి. శ్రీకృష్ణుఁడు పరమాత్మయని వారు భావించిరి.

కావునఁ బరార్థము ప్రపంచవ్యవహారములఁ జొప్పడి నంతన వాఁడు సంగికాఁడని దీనినుండి తేలినది.కాని వేషధారు లందఱు వేదాంతులుగారు. ఎవ్వఁడు సర్వసముఁడో వాఁడు జ్ఞాని. ఎవనిచిత్తము సదా శ్రీపతిపాదారవిందసమాసక్తమో

వాఁడు భక్తుఁడు. ఆవిషయ మనుభవమును బట్టియే కనుఁగొనవలయునుగాని కపటోక్తులవలనఁగాదు. దుస్తరకార్యముపట్టున వారి తెలివి తేటపడును. కాంతాకనకములవిషయమున నాశఁ బూనకుండినఁగాని పరిశుద్ధాంతఃకరణుఁడు కాఁడు. శ్రీకృష్ణపరబ్రహ్మముతో సాటిపెట్టుకొనరాదు. భగవత్కృత్యములు వేఱు. మనుష్యకృత్యములు వేఱు. అఘటనాఘటనసమర్థుఁడు భగవంతుఁడు. మనుష్యమాత్రున కాశక్తి కలదా? పదాఱువేలమంది గోపికలగృహముల నొక్కసారి కనఁబడిన భగవంతునితోఁ దుచ్ఛతముఁ డొకఁడు సాటియన్న నమ్మఁజెల్లునా? కావున గురుభక్తిలేక దైవభక్తి కుదురదనియు, భక్తిలేక జ్ఞానము లభింపదనియు నీకథ బోధించెడిని. ఈదృష్టాంతమును గోపికలకుఁ దెల్పుట వారిమదులయందు భక్తి కుదురవలయుననియే కాని వేఱుకాదు. భగవంతుఁడు కాముకుఁ డనుతుచ్ఛులమాటల కిది వజ్రప్రహారము. భక్తిగలవారుకానిచో శ్రీహరిని "పరయాభక్త్యా"అన్నమాటల కర్థమేమి? భక్తి యనఁగాఁ గామాతురత యనియాయర్థము. ఆయర్థ మపార్థమేకదా? కావున గోపికావిహారమంతయు గురుశిష్యకృత్యములనే తెల్పుచున్నదికాని రతికేళీని దెల్పుసూచనలే కానరావు. కనుక భగవంతుని గోపికలు భక్తిభరమున నమ్మికొలిచినట్లు మీరును సదా సేవింపవలయును. మర్కటకిశోరన్యాయమున ననువర్తింపవలయును. కావున మీకిఁకఁ దర్వాతికథ నాలకింపుఁడు.

శ్రీరామావతారమున శ్రీపరమేశ్వరుని జగన్మోహనాకృ

తిని గాంచి మునులు కొంద ఱీదివ్యసుందరవిగ్రహమును స్త్రీరూపమెత్తి ఆకన్నులంగాంచిన నెట్లుండునో యని వాంఛించిరి. ఆయవతారమున నట్టియవకాశము వారికి దొరకలేదు. భావిశ్రీకృష్ణావతారమునఁ గలుగుఁగాక యను నశరీరిభాషణమును విని వారు ద్వాపరయుగమున గోపికలైరని ప్రతీతి కలదు. అది కేవలకల్పితముగాదని యీముందటికథ తెలుపుచున్నది

## ఋషిరూపగోపికాఖ్యానము.

* శ్రీకృష్ణభక్తిని వృద్ధినొందించు నీయాఖ్యానమును వినిపింపఁబూని నారదుఁ డిట్లుపల్కెను. వంగదేశమున మంగళుఁడనుగోపకుఁ డొకఁడుండెను. ఆతఁడు మహానుభావుఁడు. లక్ష్మీవంతుఁడు. విద్వాంసుఁడు. తొమ్మిదిలక్షులగోవులను బరిపాలించువాఁడు. అతనికిఁ బెక్కండ్రుపత్నులు గలరు. దైవకారణమున నొకప్పు డామంగళునిధనమంతయు వ్యయమయ్యెను. ఎట్లు వ్యయమయ్యెనో యెవ్వరు నెఱుఁగరు! గోవులఁ గొన్నింటిని దొంగలు హరించిరి. రాజు కొన్నింటిని బలవంతముగాఁ గైకొనియెను. ఇట్లు విధివశమున సర్వస్వముపోఁగా నామంగళుఁడు దుఃఖితుఁడయ్యెను. శ్రీరామచంద్రవరప్రభావమున దండకారణ్యమున నుండుఋషులు స్త్రీత్వము నొందవలసినవారై యీగోపకునకుఁ గొమరితలై జన్మించిరి. ఆతనూజాతల

* ఇయ్యది గర్గసంహితమాధుర్యఖండద్వితీయాధ్యాయమునుండి సంగృహీతమని యెఱుంగునది.

నెల్లం గాంచి మిగుల దుఃఖపరవశుండయ్యెను. ఆధివ్యాధిసమా కులుం డయ్యెను. దైన్య మాతనికిఁగల్గి బాధింపఁ జొచ్చెను. కావున నతఁ డొక్కపర్యాయము తనలోఁ దానిట్లు విచారపడ సాగెను. ఇంక నేనేమిచేయఁదగును ? ఎచ్చటికిం బోవుదును? నాయీదుఃఖమును దీర్చువా రెవ్వరు? ఇపుడు నాకు ధనబలము గాని, సంపద్బలముగాని, మిత్రబలముగాని, దేహబలముగాని లేదు. ద్రవ్యములేక యీపుత్రికల కెట్లు వివాహముచేయు దును? భోజనమునకే సంశయముకలుగుతఱి ద్రవ్యముమాట తలపెట్టనేటికి ? దైన్యము గలుగుతఱిఁ గాకతాలీయన్యాయా నుసారముగఁ గొమరితలు పుట్టిరి. వీరి నెట్టైన ధనబలములుగల రాజున కీకన్యకల నొసంగెద. కన్యాసుఖమును గోరుటయే. కదా తండ్రికివిధి. అని యాగోపాలకుఁడు విధివంచితుఁడు కాన నిట్టులాలోచించుచుండెను.

ఆతరుణముననే మధురానగర రాజపరిపాలిత దేశమునుండి యొకగోపాలకుఁ డచ్చటికి వచ్చెను. ఆతఁడు తీర్థయాత్రాపరా యణుఁడు. బుద్ధిమంతుఁడు వృద్ధుఁడునగు. వానిపేరు జయుఁడు. ఆజయగోపకుఁ డీమంగళగోపకునిం జూచి మాటలాడుచు నందగోపకునివైభవమును దెలిపెను. తత్సంపత్తును విని దైన్యు మునఁ దనకుమారికల నందరాజుచెంతకుఁ బంపెను. నందుఁడు వారి నాదరించి రత్నవిభూషణాలంకృతలనుగా నొనరించెను. వారెల్లగోమయమును సంగ్రహించుకార్య మొనరింప నియుక్త లైరి. జగన్మోహనాకారుఁడగు శ్రీకృష్ణునింగాంచి వారెల్ల

నతనివరించి తత్సిద్ధికై కాళిందిని సేవించుచుండిరి. ప్రతిదినము వారు నదికింబోయి పూజించుచుండిరి. ఒక్కనాఁడు కాళిందీనది స్త్రీరూపమునం దెను. శ్యామలాంగము, చారులోచనములు చెలువారుచుండ వారలకు దర్శనం బొసంగెను. వరమడిగిన నొసంగెదననియె. ఆకన్యక లాదరమున నోమహానదీ! మాకెల్ల వ్రజేశ్వరపుత్త్రుఁడు భర్తయగునట్లను గ్రహింపుమా యని ప్రార్థించిరి. అట్లేయగుఁగాక యని వరమొసఁగి యామహానది యందే యదృశ్యయయ్యెను. వారే బృందావనమునఁ గార్తికమాసమున రాసమండలమున భగవంతుని సేవింపఁగోరిరి. వారింగూడియే శ్రీహరి పూర్వమిచ్చినవరమును సార్థకముచేయ రాసమండలమున విహరించెను. ఆవిహారమే రాసక్రీడయనఁ బ్రఖ్యాతమయ్యెను.

భక్తులారా! ఈగాథ యత్యద్భుతము. పెద్దలమాటలు నిరాధారములుకావనియు, వానికి మూలములగుపురాణముల బరిశీలింపక కొందఱాక్షేపించుచుందురనియు మన మెఱుంగుట మంచిది. శ్రీరామచంద్రుని జగన్మోహనరూపమును గాంచి మహర్షులు తమరు స్త్రీజన్మమెత్తి యాకన్నులతోఁ గాంచిన నెట్లుండునో యని తలంచిరి. శ్రీరామచంద్రమూర్తి తావైకుంఠమునకు వేంచేయునపుడు రాఁబోవునవతారమున మీవాంఛితములు కొనసాగునని యాజ్ఞాపించెనని ప్రాచీనులు పల్కుట వినియున్నారము. ఈకథ శ్రీమద్రామాయణమునఁగలదా యన్నప్రశ్నమేల? పురాణాంతరములయందుఁగూడ శ్రీరామ

కథలు గొన్ని గలవు. వాని నప్రమాణములనుట కేవల మశక్త వాదము. సర్వపురాణములు ఈషద్భేదములుగఁ గథను దెల్పినను నీతియొక్కటియే. సమరసముచేసి యన్నింటిసారము గ్రహింపవలయునుగాని తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనునట్లు తాఁజదివినపురాణముమాత్రము ప్రమాణమనియుఁ దక్కినవి కావనియు వాదించుట మహాసాహసము. అది సులలితమార్గము కాదు. దాన మనస్సుఖము లేదు. భక్తిమార్గమునకది కడుదూరము.

తదా శ్రీరామస్యవరాద్దండకారణ్యవాసినః,
ఋషయస్త్రీత్వమాపన్నా బభూవుస్తస్య కన్యకాః. గర్గ.

అను నీవచనము ప్రాచీనులవచనమును సార్థకము చేయుచున్నయది. దండకారణ్యవాసులగుమునులు రామచంద్రుని వరమున స్త్రీత్వమును బొందినవారనఁగా భావమేమి? రామచంద్రుఁడు శపించిన స్త్రీత్వముగలుగునేకాని యనుగ్రహమున నలవడదుకదా? కాఁబట్టి వీరు దానిం గాంక్షించిరని జన్మాంతరమున నట్లగుఁగాక యని శ్రీరామమూర్తి వరమిచ్చెనని మనము గ్రహింపవలయును. దీనిచే భగవంతునిసౌందర్యము ఋషులకేని సమ్మోహజనక మని తాత్పర్యము గ్రహింపవలయును. ఏయే ఋషులుభగవంతుని నారాధించుటలో నెట్టి యారాధనమును వాంఛింతురో వారల కట్టి భాగ్యమును గరుణించును. భగవత్సహచరిత్వము ముక్తిహేతువు కాదని యెవ్వఁ డనఁగలఁడు? భగవద్దాస్యమునే భక్తులు ప్రాయశః కోరుచుందురు.

అక్లే దండకారణ్యవాసము చేయు నీఋషులు స్త్రీత్వమును గోరిరి. అదియు నొకభక్తిమార్గమే యని వా రూహించియుండవచ్చునని మన మూహించుటయే సమంచితము. ఆఋషులే గోవ్రజమున గోపికలై శ్రీకృష్ణునకు భార్యలైరన్నను దోషము కాదు.

ఈగోపికలు కాళింది నారాధించుట యేల? అనునదియు నొకప్రశ్నమే. జలము భగవత్స్వరూపము కావుననే సకలపాపహారము.

శ్రు. ఆపః పునంతు పృథివీం పృథివీ పూతా పునాతు మామ్,
పునంతు బ్రహ్మణస్పతి ర్బ్రహ్మపూతా పునాతుమాం,
యదుచ్ఛిష్టమభోజ్యం యద్వా దుశ్చరితం మమ,
సర్వం పునంతు మామాపోసతాంచ ప్రతిగ్రహగ్ స్వాహా.

అని శ్రుతి చెప్పుచున్నది. కాఁబట్టి సర్వాఘముల జలములు పోఁగొట్టును. అందును శ్రీకృష్ణపాదారవిందచిహ్నితమగు కాళిందీజలము పరమపావనము. తదధిదేవత కాళింది యనంబరఁగు. యమునానది ప్రత్యక్షమయ్యె ననఁగా యమునాన ద్యధిదేవత యని భావము. జలాధిదేవత యనఁగా భగవదపరస్వరూపిణి యని తాత్పర్యము. అనఁగాఁ బ్రకృతి యని సారతమార్థము. ఆమె నారాధించినచోఁ దత్కరుణకుం బాత్రులగుట కేమికొఱంత? అందును వారు కోరునది భగవంతుఁడు భర్తకాఁదగునని కదా? అది భగవతి కిష్టమే. కావుననే యట్లే యగుఁగాక యని యానదీరూపిణి యగుపరదేవత రాధాంబ

యాశీర్వదించెను. సకలరూపముల విలసిల్లునదియే ప్రకృతి. ఆమెయే భగవదిచ్ఛ యనంబడు. ఆమె కడ్డపడువార లెవ్వరు? కావుననే,

అనేకకోటిబ్రహ్మాండజననీ దివ్యవిగ్రహా.

అని ప్రఖ్యాతింగాంచెను. ఆమెనే వారాశ్రయించిరి. భగవత్సాక్షాత్కారము భగవతి నాశ్రయించిననే కలుగును. శ్రీకృష్ణపరమాత్మను సందర్శింపఁగోరువారు రాధాంబిక నాశ్రయించిననే శీఘ్రముగా నది సిద్ధించు. లేకున్న లేదనవచ్చును. కాఁబట్టి పావనమనీషులారా! ఈగాథ మహాపవిత్రము. సకలపాపనాశనక్షమమనుట కేశంకలు నుండవు. ఇఁకఁ బైకథను వ్రాసెదను. లేఖిని దానికై యువ్విళ్లూరుచున్న ట్లగపడియెడిని.

## మైథిలీగోపికోపాఖ్యానము.

* పరమపవిత్రమనఁదగు మైథిలీగోపికలయుపాఖ్యానమును వినుమనినారదుఁ డిట్లుచెప్పెను. శ్రీరామచంద్రునివర ప్రభావమున నందునిగృహములం దోమ్మండ్రుగురుగోపిక లుదయించిరి. నందనందనునిఁ గాంచి వా రత్యంతసమ్మోదము నొందుచుండిరి. వారు మార్గశీర్షమాస ముత్తమ మనువిశ్వాసమున నానెలయందుఁ గాత్యాయనీవ్రత మాచరించిరి. నియతలై షోడశోపచారములచేత నాదేవిని బూజించిరి. పూజార్థమొకమృత్తికావిగ్రహమును నిర్మించుకొనిరి. మృత్తిక భగవ

*ఇదియు గర్గసంహితమాధుర్యఖండతృతీయాధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదియే.

ప్రీతికిం బాత్రమైనవస్తువితతియం దుత్తమోత్తమము కదా? ఆగోపికలు యమునాజలంబుల నరుణోదయవేళయందు స్నానకృత్యమును జరపి కాత్యాయనిం బూజించుచుండిరి. అందఱును గలిసి భగవంతునిసద్గుణములఁ బాడుచు నిండ్లకుఁ బోవుచుండిరి.

ఒకానొకదినంబున నాగోపిక లరుణోదయకాలమున స్నానమొనరింప యమునానదికింబోయి. తమవస్త్రములఁ దటమున నునిచి జలంబులనడుమ నొకరిపైనొకరు దోసిళులజలములఁ జల్లుకొనుచు విహరించుచుండిరి. శ్రీకృష్ణమూర్తి వేకువనే లేచి యచటికింబోయి వారివలువలఁగైకొని త్వరగాఁ గదంబభూరుహమునెక్కి చోరునిచందమున మౌనమూనియుండెను. ఆగోపకన్యకలు తమవలువలటఁ గానరామికి విస్మయమందుచు నీపవృక్షముననున్న శ్రీహరింగాంచి లజ్జచే నవ్వుచు స్వామీ! మావలువలంగొని యిచ్చటకరుదెంచి మాకొసంగుము. అని ప్రార్థింపఁగా విని శ్రీకృష్ణమూర్తి గోపికలారా! ఇచ్చటకేవచ్చి మీమీవసనంబులఁ గైకొనుఁడు. లేకున్న నేనీయను. అని వృక్షమునుండియే పలికెను జలముల మునిఁగియుండియే యాగోపికలు శీతముచే వడఁకుచు నవ్వుచు శిరసులనువంచి నందనందనా! మనోహరగోపరత్నమా! గోపవంశముక్తామణీ! మహార్తిహరా! శ్రీశ్యామసుందరా! నీవాక్యముచొప్పున మేమెట్లు నీచెంతకు రాఁగలుగుదుము. వివస్త్రలముకదా. వనితలముకదా? విశేషించి నీపాదదాస్య మొనరించువారముకదా.

* గోపాంగనావస్త్రచోరుఁడవని, నవనీతహారకుఁడవని పేరు పొందఁగలవు లే. గోకులమున నతిరసికుఁడవై జనించితివి. నీకు భయమెక్కడిది? మావసనంబుల మాకిమ్ము. లేనిచో మధురాధినాయకునకుఁ జెప్పుదుము. ఇపుడు నీవొనరించుపని యన్యాయము. చేయఁదగినంతకంటె మిక్కిలి చేయుచున్న వాఁడవు.

అను గోపికాసల్లాపములు విని భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తి యిట్లు పలికెను. †గోపికలారా! సుందరమందహాసభాసమానవదనసరోజలారా! నిక్కముగ మీరు నాకు దాసికలేరైయెనచో నిట్లు పలుకుదురా? ఇప్పుడే యీకదంబవృక్షమూలముకడకు వచ్చి మీవస్త్రముల నిమ్మని ప్రార్థింపుఁడు. లేనిచో సమస్తవస్త్రములను గృహములకుఁ జేర్చెదను. కావున నావాక్యమురీతి నాలస్యముచేయక చేయుఁడు. అని పల్కఁగనే చేయునదిలేక సూర్యోదయమైన నందఅరుదెంచి చూతురని భీతిపొందుచుఁగా నాగోపికలు సలజ్జలై శీతంబునఁ దనువులు వడవడవడంకుచుండఁగాఁ దలలువంచుకొని యుచితరీతి నంగమునుగప్పుకొని

* గోపాంగనావసనముష్నవనీతహారీ జాతో వ్రజేఽతిరసికఃకిలనిర్భయోఽసి, వాసాంసి దేహినహి చేన్మధురాధి పాయవక్ష్యామహేఽనయమతీవ కృతంత్వయాత్ర. ౧౧. శ్లో. ఇదియేమూలము.

† దాస్యో మమైవ యది సుందరమందహాసా ఇత్థంతు వైత్య కిల చాత్రకదంబమూలే, నోచేత్సమస్తవసనాని నయామి గేహం స్తస్మా త్కదిమ్యథ మమైవ వచోఽవిలంబాత్. అనిమూలము.

కదంబతరుమూలము కడకుంబోయి శ్రీకృష్ణుఁ డొసంగినవస్త్రములఁ ధరించిరి. భగవన్మాయామోహితలై శ్రీకృష్ణునియందుఁ జూపులు పొలయ నందే నిలుచుండిరి. భగవంతుఁడు వారిపరమప్రేమలక్షణమగు నభిప్రాయము నెఱింగి మందస్మితముతోఁప వారినాదృతిం గాంచి యిట్లు పలికెను.

గోపికలారా! మీరెల్ల మార్గశీర్షమాసమునఁ గాత్యాయనీవ్రతము నాచరించితిరి. నాప్రీతిని బడయఁగోరియే యీవ్రతము నాచరించితిరి. అది సఫలంబగును. సంశయము లేదు. నేఁటికి మూఁడవదినమున బృందావనమునందు యమునాతీరమున మనోహరభూభాగమున మిమ్ముంగూడి పూర్ణమనోరథములనొసంగు రాసక్రీడ నాచరించెదను. అని పలుకుచు నంతర్హితుఁడయ్యెను. పరిపూర్ణప్రకాశుఁడగు చిన్మయాకారుఁడు కనఁబడకపోఁగా నాగోపికలందఱు సంపూర్ణానందమునందుచు మందహాససుందరవదనారవిందలై గృహములకుంబోయిరి.

మహామతులారా! మైథిలీగోపికాఖ్యానమును వింటిరి కదా! వీరు తొమ్మండ్రుగురు నందగోపకగృహముల నుదయించిరఁట. అనఁగా గోకులమున నుదయించిరని భావము. మిథిలానగరమున శ్రీరామచంద్రునింగాంచి సీతారూపము మనకున్న రామపత్నుల మగుదుముకదా యని కోరినస్త్రీలందఱు నీజన్మమున గోపికలై పుట్టిరని కొందఱర్థము చెప్పుదురు. సీతాంశజనితలని కొందఱర్థము చెప్పుదురు. రెండవయర్థము బాగున్నదని నాకుం దోఁచెడిని. వారెల్ల గోకులమునఁదిరుగు శ్రీకృ

ష్ణపరబ్రహ్మమును దిలకించి పరమేశ్వరునకు దాసికలము కావలయునను వాంఛ లమరఁ గాత్యాయని నారాధించిరఁట. గోపికావస్త్రాపహరణమునఁ గలకథయే యిది యని తోఁచెడిని. ఇంచుకభేదము కలదు. కాననే వ్రాసితిని. ఈగాథయందు నీతులు పెక్కులుగలవు. వాని వివరించెద. కాత్యాయనిం బూజింపనేల? అనున దొకప్రశ్నము. కాత్యాయని యాదిశక్తి. అనఁగాఁ బ్రకృతి యని భావము. రాధాదికాంతామణు లిసుకచే విగ్రహమును జేసినట్లున్నది. ఈగోపికలు తొమ్మండ్రుగురు మార్గశీర్షమాసమునఁ గాత్యాయనీవిగ్రహమును మృత్తికచేఁ జేసిరని యిందుఁ గన్పట్టెడు. ప్రభాతమునఁ గాళిందికింబోయి యాటవిధిప్రకారము స్నానమాచరించి యంబను బూజించి శ్రీకృష్ణమూర్తికృపాపాత్రల మగునట్లు వరమొసంగుమా యని ప్రార్థించుచు భగవంతునిగుణములఁ బాడుచు నిండ్లకుం బోవుచుండిరి.

వీరినియతి యెట్లున్నదో కనిపెట్టవలయునని శ్రీహరి నిశ్చయించుకొనెను. వారివస్త్రములఁగొని కదంబశాఖపైఁ గూరుచుండెను. వా రావిధ మెఱింగిరి. భగవానుఁడా! మావస్త్రములం గొనితెచ్చి మాకిమ్మని వేఁడిరి. అన శ్రీహరి మీరేవచ్చి కైకొనుండనెను. గోపికలాపలుకులు విని శ్యామసుందరా యని సంబోధించి వనితలమగు మేము వస్త్రవిహీనలమై యెట్లు రాఁగల్గుదు మనిరి. అంతతో నూరకుండిరా. లేదు. ఇంతకుముందే వెన్నదొంగ వనుపేరు నీకుం గలదు. దానికిందోడుగా గోపికావస్త్రచోరుఁడ వనుపేరు నీకుఁ గల్గునులే యనిరి. అనఁగా నెట్టి

వాఁడైనను "లోకాపవాదాద్భయమ్" అన్న నీతిప్రకారము జనులసడికి భయింపడవలయును అని హెచ్చరించిరి. నీకు భయ మెక్కడి దనిరి. లోకాతీతుఁడవుకదా నీవు. అట్టి నీకు లోకా పవాదభీతి యేల యని భావము. లోకాంతర్యాభతులకు లోకా పవాదభయముకాని సర్వలోకాధికునకుఁ దదపవాదభీతి యేటి కని గోపికలభావము. నీ వీయకున్న మధురాధినాథునకు విన్న వింతుమనిరి. నీవును మనుష్యరూపమున నున్నవాఁడవు. మను ష్యులయలవాటుల ననుసరింపఁదగు. కాన రాజునకుఁ దెల్పెద మనిరి. ఈమాటలువిని భగవంతుఁడు గోపికలారా! మీరు నాకు దాసికలేయైన నిట్లు పలుకుదురా యనియె. అనఁగా నర్థ మేమి? నాపాదసేవకులకు నావిషయమున లజ్జయుండునా యని ప్రశ్నించెను. ఈమాటయందే గంభీరార్థ మిమిడియున్నదని యె ఱుంగుఁడు. లజ్జాదులు వదలినఁగాని నాభక్తురాండ్రు కాఁజాల రని భావము. ద్వంద్వములనఁదగు మానావమానములయందు సమబుద్ధికుదురకున్న నదేటిభక్తి యని దీనిసారము. భగవంతుని కడ లజ్జఁబూనిన నది వదలుటెచ్చట! సర్వభావముల భగవంతునిఁ బ్రేమించుట భక్తునిలక్షణముకాని వేఱుకాదు. ఇప్పట్టున నొక కథ స్మృతికిం దగులుచున్నది.

ఒక్కనిర్భాగ్యుఁడు కొడుకును బిలుచుకొని గ్రామాం తరమునకుం బోవుచుండెను. త్రోవలో నొకపాడువడినదేవా లయ మగపడియెను. అందుఁ బెద్దదగువినాయకవిగ్రహము చక్షుర్గోచరమయ్యెను. దరిద్రదేవత తొలఁగిపోవుఁగాక యను

వాంఛతో భక్తిభావము నభినయించి మ్రొక్కి స్వామీ నాకుం గొలది కేదారము (వరిపండుభూమి) కలదు. దానిలోం బండువడ్లు నైలకుంగూడం జాలవు. ఆభూమిలో నీసంవత్సరము నూఱుపుట్లధాన్యముపండిన నీకొక్కపూటం బరమాన్నము పెద్దవాండవు భక్షింపంగలిగినంత తెచ్చిపెట్టెద. అని ప్రార్థించెను. ప్రక్కనునిలుచున్న కొడుకు నాయనా అంతపెట్టనేల? అనియడిగెను. ప్రక్కకుందిరిగి దేవునకుం జాటుగాం దనచేయి నునిచి అబ్బాయీ! నేనంతవెఱ్ఱివాండనా? నూఱుపుట్లుపండినతర్వాత నేదో యింత తెచ్చిపెట్టెదను. వీలులేకున్న మనయింటినుండియే చేయిచూపెదను. భయపడకుమా యని చెప్పి మరల వినాయకుని గాంచి మ్రొక్కెను. భగవంతుండు సర్వవ్యాపకుండు. వినాయకప్రతిమనుండి నవ్వి నేను నూఱుపుట్లుపండునట్లుచేయుట పరమాన్నముపెట్టుట రెండును హుళక్కియే. పద యని పలికెను. అంత నాతండు నోరుమూసికొని కొడుకుం దోడుకొనిపోయెనంట.

ఈకథ యథార్థముగా సాగియుండినను లేకున్నను భగవంతునికడ వంచనముసేయుట కీడని తెల్పును. పలికించువాండవు భగవంతుండనుజ్ఞానము లేక మూఢుండై యొరులెఱుంగరని దాంచిపెట్టిన హృదయకమలాంతర్వర్తియగు సర్వేశ్వరుం డెఱుంగకపోవునా? కాంబట్టి లజ్జాదులు ప్రపంచాతీతుండగు పరమేశ్వరునియందు దునుపరాదు. ఈబుద్ధిని దెల్పుటకే శ్రీకృష్ణుండు మీరు నాకు దాసికలైనచో నిక్కమగు ననురాగము నాయందు మీకున్నచో నాచెంతకురండని పిలిచెను. దీనిచే శ్రీకృష్ణుండు

జారుఁడని చెప్పుటకంటె వెఱ్ఱితనము వేఱొకటియుండునా. ఆల సింపక రండని హెచ్చరించెను. ఇది మనుష్యజన్మము. ఒక్కక్షణ మైన నాలసింపరాదు. పైక్షణము నాది యని తలంపరాదు. కావునఁ ద్వరగావచ్చి వలువలు గ్రహింపుఁడీ యని విజ్ఞానమును గలిగించెను. మీ రిప్పటికైన నాచెంతకువచ్చి వస్త్రముల గ్రహింపక యున్న వీని నింటకింగొనిపోయెద నని బెదరించెను.

ఆర్యులారా! మఱియు నిందంతరార్థము వేఱొండు గలదు. వస్త్రములనఁగా నాచ్ఛాదించునవి యని లోకులు భావింతురుకదా. అవి అజ్ఞానస్థానీయములు. అనఁగా నజ్ఞానమని భావము. వస్త్రము దేహము నాచ్ఛాదించులాగున దేహాంతర్గత పరమాత్మను దెలిసికొనఁజాలకుండ నజ్ఞాన మాచ్ఛాదించియుండును. దానిం దొలఁగించుకొను నుపాయ మారసినంగాని యది తొలఁగదు. అది తొలఁగినఁగాని నిర్మలజ్ఞానము కలుగదు. అది కలిగినఁగాని భగవత్సాక్షాత్కారముకాదు. కావున భగవత్సాక్షాత్కారప్రతిబంధక మజ్ఞాన మనుట నిర్వివాదాంశము. నేను భగవంతుఁడను. ఇందుఁ గూరుచుండి మీకు వాంఛితముల నీయఁగోరియున్నవాఁడను. అజ్ఞానమునువదలి యనఁగా దేహాభిమానమును వీడఁబుచ్చిరండు. అదియుండినదాఁక మీకు నాదర్శనము కాదు. కాంక్షలు ఫలింపవు. ఈస్వల్పదేహాభిమానమే వదలకున్న నాపాదసేవ కర్పూరాండ్రగుట కల్ల. నాపాద సేవ మహర్షులకుంగూడ దుర్లభము అదియే ముక్తిప్రదము. ఆలసింపకుఁడు. త్వరగ రావలయు. లేకున్న నే నిటనుండనని

శ్రీహరి స్పష్టముగాఁ దెలిపెను. దిగంబరులు సాధారణముగా నవధూతలని పిల్వఁబడుదురు. ఈవిషయము శుకయోగివర్తనమునుండి తెలియందగు.

'...మాయ నంగీకరించినభంగి వసనంబుఁ గట్టక వచ్చువాఁడు' అని యున్నదికదా. వస్త్రధారణము దేహాభిమానమును దెలుపును. ఇట్టి భగవదభిప్రాయమును మాటుపఱచి శ్రీకృష్ణుఁడు జారుఁడని చోరుఁడని నిందించుట పాపహేతువుగాక మఱే మిటి! వృథా భగవంతుని దూషించిన ఫలమేమి? ఇట్టి యసంగతప్రసంగములు చేయక భగవదభిప్రాయములు తెలియ శక్యములుకానివని, వానిం దెలిసికొనుజ్ఞానమేనాఁ గలవదునో కదా యని చింతించుచు, నట్టిజ్ఞాన మలవడఁ దగుకృత్యములు చేయుచుఁ బెద్దల నడిగి తెలిసికొనుచు నుండవలయునేకాని వ్యర్థజన్మమేల మనుష్యజన్మము రావలయునని పట్టుదలఁ బూనరాదు. ఇంతకంటె నట్టిమహనీయులకు విశేషించి వెంచి వ్రాయుట సమంచితముకాదని విరమించెదను. తరువాతికథ నాలకింపుఁడు.

## కోసలగోపికాచరిత్రము.

* శ్రీరామభద్రునివరప్రభావమునఁ గోసలగోపికలుపనందగృహములయందు జన్మించిరి. గోకులమునందే పుట్టఁగోరియుండిరి. శ్రీకృష్ణావతారమున వారి కావ్రజమునందే యుపనందగృహములయందు జననము సంభవించినది. గోపికలు

---

* ఇక్కడికథయు గర్గసంహిత, మాధుర్యఖండచతుర్థాధ్యాయమునుండి వ్రాయఁబడునని తెలియఁదగును.

వారిం బెండ్లియాడిరి. రత్నభూషణభూషితాంగములం బొలు పారుచు నిండుచందురుని ధిక్కరించుమోములువెలయ నవ యౌవనము మురువుచూపం బద్మినీజాతికిం దగుగుణములచే సంపూర్ణులై గతివిశేషముల నంచల వంచించుచు నయనపద్మము లచే సరోరుహముల డిందుపఱచుచు నుండిరి. వారెల్ల నంద నందనుం డనంబడుముకుందుని చరణారవిందముల డెందములు తగుల మిగులదృఢమగుప్రీతిం బాటించిరి. జారధర్మము నదిపోలియుండెను. అనంగా గాఢముగనుండెనని భావము. ఆప్రీతి లోకాతీతము. ఇంతియగాక మహాత్ముండనియు సుందరాకారుం డనియు శ్రీకృష్ణుని వారు భావించిరి.

మాధవుండును వారిభావము నెఱింగెను. కాన గోకుల మున వీథులలోం దిరుగునపుడు వారగపడం బరిహాసము లాడు చుండెను. చిఱునవ్వులచేతను, పీతవస్త్రాదానములచేతను వారికిం దనప్రీతి నెఱింగించెను. వారెల్ల దధివిక్రయార్థ మరు గుచు శ్రీకృష్ణా శ్రీకృష్ణా యని పిలుచుచు శ్రీకృష్ణునియందే ప్రీతిగలిగి కుంజపుంజములం దొంగి చూచుచుండిరి. * ఆకా శమునందు, వాయువునందు, నగ్నియందును, జలమునందును, భూమియందును, జ్యోతిస్సునందును, దిక్కులందును, వృక్ష ములయందును, జనబృందమునందును, వారికన్నులు శ్రీకృష్ణునే

* ఖేవాయావాగ్ని జలయోర్మహ్యాంజ్యోతి ర్దిశాసుచ, ద్రుమేషు జన బృందేషు తాసాం కృష్ణోహిలక్ష్యతే. ప్రేమలక్షణసంయుక్తాః శ్రీకృష్ణహృత మానసాః, అష్టాభిస్సాత్వికైర్భావై స్సంపన్నాస్తాశ్చయోషితః. అనిమూలము.

చూచుచుండెను. ప్రేమలక్షణములు వారికి సంపూర్ణముగాఁ గలవు. వారిమనసులు శ్రీకృష్ణహృతము. * సాత్త్వికభావము లెనిమిదియు వారియందుఁ గన్పట్టుచుండును. ప్రేమాతిశయమునఁ బరమహంసలమార్గము వారెల్ల నొందిరి. కృష్ణానందమున గోకులమున వీథులయందు వారు పరుగెత్తసాగిరి. జడము నజడమును వారెఱుంగకయుండిరి అప్పటివారిస్థితి. జడోన్మత్తపిశాచముల స్థితిని బోలియుండెను. మాటలాడుచున్న నూరకున్నను శ్రీకృష్ణధ్యానమే కలిగి లజ్జలవదలి దుఃఖములం బాసి వారెల్లఁ గృతార్థత నొందిరి. తుదకుఁ దన్మయత్వము నొందిరి. ఒకానొకప్పుడు బలవంతముగా నిలిపి శ్రీకృష్ణముఖారవిందమును ముద్దిడుకొనిరి.

ఓరాజా ! †ఆగోపికల తపోమహత్త్వము నేమని వర్ణింతును ? సంపూర్ణపరబ్రహ్మమగు శ్రీవాసుదేవునియందు వారి హృదయములు సంలగ్నము లయ్యెను. వారిప్రీతి భగవంతునియం దవిచ్ఛిన్నముగ నుండెను. ఇంద్రియములు తత్సేవాకార్యనిరతము లయ్యెను. లోకవ్యవహారమును వారు వదలిరి. ఆ గోపికలు ప్రేమరసపరిపూర్ణస్వాంతలై శ్రీకృష్ణు నంసభాగమునఁ దమబాహువుల నునిచి రాసరంగమున నానందించిరి. శ్రీకృష్ణు

---

* స్తంభస్స్వేదోఽథరోమాంచ స్స్వరభంగోఽథ వేపథుః, వైవర్ణ్యమశ్రుప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాస్స్మృతాః. సాహిత్యదర్పణము. తృతీయ పరిచ్ఛేదము ౧౪౯శ్లో. †తాసాం తపః కిం కథయామి రాజన్ పూర్ణే పరబ్రహ్మణివాసుదేవే, యాశ్చక్రిరే ప్రేమహృదింద్రియాద్యై ర్విసృజ్య లోకవ్యవహార మార్గమ్. అనిమూలము.

నివశమున నుండిరి. ఆతపస్సు చాలునని తృప్తినొందిరి. ఆది శేషుఁడుకూడ నాతపోమహత్వమును గొనియాడఁజాలఁడు. * యోగముచేతను, సాంఖ్యముచేతను, శుభతమకర్మయోగముచేతను, న్యాయవైశేషికాదితత్త్వములచేతను భగవంతు నారాధించి యేపదమును సాధువులు పొందుదురో ఆపదమునే (శ్రీకృష్ణపాదారవిందద్వంద్వమునే) కేవలభక్తిభావమున విదేహరాజు పొందెను. శ్రీహరి భక్తిభావముచేతనే వశ్యుఁడగును. ఆదిదేవుఁడగు నాపరమపురుషుఁడు భక్తిభావమున నాగోపికలకు వశుఁడయ్యెను. భక్తిమార్గ మత్యుత్తమము ననపాయము ననుటకు వేఱుదృష్టాంతము లేల ? ఈగోపికలే దృష్టాంతము. వారు సాంఖ్యయోగముల ప్రకార మాకృష్ణు నారాధింపలేదు. కేవలప్రేమముచేతనే సేవించిరి. భగవత్కరుణకుం బాత్రులైరి. తత్ప్రీకృతినే పొందిరి.

భక్తులారా ! ఈకౌసలగోపికలయుపాఖ్యానమును జదివితిరికదా. ఇంతకుముందు వ్రాసినవిశేషములే యిందును గలవు. కాని మరల నీయుపాఖ్యానమునుండి యొక్కవార్తఁ దెలుపవలయును. భగవదారాధనపద్ధతు లనేకములు. అందుఁ బరమప్రేమరూపమగు భక్తిమార్గము నిరుపమానము అనువిషయము స్పష్టపఱుపఁబడినది. ఈగోపికలు గోకులమున జనించి

---

* యోగేన సాంఖ్యేన శుభేన కర్మణా న్యాయాదివైశేషిక తత్త్వవిత్తమైః, యత్ప్రాప్యతే తచ్చ పదం విదేహరాట్సంప్రాప్య లే కేవలభక్తిభావతః. అనిమూలము.

వివాహముచేసికొనిరి. పరభార్యలగుదురు. అట్టివారు భగవంతునితోఁ గలిసియుండుట న్యాయవిరుద్ధము కాదా యని కొందఱడుగవచ్చును. ఆ ప్రశ్నమునకు సమాధాన మిదియే.

పరస్త్రీసంభాషణము మహాత్తరపాపమూల మనువిధి సామాన్యమనుజులకే కాని భగవంతునకుఁ గాదు. భగవంతునకుంగూడ గలదనువారితో సంభాషణమే వలదు. రాసవిహార మన నేదియో యోజింపుఁడు. భక్తియోగాతిశయమున వారు లోకవ్యవహారమార్గమును వదలి రనఁగా లోకాతీతలయిరని తాత్పర్యము. అనఁగా భగవత్పాదారవిందముల డెందమును నర్పించిరని సారము. ఇదియే తపస్సు. ఇదియే సత్కర్మానుష్ఠానము. ఇదియే కోర్కులపంట. దీనినిమించినది వేఱొకటి కానరాదు. సకల విధములగు నారాధనమార్గములు భగవత్కృపఁబడయుటకేకదా. ప్రేమరూపారాధనమున నీగోపిక లద్దానిం బడసిరి. ఇంతేమాత్రమేని వారు జారిణులని వచింప నవకాశముకలదా? శ్రీకృష్ణునిం బరిపూర్ణతత్త్వమని వారు భావించిరి. పూర్వపుణ్యములఫలము నీజన్మమునఁ గాంచిరి. భగవంతునితో రాసమండలమున విహరించిరి. ఆనందాబ్ధి నోలలాడిరి. భక్తిభావమును నదే యని యన్నితావులను గన్పట్టెడిని ఒక్కయతురమైనను గోపికలు కామాతురత శ్రీకృష్ణునింగూడి సుఖించిరని చెప్ప లేదు. ఇట్టిపట్టున గరళకంఠులు కొందఱు వీరిచరిత్రమునుబట్టియే హరి జారుఁడందురు. కారణము వారిబుద్ధివికారమే గాని వేఱుగాదు. వారిభావ మారీతి ననుసరించినది. దానికి మన

మేమిచేయఁగలము? వారిమతి మార్పునొంది భగవదారాధనమునఁ బ్రవహించుఁగాక యని కోరుటయే కృత్యముగాని వేఱేదియుఁ గానరాదు.

కోసలదేశవాసులలోఁ బరిపక్వజీవులే శ్రీరామచంద్రు నారాదించిరి. శ్రీరామునకు వారియం దెక్కుడుమక్కువ. ఏల యన వారు తల్లివంకవారుకదా. కావుననే యీఘట్టమున నెక్కుడుభక్తి వర్ణింపఁబడినది. అట్టివారికిఁ దరణోపాయమును భగవంతుఁడు చూపకపోఁడని మన మూహించుట పొరపాటు గాదు.

శ్లో. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. ౨
యేత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్. ౩
సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితేరతాః. ౪
యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్. ౭
మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. ౮

భగవద్గీత. భక్తియోగము.

అను నీగీతోక్తులు భక్తిని నిరుపమమార్గముగాఁ దెలుపుచున్నవి. కావున భగవంతునివిషయమున లజ్జాదులవదలి సర్వసమర్పణము గావించుటయే భద్రదంబగుమార్గము. వేతొకత్రోవ నిరపాయ మిట్టిది కానరాదని యెఱుంగుట బుద్ధిమల్లక్షణము. కావున భక్తజనులారా! అనన్యచేతసముల శ్రీ కృష్ణపరమాత్మ నారాధింపుఁడు. కర్మము లొనరించునపుడు ఫలములఁ గోరకుఁడు. ఆకర్మఫలములే మనలఁ బలుత్రిప్పులం బెట్టును. విధివిహితకర్మముల నొనరించి భగవత్సమర్పణము చేయుట మనవిధి. మనల రక్షించుట భగవంతునివిధి. ఈ రెండును సర్వమతసమ్మతసిద్ధాంతములు. వీనిని నిరంతరము చింతింపుఁడు. అవకాశము నుండినపుడెల్ల నీసిద్ధాంతముల నాచరణమునకుం దేఁ బ్రయత్నింపుఁడు. భగవంతుఁడు సర్వదేవతాస్వరూపుఁడు. ఏ రూపమున నేనామమున ధ్యానించిన నా పరమేశ్వరు నది చెందును. దేవతాంతరదూషణమే దీనిం బాడుచేయునది. దానిం బాటింపకుఁడు. ఇఁకఁ దరువాతిచరిత్రము నాలకింప నవహితులరు గండు.

## అయోధ్యానివాసిగోపికాచరిత్రము.

* బహుళాశ్వమహారాజా! సింధుదేశములందుఁ జంపకయనునగరము కలదు. తత్పరిపాలకుఁడు విమలుఁడను రాజుండెను. ఆతఁడు ధర్మపరాయణుండు. కుబేరుని ధనమునఁ గేలిసేయుం

* ఈ చరిత్రము గర్గసంహిత మాధుర్యఖండము పంచమషష్ఠాధ్యాయములనుండి గ్రహింపఁబడినది.

వాఁడు. మృగరాజువలె మనస్వియునగు. విశేషించి విష్ణుభక్తుఁడు. కనుకనే ప్రశాంతాత్ముఁడు. ప్రహ్లాదునింబోలి వెలయువాఁడు. సాధారణముగా జను లీభూతలంబున నీ రూపమునఁ బ్రహ్లాదుఁడే యవతరించెనని చెప్పుచుందురు. ఆ రాజున కఱువదివేలుభార్యలు గలరు. రూపసుగుణసంపదలు వారి కలరారు. కాని వారెల్ల వంధ్యలైరి. ఏ పుణ్యకర్మ యాచరించిన సంతానము గలుగునా యనుచింత వారికెల్లం గలిగెను. రాజునకుం గూడ నీచింతయే కలిగెను. ఇట్లు చింతించుచుండఁగాఁ బెక్కువత్సరములు గడచెను.

ఒకానొకదినమున యాజ్ఞవల్క్యమహాముని యారాజుంజూడ నరుదెంచెను. రాజా మునివరు నారాధనములనలరించి యాతని కెదురుగ నిలుచుండెను. ఆమునియుఁ జింతాకులుఁడగు నారాజుంజూచి సర్వజ్ఞుండగుట నట్టె యాలోచించి యిట్లు పలికెను. రాజా ! నీమేను కృశించినదేల ? నీమది నేమి చింతగలదు ? సప్తాంగములయందుఁ జక్కనిపద్ధతి గలదనుటగాన వచ్చెడిని. అని ప్రశ్నింప, విమలుఁ డిట్లు పలికెను. బ్రహ్మమునిపుంగవా! తపోదృష్టిచే సర్వమెఱుంగు మీ రెఱుంగని దేమియుండును ? ఐనను దమవాక్యగౌరవమును బట్టి నేఁ దెలిపెదను. సంతానహీనుఁడ ననుదుఃఖము నన్ను వ్యాపించినది. ఏమిచేయుదును ? ఏతపస్సున నది లభించునో యాపద్ధతి నను గ్రహింపుము. అనుపలుకులు విని యాజ్ఞవల్క్యమహాముని ధ్యానస్తిమితలోచనుఁడై భూతభవ్యముల విచారించుచుఁ

జాలసేపుండెను. ఇంచుక స్మృతినొంది యిట్లు పలికెను. రాజా! ఈజన్మమున నీకు గొడుకు కలుగనేరఁడు. అది నిశ్చితము. ఎందఱఁ గోరుదువో యందఱు కన్యకలు గలుగుదురు. అని ముని యూరకుండెను.

రా జిట్లు విన్నవించెను. పుత్త్రుఁడు లేక ఋణవిముక్తి కాదని వినఁబడియెడిని. అపుత్త్రునిగృహము వ్యర్థము. ఇహాముత్రసుఖ మాతనికిం గలుగదు. అనుడు యాజ్ఞవల్క్యముని రాజా! ఖేదమునకు మదిఁ జోటీయకుము. నీ పుత్త్రికలను, శ్రీకృష్ణుఁ డవతరింపఁగలఁడు గాన, నా పరమేశ్వరున కొసంగుము. సర్వస్వము సమర్పింపుము. ఆసత్కార్యము చేతనే దేవర్షిపితౄణములు తొలఁగును. ముక్తుఁడవగుదువు. అనిపలికిన నారాజత్యంతహృష్టుఁడయ్యెను. కాని యించుక సంశయముతోఁ బనిట్లు మరలఁ బ్రశ్నించెను. మునీంద్రా! ఏదేశమున నేకులమున శ్రీహరి యవతరించును? ఎట్టిరూపము భగవంతునకుఁ గల్గును? వర్ణమెట్టిది? ఎన్నిసంవత్సరములు గడువ నవతరించును? అన విని ముని యిట్లు బదులుచెప్పెను. ఇది ద్వాపర యుగముకదా. ఈ యుగము నూటపదునేనువర్షములు మిగిలియుండఁగా యదుకులమున మధురానగరమున భాద్రపదకృష్ణాష్టమీ బుధవారమున రోహిణీనక్షత్రమున హర్షణయోగమున వృషభలగ్నమున బవకరణమున నర్ధరాత్రసమయంబున నంధకారావృతమగుకాలంబున శౌరిమందిరమందు దేవకీదేవియందు శ్రీహరి సాక్షాత్కరించును. యజ్ఞంబునం దరణియందు హుత

వహాలఁ డుదయించినట్లులావిర్భవించును. ఆ కుమారుఁడు శ్రీవ త్సాంకమున నలరుచు, ఘనశ్యామవర్ణంబునఁ దేజరిల్లుచు, వన మాలావిరాజితుఁడై సౌందర్యరాశియై పీతాంబరధరుఁడై పద్మ నేత్రములనొప్పి చతుర్భుజములు కనంబడ నుదయించును. ఆ శ్రీహరికి నీ తనయల నొసంగుము. నీకంతదనుక నాయు స్సుండును. అనిపలికి యాజ్ఞవల్క్యముని యరిగెను.

ఆ మునిమాటలకు మహానందమంది చంపకాధిపతి యగు విమలుఁడు తనకుం గ్రమంబునఁ గలిగిన పుత్రికలను గాంచి హర్షించుచుండెను. వారెల్ల నయోధ్యాపురమున వసించి శ్రీరామచంద్రవరప్రభావమునఁ దనకుఁగల్గినవారనియెంతింగెను. గాన నుపాంగుచుండెను. వారెల్ల వివాహయోగ్యవయః పూర్ణలుకాఁగా యాజ్ఞవల్క్యవాక్యమును స్మరించుచుదూతను బిలువంబంపి యిట్లు పలికెను. నీవు మధురానగరమునకుం బోయి శౌరిగృహమును జూడుము. అందు వసుదేవునకు సుందరాం గుఁడు తనయుఁడుగలిగెనాయని విచారింపుము. ఆ కొడుకు ఘనశ్యాముఁడు. శ్రీవత్సాంకుఁడు. వనమాలియుఁ జతుర్భుజుఁ డునయి యుండుట తెలిసికొనుము. ఇట్లుండెనేని ఆ తనయు నకు నా పుత్రికల నీయ నెంచితిని. అని యాజ్ఞాపింప నాదూత రాజశాసనమునంది మధురానగరమున కరిగి మధురానగరవాసు లగుమహాజనుల నావృత్తాంత మడిగెను. ఆ ప్రశ్నము నాల కించి బుద్ధిసంపన్నులయ్యును గంసభీతులై యపుడు బదులుపలు కక రహస్యముగా నా దూతను బిలిచి వసుదేవునితనయుఁ

చెక్కండ్రఁ గంసుఁడువధించెను.ఒక్కకన్యక మిగిలినది. ఆమెయు నాకాశమున కేగెను. వసుదేవుఁ డిందే యున్నవాఁడు. పుత్ర హీనుఁడు. దీనమానసుఁడునై యున్నవాఁడు. ఇదియు వచింపరాదు. కంసభీతి నగరమునఁ గలదు. ఈ మధురానగరమున శౌరి సంతానవార్త యెవఁడువచించునో వానిని గంసుఁడు దండించును. వసుదేవునెనిమిదవకుమారుఁ డీ కంసునకు శత్రువఁట.

అనిమహాజనులు పలుక నాదూత చంపకానగరమున కరిగి విమలభూజాని కావృత్తాంతమును విన్నవించెను. రాజేంద్రా! మధురానగరమున శౌరి గలఁడు అనపత్యుఁడు. దీనుఁడై యున్నవాఁడు. ఆతని కింతకుముందుఁ గల్గినతనయులఁ గంసమహీపతి వధించెనని వినఁబడియెడిని. ఒక్కకూఁతురు గలిగెనఁట గాని యామె కంసహస్తముక్తయై యంబరమున కేగెనఁట. ఈ వార్తల సంగ్రహించి మెలమెల్లన వచ్చితిని మార్గమున బృందావనమును గాంచితి. ఆ వనము యమునాతటమునఁ గలదు ఆవనమున లతామండపమున నాకస్మికముగా నొకశిశువు నాకంటఁ బడియెను. నీవు చెప్పినలక్షణములుగల యా శిశువు గోపికలు గోపకులు తన్నుంబరివేష్టింప నుండెను. భవదుక్తలక్షణము లాకుమారునియందుఁ గలవు. కాని ద్విభుజుఁడు. గోపకుమారుఁడు. ఇవి రెండుమాత్రమే నీ చెప్పినలక్షణములకు విరుద్ధములు. చతుర్భుజుఁడు. వసుదేవకుమారుఁడు హరియనుపేరఁ బరఁగునని నీవు చెప్పితివి. మునివాక్యము మృషగాదు. ఇపు డేమిచేయఁదగునో యూహింపుమా. ఎందెందుఁ దిరుగుచున్న నందందుం దిరిగెదను.

అని దూత తెలుపఁగా మునివచన మేలతప్పెనోయని చింతించుచు రాజుండుతటేఁ గరిపురమునుండి సింధుదేశముల జయింపఁ బోయి భీష్ముఁ డచటికే తెంచెను. యథావిధి విమల్భుం డాతనిం బూజించి బహువిధధనదానముల నాతనిం బ్రీతునిం జేసి భీష్ముఁడు ధర్మవేత్తలలోఁ బ్రథముఁడుగాన నిట్లు ప్రశ్నిం చెను. యాజ్ఞవల్క్యముని మున్ను నాతో మధురాపురమున శ్రీహరి దేవకీవసుదేవులకుఁ దనయుఁడై పుట్టఁగలఁడనియు నిందుల కేసందియములు లేవనియుం జెప్పెను. ఇపుడు విచా రింప వసుదేవునకుఁ గుమారుఁడై శ్రీహరి పుట్టలేదని వినఁబడి యెను. ఋషివాక్యము మృష గాఁగూడదుకదా. ఇఁక నాక న్యకల నెవరి కిత్తును ? నీవు పరమభాగవతోత్తముఁడు. త్రికా లజ్ఞుఁడవు. జితేంద్రియుఁడవు. మహావీరుఁడవు. ధనుర్ధరులలో మేటివి. కావున నీవిషయమును దెలుపుమాయని వేఁడుకొని యెను. ఆమాటలువిని గాంగేయుఁడు దివ్యజ్ఞానము గలవాఁ డును, ధర్మతత్వజ్ఞుఁడు శ్రీకృష్ణప్రభావము నెఱింగినవాఁడును గాన నిట్లుపలికెను. రాజా! ఈవృత్తాంత మతిరహస్యము. వేద వ్యాసముని నాకెఱింగించెను. ఆకథ సర్వపాపహరము. ప్రీతిని వృద్ధిచేయును. దేవతల రక్షించుకొఱకు దానవుల సంహారము చేయుకొఱకు వసుదేవునింట శ్రీహరి యర్ధరాత్రమున నావిర్భ వించెను. వసుదేవుఁడు కంసభయమున నాశిశువుం గొని గోకు లమున నునిచెను. ఆశిశువే యశోదానందులకుఁ దనయుఁడు. వారికన్యకయగుమాయను గైకొని మధురానగరమును జేరెను.

ఆబాలకుఁడు గోకులమునఁ బెరుగుచున్నవాఁడు. ఎవ్వరికిం దెలియఁబడకుండ రక్షింపఁబడు చున్నవాఁడు ఆబాలకుఁ డిపుడు బృందావనమున గోపాలవేషధారియై పదునొకండు వర్షములు గూఢనివాసము చేయుచున్నవాఁడు. దానవుఁడగు కంసుని వధించినపిదపఁ దనమహిమమును బ్రకటించును. అయోధ్యానగరమున వసించి శ్రీరామచంద్రవరమున నెవ్వరెవ్వరు నీకుఁ దనయలుగాఁ బుట్టిరో వారెల్ల గూఢముగాఁ బెరుగుచున్నయా శ్రీకృష్ణునకు భార్యలు కాఁగలరు. వారి నొసంగి కృతకృత్యుఁడవు కమ్ము. ఆలసింపకుము. దేహము కాలవశంగతము కదా ! అనిపలికి భీష్ముఁడు హస్తినానగరమునకుం బోయెను. భీష్మగమనానంతరము విమలభూకాంతుఁడు నందసూనునికడకు దూతను బంపెను.

## వివాహప్రయత్నము.

* విమలానుమతిచే దూత మధురాదేశమునకుఁ బోయి బృందావనమున నందందుఁ దిరుగుచు శ్రీకృష్ణుని దర్శించెను. ఒక్కతఱి నేకాంతమున శ్రీకృష్ణునితోఁ గరయుగములు మోడ్చి మెల్లమెల్లగా నిట్లనియెను. శ్రీకృష్ణా ! నీవు పరమాత్మవు పరబ్రహ్మమనియు నీకుఁ బేరు గలదు. పరేశుఁడవు. పరులు నిన్నుఁ గానఁ జాలరు. పరిపూర్ణరూపుఁడవు. అనేకజన్మసుకృతములమహిమమున సజ్జనులకే యగపడుదువు. అట్టినీకు నమస్కారము.

* ఈ కథయుం గర్గసంహిత మాధుర్యఖండసప్తమాధ్యాయమునుండి సంగృహీతము.

అజుఁడవయ్యు గోవిప్రదేవశ్రుతిసాధుధర్మసంరక్షణార్థముయదు వంశమున నవతరించితివి. కంసాదుల వధించుటకే నీవీయవతార మంగీకరించితివి. అనంతగుణసాగరుండవు. ఇట్టినీకుఁ బ్రణా మములు. ఓహో! వ్రజవాసులసుకృత మేమని వర్ణింతును? నందుఁడు ధన్యుఁడు. పరమపురుషుఁడ వగునీవు తనయుఁడవై తివి. గోకులము ధన్యము. ఈయరణ్యము ధన్యతమము. సాక్షా త్కరించి పరమేశ్వరుఁడవగునీవు సంచరించు చున్నవాఁడవు కదా? ఏరూపము రాధికాసుందరకంఠరత్నమో మఱియు గోపి కాజీవనమూలరూపమో ఆరూపము నానేత్రములను సఫలము లగునట్లొనరించెను. ఇంతకన్న నా కదృష్టము వేఱేమియుం డును? నేను ధన్యుఁడను. గోపకులనడుమ గోపబాలకవేషమున గూఢముగ నున్నవాఁడవు. కస్తూరి కనఁబడకున్నను దానిపరి మళము వ్యాపించునట్లు నీమహిమము ప్రసిద్ధమయినది. నీకీర్తి శీతాంశుజ్యోత్స్న ముల్లోకముల వ్యాపించి పరిశుద్ధములు గాఁ జేయుచున్నది. జనచైతన్యభావమును నీవే యెఱుఁగుదువు. క్షేత్రజ్ఞుఁ డనఁబడుదువు. దేహధారులకెల్ల సాక్షివి. వినను రాజుమాటను విన్నవించెదను. ఇదిరహస్యము. కావున నాధ ర్మమును నెఱవేర్చెదను.

సింధుదేశమునందు సుప్రసిద్ధ మగుచంపకానగరము గలదు. అది స్వర్గపురిని మించు సౌభాగ్యముకలది. తత్పరిపాల కుఁడు విమలుఁడు. ఆభూజాని శచీపతితుల్యుఁడు. భవత్పాద పద్మాసక్తచిత్తుఁడు. భవదర్థమై యనేకయజ్ఞము లొనరించిన

వాఁడు. బ్రాహ్మణుల సేవించెను. తీర్థయాత్రాజపముల నొనరించి కృతకృత్యుఁడయ్యెను. అట్టిభూపతియెడ ననుగ్రహసమేతుఁడవు కమ్ము. ఆరాజునకుఁ గన్యకలు గలరు. వా రతిసుందరాంగులు. పరిపూర్ణుఁడగు నిన్నుఁ బ్రాణనాథునిగా గోరియున్నవారు. నిన్నుఁ బడయఁగోరి యనేకనియమము లొనర్చిరి. నీ పాదసేవచే నిర్మలాంతఃకరణలుగాఁ దలంచిరి. వ్రజనాథా! వారి వివాహమాడుము. వారికి నీయద్భుతసందర్శనమును బ్రసాదింపుము సింధుదేశములకు విజయంచేయుము. చేయఁదగిన దిద్దియని నిర్ణయించుభారము నీదియేకదా! అనిపలుకుదూత వచనముల నాకర్ణించి దరహాసము మోమున వెలయుచుండఁగా నంగీకరించి దూతంగూడి క్షణమాత్రమునఁ జంపకానగరమును జేరెను. అత్తఱి విమలభూజాని యజ్ఞమొనరించుచుండెను. ఆయజ్ఞవాటము వేదధ్వనిసమూహములమై యొప్పుచుండెను. ఆకసమునుండి దూతంగూడి శ్రీహరి యవతరించెను. శ్రీవత్సాంకుఁడై ఘనశ్యాముఁడై వనమాలావిరాజితుఁడై సుందరాకారుఁడై పీతాంబరధారుఁడై పద్మనేత్రుఁడై సాక్షాత్కరించిన శ్రీకృష్ణుని గాంచి లేచి ప్రేమవిహ్వలుఁడై తచ్చరణాంభోరుహాములపై వ్రాలి రోమాంచములుతోఁప లేచి కృతాంజలియై దివ్యపీఠమునఁ గూరుచుండఁజేసి బహువిధముల వినుతించి మ్రోల నిలుచుండెను. గవాక్షమార్గములఁ దనను గన్నులారఁ గాంచుచున్న యతనితనూజాతలను గాంచి మాధవుఁడు మేఘగంభీర భాషణముల విమలున కిట్టులనియె.

సాధుమతీ! నీ మనమునఁగలకోర్కెఁ దెలుపుము. యాజ్ఞవల్క్యనివచనము ప్రకారము నాదర్శనము నీకొసఁగితిని. అనుఁడు మహానందమున నా విమలభూపతి శ్రీకృష్ణా! దేవదేవా! నీ పాదాంబురుహములయందు నా మనస్సు భ్రమరమువలె నాసక్తి నొందినది. ఇది యిట్లే నిలుచుఁగాక. వేఱొక వాంఛ నామది లేదు. అనిపలికి ధనసంచయమును, గజవాజిరథములను భగవంతునకర్పించి ఆత్మను గూడ నివేదించెను. విధి ననుసరించి తనకన్యకలనెల్ల నొసంగెను. భక్తితత్పరుఁడై శ్రీహరికి నమస్కరించెను. అపుడు జయజయధ్వను లయ్యజ్ఞవాటమెల్ల నిండెను. అంబరముననుండి దేవతలు పుష్పవృష్టిని గురియించిరి. విమలుఁ డప్పుడే శ్రీకృష్ణకృపాపాత్రుఁడై యనంగసదృశరూపుఁడై సూర్యునింబోలి దిక్కులవెలిఁగించుచు గరుడవాహనారూఢుఁడై సకళత్రుఁడై యెల్లరును జూచుచుండ వైకుంఠమున కరిగెను.

ఇట్లు శ్రీకృష్ణుఁడు భూపతికి ముక్తినొసంగి తత్పుత్రికలం దోడుకొని వ్రజమండలమును జేరెను. దివ్యమందిరబృందసంయుతం బగుకామవనమున నా కన్యకలు కందుకక్రీడలఁ గాలమును గడపుచుండిరి. ఎందఱుభార్యలో అందఱి కన్నిరూపముల నగపడుచు రాసమండలమున వ్రజరాట్టు శ్రీహరి తన్మనోరంజకుఁడై వారిం గూడి యానందజలబిందువులు తనువున కలంకారముగఁ జూపట్టఁగా నర్తనంబు సలుపుచుండెను. ఆస్థలమున నొకకుండ మేర్పడియె. అది తీర్థోత్తమము. అందు స్నాన

ముచేసినను, దజ్జలమును గ్రోలినను, ద్రావినను, మేరుభూధర తుల్యపాపములు భస్మములగును. గోలోకమున నివసించు సుకృతము లభించును. యోగిదుర్లభంబగుగోలోకము దీనిఁ బఠింపఁ గలుగును.

మహామతులారా! ఈ చరిత్రమునం దొక్కవిశేషము గలదు. అదిగ్రహింపఁ దగినదియే. పెక్కుమందిభార్యలు రాజు లకుండుట యొకగొప్ప వార్తగాదు. యాజ్ఞవల్క్యమహాముని విమలునకు శ్రీకృష్ణజననము కాఁగలదని తెల్పుటయు సామాన్యవిషయమే. దూత మధురానగరమున కరుగుటయు నందలి జనులు కంసభీతులై రహస్యముగా వసుదేవునితనయులఁ గంసుఁడు వధించుట తెల్పుటయు సాధారణవార్తయే. కడపటికొమరిత యాకసమున కేగెననుటయు వాస్తవమే. పిదప దూత బృందావనమునకరిగి శ్యామసుందరవిగ్రహునింగాంచి యావార్త రాజునకుం దెలుపుటయు విచిత్రముకాదు. గాంగేయుఁ డీకృష్ణరహస్యమును విమలునకుం దెలుపుటయు సహజమే. విమలుఁడు శ్రీకృష్ణునికడకు దూతనంపుటయు నాతఁడు శ్రీహరితో నేకాంతమున సంభాషించుటయు నంతగాఁ జెర్కొనఁదగినంత యచ్చెరువు నొసంగునవికావు. శ్రీకృష్ణుఁడు దూతంబిలుచుకొని క్షణకాలమునఁ జంపకానగరమును జేరుట యచ్చెరువుగాఁ దోఁపవచ్చును. దానింగూర్చినమాటలు నాలుగు వ్రాసెదను.

భగవంతునకు క్షణమాత్రమున దేశాంతరముచేరుశక్తి యుండుట యచ్చెరువుకాదు. సామాన్యులుకూడ నీకృత్య

మును జేయవచ్చును. ఆవిషయములు విపులముగా నాగమము లయందుఁ జెప్పఁబడినవి. శివోక్త మగునింద్రజాలతంత్రము నను ఆసిద్ధులు లభించుపద్ధతులు వేర్కొనఁ బడినవి. ఘుటికా సిద్ధి, పాదుకాసిద్ధి, అంజనసిద్ధి లోనగుసిద్ధులు గలవు. ఇతరుల కగపడకుండనుండు సాధనములు కలవు. మంత్రరూపముగను, ఓషధిరూపముగను నవి చెప్పఁబడినవి. ఇవన్నియు నీకాలమున నామమాత్రావశిష్టము లైనవి. కారణమేమి? తొలుదొలుత గురుభక్తి నశించినది. దానితోడ సర్వశక్తులు నశించినవి. తుద కవియన్నియు జల్పితములని మనలోఁ జాలమంది యూహించు నంతటిదుస్థితి చేకూరినది. ఆస్తికాభాసులే పెక్కుమంది కనఁబ డుచున్నవారు. ఆస్తికతనామమాత్రావశిష్టమై యూఁగులాడుచు న్నది. మతాభిమాన మంతరించినది. వాగ్రూపమున లోకులకు దానిం జూపినను మనఃపూర్వకమగుతదాచరణము శూన్యమై నది. భగవంతునియందు విశేషించి గురువునందు దృఢవిశ్వాసము నశించినది.విద్వాంసులమనుకొనువారు దాంభికులుగఁ గన్ప ట్టుచున్నవారు. వేదాంతులమని చెప్పుకొనువారు ధనాశాపరవశ నిజాశయులు. విశేషించి కాముకులుగా నున్నవారు. ఉపన్యాస వేదికలపై వేదాంత ముత్తూఁతలూఁగుచున్నది. మతవిధుల నాచ రించుటమానివేయువారిసంఖ్యయే యత్యధిక మగుచున్నయది. స్మృతులకు విపరీతార్థము కల్పింపఁ బడుచున్నయవి. వేదమున కధోగతియే చూపఁబడుచున్నది. భక్తియనునది పేరునకుమా త్రమే నిలిచియున్నయది. డాంబికులు క్రిక్కిరిసియుండుకాల

ము వచ్చినది. వారిమాయలకు లోఁబడువారు పెక్కుమంది గలరు. అర్థాభిలాషచే యోగులవేషములు ధరించి తిరుగువా రనేకులు గలరు. హరిశిష్యులసంఖ్యకుఁ బరిమితియే లేదు. యోగమునకుఫలము ద్రవ్యార్జనమే కాని వేఱొండు గానరా కున్నది. వాక్కు లసత్యదూషితములు. మానసములు పరద్రవ్యార్జనాసక్తములు. కాయములు పరహింసాపరాయణములు. ఇట్టి లగుట కాలమహిమ మనికొంద ఱలసు లందురు. దేనిమహిమ ముచేనైననేమి ప్రస్తుతకాలము మంత్రవాదములకు మృత్యుప్రాయమనుటకు సంశయింప నక్కఱలేదు. ఇట్లు కాఁగా మంత్ర సిద్ధు లెక్కడ? ఓషధులసిద్ధు లెక్కడ?

కొంద ఱవి వృథాకల్పితములు. మోహజనకము లనుచుందురు. వారలసులే. ఏలయనఁగాఁ గ్రూరభుజంగము కఱచిన నవ్విషము తాఁకునఁ బ్రాణి మూర్ఛిల్లుటయు నొక్కపల్లెటూరువిద్యాహీనుఁ డొకపసరు ముక్కురంధ్రములఁ బిండుటయు నొకక్షణముననే యతఁడు లేచి కూరుచుండుటయుఁ గన్నులారఁ గాంచుచున్నవారము. ఒక్కని సర్పము కఱచిన వేఱొక తావుననున్న మంత్రవిదునితో నీవార్త తెల్పిన వాఁడు తన్మంత్రపూతజలమును ద్రావుటయు సర్పహతుఁడు మేల్కాంచుటయుఁ బలుమాఱు జూచుచున్నవారము. ఓషధులు సిద్ధినొసంగునవి యని నమ్మవీలులేదా? మంత్రములు ఫలించు నని చెప్ప సాహసము గలుగఁకూడదా? భరతఖండమున నేనాఁటికైన నీసిద్ధులు బీజభూతముగ నుండకమానవు. నాస్తిక, లాస్తికులు కాక

మానరు. నడుమ నడుమ నిట్టియంతరాయములు సంభవించినను భక్తిజ్ఞానవైరాగ్యముల కాటపట్టగునీభూభాగమునఁ బరిశుద్ధమతు లుండకమానరు. మహర్షు లందందు నివసించి యుండి, పామరుల నాశీర్వదించుచుఁ బురాతనసద్విద్యలు నశింపకుండుఁగాకయని యాశీర్వదించు చున్నవారు. ప్రతిష్ఠనుగోరి సంఘముల నేర్పాటుచేయుచున్నవారు. అందుఁ గొందఱు చేరుచున్నవారు. మతమెట్లుగా మాఱునో చూడవలసియున్నది. సర్వేశ్వరుఁడు సకలసిద్ధులఁ బూర్తిగా నశింపకుండఁ గాపాడి సజ్జనహృదయక్షేత్రముల నాబీజములఁ జల్లి నెక్కొనఁజేయుఁగాక!

మహాశయులారా! మనుష్యులకుంగూడ నివిసాధ్యము లగును. ఇఁక భగవంతున కసాధ్యములగునా? ఇంచుక యోజింపుఁడు. సకలబ్రహ్మాండముల నిర్మించి చక్కఁగ వెలయించి వివిధవిధకర్మజీవులు విహరించుచుండఁ జేసి క్షణమాత్రమున మాయించు నఖండశక్తికిఁ బరమేశ్వరున కీతుచ్ఛతమకార్య మొక గొప్ప యనుట కంటెఁ దెలివితక్కువ వేఱొకటి లేదు. ప్రపంచనిర్మాణపద్ధతి నించుక నాలోచింప గగుర్పాటు గలిగెడు. భగవచ్ఛక్తి యింతమాత్రముగ నుండవచ్చునని వచింప నూహింప నెవ్వనికే నలవికాదు. ఇట్లుకాఁగలదని నిర్ణయింప వలనుపడదు. ఇట్లు సాగెననికూడ వచింప నశక్యము. తదిచ్ఛ యేక్షణమున కేరీతి మార్పు నొందునో యెవ్వ రెఱుంగఁ జాలరు. ప్రకృతికే తెలియదన నీకఁ దక్కినవారిమాట యిట నేటికి? కావున క్షణమాత్రమున బృందావనమునుండి చంపకనగరమునకు దూతం

దోడుకొని శ్రీకృష్ణుఁడు పోయెనన్న నేమియాశ్చర్యము? ఈ పాటిమహాకార్యము యోగులకుంగూడ శక్యమని నమ్ముఁడు. ఈవిషయమై శంకలఁ బెంచుకొనుట దుష్కర్మలేశముచేతనే యని నానమ్మకము. ఇఁక నవ్వలికథను జిత్తగింపుఁడు.

—॥ యజ్ఞసీతాగోపికోపాఖ్యానము. ॥—

* బహుళాశ్వమహీరమణా! యజ్ఞసీతాగోపికలయుపాఖ్యానము నాలకింపుము. అది వినఁదగినది. పరమపవిత్రము. పరమమంగళాస్పదము. దక్షిణభూభాగమున నుశీనరదేశముగలదు. అది ధనాఢ్యగోపకసమాకీర్ణము. ఒక్కకాలమునఁ బదివత్సరములు వృష్టి లేకుండెను. దానిచే ధనవంతులయ్యును గోపకులనావృష్టిభయాతురులై కుటుంబములంగొని గోధనములతో వ్రజమండలమున కేతెంచిరి. బృందావనము కాళిందీతీరమున శుభముల కాస్పదమై సర్వసమృద్ధులం దులదూఁగుచుండెను. నందభూపాలునిసాయముగోరి యతనిమాటనుగైకొని యందు నివసించిరి. వా రందు నివసింపఁగా యజ్ఞసీతాఖ్యలందగుగోపికలు పుట్టిరి. శ్రీరామచంద్రుని వరముననే వార లాపేరునఁ బుట్టిరి. వారెల్ల నవయౌవనసంపన్నలైరి. శ్రీకృష్ణపరమాత్మను గాంచి తదీయసౌందర్యమున కచ్చెరువంది యాశ్రీహరియందుఁ బ్రీతి నునిచిరి. శ్రీకృష్ణప్రసాదార్థము వ్రత ముపదేశింపుమాయని శ్రీరాధాంబికకడ కరిగి యిట్లు ప్రశ్నించిరి.

---

*ఈగాథయుం గర్గసంహితమాధుర్యఖండమున నెనిమిదవయధ్యాయము నుండి గ్రహింపఁబడినది.

వృషభానుపుత్రీ, శ్రీరాధాదేవీ! ఏవ్రత మాచరించిన శ్రీకృష్ణప్రసాదము సిద్ధించునో అట్టి వ్రతము నుపదేశింపుము. త్రిలోకదుర్లభుఁ డగునందనందనుఁడు నీకు వశ్యుఁ డెట్టులయ్యెనో ఆపుణ్యము మాకు లభింపఁజేయువ్రతము నుపదేశింపుము. నీవు జగన్మోహినివి. సకలశాస్త్రపారంగతురాలవు. రాధానామమున వెలయుదానవు. కావున మాపైఁ గరుణ నునుపుమీ యని యభ్యర్థించిరి. ఆగోపికాప్రార్థనావిశేషముల నాలకించి రాధాదేవి పరమప్రీతురాలయ్యెను. వారికి వ్రత ముపదేశింపఁ బూని యిట్లుపలికెను. గోపికలార! శ్రీకృష్ణపరమాత్మకరుణను బడయఁగోరినమీ రేకాదశీవ్రతము నొనరింపుఁడు. దానిచే భగవంతుఁడు మీకు వశ్యుఁడగును. సంశయింపకుఁడు. అన వారలిట్లు ప్రశ్నించిరి. వత్సరమునఁగల యేకాదశీనామములనెల్లఁ గీర్తింపుము. ప్రతిమాసమందును దద్వ్రతము నొనరించుపద్ధతుల వచింపుము. అనుటయు రాధాంబ యిట్లు పలికెను.

గోపికలారా! వినుఁడు.మార్గశీర్షమాసకృష్ణపక్షమునందు దుష్టవధనిమిత్తము విష్ణుదేహమునుండి యేకాదశీతిథి యుద్భవిల్లెను. అదితిథ్యుత్తమమని ప్రఖ్యాతిఁ గాంచినది. అదియే ప్రతిమాసమందును వేఱువేఱుగాఁ గీర్తింపఁబడియె. కాననే వ్రతోత్తమమన నొప్పెను.దాని కిరువదియాఱునామములు గలవు మీహితమును గోరి వచించెదను. ఆలకింపుఁడు. అది భుక్తిముక్తుల నొసంగును. దానిని మించినసత్ఫలముల నొసంగునది వేఱుగా లేదు. ఉత్పత్తియు, మోక్షయు, సఫలయుఁ, బుత్రదయు,

షట్తిలయు, జయయు, విజయయు, నామలకియుఁ, బాపమోచ.
నియుఁ, గామదయుఁ, గథితయు, వరూథినియు, మోహినియు,
నపరయు, నిర్జలయు, యోగినియు, దేవశయనియుఁ, గామికయుఁ,
బవిత్రయు, నజయుఁ, బద్మయు, నిందిరయుఁ, బాపాంకుశయు,
రమయుఁ, బ్రబోధినియు, సర్వసంపత్ప్రదయు ననునీయిరువదా
ఱునామములు ప్రఖ్యాతములు. వీనిం బఠించుటచే మిగులశుభ
ములు కలుగును.

ఇఁక నేకాదశీనియమముల నాలకింపుఁడు. దశమియం
దేకభుక్తము చేసి జితేంద్రియత్వమున నలరుచు భూమిపై శయ
నించి యొకపర్యాయమే జలపానము చేసి ధౌతవస్త్రములం గట్టి
మనస్సును నిర్మలముగా నుంచుకొని బ్రాహ్మీయను ముహూర్త
మున మేల్కాంచి శ్రీహరిని బ్రార్థించి. నమస్కరించి స్నానము
చేయవలయు. కూపజలంబుల స్నానము చేయు టధమము. వాపీ
జలంబుల మజ్జనము చేయుట మధ్యమము. తటాకమున మునుం
గుటుత్తమము. నదీజలంబులఁ దోఁగుట యంతకంటె నుత్త
మము కావున యథోచితముగా స్నాన మాచరించి క్రోధలోభ
వివర్జితుఁడై నీచులతో సంభాషింపక పాషండిజనులసంగతి
మాని మిథ్యావాదములు చేయువారలను, బ్రాహ్మణనిందకు
లను వదలి, ఇంకను దురాచారరతులనెల్ల విసర్జించి, అగమ్యా
గమనము చేయువారిని గన్నెత్తియైనఁ జూడక, పరద్రవ్యాపహా
రకులం, బరదారలంగోరువారల, దుర్వృత్తులను, మర్యాదావి
హీనులను, వ్రతనియమము నాచరించునపుడు విడిచి కేశవు

నర్చించి నైవేద్యము చేయవలయు. భక్తియుక్తం బగుమన స్సుచే దీపము నొసంగి, భగవత్కథలు బ్రాహ్మణులవలన విని వారికి యథాశక్తి దక్షిణల నిచ్చి రాత్రి జాగరణము చేసి శ్రీకృష్ణకీర్తనములం బాడుచుఁ గాంస్యమాంసమసూరములను గోద్రవ్యములను జణకములను శాకములను, మధువును, బరాన్నమును, పునర్భోజనమును, సంగతి వనునీపదింటిని దశమీరాత్రియందు విడువవలయును. ద్యూతక్రీడానిద్రాతాంబూలదంతధావనపరాపవాదపైశున్యస్తేయహింసారతి క్రోధానృతభాషణముల నేకాదశియందువిడువవలయు. కాంస్యపాత్రమాంససురాక్షౌద్రతైలవితథభోజన వ్యాయామప్రవాసపునర్భోజన మిథున కర్మములను, పిష్టాపిష్టమసూరములను ద్వాదశియందుఁ ద్యజింపవలయు. ఈనియమములఁ బాటించి వ్రతమునాచరింపవలయును.

అని తెలుప గోపిక లాదరంబున రాధాదేవితో నేకాదశీవ్రతకాలమును దెలుపుము. దానిఫలమును వ్రతమాహాత్మ్యమును విస్తరింపుము. అని ప్రార్థించిరి. వారిప్రార్థనల నాలకించి రాధాంబ యాదృతిమీఱ నిట్లు బదులుచెప్పెను. ఏఁబదియైదు ఘుటికలు కనఁబడునేని మఱుసటిదిన మేకాదశిగా భావింపక దానిని దశమీతిథిగా భావించి ద్వాదశియం దేకాదశీ ప్రయుక్తోపవాసమును సలుపవలయును. దశమీఫలమాత్రమున నేకాదశి వదలదగినదగును. మదిరాబిందుసంయోగమున గంగాజలసంభృతఘుటము పరిహరింపఁదగుఁగదా. ఏకాదశి యెట్లు వృద్ధినొందునో ద్వాదశియు నట్లు వృద్ధినొందు నేని పూర్వ

విద్ధాతిథిని మాని యుత్తరతిథియం దుపవాసమును జేయవల
యును. ఇది కాలనియమము. ఇఁక నేకాదశీవ్రతఫలమును
వినుఁడు. ఫలశ్రవణముమాత్రమున వాజపేయఫలముగల్గును.
ద్వాదశీవ్రతము చేయువాఁ డెనుబదెనిమిదివేల విప్రులను
భుజింపఁజేసినపుణ్యము నొందును. ఏకాదశీవ్రత మాచరించు
నతఁడు సాగరసహితముగా భూచక్రమునంతయు దానమిచ్చిన
నేపుణ్యము గలుగునో దానికంటె సహస్రగుణాధికఫలమును
గైకొనును. పాపపంకసమాకుల మగు సంసారసాగరనిమగ్నుల
నుద్ధరించుపాంటె ద్వాదశీవ్రతము నాచరింపవలయును. ఏకా
దశీవ్రత మాచరించువాఁడు రాత్రి జాగరణము చేయవల
యును. వాఁడెన్ని పాపముల నాచరించినను యముని జూడఁడు.
తులసీదళముల ద్వాదశియందు శ్రీహరి నెవఁడు పూజించునో
పద్మపత్రము నీటినంటనట్లు పాపలిప్తుఁడు కాఁడు. అశ్వమేధ
సహస్రములును రాజసూయశతములు నేకాదశీవ్రతఫలషోడశ
భాగమునకు సరిరావు. మాతృపితృపక్షములఁ బదుగురును,
భార్యాపక్షమునఁ బదుగుండ్రను వాఁడుద్ధరింపఁగలఁడు. ఈ వ్రత
ము శుక్లకృష్ణపక్షములను భేదములేక సమముగా ఫలము నొసం
గును. గోవు శ్వేతకృష్ణవర్ణములలో నేదికలదైనను బాలు సమ
ముగనే యుండుఁగదా. కావున నేకాదశీవ్రతము సమాచ
రించిన శతజన్మకృతపాపములు పాయుననుట నిస్సంశయము.
విధిమంతముగాఁగాని విధిహీనముగాఁగాని ద్వాదశియందు
దానమిచ్చినచో నాదానము స్వల్పమేయైనను దత్పుణ్యము

మేరుమందరసంకాశమగును. ఏకాదశియం దేనరుఁడు శ్రీహరికథ నాలకించునో సప్తద్వీపవతీదానఫలమతనికి లభించును. శంభో ద్ధారతీర్థంబు స్నానమొనరించి గదాధరుని దర్శించిన నేపుణ్యము గలుగునో యది యేకాదశ్యుపవాసఫలషోడశాంశమునకు నీడు గాదు. ప్రభాసతీర్థమందును, గురుక్షేత్రమునందును గేదారము నందును, బదరికాక్షేత్రమందును, గాశియందును, సూకర క్షేత్రమందును, గ్రహణకాలముల స్నానముచేసిన నేఫలము గలుగునో మఱియుఁ బైక్షేత్రములయందు సంక్రాంతిసమయ ముల ననేకదానములుచేసిన నేపుణ్యముగలుగఁగలదో ఆసు కృతము లీయేకాదశ్యుపవాస ఫలమునఁ బదాఱవపాలునకు సరిరావు. ఫణులలో ననంతుఁడు, పక్షులలో గరుడుఁడు, దేవత లలో విష్ణువు, వర్ణములలో బ్రాహ్మణుఁడు, వృక్షములలో నశ్వ త్థము, పత్రములలోఁ దులసీపత్రము నెట్లుశ్రేష్ఠములో వ్రతము లలో నేకాదశీవ్రత మట్టిదని యెఱుంగఁదగు. పెక్కువత్సర ములు తపస్సు చేసినఫలములు ద్వాదశీవ్రతసమాచరణమునఁ గల్గును. కావున నోగోపికలారా ! మీరు త్వరగా నేకాదశీవ్ర తము నాచరింపుఁడు. ఇంకేమి వినఁగోరెదరు ? అని రాధాదేవి ప్రశ్నించెను.

## ఏకాదశీవ్రతమాహాత్మ్యము.

* గోపిక లానందపరవశలై రాధాదేవీ! నీవు జ్ఞానియగు

* ఇదియుం గర్గసంహిత మాధుర్యఖండనవమాధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

వృషభానుపుత్త్రికవు. సకలశాస్త్రపారంగతురాలవు. బృహస్పతి వాక్కు నీవాక్కుననుసరింప భయపడుచుండును. కావున నొక్కమాట యడుగుదుము. ఈవ్రతమును మున్నెవ్వ రెవ్వ రాచరించిరి ? నీవు జ్ఞాననీరరాశివి. కావున నీయుపాఖ్యాన మును జెప్పుము. అన రాధాంబ యిట్లనియె. గోపికలారా ! తొలుదొలుత నీయేకాదశీవ్రతము నమరు లొనరించిరి. రాక్షసు లపహరించినరాజ్యమును సంపాదింపఁ గోరియు, మరల రాక్షసులు తలలెత్తకుండఁ జేయఁ గోరియు నీవ్రతము నొనరిం చిరి. మనుజులలో వైశంతుఁడనురాజు దీని నాచరించెను. యమలోకమునకుఁ బోయియున్న తనతండ్రిని దరింపఁజేయుట కొఱకే యారా జాచరించెనని యెఱుంగుఁడు. హరిశ్చంద్రుఁ[?] జ్ఞాతులు తనరాజ్యము నాక్రమింప దాని మరలఁ బడయఁగోరి లుంపకుఁ డనురా జీవ్రతమును విధియుతముగా నొనరించెను. పుత్రహీనుఁడై పెద్దలయనుమతిచేఁ దత్ప్రాప్తికై భద్రావతీ నగరమునఁ గేతుమంతుఁడనురా జీయేకాదశీవ్రతము నాచరించి సత్సంతానమును బడసెను. దేవపత్న్యు లీవ్రతము నాచరించి యక్షయసుఖసంపదలం బడసిరి. మున్ను దేవేంద్రుశాపమునఁ బిశాచత్వమునొందినపుష్పదంతీమాల్యవంతులు పుణ్యతమం బగునీవ్రతమునొనరించి శాపముక్తులై గంధర్వత్వమును మరల సంపాదింపఁగల్గిరి. మఱియు శ్రీరామచంద్రమూర్తి సముద్ర మును బంధింపఁగోరియు రావణాసురసంహారార్థము నీవ్రతము చేసెను. ప్రళయాంతమున మరల లోకముల నలరింపఁగోరి

దేవతలు ధాత్రీవృక్షమూలమున నీమహావ్రతము నాచరించి సర్వకల్యాణములఁ బొందఁ గల్గిరి. మేధావియనుగంధర్వుఁడు పితృవాక్యము ననుసరించి ద్వాదశీవ్రతము నాచరించి యప్సరస్స్పర్శదోషమునుబాసి నిర్మలద్యుతి యయ్యెను. లలితుఁడను గంధర్వుఁడు భార్యంగూడి శాపవశమునఁ బిశాచరూపమును దాల్చియుండి వ్రతమును దీని సమాచరించి ముక్తుఁడయ్యెను. మాంధాతృమహీజాని యేకాదశీవ్రతోపవాస పుణ్యముననే స్వర్గమును బడయఁజాలెను. సగరుఁడు, కకుత్థ్సుఁడు, ముచుకుందుఁడు,ధుంధుమారుఁడు లోనగువా రీవ్రతమునాచరించియే యిష్టార్థములఁ గాంచిరి. బ్రహ్మకపాలధారణమును శంకరుఁడీ వ్రతముననే పోఁగొట్టుకొనఁ గల్గెను. ధృష్టబుద్ధియనువైశ్యకుమారుఁడు జ్ఞాతులు తన్నుదూరమున నుండమన నాపాపములఁ బోఁగొట్టుకొనువాంఛ నీ మహావ్రతము నొనరించి వైకుంఠమునకుం బోయెను. రుక్మాంగదుఁడనుమహారాజీవ్రతమును భక్తియుక్తుఁడై యొనరించెను. దాన నా రాజు చిరకాలము రాజ్యమేలి తుదకు ముక్తినొందెను. అంబరీషుఁడు పవిత్రమహీపతి దీని యాచరణమున బ్రహ్మశాపమునుగూడఁ దిరస్కరింపఁగల్గెను. కుబేరశాపమువలనఁ గుష్ఠురోగమున బాధితుఁడగు హేమమాలియనుయక్షుఁడు దీనియనుష్ఠానమున రోగనిర్ముక్తుఁడై చంద్రతుల్యుఁ డయ్యెను. మహీజితుండనురాజు దీని ననుష్ఠించియే పుత్త్రునిం గాంచి వైకుంఠమునుగూడఁ గాంచఁ జాలెను. హరిశ్చంద్రభూజానియు నేకాదశీవ్రతసమాచరణ

మునసే కష్టపరంపరలఁ బాసి రాజ్యమును బడసి ముక్తినొం
దెను. ముచుకుందభూపతికి జామాతయగు శ్రీశోభనుఁడు మంద
రాద్రియం దీవ్రతరాజప్రభావమున మహాపూజ్యుఁడై విజ
యము నొంది యింతదనుక రాజ్యమును బాలించుచున్నాఁడు.
ఆతనిభార్యచంద్రభాగ. ఆ రాజుభాగ్యము వచింప నలవికానిది.
కావున నోగోపికలారా! ఏకాదశీవ్రత ముత్తమోత్తమమని
నమ్మఁదగును. అని యా రాధాదేవి పలుక యజ్ఞసీతాగోపికలు
శ్రీకృష్ణుని భక్తినిగోరి యేకాదశీవ్రతము నాచరించిరి. ఆపుణ్య
మున శ్రీహరి వారికి దర్శనమొసంగి రాసమండలమున వారిం
గూడి నర్తనము సల్పెను.

## పుళిందకాగోపికోపాఖ్యానము.

* బహుళాశ్వరాజేంద్రా! పుళిందకాగోపికలచరిత్రము
నాలకింపుము. దానిచే భక్తిస్వరూపము తేటపడును. వింధ్య
పర్వతమున నివసించి యుద్భటులైనపుళిందులు గలరు. వారు
రాజద్రవ్యము నపహరించుచు దీనుల కొకింతయు నీయకయుం
డిరి. దాన వింధ్యదేశాధిపతి యాగ్రహించెను. ఆరాజు మహా
బలశాలి. కావునఁ జతురంగబలములంగూడి యా పుళిందుల
నడ్డగించెను. వారు నా రాజు నెదిరించి వారికిం గలయాయుధ
విశేషముల, సంగర మొనరించిరి. కొన్నిదినములు వారు పోరా
డఁ జాలిరి. యదుపులకధిపతి యగుకంసున కొకపత్రికను బంపిరి.

* ఈయుపాఖ్యానము గర్గసంహిత మాధుర్యఖండదశమాధ్యాయము
నుండి సంగృహీతము.

వారికి సాయమొనరింపఁగోరి కంసుఁడు ప్రలంబాసురుని బంపఁగా వాఁడతిబలశాలి యగుట మాయఁబన్ని యోజనద్వయము తన దేహము పెంచి కాలమేఘమాయన నొప్పు దేహద్యుతిగలిగి కిరీటకుండలములను ధరించి సర్పహారములు కనంబడఁగా శృంఖలములు పాదములయందుఁ గనంబడుచుండ గదాపాణియై య మునివలెఁ దోఁచుచు నాలుక యల్లాడ ఘోరమై యాకృతి వెలయఁ బర్వతశృంగములను గండోపలములను దొరలించుచు భూలోకమును వడఁకునట్లు చేయుచు యుద్ధదుర్మదుఁడై ప్రలంబుఁడు వారికిం గనఁబడియెను.

ఆరా జాతనియాటోపంబును గాంచి వీనితో యుద్ధము చేయుట పాడిగాదని చతురంగబలములంగూడి రణరంగమును వదలి సింహదర్శనమున గజము భీతిల్లినట్లు భయపడి పరుగిడెను. ప్రలంబాసురుఁడు వారిం దోడుకొని మధురానగరమును జేరెను. ఆ పులిందులు కంసునకు భృత్యులైరి. వారెల్లఁ గామాచలమునఁ గుటుంబములతో నివాసమును జేసిరి. వారిగృహములయందు శ్రీరామచంద్రునివరమహిమమునఁ బుళిందాఖ్యలఁ గన్యక లుదయించిరి. వారు రూపముల నసమానలై రెండవ లక్ష్మీదేవివలెఁ గనఁబడుచుండిరి. వారు శ్రీకృష్ణదర్శనమునఁ బ్రేమవిహ్వలలై సదా శ్రీహరినే ధ్యానించుచుఁ దత్పాదసేవఁ గోరి యుండిరి. వారు కొంతకాలమున ధ్యానబలమున భగవత్కరుణకుం బాత్రములై రాసక్రీడాసమయమున శ్రీకృష్ణపరమేశ్వరుని సేవింపఁగల్గిరి. గోలోకాధిపతియై పరిపూర్ణతేజంబున

వెలుంగుచు నాదిదేవుండగు శ్రీకృష్ణునిం గూడి రాసమండల మున విహరింపఁ జాలిరి. ఔరా! ఆపుళిందకన్యకలభాగ్యమే పరమభాగ్యము. యోగీశ్వరులకేని దుర్లభమగు శ్రీహరిపదర జస్సు శిరముల ధరింపఁగల్గిరి. భూలోకాధిపత్యమునుగాని పాతాళాధిపత్యముగాని స్వర్లోకాధీశత్వమునుగాని తుదకు సత్యలోకాధిపతిత్వమునుగాని వాంఛింపనిసాధువులు శ్రీహరి పాదసేవనే కోరుదురు. అదియే పునర్జన్మదుఃఖమును బోఁగొ ట్టును. సకలవాంఛితముల నొసంగును. దానిని మించినశుభ కార్యము లేదు. ఇది నిశ్చయము. అనిపలికి నారదుఁ డింకను శ్రీహరిభక్తకీర్తనము చేయందలంచి బహుళాశ్వున కిట్లనియె.

## ఊర్ధ్వలోకవాసిగోపికావృత్తాంతము.

* మహారాజా! మఱికొందఱు గోపికలు భూలోకమున నుదయించిరి. వారిచరిత్రము విన(దగినది. పాపనాశనమునగు. కావున వినిపింతు. అవహితుఁడవు కమ్ము. నీతివిదుఁడు, మార్గ దుఁడు, శుక్లుఁడు, పతంగుఁడు, దివ్యవాహనుఁడు, గోపేష్టుఁడు ననువృషభానువు లాఱుగురుకలరు. వారెల్ల గోలోకమునుండి భగవంతునకు సాయపడ వ్రజమున నవతరించిరి. వారిగృహ ముల లక్ష్మీపతి వరప్రభావమునఁ గన్యకలుపెక్కం డ్రవతరిం చిరి. వైకుంఠమున నలరుచు సముద్రపుత్రికయను విఖ్యాతిం

* ఈ మహాగాథయుం గర్గసంహిత మాధుర్యఖండైకాదశాధ్యాయము నుండియే గ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

గాంచిన లక్ష్మీదేవికిఁ జెలికత్తెలగువారెల్ల వారియిండ్ల నవతరిం చిరి. ఊర్ధ్వలోకోత్తమమగు వైకుంఠమునుండి పుట్టినవారు గోకులపరిసరమున నుండుజనపదముల నవతరించిరి. శ్రీ లోకా చలవాసముచేయు శ్రీ సఖీబృందము సముద్రజాతయగులక్ష్మీ దేవిపరిచారికలు వృషభానుల యిండ్లఁ బుట్టిరి. వారు పుట్టినది మొదలు శ్రీ మద్గోవిందచరణారవిందద్వంద్వమును జింతించు చుండిరి. *శ్రీ కృష్ణమూర్తిప్రసాదమును గోరియే వారెల్ల మాఘవ్రతము నాచరించిరి. మాఘశుక్లపంచమీతిథియందువసం తాదియందు శ్రీ హరి వారిప్రేమ పరీక్షఁజేయం దలంచెను. మెల్ల మెల్లన వారిగృహములకేగెను. వ్యాఘ్రచర్మమును ధరించి జటా జూటము మస్తకముపైఁ గ్రాలుచుండ విభూతి మైనిండఁ బూసి కొని వేణువు నూదుచు జగముల మోహింపఁజేయుచుఁ బోయెను. తమవీథులలో సంచరించు నీమాయామానుషరూ పుని గోపికలు చూచిరి. తత్సౌందర్యనమున మోహితలై ప్రేమభరంబున నోడలెఱుంగక యాపురుషుని బాగుగఁ జూడ నచ్చటికి వచ్చిరి. మహాయోగియు, నతిశయసుంద రాకారుఁడు నగునాభగవంతుని జూచి ప్రేమానంద భరసమాక్రాంతహృదయలై తమలోఁ దమ రిట్లు చెప్పుకొన సాగిరి. ఎవఁ డీశిశువు. నందనందనుంబోలి యున్న వాఁడు ? ధన వంతుఁడై ప్రభువునగునొకానొకని పుత్త్రుఁడాయేమి ! లేక స్త్రీలయుపాలంభనములకు రోసి మనస్సుకలవిలపాటొందఁగా విరక్తుఁడై తనకృత్యములు మాని మనసిజుఁ డీరూపమున నవ

---

* శ్రీకృష్ణస్య ప్రసాదార్థం తాభిర్మాఘవ్రతం కృతమ్=అని మూలము.

తరించెనా యేమి ? లేకున్న నీవిశ్వమనోహరరూప మేల కలుగును ? అకటా ! ఈతనిం జూడక యీతనితల్లిదండ్రులు భార్యయుం దోఁబుట్టువులు నెట్లుజీవింతురు ? అనుచు నిట్లు గోపికలెల్ల గుంపులుగాఁ గూడి యాలోచించి యాశిశువు నిట్లు ప్రశ్నించిరి. వారిపలుకులు మృదుమధురములై ప్రేమభరితములై యుండెను. యోగీశ్వరా ! నీవెవఁడవు ? నీపేరేమి ? నీనివాసమెందు ? వృత్తియేది ? తపస్సిద్ధి యెట్టిది ? మాకెల్ల నాదృతిం జెప్పుము. అనుడు నాయోగి యిట్లు పలికెను. నన్ను యోగీశ్వరుండందురు. మానససరోవరమున నుండువాఁడను. స్వయంప్రకాశుఁడనినాపేరు. నిరన్నుఁడను. స్వబలముచేతనే జీవించువాఁడ. గోపికలారా ! పరమహంసలం గూడి తిరుగుచుండుదు. భూతభవ్యభవిష్యంబులనెఱుంగుదు. దివ్యదర్శనుఁడను. ఉచ్చాటన మారణ మోహన స్తంభనమ్ముల నెఱుంగుదును. వశీకరణవిద్యయు నాయెఱింగినదియే. అనుటయు గోపికలచ్చెరువంది యిట్లు ప్రశ్నించిరి. యోగీంద్రా ! త్రికాలజ్ఞానము నీకుం గలదేని మామనస్సులఁ గలకోరిక యెయ్యదియో తెల్పుము. నావిని యాసిద్ధుం డిట్లుత్తరమిచ్చెను. గోపికలారా ! మీమనోగతవార్త నేనెఱుఁగుదును. కాని యది మీచెవిలోఁ జెప్పఁదగినది. మీరందఱు సమ్మతించిన మీయందఱు వినఁ జెప్పెదను. అనుటయు గోపికలు మహాత్మా ! నీవుసత్యముగా యోగీశ్వరుఁడవే. త్రికాలవేత్తవే. వశీకరణమంత్రము పఠించినమాత్రమున మామనోభీష్టమునఁ గలవాఁ డిచ్చటికి

వచ్చునేని నిన్నుమంత్రకోవిదునిగా భావింతుము. మంత్ర వేత్తలలో నుత్తమోత్తమునిగాఁ దలంతుము.

అనువారిపలుకులు విని సిద్ధుఁ డీట్లు బదులు పలికెను. గోపికలారా ! దుర్లభమైనది దుర్ఘటమైనదియు నగుభావమును దెలుపుచున్నవారు. ఐనను నేనట్లుచేసెదను. సజ్జనవాక్యము చలింపదుకదా ? కామినులారా ! నేత్రములమూసికొనుఁడు. మనముల నిదిసిద్ధించునాయని వగనొందకుఁడు. మీకార్యము ఫలించును. సంశయమేలేదు. అనఁగా నాగోపికలెల్ల నయన ములు మూసికొని యుండిరి. అంతలో శ్రీవారి యాయోగి రూపమును వదలి నందనందనుఁడయ్యెను. వారవ్వాల నయన ములు తెఱచి మహానందమున నానందనందనుం దిలకించిరి. అచ్చెరువందిరి. తత్ప్రిభావము నెఱింగిరి. హర్షాంబుధి నోల లాడిరి. మోహితలైరి. మాఘమాసమున మహారాసమండల మునఁ బవిత్రతమబృందావనమున నచ్చరలంగూడియుండు మహేంద్రునివలె నాగోపికలం గూడి శ్రీవారి-విహరించెను. వారియానందపారవశ్య మిట్టిదని వర్ణింప నెవ్వరికి శక్యమని నారదుఁడు చెప్పి మఱియు నిట్లు చెప్పఁ బూనెను.

మహాశయులారా ! యజ్ఞసీతాగోపికలయుఁ బులింద గోపికలయు నూర్ధ్వలోకములనుండి యవతరించినగోపికలయు నుపాఖ్యానముల నాలకించితిరి. వానినడుమ నేకాదశీవ్రతా చరణపద్ధతియుఁ దత్ప్రిభావమును వింటిరి. వీనినుండి తెలిసికొనఁ దగిన విషయము లనేకములు గలవు. ఏకాదశీవ్రతమహిమ

మీాపఱకే వ్రాయఁబడినను మరల వ్రాయుటేలయని ప్రశ్నింపఁ గుఁడు. ఇందుఁ గొన్నివిశేషము లుండుటంబట్టియే వ్రాసితిని. ఏకాదశీవ్రతము నిత్యమని కొందఱు కామ్యమని కొందఱును జెప్పుదురు. నిత్యకర్మములకు ఫలస్తుతియుండదు. సంధ్యావంద నాదులు నిత్యకర్మములు. అవిచేయకున్న మహాపాపము. చేసినఁ బుణ్యమునుగోరి చేయరాదు గాన ఫలములేదు. పూర్వమీా మాంసాశాస్త్రమున దురితక్షయరూపఫలము గలదని చెప్పఁ బడినది. ఐన నాఫలము కామ్యము కాదు. కోరకున్నను తత్ఫ లము లభించునదియే. ఏకాదశీవ్రత మట్టిదియాయనునదియే యిటఁ బ్రశ్నింపఁదగినవిషయము. ఏకాదశీవ్రత మాచరించిన సకలవాంఛితములు ఫలించునన్నఫలస్తుతి వినఁబడియెడిని. ఫల స్తుతిగలనియమము కామ్య మనఁబడుఁగదా? కావున నేకాదశీ వ్రతవిషయమున నిత్యత్వకామ్యత్వములు కల్పింపఁబడినవి. ఆవిషయ మించుక వ్రాయకతప్పదు.

“తత్రైకాదశ్యాముపవాసో దానాదికం చేత్యుభయం విహితం.ఉపవాసోజయంతీవన్నిత్యకామ్యరూపః ద్వైరూప్యంచ తస్య ద్వివిధప్రమాణబలా దధ్యవసీయతే.ఉపవాసవిధివాక్యేషు నిత్యశబ్దసదాశబ్దాదీనాం నిత్యత్వసాధకానాం స్మరణా న్నిత్యత్వ సిద్ధిః. తాని చ సాధకాని సంగ్రహకారేణ సంగృహీతాని. నిత్యం సదా యావదాయుర్న కదాచిదతిక్రమేత్. ఇత్యుక్త్వాతి క్రమే దోషః శ్రుతేరత్యాగచోదనాత్.ఫలశ్రుతేర్వీప్సయా చ తన్నిత్యమితి కీర్తితమితి. అత్ర నిత్యశబ్దాదీన్యష్టౌ నిత్యత్వసాధ కాని. గారుడపురాణే ‘ఉపోష్యైకాదశీ నిత్యం పక్షయోరుభ

యోర'పీతి.సనత్కుమారసంహితాయాం.ఏకాదశీ సదోపోష్యా పక్షయోశ్శుక్లకృష్ణయోః'ఇతి.విష్ణురహస్యే'ద్వాదశీ న ప్రయో క్తవ్యా యావదాయుస్సువృత్తిభిః.'ఆగ్నేయపురాణేఽపి 'ఉపో ష్యైకాదశీ రాజన్యావదాయుస్సువృత్తిభిః' కణ్వః 'ఏకాదశ్యాం చోపవాసం న కదాచిదతిక్రమేత్.' విష్ణునాపి 'ఏకాదశ్యాం న భుంజీత కదాచిదపి మానవః.' కామ్యమేకాదశీవ్రతమ్. కామ్య త్వం చ సాయుజ్యాదిఫలశ్రవణాదవగమ్యతే. తదుక్తం విష్ణుర హస్యే. 'యదిచ్ఛేద్విష్ణుసాయుజ్యం సుఖసంపదమాత్మనః, ఏకాద శ్యాం న భుంజీత పక్షయో రుభయోరపి.'కూర్మపురాణేఽపి.'య దిచ్ఛేద్విష్ణుసాయుజ్యం శ్రియం సంతతమాత్మనః,ఏకాదశ్యాం న భుంజీతపక్షయోరుభయోరపీ'తి. కాత్యాయనః.'సంసారసాగరో త్తారమిచ్ఛన్విష్ణుపరాయణః, ఐశ్వర్యం సంతతిం స్వర్గం ముక్తిం వాయదృదిచ్ఛతి, ఏకాదశ్యాం న భుంజీత పక్షయోరుభయోర పీ'తి స్కాందపురాణేఽపి. 'యదిచ్ఛేద్విపులాన్ భోగాన్ముక్తిం వాత్యంతదుర్లభాం, ఏకాదశ్యాముపవసేత్పక్షయోరుభయోర పీ'తి. నారదోఽపి. 'ఏకాదశీసమం కించిత్పాపత్రాణం న విద్యతే, స్వర్గమోక్షప్రదా హ్యేషా రాజ్యపుత్రప్రదాయినీ. సుకళత్ర ప్రదా హ్యేషా శరీరారోగ్యదాయినీ' తదేవం ఫలశ్రవణా త్కామ్యత్వం చ సిద్ధమ్." కాలమాధవీయము.

ఇట్లు వేదభాష్యకర్త శ్రీవిద్యారణ్యులు వ్రాసిరి. కావున నేకాదశీవ్రతము భుక్తిముక్తిప్రదమని సకలప్రమాణముల వలన స్పష్టమగుచున్నది. కాని నిత్యమనియుఁ గామ్యమనియు

రెండువిధములు గలదనియు సిద్ధాంతము చేయవచ్చును. పుత్త్రులను, సద్భార్యను, ఆరోగ్యమును, భాగ్యము మొదలగువానినొసంగునని సకలపురాణములయందును గన్పట్టెడు. కావునం గామ్యమనక తప్పదు. ఏకాదశీవ్రతమే కాక యింకనెన్నియో వ్రతములు సకలవాంఛల నొసంగునని ఫలస్తుతులందుం గన్పట్టెడిని. అపు డేవ్రతము నాచరించినను సమానమే. ఎవరికేది యిష్టమో వారు దాని ననుసరింతురు. ఇతరు లాక్షేపించుట యేమిన్యాయము? ఏకాదశీవ్రతము ముక్తిప్రదమన్న విశ్వాసముకలవారు దాని నాచరింపవచ్చును. అట్టివిశ్వాసము లేనివారు మానవచ్చును. మానినవారి నాక్షేపింపవచ్చునా? ఏవ్రత మెవ్వరాచరించినను ఆచరింపనివారి నాక్షేపించునాచారము కలదా అదియుత్తమమా. కాదుకదా? కాంబట్టి యేకాదశీవ్రత మాచరించువారు దానినాచరింపనివారి నాక్షేపింపరాదు. ఇదియే బుద్ధిమంతులు గ్రహింపందగిన నీతి. అట్లుగాక యితరుల నాక్షేపింతురేని వారుభగవద్భక్తులు కాంజాలరు. ఈర్ష్యాపరవశులనియే చెప్పవచ్చును ఇట్లే దేవతారాధనమందును నియమమును బాటింపవలయు. తన కేదేవతయందు భక్తిగలదో, వేఱొకనికి మఱొకదేవతయందట్లే భక్తియుండునని గ్రహింపవలయు. తనదేవతను బరుండు దూషించిన నెట్లుమనస్సునొచ్చునో యితరునిదేవతను దాను దూషించిన నాతనిమనస్సట్లే కోపముగలదగునని గ్రహించుట బుద్ధిమంతునిలక్షణము. కనుకనే పరదేవతల దూషింపరాదనుసూక్తి యుప్పతిల్లెను.

దానిం దలపోయకున్నచో మహాపాపము చేసినవాఁడగును. అన్యదేవతాదూషణమున భగవంతుఁడు పరాఙ్ముఖుఁడగును. కావున మాదేవత గొప్పవాఁ డనుగర్వమూని పరులకుపాస్యుఁడగుదేవునిదూషించిన నీరెండుమూర్తులనుండువాఁ డొక్కఁడే గావున నీతఁడు భక్తుఁడు కాఁడని భావించి వరప్రదుఁడు కాకుండును. కావున భక్తులమనుకొనువారు తెలివి గలిగి పరదేవతల దూషించు దుష్కృత్యమునకుఁ బాల్పడ కుందురుగాక.

భక్తవర్యులారా! గోపికలచరిత్రములనుగూర్చి యించుక వినుఁడు. ఊర్ధ్వలోకములనుండి లక్ష్మీదేవీపరిచర్యచేయుకాంతలు గోపికలై యవతరించిరని కనఁబడుచున్నది. మహాలక్ష్మియగు రాధాదేవికి బరిచర్యచేయునిమిత్తమై వా రవతరించుట చిత్రమనఁ దగదు. వారెల్ల రాసమండలమున శ్రీకృష్ణదివ్యపాదారవిందముల సేవింపఁగల్గిరి. ఇట్లు సకలలోకములనుండి భగవత్సేవార్థము గోపిక లవతరించిరి. పరమేశ్వరుని రాసమండలమున దర్శించి తత్సేవాపరాయణలైరి. ఈకృష్ణావతారమున నిన్నిలోకములనుండి స్త్రీలుజన్మించి సేవించినట్లు మఱియేయవతారమునందును లోకాంతరములనుండి స్త్రీలుదయించినట్లు కనఁబడదు. ఈ రాసనర్తనము భగవత్ప్రీతిప్రదము. కావుననే యాపరమసౌభాగ్యమును బడయఁగోరి యిట్లవతరించిరి. ఆరాసమండలేశ్వరి రాధాదేవి.ఆమెయే పరాపరరహస్యయోగినియని చెప్పవలయును. అట్టిరాధామాధవు లవతరించుటచే నిది సంపూర్ణావతార

మయ్యెను. రాధ లేకున్న నిది సంపూర్ణావతార మనఁ దగునా? మఱియే యవతారమునందైన నిట్టివింతలు కల్పించునా. కాఁబట్టియే శ్రీకృష్ణావతారము దశావతారములలోఁ బరిగణింపఁబడక విశేషించి ప్రత్యేకంబ కీర్తింపఁబడియెను. సకలలోకముల నున్న భక్తులకుఁ దా నభీష్టముల నొసంగుటకుఁగా డిగఁబూనినయవతార మిదియే. లోకోత్తర శ్రీహరిరూపమును గనుఁగొనఁగోరిన భక్తుల కెల్ల నీరాసమండలమునఁ దన యపరస్వరూపమనంబడు శ్రీరాధాంబికం గూడి దర్శనమిచ్చి వారిం గూడియే నానాక్రీడల గావించెను. ఇందాశ్చర్యమునఁ దగినది కాని నమ్మఁదగనివిషయము గాని యించుకంతయుఁ గానరాదు. ఇందఱుగోపికలుందురా యనిగాని, యిందఱంగూడి రాసమండలమున విహరింప నెవ్వరు చూచి దండింపలేదా యనిగాని, యింత యున్న గోకులమున స్థలముగలదా యనిగాని, యిందఱభర్తలు తమభార్యలెందో పోయిన నేమనకుండ మానిక్కువదలి స్వామినియూరకుందురాయనిగాని, యిందఱకిన్నిరూపముల దాల్చి విహరింప నవకాశముగలదాయనిగాని ప్రశ్నింపరాదు శ్రీకృష్ణుఁడు మనుష్యమాత్రుఁడన్నచో నిందొక్కటిగూడ సాధ్యము కాని కార్యమే. శ్రీహరి పరమేశ్వరుఁడన్నచో నిందొక్కటియేని యశక్యము గాదు. సకలబ్రహ్మాండముల నొకక్షణమున నిర్మింపఁ బెంపఁ ద్రుంప సమర్థుఁడగుభగవంతున కీతుచ్ఛకార్య మొక లెక్కయా? ఎవరెవ్వరి భార్యలు వారిభర్తలయొద్దనేయుండిరి. ఈరూపములు భగవం

తునకే కనఁబడును. తక్కుంగలవారికిఁ గనఁబడవు. గోపాలబాలకుఁ డూరనుండును. తల్లితో మాటలాడును. ఆసమయమునందే రాధాంబికంగూడి రాసమండలమున విహరించును గోవుల నా సమయముననే మేపుచు నడవులలో గోపార్భకులం గూడి తిరుగుచుండును. నందునితో నానందముగా మాటలాడుచుండును. ఇన్నియు నొక్కకాలమున సాగునవియే. కావుననే యెవ్వరుగాని సంశయముల నొందకుండిరి. ఈనాల్గుపను లొక్కసారి చేయఁజాలనిచో భగవంతునకు సర్వాంతర్యామిత్వ మెక్కడిది? సర్వనియంతృత్వ మెక్కడిది? భగవంతుఁడన నొకమానవమాత్రుఁడేయనవచ్చును. కావున శ్రీకృష్ణునివిషయమున నిట్టిశంకలకుఁ జోటిచ్చుట పూర్వజన్మపాపవశముననేయని తెలియవలయును. కావునమహాశయులారా! శ్రీహరికథ లసత్యములన్న మాటలకు హృదయమునఁ జోటీయక శ్రీపరాత్పరుఁడు శ్రీకృష్ణుఁడని నమ్మి తదీయామేయకృత్యములఁ బఠించి తత్పాదాంబురుహములపై మనసునిలిపికృతార్థులరగుఁడు. నిస్సారమగునీసంసారమే శాశ్వతమనుమూఢవిశ్వాసమును వీటఁబుచ్చుఁడు. భగవన్నామము సకలపాపనోదనక్షమమని విశ్వసింపుఁడు. భూతదయ అహింస యనునీ రెండుదివ్యప్రసూనములు. వీనిచే శ్రీహరిని బూజింపుఁడు. అదియే తరణోపాయము వేఱొక్కయుపాయము కానరాదు. ఇది సత్యము. సత్యము సత్యము. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## భూమిగోపికాచరిత్రము.

*బహుళాశ్వమహీరమణా! ఆవలిచరిత్రమును వినుము. ఉపనందునిగృహమున వీతిహోత్రుఁడు, అగ్నిభుక్కు, సాంబుఁడు, శ్రీకరుఁడు, గోపతియు, శుభుఁడు, వ్రజేశుఁడు, పావనుఁడు, శాంతుఁడు ననుగోపకులు జన్మించిరి. వారెల్లఁ బుత్రవంతులు, ధనవంతులు, రూపవంతులు, బహుశ్రుతులు, శీలాదిగుణసంపన్నులు, దానపరాయణులు నై ప్రఖ్యాతి నొందిరి. దేవవాక్యము ననుసరించి వారిగృహములయందుఁ బెక్కుసంఖ్యలు కన్యకామణులుదయించిరి. అందుఁ గొందఱు దేవలోకమున నుండినవారు. కొందఱు భూలోకమున నుండినవారు. త్రిగుణావృత్తులు. వారెల్ల భూమిగోపిక లనఁబరఁగిరి. వారు బహువిధపుణ్యముల నొనరించి శ్రీకృష్ణసేవాభాగ్యము నొంది పుట్టినవారని తెలియవలయును. వారందఱు రాధికాసహచరిణులు. చెలికత్తియలుగూడ నైరి.

ఒక్కనాఁ డాగోపికలెల్ల రాధాదేవిగృహమున శ్రీకృష్ణమూర్తిం గాంచిరి. ఆనాఁడు హోళికామహోత్సవము సాగుచుండెను. దానికై శ్రీపతి వచ్చుచుండెను. ఆశ్యామసుందరునిం గాంచినంతనే మహానంద మంది రాధిక కిట్లు విన్నవించిరి. రాధాదేవీ! మహానుభావురాలా! హోళికోత్సవవిహారము చాలును వ్రజభూషణుం డరుదెంచుచున్నవాఁడు. నిండుజవ్వన

* ఈగాథ గర్గసంహిత మాధుర్యఖండద్వాదశాధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

మునఁ బెంపొందు మదమున విఘూర్ణితలోచనుండై నీలాలకాళ్యలంకృతకపోలగోళుఁడై, హారకేయూరకిరీటాభిరాముఁడై, విద్యుద్రుచిస్ఫీతకుండలమండితుండై, పీతాంబరమును దాల్చి ద్యుతిమండలమండితుఁడై భూమండలమును వెలయించుచు నింద్రధనుర్విరాజితమేఘమండల మాకాశమును బ్రకాశింపఁ జేయుచాడ్పున నున్నవాఁడు. గోపికాజనకుంకుమపంకవిలిప్తదేహుఁడు. హస్తమున మురళి వెలయఁ దగువాఁడు. నిన్నుం జూడఁ దత్తఱపడుచు రాసరంగమున నిన్నుంగూడియుండఁ గోరి యరుదెంచు చున్నవాఁడు. ఫాల్గునవ్యాజమున హోళికా దేవికి యశస్సును గలిగింపఁ గోరి నీమందిరమున కరుదెంచు చున్నవాఁడు. కాన నందనందనునకుఁ బాటీరపంకమకరందమిళితపాద్యము నొసంగుము. అంబా! లెమ్ము. ఎదురుగాఁ బొమ్ము. మహానుభావుఁ డెందుండునో యచ్చటి కేగవలయును. ఇట్టి శుభసమయ మెప్పుడును లభింపఁబోదు. పుణ్యనదీప్రవాహములఁ గరశుద్ధిచేయు టెట్లో ఈమహానుభావుని దర్శించు టట్లని నమ్ముము.

అను గోపికలపలుకుల నాలకించి రాధ యభిమానము వదలి లేచి సఖిసంఘపరివృతయై శ్రీకృష్ణునిం గొనివచ్చి కూరుచుండఁ జేసి యుత్సవము నారంభించెను. శ్రీఖండాగరుకస్తూరీహరిద్రాకుంకుమద్రవములుగల కుంభముల నెత్తికొని చెలికత్తియలు రాఁగా రక్తహస్తలు పీతాంబరలు కూజన్నూపురమేఖలలునై కొందఱు వెంటనుండఁగా నామహోత్సవము నారం

భించెను. కొందఱంగనలు హోళికాదేవీగీతికలు పాడిరి. కొందఱు తచ్చరిత్రములఁ జదివిరి. కొందఱు హాస్యములు చెప్ప సాగిరి. అబీరారుణచూర్ణముష్టులం బట్టి కొంద ఱర్చించిరి. రక్తచూర్ణముల భూమ్యాకాశముల దిగంతరముల నరుణము లను గావించిరి. బిడికిళ్లనిండ నా కుంకుమాదిసుగంధవస్తు చూర్ణములం గైకొని శ్రీకృష్ణుపైఁ జల్లిరి. శ్రీకృష్ణుని యాకృతిని గరములచే స్పృశించిరి. శ్రావణమాసమున సాయంకాలము నందు మేఘమును మెఱపుఁదీవలుపోలె నరుణపరాగముష్టుల శ్రీకృష్ణకాలమేఘమును వా రలంకరించిరి. అరుణరజంబులచే నాభగవంతు నభిషేకించిరి. *భగవంతుఁడును నన్నర్చించు గోపికలెందఱో యన్నిరూపముల నాగేహమున నుండెను. వారిపూజలం గైకొనుచు సంతోషించుచుండెను. ఆ హోళికో త్సవమునందు రాధతోఁ గూడియున్న శ్రీకృష్ణపరమాత్మ సాయంకాలమున మెఱపుఁదీఁగలతోఁ గూడిననీలాభ్రమునవలెఁ బ్రకాశించెను. శ్రీహరి యారాధాదేవి యిడినపూజలం గైకొని యుత్తరీయమునొసఁగి యావ్రజసుందరీముఖులం గూడి నంద మందిరమున కరిగెను.

ఆర్యులారా! ఈయుపాఖ్యానసారమును వినుఁడు. ఫాల్గుణ శుక్లపూర్ణిమాతిథియందు హోళికార్చనము చేయవలయును. హోళికాంబయనునదియే పరదైవము. ఆదేవిని పరిమళవస్తు

* భగవానపి తత్రైవ యావతీర్వ్రజయోషితః, ధృత్వా రూపాణి తావంతి విజహార నృపేశ్వర. అని మూలము.

చూర్ణములచేఁ బూజింపవలయును. ఆపూజకు సాయంకాలము ముఖ్యము. పగ లాదేవిని బూజింపరాదు. దీపావళులచే గృహము నలంకరింపవలయును. ఆపగటిపూట గోక్రీడనోత్సవము చేయవలయు.

'సాయాహ్నే హోళికాంకుర్యాత్పూర్వాహ్నే క్రీడనంగవామ్.'

ఆని నిర్ణయామృతము.

"ప్రతిపద్భూతభద్రాసు యార్చితా హోళికా దివా,
సంవత్సరం చ తద్రాష్ట్రం పురం దహాతి సాద్భుతమ్."

జ్యోతిర్నిబంధము.

"అస్యాం నిశాముఖే పార్థ సంరక్ష్యాశ్శిశవో గృహే,
గోమయేనోపలిప్తే చ సచతుష్కే గృహాంగణే.
భద్రాయాం దీపికాహోళీ రాష్ట్రభంగం కరోతివై,
నగరస్య చ నైవేష్టా తస్మాత్తాం పరివర్జయేత్.
నిశాగమే ప్రపూజ్యేత హోళికా సర్వదా బుధైః,
న దివా పూజయేద్ఢుండాం పూజితా దుఃఖదా భవేత్."

అను నీప్రమాణములు స్మృతులయందుఁ గనఁబడియెడిని. హోళిక తేజస్స్వరూపిణి. ఆమెను సాయంకాలమునఁ బూజింపవలయును. అట్లుపూజించినచో మఱుసంవత్సరమున ఫాల్గుణపూర్ణిమవఱకు నాదేవి రాష్ట్రమును గాపాడును. ఇది హోళికాదేవీ పూజాపద్ధతి. హోళికార్చన మేల రాధాదేవి చేసెనో యించుక యోజింపుఁడు. భగవంతుఁడు తేజస్స్వరూపుఁడు. యోగులు స్వహృదయాంతర్వర్తితేజస్స్వరూపమును

ధ్యానింతురు. హోళికాంబను దీపస్వరూపిణిగాఁ బూజింపవలయుననుటచేఁ దేజస్స్వరూపిణియని స్పష్టము కదా? విగ్రహపూజ మూఢజనులకుఁ దొలుత చేయఁదగినది. కావున రాధాంబ స్వాభిన్నురాలగుభగవతిఁ బూజించి లోకమునకు మార్గదర్శకురా లయ్యెను. భగవంతుఁడు తపస్సుచేసె ననఁగా స్వరూపమునే చూచుచున్నవాఁడని భావము. ఉపాస్యుఁడాపరమేశున కెవ్వఁడు కలఁడు? అట్లే ప్రకృతియు రూపాంతరముననున్న తన్నుఁ దానేపూజించుకొనును. ఇదిలోకుల కీసదాచారము నుపదేశించుటకొఱకేయని యెఱుంగవలయును. శ్రీకృష్ణాదులు కూడ లోకశిక్షార్థము దేవతాపూజచేయుదురు. ఇప్పటి వేదాంతులలోఁ గొందఱు లోకవంచకులుగాన నిదియెల్ల మిథ్యయని పల్కి ద్రవ్యార్జనము చేయుచుందురు. వీరికి వేదాంతశాస్త్రపఠనము క్షుద్రఫలప్రదమేయగును. పరమపురుషార్థము శూన్యమే.

ఇఁక హోళికోత్సవసమాగత శ్రీ కృష్ణునిమహిమము నించుక విచారింతము. స్వర్గమర్త్యపాతాళముల నున్నవారియం దెవ్వరెవ్వరీశ్రీకృష్ణాంఘ్రిజలజముల దర్శించు భాగ్యము లభించుసుకృత మొనరించిరో వారెల్ల నీగోకులమునఁ బుట్టిరి. ఆహోళికోత్సవమున శ్రీరాధాగృహమునకుం జనిరి. శ్యామసుందరమూర్తియు నచ్చటికేతెంచెను. రాధాంబ శ్రీహరిం బూజించెను. ఈగోపికలెల్ల పరిమళవస్తుచూర్ణముల నారాధామాధవుని గొలిచిరి. తచ్చరిత్రములఁ బాడిరి. ఎందఱు తన్నుం

బూజించిరో అందఱు కన్నిరూపములఁ గైకొని శ్రీహరి వారి పూజల నందుకొనియెను. ఇదియే యిందలిరహస్యము. ఎందఱు గోపికలు తన్నారాధింపఁ బూనిరో అందఱు కన్నిరూపము లుగాఁ గనఁబడియె. తనసర్వవ్యాపిత్వమును దెలియఁజేసెను.

జారచోరశిఖామణి శ్రీకృష్ణుఁడు.

అన్నమాట సత్యమనియే నాభావము. ఏలన ఎవ్వరికిం దెలియ కుండ హృదయసంగతిం గాంచును. కావున జారుఁడే. భక్తుల పాపరాశి నపహరించును. కావున దొంగయే. ఈ రెండపకీర్తులు శ్రీకృష్ణున కలంకారములే. ఇట్టియలంకారములు వేఱొండు కానరావు. సర్వవ్యాపకుఁడని స్పష్టమగుచుండ భగవంతుని నిందించుటకన్నఁ బాపకార్యము వేఱేమున్నది ? ఈయొక్క విషయమును మది నిలుపుకొన్నం జాలును. భక్తుఁడు తరించి నట్లే. ఇట్టి దివ్యమగుచరిత్రమును నిందించుటకంటె వెఱ్ఱితన మేది గలదు ? కాఁబట్టి యార్యులారా ! శ్రీకృష్ణుని ధ్యానించి కృతార్థుల రగుఁడు. ఇఁకఁ బైకథను వినుఁడు.

దేవాంగనాగోపికోపాఖ్యానము.

* మహారాజా! అని సంబోధించి నారదముని యిట్లు పలి కెను. మాళవదేశమున నందుఁడనుగోపకుఁ డుండెను. పెక్కండ్రు వనిత లాతని వివాహమాడిరి. ధనవంతుఁడు నీతిమంతుఁడు నై యాతఁడు గోపవతంసుఁడనఁ బ్రఖ్యాతింగాంచెను. ఆతఁడు తీర్థయాత్రాప్రసంగమున మధురానగరమున కేతెంచెను. అందు

* ఇది యీవఱకు వ్రాసినకథతరువాతిదని యెఱుంగవలయు.

నందరాజు వ్రజాధీశుఁడనియు సుగుణవైభవోపేతుఁడనియు, గుణవంతుఁడనియు వినవచ్చెను. వెంటనే సాంబశివనందుఁడు గోకులమునకుం బోయెను. నందరాజును బృందావనమునను దర్శించి హృష్టమానసుఁ డయ్యెను. నందరాజానుమతి నాబృందావనమున వసించెను. అందు యోజనద్వయ పరిమాణము గోష్ఠము నేర్పఱచి గోరక్షణము చేయుచుండెను. ఆనందవను దివస్పతియనునామాంతరము గలదు. ఆ వ్రజమున నానాళివది వస్పతియుండి మహానందము ననుభవించెను.

ఆదివస్పతికి దేవలమహామునివర ప్రభావమున దేవకన్యకలు పుత్రికలుగా జన్మించిరి. వారు రూపవతులని గుణవతులని విఖ్యాతిం గాంచిరి. నందనందనునిసుందరాకారమును గాంచి యాకన్యకలు విస్మయపరవశలై యతనిపై మనసు నిల్పిరి. భగవత్సేవార్థమై వారెల్ల మాఘవ్రతము నాచరించిరి. ప్రతిదినము సూర్యార్ఘోదయకాలమందు వారు యమునానదియందు స్నానమొనరించి ప్రేమపురస్సరముగా శ్రీకృష్ణదివ్యచరిత్రమును గీర్తించుచు వ్రతనియతి నుండిరి. శ్రీకృష్ణుఁడు వారికిం బ్రత్యక్షమై వరము కోరుఁడనియెను. భగవత్పాదములకు వందనము లాచరించి దోసిలొగ్గి ప్రార్థింపఁ బూనిరి. శ్రీకృష్ణా! నీవు యోగీశ్వరులకేని దుర్లభుఁడవు. సర్వేశ్వరుఁడవు. కారణకారణుఁడవు. నీయీదివ్యరూపము మురళీహస్తమై సదా మా యెదుట దోఁచుచుండునుగాక! ఆవరము ఫలించునట్లనుగ్రహించి యాదేవదేవుఁడు వారి కనవరతము దర్శన మిచ్చుచునే.

యుండెను. హృదయమందు నివసించినట్లు వారికిఁ దోఁపఁ జేయుచు నేత్రములకుఁ గనఁబడుచు నెపుడుతలఁచిన నప్పుడోయని పలుకుచుండెను. పరిపూర్ణతముఁడగునా శ్రీహరి శ్రీకృష్ణరూపమున నావిర్భవించె నని వారు విశ్వసించిరి. * ఒక కార్యముచేయ నవతరించి యనేక కార్యముల నొనరించెను. అనిచెప్పి బహుళాశ్వమహీరమణా!

పరికరీకృతపీతపటం హరిం శిఖికిరీటనతీకృతకంధరమ్,
లకుటవేణుకరం చలకుండలం పటుతరం నటవేషధరం భజే.

అని ధ్యానింపుమా యని వచియించి భక్తిచేతనే భగవంతుఁడు వశ్యుఁడు. ఇందులకుఁ బ్రమాణము గోపికలే. గోపికలు సాంఖ్యమునుగాని యోగమునుగాని బఠించి తదుక్తప్రకారమున శ్రీహరినారాధింపలేదు. ప్రేమముననే భగవంతుని లోఁబఱచుకొనిరి. కావున నీవును శ్రీపరమేశ్వరుని భక్తిచే నారాధింపుమని పలికెను.

పాఠకులారా! దేవాంగనోపాఖ్యానమును వింటిరి. శ్రీకృష్ణసేవార్థము దేవాంగన లవతరించిరని దీనిసారము. గోలోకనాయకుఁడగు శ్రీకృష్ణుని రాసమండలమున దర్శించుట మహాభాగ్యమని మర్త్యలోకమున నవతరించిరి. దివస్పతియనుగోపకునకు దేవలముని యనుగ్రహించి సంతానము కలుఁగుఁగాక యని వరమిచ్చెను. దేవలముని మహాత్ముఁడు. త్రికాలవేత్త. కావుననే యీదివస్పతికి దేవాంగన లుదయించి శ్రీకృష్ణుని సేవించిన

* ఏకకార్యార్థమాగత్య కోటికార్యం చకారహ. అనిమూ.

చో నీతఁడు తరించుననియూహింంచెను. దేవాంగనలుదయించిరి. వీరెల్ల బృందావనమున దివస్పతి నివసించుటకే బుట్టిరి. ఎవ్వరెవ్వరు భగవత్సేవార్థ మేర్పడిరో వారెల్ల బృందావనమునను దత్పరిసరమునను జేరిరి. క్రూరు లగువారెల్లఁ గంసునిపక్షమునఁ జేరిరి. ఈభక్తులు, నాక్రూరాత్ములు శ్రీకృష్ణునిచే ముక్తినిగాంచఁదగిన వారే లోకప్రవృత్తిభేదమే కాని ఫలప్రాప్తియందభేదమే. భగవంతునిచేఁ జంపఁబడిన క్రూరులకు ముక్తి లేదనరాదుకదా! అనఁగా నెవరెవరు శ్రీకృష్ణునిద్వారా ముక్తినొందఁదగుపుణ్యము నొనరించిరో వారెల్ల సేవచేసిగాని విరోధించికాని పరమపదము నొందుదురనుట నిక్కము. ఇది సిద్ధాంతముకాదేని సకలపురాణములు స్మృతులు నసంగతములగు. అట్లైనఁ బుణ్యాత్ములకుఁ బాపాత్ములకు భేదమేమని ప్రశ్నింపవచ్చును? పాపాత్ములుగూడఁ బూర్వజన్మమునఁ బుణ్యముచేసియే యుందురు. కాననే భగవంతునిచే మృతిగలిగినది. పాపముచేసియుందురు. కాఁబట్టియే క్రూరస్వభావముగలిగినది. తమోగుణప్రధానజీవులుచేయు పుణ్యకార్యములకు,సత్వగుణప్రధానజీవులుచేయుపుణ్యకార్యములకు భేదమింతియే.ఫలము తుదకు భగవత్పదప్రాప్తియే.కాని లోకమున భేదముగాఁ గనుపట్టును. శిశుపాలాదులకు ముక్తిలేదందురా భగవంతునిచేఁ జచ్చుటయు నిష్ఫలమగును. కాఁబట్టి యేరూపముననైనను భగవంతుని సందర్శనము మంచిది. దీనికి దృష్టాంతమును వినుఁడు. జయవిజయులు శాపమును బొంది పశ్చాత్తప్తులై ప్రార్థింప భగవంతుఁడే మూఁడుజన్మములనాతో విరోధించి

కాని, ఆరుజన్మముల నాకు భక్తులైకాని నన్నుఁ జేరుదురు. ఏది కోరుదురు? అని ప్రశ్నించెను. ఆలస్యమున కోర్వఁజాలక మొదటి పద్ధతినేకోరిరి. దీనఁ దెలియఁదగినభావమిద్దియే. లోకప్రవృత్తియం దు భేదమున్నను శ్రీకృష్ణపాదసేవకులకు, శ్రీకృష్ణుని ద్వేషించి యుద్ధముచేసిచచ్చినవారలకులభించుపదమొక్కటియే. అట్లులగు టంజేసియేయే స్త్రీలు పురుషులును భగత్సేవాలాభమునుబొందఁ దగుపుణ్యము నొనరించిరోవారెల్లబృందావనప్రాంతములఁ జేరిరి. కృష్ణునిహతులుకాఁదగువారెల్లఁగంసశిశుపాలాదిరాజపక్షపాతు లయిరి. కాఁబట్టి యిందఱుగోపికలుండిరా యని శంకనొందఁబని లేదు. శ్రీరామావతారమున దండకారణ్యమునఁ దత్పాదదర్శ నముచేయఁగలపుణ్యము నొనరించినవారెల్ల మునులుగను దద్భార్యలుగను బుట్టి వేచియుండిరి. కొందఱు రాక్షసులుగఁ బుట్టియందేయుండి శ్రీరామమూర్తివలన ముక్తులైరి. వాలికిని శబరికిని ముక్తిలభించుటలో భేదముగలదా. తమస్సత్వప్రధా నజీవులనుట యొక్కటియే భేదముగాని వేఱుగాదు కదా?

ఇఁక నీగోపికలచరిత్రమును బరిశీలించెదను. వీరు మాఘవ్రతము నాచరించిరి. భగవంతుఁడు ప్రత్యక్షమై వర మడుగుఁడన సదా మాకుఁ గనఁబడుచుండుము. ఇదియే. మావాంఛిత మనికోరిరి.

త్వం నేత్రగామీభవతాత్సదానోవంశీధరోమన్మథమన్మథాంగః.

ఇదియే వారికోరిక. గోపికలు రతిని గోరిరని వచింప నెవ్వనికైన శక్తి గలదా? అట్టివారివాగ్ధోరణి యిట్లే యుండునా?

ఇది యొకసంభోగమే యైన దీనిం బురుషులుకూడఁ గోరవల సినదే. మహర్షులుకూడఁ గోరవలసినదే. ముక్తి యింతకంటె నెక్కువదికాదని నాయాశయము. కావున భక్తులారా! గోపి కలు భగవత్సేవార్థ మవతరించినవారని, వా రతిప్రేమమున నా రాధించిరని, వారిమనసులు భక్తిరసపూరితములని తలంచుట పాడి. వేఱొకరీతిగాఁ దలంచుట పూర్వజన్మకృతకర్మవిశేషము ననే. ఇట్లు గోపికలచరిత్రమును వ్రాయుటయీగ్రంథమును బెం చుటకుంగాదు. గోపిక లెవ్వరనువిషయము తెలిసినఁగాని భగవ చ్చరిత్రదూషణము మిథ్యయనితోఁపదనియు, నదియే యీపుస్త కమునకు ఫలమనియు నాశయమున వ్రాయఁబడినదని గ్రహింప వలయును. ఇంతటనీవిషయమును మానుచు నొక్కమాట చెప్పి చరిత్రాంతరము వ్రాసెదను. భగవంతుఁడు భక్తిచే లోఁబ డినట్లు ప్రక్రియాంతరములచే లోఁబడఁడనియు నిష్కపటభక్తి యలవరించుకొనుట మనవిధియనియు మఱియొక పర్యాయము చెప్పుచున్నవాఁడ.

## జాలంధరీగోపికావృత్తాంతము.

* నారదుఁ డింకను బహుళాశ్వునకు గోపికావృత్తాంత మును జెప్పనెంచి యిట్లు పలికెను. రాజచంద్రమా! జాలంధరీ గోపికావృత్తాంతమును జక్క నాలకింపుము. సప్తనదీతీరమున రంగపత్తన మొం డుండెను. అది నగరోత్తమమని ప్రఖ్యాతిం

*ఈకథయుం గర్గసంహిత మాధుర్యఖండము పదునాల్గవయధ్యాయము నుండి గ్రహింపఁబడినది.

గాంచినది. సర్వసంపత్సంభృతము. రెండుయోజనములపొడవా నగర ముండునని నిర్ణయింపఁ బడియె. ఆనగరాధిపతి రంగోజియనుగోపాలుఁడు. మహాబలుఁడు. పుత్రపౌత్రసమన్వితుఁడు. సమధికధనధాన్యయుతుండునై యుండెను. ఈగోపాలుఁడు హస్తినాపురనాథుఁ డగుధృతరాష్ట్రునకు నేఁటేట ననేకస్వర్ణముద్రికలఁ గప్ప మిచ్చుచుండెను. ఒక్కతఱిఁ గప్పమిచ్చుగడువు దాఁటినను మదోత్కటుఁడై యాగోపాలుఁ డూరకుండెను. మహోత్సవసందర్శనార్థమైనను బోవకుండెను. ఆవిధ మెఱింగి ధృతరాష్ట్రుఁడు వీరభటులను రంగనగరమునకుం బంపెను. వారరిగి యారాజునుగట్టి కరిపురికిం గొనిపోయిరి. చాలసంవత్సరములు కారాగారమున నాగోపకు నునిచిరి. కారాగారమందుండినను, గొట్టఁబడినను, భీరువుగాక యతఁడొక్కరీతి నుండెను. కప్పమిత్తును విడువుఁడను మాటనైన బలుకకుండెను.

ఒకానొకదినమున నాగోపకుఁ డాభయంకరకారాగారమునుండి పలాయనపరాయణుఁ డయ్యెను. అదెట్లుసాగెనో భగవంతుఁ డెఱుఁగును. ఒక్కనాఁటిరేయి రంగపురమును జేరెను. మరల నారాజునుగట్టి తెండనిధృతరాష్ట్రుఁ డాజ్ఞాపింప ననేకవీరభటు లరుదెంచి నగరమును ముట్టడించిరి. రంగోజియు వారినెదిరించి యనియొనరించెనుగాని వారియాటోపమునోర్వఁ జాలకపోయెను. ఎట్లో తప్పించుకొని పురికరుగుదెంచి యదుభూపతియగుకంసు నాశ్రయింపఁదలఁచి తనదూతను బిలిచి భయపీడితుఁడు. గావునఁ దనస్థితిని దెలిపిరమ్మని పంపెను. ఆ

దూతయు మధురానగరమున కరిగి రాజద్వారమున నిలిచి తనరాకఁ దెలుపుకొని రాజానుమతినిసభాంగణమును బ్రవేశించి నతాస్యుఁడై కరపుటము నిటలమున ఘటియించి మహారాజా! రంగపురపాలకుఁ డగురంగోజి శత్రుసంరుద్ధుండై యనాథుఁడై నీశరణమును గోరెను. నీవు దీనమానపరిపాలనసమాదరుఁ డగు మహారాజవు. మహాబలపరాక్రమశాలివి. భయంకర పరాక్రమోపేతాసురుల నోడించితివి. మహేంద్రున కైన యగువాఁడవు.చకోరములు శీతకరుని, కుశేశయము భాస్కరుని, జాతకములు శరచ్ఛీకరమును, క్షుధాతురు లన్నమును, తృషా తురులు జలమును సమాశ్రయించునట్లు మాభూపతి దీనుఁడై నిన్నాశ్రయించెను.

దూత యీలాగు పలుక నాలకించి కంసుఁడు దీనవత్స లుఁడై దైత్యకోటులంగూడి పో నుద్దేశించెను. కంసునివాహ నము కువలయాపీడమను గజరాజము. దానియలంకారము లనర్ఘ్యదృశములు. దానినెక్కి చాణూరముష్టికులు వెంట రాఁగాఁ గేశివ్యోమవృషాసురులు సైదోడగుచుండ రంగ పత్తనమున కేగెను. యదుకురుబలముల కన్యోన్యమహాహవము సంఘటిల్లెను. బాణములు, ఖడ్గములు, శూలములు తమప్రతా పమును గనఁబఱచుచున్నట్లు చలించుచుండెను బాణాంధ కారము గ్రమ్మఁగా నాకంసుఁడు గదాపాణియై శుష్కారణ్యము నగ్నివలెఁ గురుసేనలయందుఁ జొచ్చి యశనితుల్యమగుగదా దండప్రహారములఁ గొందఱ ఖండఁ జేయుచు, నింద్రుఁడు

వజ్రమునఁ బర్వతములం బోలెఁ దక్కినభటుల నుక్కడంచుచుఁ బాదస్పర్శమున రథములను, హస్తములచే ఘోటకములను నశింపఁజేయుచు, గజములచే గజములఁ బోడవడఁగించుచు, బలములనెల్లఁ జిందఱవందఱగా నొనరించెను. తత్సహచరు లగు కేశివ్యోమాసురాదిదానవపుంగవులు రణమున విహరించిరి. హతశేషు లగుసైనికులు దశదిశలకుఁ బరుగులిడిరి.

అంతఁ గంసుఁడు సకుటుంబముగా రంగోజినిబిలుచుకొని మధురానగరమునుజేరెను. కౌరవులు స్వబలపరాజయము నాల కించి రాక్షసులప్రవృత్తిని దలంచి మౌనముండిరి. కంసుఁడు రంగోజికి బర్హిషదమనుపేరుగలనగరము నొసఁగెను ఆరంగోజీగారందే నివసించిరి. జాలంధరీస్త్రీ లాతనికిం బుత్రికలై పుట్టిరి. పెక్కుభార్య లాతనికుండుటంబట్టి పెక్కుమంది కన్యక లుద యించిరి. వారెల్ల శ్రీహరివరప్రభావసంజనితలు. వారు గోప కులఁ బెండ్లియాడిరి. రూపయౌవనసంపన్నలై శ్రీహరిని ప్రేమించిరి. వారిమనస్సులు శ్రీకృష్ణునియందు లగ్నము లయ్యెను. వారిపూర్వచరిత్రము నెఱింగి శ్రీకృష్ణుఁడు చైత్ర మాసమున బృందావనమున రాసమండలమున విహరించెను.

సజ్జనశేఖరులారా! ఈవృత్తాంతమునఁ బెక్కుసంశయ ములఁ గలుగఁజేయువిషయ మున్నది. దానినుదహరించి తద్విషయకసమాధానమును వ్రాసెదను. జాలంధరీకాంతలందఱు శ్రీహరివరప్రభావమున భూలోకమున నవతరించిరి. వారిని గోపకులు పెండ్లియాడిరి. వారు రూపయౌవనసంపదల నల

రారిరి. శ్రీహరినే ప్రార్థించిరి. వారిం గూడి శ్రీకృష్ణపరబ్రహ్మము బృందావనమున విహరించెను. అని యున్నది కదా. గోపకులం బెండ్లియాడినగోపికలు శ్రీహరియందు స్నేహ మునిచిరనియు వారిం గూడి క్రీడించె ననియుఁ గనఁబడుచో నిది జారత్వముకాదా యనుశంక యుదయింపక పోదు. దీనికింగూడ సమాధానము కలదాయనియుఁ దోఁచును. కాని యించుక సూక్ష్మదృష్టిం బరికింపుఁడు. గోపకులెవ్వరు ? గోలోకవాసులగుశ్రీకృష్ణాపరస్వరూపులు. గోపిక లెవ్వరు ? శ్రీకృష్ణపాదాంబుజాసక్తచిత్త లగుశ్రీరాధాకళాసంభూతలు. కొందఱు పద్మావతీకళాసంభూతలు. కొందఱు శ్రీకళాసంభూతలు. రాధాపద్మావతీభార్గవీనామములు వేఱుగానున్నను భగవత్పత్ని యొకర్తయే. భక్తానుగ్రహార్థము పెక్కుస్థలములఁ బెక్కునామముల వెలయుచుండును. శ్రీమత్పరమపురుషుఁడు నట్లే పెక్కురూపముల నామముల నలరుచుండును. వారికి భేదము కల్పింపరాదు. కల్పించునంతకంటెఁ బాపకార్యము వేఱొకటి లేదు. అది మనకు రాకుండుగాక!

వివాహము విధివిహితము. కన్యాదానము చేయునధికారము తల్లిదండ్రులకుఁ గలదు. బ్రహ్మక్షత్రియవైశ్యులు ద్విజులనఁబడుదురు. ఈమూఁడుతెగలవారికి వేదపఠనాధికారము కొనితెచ్చుకొన్నదిగాక విధివిహిత మైనది. అందు బ్రాహ్మణులకు వైశ్యుల కొక్కరీతిని, క్షత్రియుల కొక్కరీతిని వివాహకాలవిధి యేర్పడినది. యాదవులు రాజులు. యయాతిశాప

మున రాజ్యభ్రష్టులైరి. కాని కులోచితధర్మభ్రష్టులు కాలేదు. ఈజాలంధరగోపికలకుఁ దండ్రి వివాహముచేసెను. వారు ప్రౌఢలైరి. యౌవనశ్రీసమాకలిత లైరి. వారిమదు లప్పుడు వికసించినవి. పూర్వపుణ్యమున శ్రీహరిపై స్నేహము నుంచుభాగ్యము వారికిం గల్గినది. వారలంగూడి శ్రీకృష్ణుఁడు బృందావనమున విహరించెను. అనఁగా రాసమండలమున వినోదించె నని భావము. రాసమండలము క్రీడాస్థానము కాదనియు శ్రీపతిభక్తులతో నృత్యముచేయు మహాయంత్రస్థానమనియుఁ బురాణములు ఘోషించెడిని.

"జారధర్మేణ సుస్నేహం శ్రీకృష్ణే తాః ప్రచక్రిరే."

అని యున్న దిగదా. ఇదేమని ప్రశ్నింపవచ్చును. కులట జారునియం దెట్టిస్నేహము నుంచునో యట్టి దనఁగా గాఢస్నేహమని తాత్పర్యము. కులటలై జారుఁడగుకృష్ణునియందుఁ బ్రేమమునిచిరని యర్థము చెప్పఁగూడదా అన్నఁ జెప్పరాదు. ఇపుడుండుభాషానియమములఁ బట్టి యట్టియర్థము చెప్పవలనుపడదు. కావున దుష్పాండిత్యము నుపయోగింపక గాఢతరమైత్రి నునిచిరని యంగీకరించుట బాగు.

"చైత్రమాసే మహారాసే తాభిస్సాకం హరిస్స్వయం,
పుణ్యే బృందావనే రమ్యే రేమే బృందావనేశ్వరః."

ఇందు రేమే అనుధాతువునకు వారిం గూడి నర్తనకేళి సల్పెనుట సంగతముకాదనియు విహరమే దానియర్థమనియుఁ గొందఱు పండితమ్మన్యులు వాదింతురు. ఆర్యులారా! చక్కఁగాఁ

బరికింపుఁడు. శ్రీహరి స్వయముగాఁ జైత్రమాసమందు మహా రాసమండలమునఁ బరమపవిత్ర మగుబృందావనమున బృందావనేశ్వరుఁడై విహరించెనని శ్లో కార్థము. క్రీడాగృహమును వర్ణించునపుడు పరమపవిత్రమై, తపోయోగ్యమై, యోగిజనసేవితమై తగుశయనగృహమందు జారుఁడు తానుగాఁ గ్రీడించెననివర్ణించు ఘట్టములనెందైనఁ గంటిరా? "పుణ్యేబృందావనేమహారాసేహరి స్స్వయంతాభిస్సాకంరేమే" అనుపదములకూర్పునుదలంచినచో వ్యభిచరించెనునర్థము చెప్ప వీలుండునా? స్వయముగా విహరించెననఁగా నితరుల సాయముగోరకుండఁ దానే యనియర్థమా. ఔరా! ఎంతటి తెలివితక్కువ! భగవంతుఁడు వేషాంతరమునఁగాక గోలోకమున ద్విభుజవిరాజిత మగురూపమున నాగోపికలతో నాట్యమాడెను. మహారాసమున విహరించెననఁగా వ్యభిచరించెనని యర్థము చెప్పుట యోగిమానసపద్మములందు రమించువాఁడు గాన రాముఁడనుచోట తనకువలసినకాంతలంగూడి యోగులమనస్సరోజములయందు వ్యభిచరించెనని చెప్పినట్లున్నది. కావున నీభాగమున నీసూత్రము నీచార్థము కానరాదు దానిని గల్పించుకొనుట వారిపూర్వజన్మసంస్కారవిశేషముచేతనే యనక మానవీలులేదు. భగవంతునియందిట్టియపార్థములఁ గల్పింపక తత్కథలఁ బరమభక్తితోఁ బఠించినఁ బుణ్యము లభించును. కాఁబట్టి యట్టిసత్కార్యమునకుఁ బ్రయత్నింపుఁడు. ఇంతట నీవిషయమును వదలి తరువాతిపుణ్యకథను వ్రాయఁ బూనెదను.

## సుదర్శనోపాఖ్యానము.

* అష్టావక్రమునిచరిత్రమును వ్రాసినపిదప గర్గసంహిత నుండి గోపికలచరిత్రమును గొంత వ్రాసితి. అది గోపికలవ నెవరు? వారు శ్రీకృష్ణు నేల ప్రేమించిరి ? అన్న విషయమునఁ గలయపార్థమును దొలఁగించునన్న యాశయముననే యీచరిత్రము వ్రాయఁబడియెనని స్పష్టమగును. ఇఁకను గోపికలచరిత్రములు గలవు కాని వాని నాయాయిసందర్భములలో వ్రాయ నెంచితిని. భగవంతునిచరిత్రమును బూర్వానుబంధముగా వ్రాయఁ దలఁచితిని. ఈగోపికలచరిత్రముకూడ శ్రీకృష్ణమహిమమునే తెల్పును. రాసమండలవిహారానంతరమున భగవంతుఁడేయేకార్యముల నొనరించెనన్న ప్రశ్నము రాకమానదు. దానికి సమాధానముగాఁ జరిత్రమును వ్రాయుచుఁ బ్రాచీనానుబంధమును దెలుపుగాథల నడుమనడుమ తెలుపుచు విషయమును విమర్శించెదను. దాని నాలకింపుఁడు.

శ్రీకృష్ణుఁడు రాసమండలవిహారమును జాలించి యెప్పటియట్ల గోకులమున నుండెను. అంతనుముందేయేవినోదముల నాహరి యొనరించెనో అందఱు వానివచిరి. ఇందులకు భగవన్మాయయే కారణము. ముద్దుకుమారుని జూచుచు యశోదయు నందుఁడు నానందించు చుండిరి. కాల మిట్లు హాయిగా గడచు చుండెను. కాని యీరీతిగాఁ గాలము పుచ్చుట భగ

---

* ఇదియు గర్గసంహిత మాధుర్యఖండమున నిరువదిమూఁడవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

వంతునాశయముకాదు తనయవతారమున కిది ఫలముకాదని యామహాత్ముఁ డెఱుఁగును. కావునఁ దనపని యేమని యూహిం చెను. శ్రీకృష్ణుఁ డిట్లూహింపఁగనే గోపకు లేదోయొక కార్య ము చేయ సంసిద్ధులైరి. భగవదిచ్ఛ యట్టిదనుట సత్యమే కదా. ఒక్కనాఁడు రాజచిహ్నములుగల గోపాలురగు వృషభానూప నందాదులు రత్నపూరితము లగుశకటముల నెక్కి యంబికావ నమును జూడఁబోయిరి. అందు వేంచేసి భద్రకాళికను బశు పతిని విధానమునసుసరించి పూజించిరి. ద్విజాతిప్రవరులకు యథాశక్తి దానము లొసంగిరి. ఆనదీతీరమున నాఁడు నివ సించిరి. భగవత్కథలఁ జెప్పుకొనుచు సుఖనిద్ర చేసిరి.

ఆనడికిరేయి నదీతీరస్థవల్మీకాంతరముననుండి యతి భయంకరసర్పరాజ మొండు బయలువెడలి ఫూత్కారముల నగ్నిజ్వాలల వెలువరించుచు వడివడిఁజనుదెంచి నందపాదములఁ బట్టుకొనెను. అతిశయసాధ్వసవిహ్వలుఁడై నందుఁడుకృష్ణాకృష్ణా యని యాక్రోశించెను. ఆయాక్రోశమునువిని గోపకులెల్లఁగొఱ వికట్టులను బాషాణములను దానినిజావమోఁదిరి. కాని యాయ జగర మాతనిపాదముల వదలకపోయెను. నందునిచెంతనే శయ నించియున్నయాబాలగోపాలుఁడు లేచి తనపాదమున దానిం దన్నెను. ఆపాదము తనదేహమును స్పృశింపఁగనే యది యాసర్పరూపమును వదలి సఫలమనోరథుఁడగు విద్యాధరుఁ డయ్యెను. భక్తియుక్తుఁడై యతఁడు శ్రీకృష్ణపరబ్రహ్మపాదార విందములకు వందన మాచరించి కరయుగమును మోడ్చి యిట్లు ప్రార్థించెను.

పరమేశ్వరా ! నేను సుదర్శనుఁడను విద్యాధరుఁడను. అష్టావక్రమహామునిం జూచి పరిహాసించితిని. అత్తఱి నాకంటె బలవంతుఁడు లోకమున లేఁడన్న గర్వము నాకుండెను అమ్ముని యందుల కాగ్రహించి దుర్మతీ ! నీవు సర్పరూపమున నుండు మని ఘోరశాప మొసంగెను. శాపవాక్కు వినఁబడినంతనే భీతుఁడనై యమ్మునిపాదముల వ్రాలి నాయీయపరాధమును మఱచి శాపమోక్షము ననుగ్రహింపుమాయని వేడితి. వారను గ్రహించిన వాక్కులఫలమే యీనీసందర్శనము. భవత్పాదార విందదర్శనమున ముక్తి లభించెను. మహాత్మా! నీపాదపంకజరజః కణసంస్పర్శమున దివ్యపదవిని బొందఁగలను. అట్టిమహిమము గల భగవంతునకు సకలబ్రహ్మాండనాయకునకు భూభారహర ణార్థ మవతరించిన పరమేశ్వరునకు నీకు నమస్కారము లొన రించెదను. అని వినుతించి శ్రీకృష్ణానుజ్ఞాతుఁడయి యావిద్యా ధరుఁడు సర్వోపద్రవవర్జితుఁడై వైష్ణవలోకము నొందెను. ఆవిచిత్రచరిత్రమును గాంచిననందాదులు విస్మితులై శ్రీకృ ష్ణుని బరమేశ్వరునిగా భావించుచు నాయంబికావనమునుండి గోకులమున కేతెంచిరి. ఇది బాలగోపాలు నద్భుతకృత్యంబులం దొక్కండు. దీనిం బఠించి భక్తిచే హరిం దలంచినఁ బాపములు తొలంగును. అన విని యాబహులాశ్వభూపతి పిదప శ్రీకృష్ణుఁ డేయేలీలల నొనరించెనో తెలుపుమని ప్రార్థించెను.

పాఠకమహాశయులారా ! ఈచిన్నకథయం దొక్క విశేషము పొడకట్టెడి. పూర్వాచారము లెట్టివో తెలిసి

కొనుట ముఖ్యముకదా? మనపూర్వులు తఱచుగా శుభకార్యములకు ముందును, ఆపత్కాలమునందును శక్తిదేవతాపూజ చేయుచుండువారు. అందును భద్రకాళీప్రభృతిదేవతలం బూజించువారు. ఏల ? అనియూహింతము. కాళియనఁగా భగవంతుని స్త్రీరూపమనికదా తాత్పర్యము. స్త్రీరూపమున వెలయు భగవంతుఁడే యనిసారము. ఆరూపమునకే ప్రకృతి యనిపేరు. రూపధారి యగుభగవంతుఁడే సగుణబ్రహ్మమని పిల్వఁబడువాఁడు. నటుఁడు సమయాంతరమున నొక్కొక్క వేషమును దాల్చుచుండును. అట్లే భగవంతుఁడు సమయానుకూలముగాఁ బెక్కురూపముల ధరించి ప్రపంచపరిపాలనము చేయుచుండును. ఇవన్నియుఁ బరమేశునిరూపములు. ఇన్ని యుండినఁగాని ప్రపంచము నడుప నవకాశము చాలదు. భగవద్రూపములం దొకదానిని దూషించుట వేఱొకదానిని భూషించుట యీరెండుకార్యము లజ్ఞానవిలసనములనక తప్పదు. అన్నింటియందు సమబుద్ధిగలవారే జ్ఞానులు. విషమబుద్ధిగలవా రపూర్వజ్ఞానులు. ఒకభగవద్వ్యక్తిని దూషించినచో రెండవవ్యక్తిని భూషించుటయు వ్యర్థము. సర్వజ్ఞుఁడగు పరమాత్ముఁ డీమూర్ఖుని ప్రేమింపఁడు. వీనిభక్తిని గైకొనఁడు. సేవానిరతిని బరికింపఁడు. ఏల ? వీఁడు బుద్ధిశూన్యుఁడని గ్రహించుటచేతనే ప్రేమింపఁడని మనమూహింపవలయును.

శ్లో. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. ౫అ. ౭శ్లో.

సర్వేషాం భూతానాం ఆత్మభూత ఆత్మా యస్య సః లోకసంగ్రహార్థం స్వాభావికం వా కర్మ కుర్వన్నపి న లిప్యతే. నైర్నబధ్యతే అని శ్రీధరాచార్యులు.

పిపీలికాదిబ్రహ్మపర్యంతమును బ్రహ్మముగాఁ జూచుచుండువాఁడు కర్మములచే బంధింపఁబడఁడు.

ఈగీతావాక్యమే పైవిషయమును సిద్ధాంతము చేయుచున్నది. ఎవఁడు సర్వభూతములయాత్మను దనయాత్మగాఁ జూచువాఁడోయనఁగా భావమేమో పరికింపుఁడు. అట్టివాఁడేజ్ఞాని. తనయుపాస్యదైవమును సర్వరూపములయందును గనుచుండువాఁడుకదా భక్తుఁడు. అట్లుగాక యున్నచోవాఁడుభక్తిహీనుఁడు. కుక్షింభరుఁడు. కపటాత్ముఁడు. పరవంచకుఁడునగుఁగదా. అట్టివానికి భగవత్ప్రసాదము లభించునా? దేవాలయములందు దేవలకుఁ డిడుప్రసాదము లభించును. అంతియకాని పరమేశ్వరానుగ్రహము లభింపదు. సత్యముగా లభింపదుసరికదా జన్మాంతరమున వానికి మనుష్యత్వ మలవడదు. ప్రకృత మనుసరించెదను.

నందాదు లంబికావనమున కరిగిరి. భద్రకాళిని బూజించిరి. వినుతించిరి. ఆరేయి సుఖనిద్ర చేసిరి. ఆదేవీసన్నిధియందే యుండుకొనిరి. వారి కిట్టి యపమృత్యుపీడ యేలకలుగవలయు నన రాదు. తొలిమేనఁజేసికొన్నపుణ్యపాపములు ఫలముల నిడక విడువవు. ఇదియు భగవదాజ్ఞయే. ప్రకృతకథయందు శ్రీకృష్ణునిచే శాపముక్తినిబడయఁగల్గిన పూరుషుఁ డొకఁడుకలఁడు.

వాఁడు సర్పరూపమున నుండువాఁడు. వాని కారాత్రికి ముక్తి కలుగవలసినదని కర్మము సిద్ధాంతముచేసినది. అదియుమాఱ్ప రానిదియేకదా. అది నందాంఘ్రిద్వయముం బట్టుకొనియు ఆపైన కారాత్రి యతఁడు పాత్రుఁడు కాఁదగునని సిద్ధాంతము. శ్రీహరి దానిం గాలందన్నెను. తత్పాదస్పర్శమున దానికి శాపముక్తి లభించెను కృష్ణుఁడు భగవంతుఁడే యని దానింబట్టి నందాదు లెఱింగిరి ఎఱింగినవిషయము మనకు మహర్షులు తెలిపిరి. ఆజ్ఞా నము నందాదులకుఁ జాలసేపు నిలువరాదు. అదియే నిలిచిన చో లోకవ్యవహారములు గొన్ని సాగవు. కావున భగవంతుఁ డాత్మమాయచే వారి నాచ్ఛాదించెను. వెంటనే వారు బాల కృష్ణునిమహిమ మవాఙ్మానసగోచరమనువిషయమును మఱచిరి. కాని సర్వకార్యదక్షుఁడు శ్రీకృష్ణుఁడనిమాత్రము తలంచిరి.

ఈకథ మనకుఁ బూర్వులయలవాటులఁ దెల్పుచున్నది. దేవతారాధనము ముఖ్యమనియు, శివకేశవాదినామములు భగ వంతునకు భక్తులకొఱకుగాఁ గల్పింపఁబడినవనుసిద్ధాంతము మన వారెఱుంగుదురనియు, దేవతాంతరద్వేష మాకాలపువారికి లేదనియు, అంబికాభార్గవీసరస్వతీప్రభృతులకుఁ దారతమ్యము కలదనుస్వల్పబుద్ధి పూర్వులకుఁ గించిత్తైన లేదనియు నీకథ మన కుఁ దెలుపుచున్నది. కావున మనముకూడ నల్పభేదములఁ బా టించి మతదూషణ మొనర్పక భగవద్రూపములలో నొకదా నిని భూషించి వేఱొకదానిని దూషింపక మారాముఁ డధికుఁ డు మాశంకరుఁ డున్నతుఁడని తుచ్ఛాలాపములఁ గాలము

గడుపక సర్వరూపనామపరిభాసురుఁడగు భగవంతు నిష్టకల్పిత రూపమున నామమునధ్యానించుచుస్మరించుచు నితరులుచేయు పూజాదులు తామసములని యాక్షేపించి యాపాపమును సంపాదింపక పరిశుద్ధమతి కలిగినపుడెల్ల సర్వాంతర్యామిశ్రీకృష్ణుని ధ్యానించుచు శ్రుతిస్మృతిపురాణేతిహాసములకుఁ దోఁచిన ట్లల్పమతిరై యర్థములఁగల్పింపక శాంతము నలవాటుచేసికొనుచుఁ బరమపురుషార్థమునకుఁ బ్రయత్నముచేయుట న్యాయము. కానిచోఁ గాల మతిచంచలము. దేహము క్షణభంగురము. కాలుఁడు సదా వేచియుండును. ఒక్కక్షణము వృథచేసిన నది మరలలభింపదు. కాఁబట్టి యిట్టివిపరీతప్రసంగముల, డాంబికాలాపములఁ గాలముపుచ్చరాదు. ఇంక నీవిషయమునుండి విరమించి భగవత్కథాంతరమును మనవి చేసెదను.

భక్తవర్యులారా ! ఈప్రకరణమునఁ దొలుతొలుత రాధాదేవిప్రశ్నింప శ్రీహరి యష్టావక్రమునిమహిమమును జెప్పుకథ వ్రాయఁబడినది. దానివెంట రాధామాధవులదర్శింప నాసురియనుమునియు శివుఁడు నరుదెంచుటయుఁ దత్ప్రస్తావమున గోపికలచరిత్రములును వ్రాయఁబడినవి. బృందావన చరిత్రమును బూర్తిచేసి భగవంతుఁ డొనర్చినకృత్యముల వ్రాయఁదలంచితిని. నడుమ దానిని వదల నయితిగాదు. కావున రాధామాధవులసంవాదమును నిరవశేషముగా వ్రాయ శక్యము గాకున్నను సంగ్రహించి వ్రాసి పిదపఁ గంసవధ ప్రయత్నమును వ్రాసెదను. అట్టులౌట నిదియొక్కడికథ యని

లేంకనొందక బృందావనచరిత్ర శేషమని దీనిని భావింపవల యును. అవాంతరకథ లవసరములే యని భావింపవలయును. ఇప్పట్టున శ్రీలీలాశుకు లొనరించిన శ్రీకృష్ణస్తుతిని బఠించి తరు వాత దచ్చరిత్రమును జదువుదము.

శ్లో. ఓష్ఠం జిఘ్రన్ శిశురితిధియా చుంబితో వల్లవీభిః
కంఠం గృహ్ణన్నరుణితపదం గాఢమాలింగితాంగః,
దోష్ణాలజ్జాపద మభిమృశన్నంకమారోపితాత్మా
ధూర్తస్వామీ హరతు దురితం దూరతో బాలకృష్ణః.

శ్రీకృష్ణకర్ణామృతము 3 ఆ. ౬౯.

పాఠకులారా! అంబికావనవృత్తాంతమును జదివినపిదప మరలమీమనముల బృందావనముప్రక్కకుం ద్రిప్పుఁడు. రాధా మాధవు లందు విజయంచేసినట్లు భావింపుఁడు. ఆదంపతులు లోకానుగ్రహార్థ మేవిషయముల సంభాషించి రని వానిం దెలిసి కొన నవహితుల రగుఁడు. ఇపుడు రాధాదేవియు శ్రీకృష్ణు నష్టావక్రమునిచరిత్రమును విన్నపిదప లోకుల నుద్ధరింపఁగోరి యింకను బ్రశ్నించుచున్నదని యెఱుంగుఁడు. లోపలికథలను దీనికి నేమిసంబంధముగలదని ప్రశ్నించుప్రయత్నమును మానుఁ డు. శ్రద్ధతో నాలకింపుఁడు.

బ్రహ్మశాపకారణమును శ్రీహరి రాధకుం దెల్పుట.

*శ్రీకృష్ణపరమాత్మ వచించినపలుకు లాలించి రాధాదేవి

---

*ఇయ్యది శ్రీకృష్ణజన్మఖండము ముప్పదొకఁడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

పరమేశ్వరా! మిక్కిలి యచ్చెరువును గల్గించునట్టిచరితమును వినిపించితిరి. మనస్సు సంతోషసాగరనిమగ్నమయ్యెను. ఇపుడు బ్రహ్మకు శాప మేల కలిగెనో వినఁ గోరెదను. ముల్లోకమ్ములకు సృష్టికర్తయై తపస్సు చేయువారలకు సకలఫలముల నొసంగుచు మహాత్ముఁడనవెలయు సరస్వతీజానికిఁ గులటాశాపకారణమునఁ బూజ్యత లేకపోయెనా. ఇంతకంటె నాశ్చర్య మేమున్నది? ఈసందియమునాకుఁ దీఱునట్లు తత్కథను సాంతముగా వచింపుమని వేఁడఁగా శ్రీకృష్ణుఁ డాదరమున రాధిక కిట్టు లనియె. రాసేశ్వరీ! చక్కఁగా వినుము. రైవతమన్వంతరమున సుచంద్రుఁ డను నృపపుంగవుఁ డుండెను. ఆతఁడు తపస్వియు, విష్ణుభక్తుఁడు, జ్ఞానియుఁ బరమధార్మికుఁడు నై యుండెను. ఆ రాజు తపోనిరతుఁడై భారతభూభాగములందు మనోహరమగు మలయద్రోణికి వచ్చెను. అందు సహస్రవర్షములు తపస్సు చేసెను. కఠినతరమగునాతపోనియమమున నా రాజర్షి దేహము కృశించెను. వల్మీకాంతరమున జీర్ణప్రాయమై యున్న యతని తనువును జూచి బ్రహ్మ కృపానిధియై యచ్చోటికి వరమీయ నరుదెంచెను. ఆ విధాత చేతి కమండలూదకము నాపాదోద్భవమని యెఱుంగుదువు కదా. ఆ జలముల నా రాజర్షి దేహముపైఁ జల్లి నన్ను ధ్యానించుచు మద్దత్తమంత్రమును బఠించుచుఁ బలుమాఱు నాజలములఁ బ్రోక్షించెను. ఆకమండలూదకము మేనునఁ బడినంతనే సుచంద్రుఁడు లేచి తనయెదుట విజయంచేసియున్న విధాతకు భక్తియుక్తుఁడై నమస్కరించెను. పాదముల వ్రాలియున్న యన్నర

పాలునిం జూచి నలువ కరుణయొలయుపలుకుల నిట్లనియెం. రాజా ! నీమనమున నేమికోరికగలదో యది ఫలించునట్టివరము నడుగుము. తప్పక యిచ్చెద ననియె. అన విని యానరపుంగవుఁడు మహాత్మా! శ్రీకృష్ణపాదకమలభక్తియు,శ్రీకృష్ణదాస్యము ననుగ్రహింపుమా యని వేఁడెను. ఆవరమును బరమాదరమున సరసిజాసనుఁ డొసఁగి యతనితనువును దడవెను. తత్కర సరసిజస్పర్శమాత్రమునఁ దజ్జీర్ణదేహము నవనవవికాసభాసురమై తనరారెను. అత్తఱి నారాజన్యుఁడు నూతన మీనకేతనుఁడో యన నొప్పియుండెను. ఇంతలో నంబరమునుండి యొకరథమరుదెంచెను. అది పరమపవిత్రము. దానియందుఁ బార్షదులుండిరి. వారు చతుర్భుజులు. పీతాంబరాఢ్యులు. వారిం గాంచి సుచంద్రుఁడు నమస్కరించెను. ఆరాజు మూర్ధముపైఁ గుసుమవృష్టిం గురిసెను. దుందుభులు మ్రోయించి సురలు ప్రమోదమును దెల్పిరి. గంధర్వులు పాడిరి. అచ్చరమిన్నలాడిరి. * ఋషులు మునులు సిద్ధులు పరమానందమున నాతని నాశీర్వదించిరి. ధన్యుఁడవైతి వోరాజా యని దేవతలు ప్రశంసించిరి. ఆరాజు పార్షదులం జక్కంజూచి ధ్యానించుచుఁ దద్రూపుఁడయ్యెను.

పార్షదు లాతని రథమున నునుచుకొని గోలోకమునకుం బోయిరి. ఆతఁడు పార్షదుఁడై మత్సేవకుఁడయ్యెను. బ్రహ్మయు సుచంద్రునకు వరము లొసంగి తనమందిరమునకుం బోయెను.

---

*ఋషయో మునయస్సిద్ధాః ప్రహర్షంతో ముదాశిషః. అని మూలము.

సత్యలోకమున కరుగుచుండుచతురాస్యుని మోహిని కనుంగొనియెను. ఉద్యానవనమున నామోహిని యపుడుండెను. నలువయు హంసవాహనారూఢుండై పోవుచుండెను. అత్తఱిం బుష్పపరిమళభారమును వహించి వాయువు తనకుంగల గంధవహనామమును సార్థకము చేయుచు మెల్లమెల్లన నందఱి స్పృశించుచుండెను. ఆసమయముననే మదనహవ్యవహజ్వాలామాలిక లాభీలముగ నామోహినిమదికిం దాపమును గల్గింపసాగెను. కావున భక్తియు క్తింగాక మోహాతిశయంబున నలువం జూచెను. సుస్మితము తనంతట తానే మోమునందోంచెను. దాన నామోహిని తనమోమును, వస్త్రాంచలంబున నాచ్ఛాదించుకొనియెను. తన్ముఖశీతాంశుని సిందూరతిలకము పూర్ణచంద్రునిగా నొనరింపం జాలెను. ఆమె తనుచ్ఛాయ చారుచంపకవర్ణము గలది. స్థిరయౌవన మామెకు వరప్రసాదలబ్ధము. ఆమె తక్కినయవయవములసౌందర్యమువర్ణనాతీత మనుట నిర్వివాదాంశము. ఆమోహిని కటాక్షములచేతనే విలాసముగా ముల్లోకముల మోహపరవశములం జేయం జాలును. ఆమెనడబెడంగు విచిత్రమనక తప్పదు. అట్టి యాయంగనామణి పులకాంచిత సర్వాంగియై త్రోవనడుమ మూర్ఛ మునింగెను.

నలువయు నా చెలువలమిన్నం గాంచుచు, నా పాదాంబుజముల స్మరించుచుం దనదారిం బోయెను. జితేంద్రియుండు కావున నించుకయు వికారము నొందండయ్యెను. ఇట్లు నిర్వికారచిత్తుండై సత్యలోకమును జేరెను. ఆమోహినియు సకామ

యూట నస్వస్థతం గాంచెను. దివానిశములు స్వప్నమందును జ్ఞానమునందును జతుర్ముఖునినే స్మరించుచు హరిని గూడ మఱచెను. పండుకొనుచు నప్పుడే శయనమునుండి లేచుచుఁ దిరుగుచు నిలుచుచు నతికామకుగా లయ్యెను. తప్తపాత్రమునందు వైచిన ధాన్యపుగింజవలె నలమల మాడఁజొచ్చెను. ఇట్లుండ దేవకాంతలందు సుందరాంగి యనఁబరఁగు రంభ సకామయై కామలోకమునకు నా(త్రో)వనె పోవుచుండెను. ఆచోట శుష్కకంఠోష్ఠతాలుకయై కడు బడలు నిజసహచరిని మోహినిం గనుంగొని తదభిప్రాయము నెఱిఁగి సస్మితాస్యయై యిట్లు ప్రశ్నించెను. సఖి! నీవు త్రైలోక్యచిత్తమోహినివి. అటులయ్యు నేల యిట్లు పరితపించుచున్నదానవు? ఈ వచ్చిన నేను రంభను. నన్ను స్మరింపుము. మూర్ఛనుండి లెమ్ము. ఏ కాంతునిగోరి యిట్లు కామకులవైతివి? కులట యనునది సర్వసౌభాగ్యసమన్విత. మనము కులపాలికలముగాము సుమీ. ఎల్లవారును ముల్లోకములందును సుఖమును గోరియే యింద్రియములకు లోఁబడుదురు. కాలమునందు నెల్ల జీవులకుఁ బ్రాణములు పోవుచున్నవి. ఇఁక లజ్జ యేల? ఆత్మకంటె నుత్కృష్టుఁడగు కాంతుఁడు లేఁడు. ఎవరియందుఁ బ్రేమముంచిన నది స్వాత్మహేతుకమేకదా! ఏ పదార్థమునం దాత్మ కెంతవఱకు సంబంధము కలదో యంతవఱకే స్నేహము నిలుచును. ఎవ్వరియం దెవ్వతెమానసము నిలుచునో వారే యామెకుఁ బ్రాణములు. నేను గామలోకమునకు సకామనై పోవుచు

న్న దానవని యెఱుంగుము నీకు నెచ్చెలినగు నాతో నాలోచించి యెవ్వనిం గోరి పరితపించుచున్న దానవో యాతనికడ కేగుము. జడను సవరించుకొమ్ము. నీవిని జక్కబంధింపుము. సురుచిరరీతి వేషమును ధరింపుము. మునిమోహనబీజమగునా మోహామును స్మరింపుము. మోహినీ! హృదయగతవార్తను దెల్పుము. జగత్త్రయమునఁ గలస్త్రీజాతిప్రభావమును నిన్నుఁ గాపాడు కొనుము. సురతమునందు స్వాభిప్రాయము నెవ్వరికిం దెలుప రాదు. తనమనసును దాఁగోరినకాంతునినెచ్చెలికిందప్ప నితరులకుఁ దెల్పరాదనుట నిక్కము. మోహినీ! నీకేప్రియుసం దెక్కువ మక్కువ కలదో ఆవిషయమును నాతోఁ బల్కుము. లేనిచో నీయనురాగము పరిహాసపాత్రమగుటయో మరణకారణమగుటయో కాఁగలదు.

ఇట్లు రంభ పలుక మోహినీకాంతావతంస మాలకించి మిగుల లజ్జాభరంబున సుస్మితము బయలువెడల మనసును గరగింపఁజాలు పలుకుల నిట్లు పలికెను. ఆ మాటలనుండి తనకుం గల్గిన యార్తి వెల్లడియగునని యానెలఁత తలఁచెను. తన కప్పటియవస్థ యేకారణమునఁ దటస్థించెనో యావిధ మామాటలు వెల్లడించు చుండెను. ఓరంభా! నీవు మైత్రిఁ బాటించి యిట్లు ప్రశ్నించితివి. బదులు చెప్పెదను వినుము. నిర్జనకాననమున సత్యలోకేశుని జతురాననుం గాంచితిని. తద్దర్శనముననే నామనము మనసిజానలజ్వాలలచే దగ్ధమయ్యెను అదిమొద లన్నపానముల వదలితిని. మది కేవస్తువుగూడ నింపుగాదు. సూర్య

చంద్రు లుదయించుటయుంగూడ నెఱుంగఁజాల కున్నదా నను. స్వప్నజ్ఞానములకు భేదమిట్టిదని నేను దెలియఁజాలను. నా పంచప్రాణములు పరమేష్ఠిసమాలింగనలాభముకల్గు టెప్పు డోయని కోరుచున్నవి. ఇప్పటికినా ప్రాణములస్థితి చంచలముగా నున్నది. నెచ్చెలీ! ఏమని వచింతును? బంగారువంటి యీనా దేహము మన్మథానలజ్వాలాకలాపములచే డస్సి యాహారముం గానమి దగ్ధశైలాకృతి నున్నయది. ఎందేఁ బోవుటకుఁగాని నిలుఁచుటకుఁగాని శయనించుటకుఁగాని యవకాశము కలుగ కున్నది. పుంశ్చలీజాతియే నీచమైనది. విశేషించి నేను నీచురా లనైతిని. ఏ యుపాయమున నా కోరిక దీర్పఁజాలుదునో వచిం పుము. లజ్జను వదలుదునా. ప్రాణముల వదలుదునా. నీవే యాలోచించి చెప్పుము.

అని మోహినిపలుక నచ్చరమిన్నయగునారంభ నీతియు తమై హితమునగు నుపాయమును మోహినికి శుభము చేకూ ర్పఁజాలుదానిని జెప్ప నారంభించెను. మోహినీ! ఇదియేనా నీకోరిక. దీనికై యింతగఁ బరితపించుచున్నదానవా! నీ యీప రితాపమును దొలఁగించెద. శుభప్రాప్తికిఁ దగునుపాయమును జెప్పెద. వినుము. భయము వదలుము. చక్కఁగా నలంకరించు కొనుము. తొలుత మదనునిఁ బూజింపుము. అతఁడు ప్రసన్నుం డగు. ఆ మహానుభావునిం గూడి పొమ్ము. నలువ మోహితుం డగు. జితేంద్రియులలో మేటికదా బ్రహ్మ. సాక్షాన్నారాయణా త్మకుఁడు. అట్టివానిని మన్మథసహాయములేక జయింపశక్యమా?

మోహినీ ! పుష్కరమున కరిగి మదనుంగూర్చి తప స్సొనరిం పుము. ఆ మనసిజుఁడు దయాళువు. అంతియగాక యోషిత్ప్రి యకుఁడు. కావునఁ బ్రసన్నుఁడగు. అని హిత ముపదేశించి. మోహినిని దపోనిరతం గావించి రంభ సత్వరంబ కందర్పదర్శ నమున కరిగెను. మోహినియుఁ బుష్కరమునకుఁ దపం బొన రింపఁ జనియెను.

ఆ పుష్కరమున నియతి మదనుంగూర్చి తప మొనరిం చెను. అతఁడు ప్రత్యక్షమై మోహినీవాంఛితముఁ దీర్ప వర మొసంగెను. ఆతనింగూడి బ్రహ్మకడ కరిగెను. నిర్జనస్థుఁ డగు నా చతురాస్యుని మోహిని గనుంగొనియెను. ఆతనిచెంత నిలు వంబడి మోహసాగరమున ముంప నారంభించెను. క్షణకాలము నాట్యమాడెను. క్షణకాలము మధురముగఁ బాడెను. రాధా దేవీ ! ఆగానము మన్నామాంకితమని యెఱుంగుము. భక్తుల కయ్యది చిత్తమోహనము. బ్రహ్మయు నా మోహినీకాంత యొనరించు గీతము నాలకించెను. పులకాంచితసర్వాంగుఁ డయ్యెను. సాశ్రులోచనుఁడై ప్రేమమయుఁ డయ్యెను. మోహి నియు నాతఁడు మోహపరశుఁడయ్యెనని యెఱింగి యత్యంత హృష్టురాలయ్యెను. కలాప్రమాణమును భావమును బ్రకటిం చెను. నలువకు స్వాంగము నగపఱచెను. స్మేరభ్రూభంగములఁ గనఁబఱచెను. లోకమున నెవ్వఁడు కామహతచేతనుఁడగునో వానికి లజ్జ యేల కలుగును ? విరించియు దాని యభిప్రాయ ము నెఱింగి యవనతముఖుండయ్యెను. ఆయాటపాటల కుచిత

మగుధన మొసంగి పరమేశ్వరు సంస్మరించుచుండెను మోహి నియు శతానందుని భావము నెఱింగి శుష్కకంఠ ష్ఠగాలుకగ్గు తన ప్రయత్నము విఫలమగు టెఱింగి కామప్రదుండగు కాముని వినుతించెను.

మన్మథప్రభూ! సర్వేంద్రియ ప్రభావవు. విష్ణ్వంశసంభూతుండవు. మానస సంజాతుండవు. కర్మబీజభూతుండవు. ఇట్టి నీకు నమస్కారములు. మహేశ్వరుండు జ్ఞానరూపుండు. అత నికి నాత్మవు నీవే. జగత్సృష్టి నీవలననే సాగుచున్నది ఇట్టి నీకు నమస్కారము. సృష్టికర్తవు నీవే. యోగీశులకును దృష్టివి నీవే. దురారాధ్యుండవన నీవే. దుర్నివారుండవగు నిట్టినీకు నతులు. నిన్నుజయించువారు లేరు. జగత్తులను జయింపఁజాలువాఁడవు నీవుకదా. జీవమనోహరుండవు. రతీకాంతుండవు. రతీదేవీ ప్రాణ వల్లభుండవు. రతిప్రియుండవు. ఇట్టి నీకు వందనములు. అని మఱియు ననేకప్రకారముల వినుతించెను. ఈస్తోత్రము నేకా ముకుండు పఠించునో వానిని మదనుండు పీడింపఁడు నిష్కలం కునిగా నొనరించును. ఏకాలమునందును నూరుఁడాతనిపుది కామాసక్తిగలదానినిగా నొనరింపఁబూనఁడు. ఆభక్తుండు రోగి కాఁడు. శ్రీయుక్తుఁడగును. ఈస్తోత్రపాఠమున సాధ్వియగు పత్నిని భక్తుండు పొందఁగలఁడు.

ఇట్లు మోహిని వినుతించెను. కాముఁడానందపరవశుఁ

*ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ముప్పదిరెండవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగనగు.

డయ్యెను. అంతరిక్షమునసుండియే శరమును వింట సంధించెను. బ్రహ్మపై మంత్రపూతమగుమహాస్త్రమును దానిని బ్రయోగించెను. బ్రహ్మయు నాయస్త్రహతుండై చంచలాంతః కరణుండయ్యెను. ఒక్కక్షణము మోహినిం దదేకచిత్తమునం జూచెను. అంతలో జ్ఞానము పొడసూపెను. శ్రీహరిని స్మరించెను. మనస్సున మన్మథచరితమునెల్ల నెఱింగెను. పుత్త్రుండైనను మదనునిం గ్రోధవిహ్వలుండై శపించెను ఓరీమన్మథుండా! యౌవనగర్వమున విఱ్ఱవీఁగుచున్నవాఁడవు. మూఢుండవు. ఐశ్వర్యగర్వితుండవు. న న్నవమానింపఁబూనితివిగాన నీకు గర్వభంగమగుంగాక. వసంతునితోఁగూడ విఫలప్రయత్నుండ వగుదువుగాక. ఇట్లు బ్రహ్మశపింపఁగా భీతుండై కంఠమెండఁగా మదనుండు వడఁకుచుండెను. బ్రహ్మయు మన్మథు నిట్లు శపించి మదనాతురయై తననాలుగుమోములను స్మితము చెలువార వక్రదృష్టి నిరీక్షించుచున్న మోహినిం గాంచి యిట్లు పలికెను. తల్లీ! మోహినీ! ఇఁకఁబొమ్ము. నీప్రయత్నము నిష్ఫలము. నీయభిప్రాయ మెఱింగితిని ఈకర్మమునకు నేనర్హుఁడనుగాను. వేదనిషిద్ధకర్మమును జేయఁ బ్రయత్నింపను. నేను వేదకర్తను. వేదవ్యవస్థాకారకుఁడను వేదజ్ఞున కిది యకీర్తికరము. దీనికన్న నిందింపఁదగినది లేదు ఏయోషిన్మణి తన్నుఁగాంక్షించి యెదుటనిల్చునో యది రాగియగువానికిఁ ద్యజింపఁదగదని ప్రమాణము కలదు. అట్టిస్త్రీ తన్నుఁగోరినను దపస్విలు గ్రహింపక వానిని ద్యజింపవలయునని శ్రుతులు ఘోషించెడిని. పుంశ్చలినో సర్వప్రకా

రములచేత నందఱును వదలవలయును. ధనాయుః ప్రాణయశస్సులకు నాశనస్వరూపురాలు పుంశ్చలి. విశేషించి దుఃఖదాయినియు నగు. మఱియు స్వకార్యతత్పరయుఁ బరకార్యవినాశినియు నూత్నవ్రణములకంటె నిష్ఠురయు, సంపద్విపద్బీజరూపిణియుఁ బుంశ్చలియగు. ఇంతియగాదు. విద్యుద్దీప్తజలముల రేఖగా వ్యాపించినట్లు లోభమువలన మైత్రిగుదిరినట్లు, పరద్రోహమువలన సంపత్తుగలిగినట్లు కులటాప్రేమయు క్షణకాలము నిలుచును. సర్వఘాతుకపదార్థములకును విపద్బీజము వంటిది కులట. ఎవ్వఁడు కులటయందు విశ్వాసముంచునో వానికిఁ బ్రతిక్షణ మాపదలు కల్గును. మోహినీ! నీవు రూపవతివి. ధన్యురాలవు. కాముకులచే వంచింపఁబడితివి. యౌవనవంతులకుసంపత్స్వరూపురాలవు తపస్వులకువిషస్వరూపురాలవు అచ్చరలలో మిన్నవని వన్నెకెక్కినదానవు. స్థిరయౌవనవతివి. నీయీకార్యము మంచిదే. ప్రాయపుఁబురుషుని గోరుము. వనితలలోఁ జతురురాలవు. కాన విదగ్ధాన్వేషణము న్యాయము. విదగ్ధయగు కామిని విదగ్ధుఁడగు పురుషునితో సంగతిసల్పిన గుణయుక్తమనంజను. కాంతామణీ! నేను జరాతురుఁడను. వృద్ధుఁడను. తపస్విని. విష్ణుభక్తుఁడను. బ్రాహ్మణుఁడను. స్వతంత్రుఁడను గాను. సదా పరాధీనుఁడను. ఇట్టి నాకుఁ బుంశ్చలీరతి యేమి సుఖమును గల్గించును? వత్సా! తండ్రినగునన్నువదలి వేఱొకతావునకుం బొమ్ము. నేను వేరునకు సృష్టికర్తనుగదా. దాననే నీకుఁదండ్రిని. మన్మథుని, జయంతుని, నలకూబరు, నశ్వికుమారులను, జంద్రతనయుని, దితిపుత్రసంతతిని వేరుఁగాంచిన సుంద

రాంగులను, మఱియుఁ గామశాస్త్రవిశారదులై రతికర్మనిష్ణాతు లగువారిని గోరుకొనును. లోకమునఁ బురుషుఁడు స్త్రీనిగోరు ట సహజము. కామిని తనకుఁ దానే పురుషునిగోరిన విడంబన మది విపరీతమగును.సకలరత్నములలో స్త్రీరత్నము దుర్లభము. దానిని బురుషుఁడే ప్రార్థించును. అంతియకాని పురుషుని నట్టి నారీరత్నము ప్రేమింపదు. ఏకామిని దానే పురుషునిగోరు కొనునో అది యోషిజ్జాతియందు మర్యాదలేనిదగును. అమూ ల్యమగురత్నము బహుదూరమునకుంబోయి తన్నుగొనుఁడని కోరిన నది యల్పమూల్యమనియే భావింపఁబడును. ప్రతిదినము లోకమునఁ బురుషుఁడు కాంతను గోరిపోవును. కాంత యట్టు చేయదు. లోకాచారములను వేదముల ననుసరించినచోఁ బురు షుని వనితకోరి చనుట న్యాయముకాదు. తదుక్తరీతిఁ బ్రవర్తిం చిననే మర్యాదగాని విపరీతమైన గౌరవములేదు వేదవిరుద్ధకా ర్యము లొనరించిన మిత్రుఁడు శత్రువగును. వేదోక్తకర్మాచరణ నిరతునిహరియేప్రేమించును శ్రీహరి ప్రేమించిన లోకమంతయుఁ బ్రేమించినట్లే యగును ఆ హరియే ద్వేషించినసందఱుశత్రువులే యగుదురు. కులటాజాతి యెందుఁగలదు? సాధ్వీజాతి యెందుఁ గలదు? తమతమకర్మములనుబట్టి యిట్టిజాతు లేర్పడును స్త్రీజాతి ప్రకృత్యంశమున జనించెను అదియు శ్రీమన్నారాయణవినిర్మి తమే.ఎవతె దుశ్శీలయో నిందనొంధునో యది పుంశ్చలి యనఁ బడు. సుశీలయగువనిత పతివ్రత యనఁబడును. పుంశ్చలులందు మూఁడుభేదములు గలవు. ఆ భేదములయం దేజాతియుఁ దాను

బురుషునిగోరునది కానరాదు. వంశదూషకురాలగుస్త్రీ యేజాతియందును నిందార్హయేకదా.

అని యిట్లు పెక్కుభంగుల ధర్మములుదెలిపి విధాత విరమించెను. మోహినియుఁ గోపప్రస్ఫురితాధరబింబయై యిట్లు పలుక నారంభించెను శతానందా! ఇప్పటి నీ చరిత మెఱుకపడినది నీ యుపదేశానుసార మీ నీతి నాఁమది కెక్కదు. నీ ముఖదర్శనమున నాకు లోకమునఁగలపురుషులెల్ల స్మృతిగోచరులు కారైరి. నా తనువు కామానలమున దహింపఁబడుచుండెను. కాన వదలఁ బ్రయత్నించితిని. అట్టితఱి నన్ను రంభ నిషేధించి యీ మంత్రమును దెలిపెను. ఆ రీతిని గామసహాయురాలనై యిచటి కరుదెంచితిని. వసంతుఁడు నీ శాపమున హతోద్యముఁడై పోయెను. నే నట్లే పోవఁజాలనైతిని. నీ వెంతతూలనాడినను గదలఁజాలకయున్న దానను. విభూ! నా సర్వాంగములయందీజాడ్య మంకురించినది. కృపాసింధూ! ఇట్టి నాపైఁ గరుణనునుపుము. నన్నుఁ జంపుట నీకు న్యాయముకాదు. భవదాలింగనలాభమున నేను గతజ్వరనగుదును. నీవు జగముల సృజించువాఁడవు. కర్మమున నేను గులటనైతిని. సత్పురుషులు గర్వింపరు. కర్మసాధ్యులగుదురు. ఒక్కఁడు యానాధిరూఢుఁడై పోవును. వానిని బెక్కుమంది మోయుచుందురు. నృపాలకుఁడు ప్రజలనుండి కరమును గ్రహించును. ప్రజలు కర్మవశమునఁ గరము నిత్తురు. ఒక్కఁడు సింహాసనము నధిష్ఠించును. వేఱొకఁడు నృపమాత్రుఁడుగనుండును. కర్మమున నేకొందఱు వాహకు

లుగ నుందురు. కొందఱు వాహనపాలకులుగ నుందురు. స్వకీయకర్మవశమున నొకఁడు సూకరీజాతిం బ్రవేశించును. ఒకానొకఁడు శచీదేవిజఠరమును బ్రవేశించును. కొందఱు సీకుఁదనూజాతు లగుదురు. కొందఱు శ్రీ హరికి భక్తులై తత్పార్శ్వవర్తు లగుదురు. కొందఱు కృములై విణ్మూత్రపంకమునఁ బడియుందురు. కొందఱు రాజేంద్రులు స్వర్గమున కేగుదురు. కొందఱు నరకమునఁ బడుదురు. ఒక్కఁడు దేవతాధీశ్వరుండగు. కొందఱు దేవతలు మనుష్యులు క్షుద్రజంతువులు నగుదురు. కొందఱు కర్మమున వర్ణాధిపతులగు బ్రాహ్మణులగుదురు. కొందఱు రాజవైశ్యశూద్రులగుదురు. మఱికొందఱు మ్లేచ్ఛజాతులగుదురు. కొందఱు జ్ఞానులై సర్వద్రష్టలగుదురు. కొందఱు మూర్ఖులు, గ్రుడ్డివారు, స్వాంగహీనులుగా నగుదురు. కొందఱు శాస్త్రబోధకులై శిష్యవర్గములకు బోధించువారగుదురు. కొందఱు గురువుల సేవించుచుఁ బఠించువారుగ నుందురు. కొందఱు స్వకర్మవశమున స్థావరజంగమరూపంబులఁ గాంతురు. నీవు కర్మవశముననే తపస్వివి. సృష్టికర్తవుకూడ నైతివి. ఒకర్తుక నిజకర్మవశమున సాధ్వియు నిహపరలోకపూజ్యయు నగును. మఱియొకతుక వేశ్యయై పరులకు స్వాంగవిక్రయ మొనర్చి జీవించును. శతానందా! నేను స్వైరె వేశ్యను, సురభోజ్యను, పూజ్యరాలను. స్వైరె వేశ్యాలింగనముననే కర్మము పూర్తియగునుగదా. మనస్సునకు స్వభావమే బీజము. ఆ స్వభావము కర్మబీజముగలది. ఆ కర్మము. ఫలబీజము. అందఱకు నన్నింటికి

జనకుఁడు శ్రీ హరి. ఆ మహాప్రభువు కర్మానుసారముగ ఫలము నొసంగును. అన్నింటికంటె బలవత్తరుఁడు కర్మస్వరూపముగల భగవంతుఁడే యని యెఱుంగందగు.

ఇట్లుండ నన్నేల దూషించితివి. తొలఁగిపొమ్మంటివి. జగత్స్రష్టవగు నీ పాదారవిందముల దర్శింపవచ్చితిని. నీపాద ద్వంద్వమును యోగులుకూడ స్వప్నమునందుఁ జూడఁజాలరు కదా. అట్టి నీవు భగవంతుఁడవు. ప్రభువవు. కావున నిన్ను దర్శింపవచ్చితిని. నింద్యస్థానమునకుంబోయినచో నారి నింద్యురాలగు. అస్పృశ్యయునగు. నీ వంటిమహాత్ముని పాదరజస్సుచేఁ బరమపవిత్రురాలగును. అనిపలికి మోహిని యచ్చటినుండి త్వరగాఁ బోయి శ్రీ హరియెదుట నిలువఁబడియెను. నలువయు మోహినికోపమునకు భీతిల్లెను. వడవడవడఁకెను. మోహినియు సస్మితయు వక్రనయనయునై కామవికారము నొందెను. స్వాంగ మును గనఁబఱచెను.

మోహినీవృత్తాంత మిటులుండ నట బ్రహ్మ మోహిని నవమానించెనని యెఱింగి మన్మథుఁడు నలువకడకువచ్చి యదృశ్యుఁడై పంచబాణముల వైచెను. దాన నాకంజజుఁడు సమ్మోహితుఁడయ్యెను. మన్మథబాణములు సమ్మోహనము, సముద్వేగము, బీజస్తంభనకారణము, నున్మత్తబీజము, చేతసహారకంబగు జ్వాలదము ననుపేరులు గలవి. ఈ బాణపంచకమును బ్రయోగించెను తనసేవకుల నాపద్మజుని మోహింపఁజేయుఁడని పంపెను. వసంతుఁడు, కోకిలము, భ్రమరము, మనోహరగంధవ

హుఁడును నను వీరామన్మథునాజ్ఞఁ దలఁదాల్చి బ్రహ్మను మోహింపఁజేయఁబూనిరి. మదనుఁడు కింకరులఁ బంపి తాను నంతఃకరణమును బ్రవేశించి వికారమును గల్గించెను. పుంస్కోకిలము బ్రహ్మచెంగటనుండి కలరవమున నార్చెను. భ్రమరము సరసిజయోనియెదుట నిటునటు తిరుగుచు ఝుంకారరవమున నతనిస్థైర్య మగలించెను. మందగమనమున నతిశీతలుఁడై గంధవహుఁడు వీచెను. వసంతుఁడు సర్వజనమనోహరాకారమున నందుఁ బరిభ్రమించెను. ఈచర్యలకు నలువ మది చలించెను. మోహినీభావము నెఱింగెను. మిగులఁ బ్రీతిగలిగి వక్రనయనయై కామాస్త్రహతచేతనయై యాసుదతి యున్నట్లు కనుఁగొనియెను. తనమనస్సును నిశ్చలముగా నిలుపఁజాలక భీతుఁడై శ్రీహరిని స్మరించెను. శ్రీకృష్ణుని దనహృదయారవిందనివాసుని ధ్యానించి యీ యెడరు తప్పింపుమా యని ప్రార్థించెను. ద్విభుజవిరాజితుఁడై మురళీహస్తమున నలరుచుఁ బీతాంబరమును దాల్చి మిగులఁ గమనీయమూర్తియై స్థిరయౌవనవిరాజితుఁడై కిశోరమూర్తిం గైకొని రత్నాలంకారముల వెలయుచు సుస్మితముమోముదమ్మిపైఁ జిందులాడ నలరారు శ్రీశ్యామసుందరా! నన్నుఁ గాపాడుమా యని చేతులొగ్గెను. శ్రీహరీ! కామసాగరనిమగ్నుఁడనగు నన్నుఁ గాపాడుము. ఈ కామసాగరము దుష్కీర్తిజలపరిపూర్ణము. దుష్పారము. బహుసంకటము. భక్తివిస్మృతిబీజము. విపత్స్రోపానదుస్తరము. నిర్మలజ్ఞానచక్షుఃప్రచ్ఛన్నకారణము. జననమయోర్మికాజాలసం

కులము, కామినీనక్రౌఘసమాకీర్ణము, నతిస్రోతస్సమన్వితము, గంభీరము, ఘోరము, తొలుత నమృతమయముగాఁ దోఁచునది. పరిణామమునందు విషాలయమగునది. యమాలయమునకుఁ జెంతనుండునది. ముక్తిద్వారమును మఱువఁజేయశక్తిగలది. జ్ఞానము నొసంగి సద్బుద్ధియను నౌక ననుగ్రహించి యీ మహా ఘోరకామసాగరమునుండి నన్నుఁ దరియింపఁజేయుము. నీవే కర్ణధారుఁడవు. మధుసూదనా! ప్రసన్నుఁడవు కమ్ము. నావంటివా రెందరో సృష్టికర్తలు గలరు. ఈ లోకము కర్మక్షేత్రము గాదు. జ్ఞానాంబురాశి. ఐనను నాకుఁ గామమున స్పృహగలిగినది. ఆ కామము నీ భక్తిని నశింపఁజేయునట్టిది. కృపాసింధూ! దీనబంధూ! నాపైఁ గరుణ యుంచుము. నీవు సర్వజ్ఞుఁడవు. దుస్స్వప్నము నాకుఁ దోఁపకుండఁజేయుము.

అని వినుతించి యానలువమోముల వేలుపు ధ్యానము నాశ్రయించెను. రాధాదేవీ! నా పాదారవిందముల ధ్యానించుచు బ్రహ్మ నన్నే స్మరించుచుండెను. ఇది బ్రహ్మయొనరించిన స్తోత్రరాజము. *దీనిని బఠించిన నా మాయను జయించి చక్కని జ్ఞానముగలవాఁడగును. అనిపలికి యవ్వలికథను జెప్పఁబూని శ్రీకృష్ణపరబ్రహ్మము రాధ కిట్లనియె.

## బ్రహ్మకు గర్వభంగమగుట.

† రాధా! ఆ మీఁదికథ వినఁదగినది. బ్రహ్మ యిట్లు

*మమ మాయాం వినిర్జిత్య సంజ్ఞానం లభతే ధ్రువమ్=అని మూలము.

† ఈ చరిత్రము శ్రీకృష్ణజన్మఖండము ముప్పదిమూఁడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

వినుతించి మోహినీసమీపమున నుండెను. మోహినియుఁ గామ ప్రోత్సాహమున నచటి కేతెంచెను. దివ్యజ్ఞానాంకుశమును బ్రసాదించితిని. దాన నాబ్రహ్మ మనోమత్తగజేంద్రము నాపుచుండెను. ఆ సమయమున మోహిని పరిహాసవచనముల నిట్లు పలికెను. మహానుభావా! ఇంగితముచేతనే కామినీచిత్తము మత్తతంగాంచును. అట్టివనితను బలిమియై నెవఁడు గ్రహించునో వాఁడే యుత్తమనాయకుఁడు.స్ఫుటాభిప్రాయము నెఱిఁగి యెవఁడు కామినిచేఁ బ్రోత్సహింపఁబడి పిదప శృంగారమును గనఁబఱచునో, వాఁడు మధ్యమనాయకుఁడు. కామార్తయగు కాంతచే నెవఁడు పలుమాఱులు ప్రోత్సహింపంబడి యామెను రహస్యగోష్ఠులచేఁ దృప్తిపఱుపఁబూనఁడో వాఁడు నపుంసకుఁ డనఁబడును. గృహస్థువుగాని, తపస్విగాని, కాముకుఁడుగాని తనను గోరివచ్చినకాంతను వదలి మఱియొకస్త్రీయందుఁ బ్రీతి నునిచినచో వాఁడు నరకకూపమునఁబడును. వానిసిరి నశించును. రూపము పాడగును. బుద్ధి విపరీతమగును. అప్పుడే నపుంసకుఁ డగును. ఇట్లు కమ్మని యానారీమణి శపించును. జగన్నాథా! లెమ్ము. స్మరార్ణవమందుఁ బారమును గనుఁగొనుము. నేను గామసాగరమున మునింగితిని. ఇట్టి నాకు నీవు కర్ణధారుఁడవుకమ్ము. సర్వజంతువివర్జితమగు నిర్జనవనమున నన్నుం గూడుము పుంస్కోకిలములు ధ్వనులుచేయుచుండ సుగంధివాయువులు విసరుచుండ నను సుఖింపఁజేయుము. నీకుఁ బ్రతిజన్మ

మందును దాసురాల నగుదును. సత్వరము నను౦ బరిగ్రహింపుము.

అనిపలికి యా మోహిని సృష్టికర్తను సమీపించి తదీయ చేలాంచలమును సుస్మిత మొనర్చుచు నాకర్షించెను. దాని యుద్యోగ మెఱిఁగి విధాత భయాకులుఁడై దానితో నిట్లు పల్కెను. ఆ వచన మమృతతుల్యము, వినయపూర్వకము, న్యాయసమ్మతమునై యుండెను. ఓ మోహినీ ! సత్యసారమై హితమై స్పష్టార్థమునగు నా మాట నాలింపుము. ముల్లోకము లందలి స్త్రీజాతి లజ్జాహీనయైనదని దృఢపఱుపఁబూనకుము. తల్లీ ! వృద్ధును. నిష్కాముఁడను. పుత్త్రుఁడను. ఇట్టి నన్ను వదలుము. సుస్మితాస్యసుందరీ! త్వత్కర్మయోగ్యుని, రసికుని, బ్రాయపుఁబురుషుని వరింపుము. పత్ని భర్తకు నిషేకమువలన బహుళతరశుభముల నొసంగును. మంత్రము, శిల్పము, సంతానము ననునివి ప్రయత్నమువలన లభింపవు. నిన్నుఁగూడినచో నొక నిబంధముండిన మేలు. అని యేమేమో పలుకుచు నన్నే స్మరించుచున్న యా బ్రహ్మను మోహినిపట్టుకొని యీడ్చెను. ఆసమయమునందే యచ్చోటికి బ్రహ్మతేజస్సుల నలరుమునులు ప్రవేశించిరి. అత్రియుఁ, బులస్త్యుఁడు, పులహుఁడు, వసిష్ఠుఁడు, క్రతువు, నంగిరసుఁడు, భృగువు, మరీచియుఁ, గపిలుఁడు, పంచశిఖుఁడు, రుచియు, నాసురియుఁ, బ్రచేతసుఁడు, శుక్రబృహస్పతులు, నుతథ్యుఁడు, కరకుఁడు, కణ్వుఁడు, కశ్యపుఁడు, గౌతముఁడు, సనకసనందనులు, కర్దమసనాతనులు, సనత్కుమా-

రుఁడు, శాతాతపుఁడు, పిప్పలుఁడు, శంకు, శుక్రుఁడు, పరాశరుఁడు, మార్కండేయుఁడు, లోమశుఁడు, మృకండువు, చ్యవనుఁడు, దుర్వాసుఁడు, జరత్కారువు, ఆస్తీకుఁడు, విభాండకుఁడు, ఋష్యశృంగుఁడు, భరద్వాజుఁడు, వామదేవుఁడు, కౌశికుఁడు నామునులందుఁ బ్రముఖులు. వీరందఱు రాఁగా మోహిని లజ్జాభరంబునఁ గమలాసనుని వీడిపోయెను. అగ్రహాము ప్రక్కన నిలుచుండెను. భక్తిమీఱ నమ్మును లాపరమేష్ఠికిఁ బ్రణమిల్లిన వారిజాసనుఁడు వారి నాశీర్వదించి వారిం గూరుచుండ నియోగించి వారినడుమ నక్షత్రముల నడుమఁ జంద్రునివలెఁ బ్రకాశించెను. మును లాపరమేష్ఠిని మోహిని యిటనుండఁ గారణమేమని ప్రశ్నించిరి. ఇది స్వైరైశ్వర్యగచాజ్ఞానననిధివగు నీ చెంత కేలవచ్చెననియు నడిగిరి.

పరమేష్ఠియుఁ దగినట్లు చెప్పఁదలఁచి యిట్లు పలికెను. ఈ శుభాంగి యపూర్వన ర్తనగీతముల నొనరించి పరిశ్రాంతరాయై యిట నిలిచియుండెను. తండ్రిదగ్గరఁ గన్యకయుండుట యచ్చెరువుకాదుగదా. అని తెలుపుచు నల్లన నవ్వెను. రాధాదేవీ! పరమేష్ఠి నవ్వినంతనే మునులు సర్వజ్ఞులు కావున నందఱు నవ్విరి. మునులు మోహినీచరిత్రమును బ్రహ్మమానసమును దెలిసికొనిరి. ఆ చెంతనున్న మోహిని వారందఱు పక్కుననవ్వ కెంటింగి యాగ్రహముగలదగుచు సర్వాంగములు కంపింప నేత్రములు కుటిలాకృతిం దాల్ప నతిరక్తిమ మనోగతకోపమును బయలుపఱుప నధరోష్ఠము కంపించుచుండఁ దటాలున సభాంత

రమున కరిగి వారియెదుట నిలువఁబడి బ్రహ్మను సంబోధించి మృత్యుదేవత యాగ్రహించిపలుకుచున్నదో యనునట్లు పలుకసాగెను. ఓ పంకజసంభవా ! నీవు వేదకర్తవుకదా. వేదప్రణీహితధర్మమేది? తద్విపరీతధర్మమేది? ఈ విషయము నించుక విచారింపుము. స్వకన్యకయందు స్పృహగలిగియు నర్తకినిగూర్చి నవ్వేదేల? భగవంతుఁడు స్వైరిణిగా నన్ను నియమించెను. సజ్జనుల విరుద్ధకర్మమతిహాస్యము చేయఁదగినది కాదాయేమి? దాసీతుల్యనై వినీతనై దైవవశమున శరణాగతురాలనగు నన్నుఁ బరిహాసించితివి కావుననీ వపూజ్యుఁడవై చిరకాలముండుము. శ్రీహరి శీఘ్రకాలమున నీ దర్పభంగము చేయఁగలఁడు. ఈ వైశ్యావచనము నెఱుంగుము. నీ వచనము నెవఁడు స్తుతిరూపముగా గ్రహించునో వాఁడొనరింపఁబూనిన సర్వకార్యము లంతరాయోపహతములౌఁగాక! దేవతల సంవత్సరమున కొక్కపర్యాయము పూజింతురు. నీ కొక్కసారియైన నా పూజ లేకయుండుఁగాక! కల్పాంతరమునఁగాని యీ కల్పమునఁగాని నీవు దేహాంతరము నెత్తినఁగాని పూజలేకయుందువుగాక! అని శపియించి మోహిని మదనాలయమునకుం బోయెను. అతనింగలిసి కొన్నిదివసము లుండి విగతజ్వరయయ్యెను. కాని మరల స్మృతికిం దెచ్చుకొని విలపించెను. ఔరా ! జగత్సృష్టికర్త నేనేల శపించితిని. అని పరితపించెను.

దేవాంగన యరుగ నామును లెల్ల దుఃఖించిరి. జగత్కర్తయు నతకంధరుఁడై కంపించెను. మునులు కల్యాణకర

కృత్యము లొనరించువారు గావున నాబ్రహ్మ కుపాయము చెప్పందలంచి కమలసంభవా ! నీవు శ్రీహరిని శరణమునొందుము. ఆపలుకుల కానందించి నాయపరమూర్తి యగువైకుంఠుని కడకేగి రక్షింపుమని కోరెను. పాదములచెంత నిలువంబడెను. దీనబంధూ! యని సంబోధించి తనవార్త నెఱింగించెను. ఆనారాయణమూర్తియుఁ దద్ద్విహాస్యము నెఱిఁగి పక్కనవ్వి యిట్లనియె. పంకజసంభవా ! నీవు వేదవేత్తవు. గురువులకు గురువవు. నీవొనరించినసత్కర్మము నెవ్వరును జేయలేదు. *స్త్రీజాతి ప్రకృత్యంశజనిత. జగద్బీజరూపిణి. అట్టిస్త్రీని బరిహసించినఁ బ్రకృతిని బరిహసించినట్లేకదా!. నీవుండునది పుణ్యక్షేత్రోత్తమంబగు భారతవర్షముకాదు. బ్రహ్మలోకము. క్రీడాక్షేత్రము. అందింద్రియనిగ్రహ మెట్లు సాగు ? భారతవర్షమున నీవుండఁగా మోహిని నీచెంత కరుదెంచెనేని జితేంద్రియత్వము నీకుం జెల్లును. రహస్థ్సలంబునఁ గామార్తురాలగు నాకాంత త్యజింపఁదగదు. త్యజించిన నరకము లభించును. ఇది నియమము. దుఃఖార్తురాలగునాతి శాప మొసంగును. స్వకళత్రమునుమాని యెవఁడు పరకళత్రమున కాశపడునో ఆకోరుట కామమునఁగాని లోభమునఁగాని యైనను అట్టివాఁ డధముఁడనంబడు. సంశయములులేవు. ఏనారి యుపాయముచేతఁ బర

---

* స్త్రీజాతిః ప్రకృతేరంశా జగతాం బీజరూపిణీ, స్త్రీణాం విడంబనే నైవ ప్రకృతేశ్చ విడంబనమ్. న తద్భారతవర్షం చ పుణ్యక్షేత్రమనుత్తమం, క్రీడాక్షేత్రే బ్రహ్మలోకే కస్తవేంద్రియనిగ్రహః. అని మూలము.

పురుషునిఁ దనవశము చేసికొనునో యా స్త్రీ చంద్రసూర్యు లుండు దనుక నంధకూపమను నరకమునఁ బడియుండును. స్వా ర్వైశ్య కులధర్మము నాశ్రయించి స్వర్గమున కేగఁజాలును. అట్టి స్వార్వై శ్యకు బరాభవము గల్పించినవాఁ డపరాధి యనంబడును. నీవు శపింపఁబడితివి. దానినుండి విముక్తుఁడవగు నుపాయంబు చెప్పెద.

సృష్టికర్తవగు నోచతురాననా! పాపులుండఁదగు భవార్ణవమున క్షణకాలముండుము. అనునంతలో నొకద్వారపాలకుఁ డరుదెంచి నమస్కరించి దేవాదిదేవా! మఱొక బ్రహ్మాండాధిపతి దశముఖములుగల బ్రహ్మ తమదర్శనమునుగోరి యరుదెంచి కాచియున్నవాఁడు. ఆమాటలు విని శ్రీహరి రాసమ్మతిం దెల్పెను. ద్వారపాలుఁడు వినయమున భగవదాజ్ఞను దెలుపనా బ్రహ్మవచ్చి భక్తియుక్తుఁడై భగవంతునకు నమస్కరించి చతుర్ముఖుఁడెఱుఁగనియనేకస్తోత్రరాజముల వినుతించి శ్రీమహావిష్ణు వానతీయఁ జతుర్ముఖునకు ముందుఁ గూరుచుండెను. శ్రీనారాయణమూర్తియుఁ జతుర్భుజులగు ద్వారపాలకులం గాంచి యెవరుగాని నన్ను దర్శింపవచ్చిన నిచటికిం బంపుఁడు. అని యాజ్ఞయిడునంతలో బృందావనమున నివసించు బ్రహ్మ యొకఁడు శతముఖుఁ డరుదెంచి బహువిధస్తుతిరాజముల వినుతించెను. ఆస్తుతు లతివిచిత్రములు, మనోహరములు, నశ్రుతాదృష్టపూర్వములుగ నుండెను. ఆబ్రహ్మయుఁ బూర్వబ్రహ్మల కిరువురకును ముం దుపవిష్టుఁడయ్యెను. వారందఱు నిట్లు కూరు

చుండి మాటలాడుతఱి మఱియొక బ్రహ్మాండాధిపతి బ్రహ్మ యరుదెంచి వేయితలలు చెలువారుచుండ నమస్కరించి యెవ్వరు నెఱుంగనిమంత్రముల వినుతించి కూరుచుండెను. శ్రీమన్నారాయణమూర్తియు నా బ్రహ్మను సకలబ్రహ్మాండవార్తలును దేవతాభేదముల విచిత్రప్రవర్తనములను వేఱువేఱ నడిగెను. ఆప్రశ్నమును విని చతుర్ముఖుఁడు ,తనకంటె మిన్నలగుబ్రహ్మలం గాంచి గర్వభంగమాయెఁగదా యని తలంచెను. ఈవఱకు నేను విష్ణుతుల్యుఁడ నని తలంచుచుంటిని. దాన గర్వము నామది గదిరెను. దానినిఁ దొలఁగింప భగవంతుఁ డూహించెను. ఇంకను బ్రహ్మాండము లెన్ని గలవో యెందఱు బ్రహ్మలుగలరో వారినెల్లఁ గనఁబఱుప భగవంతుఁడుతలంపలేదు. ఇంతియే చాలును. నాకుఁ గలగర్వము పోయినది. భగవంతునిముందఱ నేనెంతవాఁడను ? అని దీనుఁడై యూహించుచు గర్వ ముడిగియుండెను.

ఓరాధా ! శరీరమున నెన్ని రోమకూపములుగలవో యన్ని బ్రహ్మాండములుగలవు. అందఱు బ్రహ్మలుగలరు. వారి నెల్ల నెఱుంగక గర్వించుట తగదు. ఇపుడు బ్రహ్మ మృతతుల్యుఁడు. గర్వభంగమునఁ దలలువంచి కూరుచుండినవాఁడు. అట్టినలుమోములవేలుపు చూచుచుండఁగనే తక్కినబ్రహ్మలందఱు నారాయణునకు నమస్కరించి తమతమలోకముల కరిగిరి. చతుర్ముఖుఁడును దనబ్రహ్మాండ మత్యల్పమనియుఁ దనశక్తి యత్యల్పమనియుఁ దలంచెను. లజ్జచేఁ దలవంచియున్న యా బ్రహ్మనుజూచి విష్ణు వోపంకజాసనా ! స్వప్నమునందువలె

నీవు దేమిచూచితివో చెప్పుమా యని ప్రశ్నించెను. బ్రహ్మాయం జేతులుజోడించి యోమహాత్మా ! భూతభవ్యభవిష్యములు నీమాయాకల్పితములు అని యింతమాత్రమే పలికి సిగ్గుపడి యూరకుండెను. సర్వాంతర్యామియగు శ్రీమన్నారాయణ మూర్తి యాతనిచింతదీర్ప నొకయుపాయమునన్న నూహించు చుండెను.

## శంకరాదులు వైకుంఠమునకు వచ్చుట.

*ఆసమయమున వైకుంఠమునకు శంకరుఁ డరుదెంచెను. వృషభవాహనారూఢుఁడై సుస్మితము తనరార విభూతిభూషణ మొప్పార వ్యాఘ్రచర్మము తనతనువున కొకవింతచెలువు గలిగింప నాగయజ్ఞోపవీతము దృష్టిపాత్రమై తనర స్వర్ణాకార జటామండలము వెలయ నర్ధచంద్రభూషణ మతిమనోహరమై మురువుసూపఁ, త్రిశూలపట్టిసములు కరములధరించి వేఱొక హస్తమున ఖట్వాంగమును దాల్చి వాహనమునుండి దిగి భక్తిచే శీర్షమునువంచి కమలాకాంతునిపాదారవిందములకు వందన మాచరించి తదాజ్ఞ మెయిఁ గూరుచుండెను. అప్పుడే బ్రహ్మర్షులు దిక్పాలకులు దేవతలు చనుదెంచిరి. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, సిద్ధులు, చారణులు వచ్చిరి. వారెల్ల భక్తియుక్తులై నమస్కరించి బహుభంగుల స్తుతియించి యందు వేంచేసియున్న శంకరునకు నమస్కరించి తదనుమతింబడసి కూరుచుండిరి.

---

* ఈకథయం శ్రీకృష్ణజన్మఖండము ముప్పదినాల్గవయధ్యాయము నుండి సంగ్రహింపఁబడినది.

ఆతరుణమున శంకరుండు స్వరతాళయుతముగా సంగీతమును బాడెను. రాధాదేవీ ! ఆగీతికలయందు మనయిర్వురరాసమండలవిహారగాథ యిమిడియుండినది. ఎల్లరమనసుల రంజిల్లఁజేయుచు సమయోచితరాగమున శంకరుఁడు పాడెను. ఆసంగీతము శాస్త్రమర్యాదలమీఱక మనోహరముగ నుండెను. ఆగీతికలు శ్రీశంకరుఁడే నిర్మించెను. ఆగీతలఁబాడుచు సాంబశివుఁడు పులకాంచితసర్వాంగుఁడై భక్తిభరాక్రాంతస్వాంతుండయ్యెను. ఆగానమున కెల్లరు మోహపరవశులైరి. అందఱు రుద్రరూపులైరి. వైకుంఠమెల్ల రసమయమయ్యెను. ఆజలము వైకుంఠమును ముంచునా యని తోఁచెను. ఆజలాధిష్ఠానదేవి యగుమందాకిని సాక్షాత్కరించెను. ఆజనని ముముక్షువులకు ముక్తి నొసంగును. భక్తులకు శ్రీహరిపాదములయందు దృఢభక్తిని గటాక్షించును. కోటిజన్మములనుండి సంపాదించినపాపములు గంగాతోయములనుండి వాయుస్పర్శముననే నశించును. రాధాదేవీ ! గంగావాయుస్పర్శమునకు, గంగాదర్శనమునకు భేదము నెఱుంగఁజాలకున్నవాఁడ. ఇఁక గంగాస్నానమొనర్చినచోఁ గలుగుఫలములను వచించెదను.

## గంగామహిమము.

తీర్థరాజములలోఁ బుష్కరమనుతీర్థము ప్రధానము. ఇది వేదోక్తము. దానిలో మునింగినపుణ్యము మందాకినీస్నానఫలషోడశాంశమును బోలదు. భగీరథుఁడు భూలోకమునకుం దెచ్చెనుగాన భాగీరథియనుపేరు గంగానదికిఁ గల్గెను. భూలోక

మును ప్రవాహరూపమునం బొందినదిగాన గంగానామము ప్రథితము. జహ్నుముని క్రోధమున గంగను ద్రావి వదలెను గాన జాహ్నవి యనుపేరు ప్రఖ్యాతమయ్యెను. జహ్నుపుత్రిక యనుపేరు నట్టిదే. వసువులలో నొక్కనియంశమున భీష్ముఁడు గంగకుఁ గొడుకై పుట్టెనుగాన భీష్మసువు నాఁబరఁగె. మూఁడు ప్రవాహములచే నాయాజ్ఞానుసారము స్వర్గమర్త్యపాతాళములఁ బ్రవేశించినదికాన నాగంగానది త్రిపథగామిని యనఁ జను. అందుఁ బ్రధానధారచే స్వర్గమున బ్రవహించుట మందాకిని యని పిల్వఁబడియెను. పాషాణతలముల యోజనాయుతవిస్తీర్ణభాగము నాక్రమించుట యోజనయనియుఁ బిల్వఁబడును. క్షీరతుల్యజలములుగలిగి యత్యుత్తమతరంగములచే జెన్నారుచు వైకుంఠమునుండి బ్రహ్మలోకమునకు, నందుండి స్వర్గమునకుఁ బోయి యందుండి హిమాద్రిపైఁబడి పృథ్వీతలమును జొచ్చెను. ఆధార యలకనంద యనఁబరఁగెను. అది లవణాంబురాశిం గలిసెను. శుద్ధస్ఫటికవర్ణముగలిగి బహువేగముగాఁ బ్రవహించుచుఁ, బాపాత్ముల పాపశుష్కదారువుల దహింపఁ బావకరూపముం దాల్చిన నది గంగయే యని తలంపుము. సగరవంశజనితులకు ముక్తి నొసంగినది గంగానదియే కదా ! వైకుంఠమునకు సోపానమార్గముగ నుండునది యదియేసుమీ! ఈకారణముల చేతనే పుణ్యాత్ములకు మరణకాలమునందు శిరమునందుఁ బాదములందుఁ దొలుతఁ దజ్జలమును జల్లి ముఖమునఁ దీర్థమును బోయుదురు. గంగాసోపానమార్గమునా

శ్రయించి సజ్జనులు నిరామయమగు వైకుంఠమున కేగుదురు అందుండి విమానమునెక్కి బ్రహ్మలోకాదిలోకముల కేగుచు వచ్చుచునుందురు. ఎన్నిపాతకము లొనరించినవారైనను భక్తియుక్తులై గంగాస్నానమొనరించినవారు వైకుంఠమును బొంది సుఖముగ నట నుందురు. పిదపఁ బుణ్యాత్ములయింటఁ బుట్టి భారతవర్షమునఁ గొంతకాలముండి నిశ్చలహరిభక్తినొంది శ్రీహరిరూపులై వెలయుదురు. మృతవిప్రకళేబరమును శూద్రుఁడు వహించినచో నెన్నిపదము లతఁడు దానిఁగొని నడుచునో యన్నివర్షములు నరకవాసము గల్గును. అత్తఱి వారికి గంగానది సాయపడఁగలదు. అట్టివారు స్నానమెప్పుడైనఁ జేసియుందురేని కృపాస్వరూపురాలగు మందాకిని వారింగూడ నుద్ధరించును. నరకమునుండి భారతవర్షమున సత్కుటుంబమునఁ బుట్టుకను గల్పించి జన్మాంతమున వారికి వైకుంఠమున నుండ స్థలమొసంగునది గంగానదియే. ఎవ్వఁడు పరిశుద్ధాంతఃకరణుఁడై గంగాస్నానముచేయుటకై యాత్రచేయుతఱి నెన్ని యడుగులు పెట్టునో యన్నివత్సరములు వైకుంఠమున నతఁ డుండును.

పాపములొనరించి దానిం బాపుకొనంగోరిన మానవుఁడు గంగాస్నానముచేసినఁ బరిశుద్ధుఁడగును కాని మరల నట్టి పాపములను జేయరాదు. * గంగానది కలియుగమున నైదు

* కలా పంచసహస్రాబ్దం స్థితి స్తస్యాశ్చ భారతే, తస్యాం చ విద్యమానాయాం కః ప్రభావః కళేరహో. అని మూలము.

వేలసంవత్సరములు నివసించును. ఆజనని భారతవర్షమున నివసించునంతకాలము కలిప్రభావము సాగదని నమ్ముము. *రాధాదేవీ ! కలియుగమునఁ బదివేలవర్షములు జరగునంతదనుక నాప్రతిమయునుండును. తావత్పర్యంతము కలిప్రభావము సాగదని నమ్ముము. గంగానదీధార యేది యతలమునకుఁ బోయెనో యాధార భోగవతియని పిల్వఁబడును. దానిజలము ఫేననిభము. అతివేగముగాఁ బ్రవహించుస్వభావముకలది. ఆ భోగవతి యనేకామూల్యరత్నముల కాకరము. దానితీరముల నాగకన్యకలు విహరింతురు. వారియౌవన మక్షయము.

గంగానది యొకభాగమున వైకుంఠనగరమును జుట్టి ప్రవహించును. వేయియోజనములపొడవున నది యుండును. దానికిఁ బ్రళయమందును నాశనములేదు. దానితటమున ననేక రత్నములు లభించు గను లుండును. రాధా ! ఇది గంగామాహాత్మ్యము. నీకు విస్తరించివచించితిని. ఇంక బ్రహ్మకు మోహినీశాపవిముక్తిని వచించెదను. ఆలకింపుమని శ్రీకృష్ణుఁడు మరల నిట్లు పలికెను.

## బ్రహ్మశాపమోక్షము.

† శంకరాదులందఱుఁ దమతమపీఠములఁ గూరుచున్న

* కలౌ దశసహస్రాణి వర్షాణి ప్రతిమా మమ, తిష్ఠంతి చ పురాణాని ప్రభావస్తత్ర కః కలేః. అనిమూలము.

† ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ముప్పదియైదవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగునది.

పిదప శ్రీమన్నారాయణమూర్తి బ్రహ్మనుజూచి యిట్లు పలికెను. ఓ చతుర్ముఖా! లెమ్ము. విచారము మానుము. భద్రములు గలుగఁగలవు. ఈ మందాకినియందు స్నానముచేయుము. శాపానల సంతాపము నశించును. శాపవిముక్తి కలుగును. ఇది నాయాజ్ఞ యని యెఱుంగుము. సత్యముగా నీవు పరిశుద్ధమతివైనచో గంగాసంస్పర్శనమును వాంఛింతువు. సర్వతీర్థములు శ్రీ విష్ణుమయములు. నీవు ప్రకృతిని దిరస్కరించితివి. కావున శాపము లభించెను. ఎవ్వరికైన నహంకారము పాపబీజము. అమంగళమునగు. పంకజాసనా! నీవు వేగమ గోలోకమున కరుగుము. పరాత్పరమగు నా యాలయమందున్నది. అందుఁ బ్రకృత్యంశమున నొప్పారుచు సర్వమంగళముల నొసంగఁజాలు భారతిని బొందఁగలవు. శతానందా! * ప్రకృతిని సేవింపుమా. ఆప్రకృతియే సృష్టిబీజస్వరూపురాలు. ఓహో! కల్పాంతపర్యంతము తపస్సుచేసితివి. కాని నీమంత్రము మోహినీశాపమున నెవ్వరంగీకరింపరైరి. ఎవ్వఁడేదేవతను బూజించినను నిన్నుఁ బూజించినట్లే యగు. నీవు సృష్టికర్తవుకదా! స్త్రీలయాత్మయందు విహరించువాఁడవు నీవేకదా! నీవు పరమపూజ్యుఁడవు. ఐనను నాయానతింగొని యీమందాకినీమనోహరవినిర్మలవారిపూరంబున స్నానమొనరింపుము. వేవేగ గోలోకమున కరుగుము.

అని నారాయణమూర్తి పలుక నావిరించి నమస్కరించి దదాజ్ఞమెయి గోలోకమునకుం బోయెను. అందు నన్నుఁగాంచి

* ప్రకృతిం భజ కల్యాణసృష్టిబీజస్వరూపిణీం. అని మూలము.

నమస్కరించెను. బ్రహ్మ యరిగినంతనే వైకుంఠమునుండి మునులు దేవతలు తమతమనివాసములకుం బోయిరి. బ్రహ్మయు గోలోకమునఁ దనభారతీదేవిని గాంచెను. ఆ భారతి నాముఖ కమలమునుండి వెలువడినసర్వవిద్యాధిదేవత యని తలంపుము. వాగీశ్వరి యనుపే రామెకుం జెల్లు అట్టిభారతిని జేకొని యావేధ మోదభరితస్వాంతుఁడై కామాస్త్రవ్యాపారము నెఱెంగెను. మరల నాచెంత కరుదెంచి నమస్కరించి త్రైలోక్య మోహినింగూడి క్రీడించెను. మోహినీసమ్మోదమును దీర్చి యంత విరమించెను. తరువాత నా పరమేష్ఠి వాగీశ్వరిం గాంచి దేవీ! నీవే సృష్టికర్త్రివి. పతివ్రతవు. స్థిరయౌవనవతివి. అని పలికి యామెంగూడి సత్యలోకమున కరుగుదెంచెను. బ్రహ్మలోకమున నివసించుపుణ్యాత్ము లాపరదేవిని శారదను జూచిరి. ఆమెదేహచ్ఛాయ శ్వేతము. చిఱునవ్వు పరిశుద్ధము. వీణాపుస్తకము లామెకరముల నలరుచుండును. వ్యాఖ్యాముద్రయు వేఱొకకరమున విరాజిల్లుచుండెను. ఆ దేవిని గాంచినంతనే వారెల్ల రామోదపరవశులై నమస్కరించి నగరప్రవేశమహోత్సవ మొనరించిరి. పరమేష్ఠియు భారతింగూడి సమ్మదముననుండెను. రాధాంబికా! నీ వడిగినవిషయమును విస్తరించి వచించితి. ఇంకేమి వినఁగోరెదవు?

అనుడు రాధాదేవి చిఱునవ్వున భగవంతుని శ్రీకృష్ణునింజూచి ప్రాణేశ్వరా! బ్రహ్మ కర్మక్షేత్రమునఁ దపస్సుచేయువారికి వరము లిచ్చువాఁడు. సర్వధర్మము లెఱింగినవాఁడు.

తనలోకము కర్మక్షేత్రముగాదని యెఱింగియు నందుఁ దన్ను మనోవాక్కాయశుద్ధిగ వలచినకాంచితను విడనాడరాదని తెలిసియుండియు నేల యంగీకరింపఁడయ్యెను. ఈ సంశయము నివృత్తియగునట్లు కారణమును వచింపుమనవిని నవ్వి శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పెను. ప్రేయసీ! పాద్మకల్పవృత్తాంతమును వచించెద. దాన నీసంశయము తొలఁగును. పూర్వము సృష్టికార్యమున మెలఁగుమాయని బ్రహ్మను నేను బురికొల్పితిని. విరించి మదాజ్ఞంగైకొని మనస్సుచేఁ బుత్త్రుల నిర్మించెను. వారు బ్రహ్మతేజోవిరాజితులు. సనక సనంద సనాతన సనత్కుమారులను, గవిని, బంచశిఖుని, నసితుని, గపిలుని, సిద్ధుని బుట్టించెను. వీరే బ్రహ్మమానసపుత్త్రులనఁబడువారు. వారెల్ల దిగంబరులు. సదా పంచవర్షవయస్కులు. వారినిజూచి బ్రహ్మ మీరెల్ల సృష్టికార్యమునఁ బ్రవర్తిల్లుఁడని పలికెను. వారు ప్రజలసృజింపుఁడని తమ్ముం బ్రోత్సహించుజనకుని యానతిం దిరస్కరించి నన్నుఁ బూజింపఁదలంపుఁగొని తపస్సునకై పోయిరి. వారు తపోనిరతులై పోయిన పిదప బ్రహ్మ మరలఁ దనయులం బుట్టించెను. వారేకాదశరుద్రులనఁబడిరి. సృష్టికార్యమువలదని దుఃఖించిరి. గాన రుద్రులను పేరు వారికిం గల్గెను. మరలఁ బరమేష్ఠి యోగమున నన్ను ధ్యానించి వసిష్ఠపులహక్రత్వంగిరోభృగ్వత్రిపులస్త్యదక్షకర్దమ మరీచినామకులఁ దనయులం గాంచి సృష్టిచేయ నాజ్ఞాపించి వారివెనుక నొకకన్యకం గాంచెను. మరల నొకతనయునిం బుట్టఁజేసెను. ఆ పుత్త్రుఁడే కామదేవుఁ డని యెఱుంగుము. ఆపు

త్రుఁడు దుర్నివారపరాక్రమశక్తిసంపన్నుఁడు. వానింగాంచి బ్రహ్మయుఁ బుత్రకా! స్త్రీపురుషులకుఁ గ్రీడామోదమును గలిగింప నిన్ను నిర్మించితిని. సృష్టియోగమున నందఱియందు నీవు నివసింపఁజాలుదువు. సమ్మోహనాదికృత్యముల నీకత్యంత పాండిత్యము గలిగియుండును. నావరప్రభావమున నీ వీర్యము దుర్నివార్యమై యలరుఁగాక! సర్వప్రభావములు నీయందుండుఁగాక! అనిపలికి బాణముల నైదింటి నాతని కిచ్చి ప్రహృష్టమతియై పుత్రికకు వరముల నీఁగోరి యుండునంతఁ గాముఁడు తనబాణము లమోఘములగునో కావో పరీక్షింపఁగోరి బ్రహ్మపైఁ బ్రయోగించెను. ఆ బాణములు మంత్రపూతములు. దుర్నివారములు. ఆ బాణములు తాఁకుటచే బ్రహ్మ హతచేతనుఁడై మూర్ఛిల్లెను. క్షణకాలమున సంజ్ఞనొంది యెదుటనున్న కూఁతురిని జూచెను. దానితో విహరింపఁ దలంపుకొనఁగా నామె యెఱిఁగి భీతయై పరుగిడెను. బ్రహ్మయుఁ గూడఁ బరుగెత్తుచుండెను. దానింగాంచి మఱింత భయముఁగొని తపస్సుచేయు సనందనాదులకడకుంబోయి తనదుఃఖస్థితిని దెలిపెను. వారామెకభయమిచ్చి తండ్రి యపుడచటి కరుదేర నిట్లు హితము దెలిపిరి.

తండ్రీ! ఏమి యిట్లువినీతిపాలైతివి? ఈ కర్మ మతిగర్హితముకదా! జగన్నిర్మాతవగు నీవు నీచవ్యాపారమునఁ బ్రవర్తించెదవేల? సత్పురుషులు తనపుత్రికనుగాఁ బరకాంతను దిలకింతురు. అట్టివారే పూజ్యులు. జితేంద్రియులు నగుదురు. నీవు

వేదకర్తవయ్యును బుత్రికను బ్రేమించుచున్నవాఁడవు. కన్యక వేదసిద్ధాంతము ననుసరించి మాతృవర్గమునఁ జేరును. గురుపత్నియు, రాజపత్నియు, విప్రపత్నియు, భ్రాతృపుత్త్రులపత్నులును, మిత్త్రపత్నియుఁ బుత్త్రపత్నియు లోనగువారు మాతలని వేదములు ఘోషించెడిని. వీనిలో నించుకంతయు భేదములేదు. కన్యాదాతయు, నన్నదాతయు, జ్ఞానదాతయు, నభయప్రదాతయు, జన్మదాతయు, మంత్రదాతయు, జ్యేష్ఠభ్రాతయు నను వీరు పితరులు. ఈ తల్లులను దండ్రులనెవరు తిరస్కారమునఁ జూతురో వారు రౌరవాదినరకకూపములం బడుదురు. వారికా నరకమునుండి మరలుటలేదు. దుర్గంధభూయిష్ఠంబగు నానరకకూపంబులంబడి వారశుద్ధము నాహారముగాఁ గొనుచుందురు. నీవే విశ్వకర్తవు. యమునిగూడ శిక్షింపఁగలవు. అటులయ్యును బుత్రికను బరిగ్రహింపఁబూనితివి. కామార్తమానసుఁడవు కావున మాయెదుట నుండకుము. దూరముగాఁ బొమ్ము. నిన్ను భస్మముగాఁ జేయుతపశ్శక్తి మాకుం గలదుగాని జనకుఁడవని యప్పనికిం బూనకున్నారము. గురువు సహస్రదోషములొనరించిన క్షమించి పండితులుందురని వినఁబడియెడిని. సర్వహంతను నీతిజ్ఞులు గురువుకాఁడేని హింసింతురు. * గురువు

---

* కృష్ణాంతం యది సర్వస్వం శపంతం నిష్ఠురం గురుం, సాధవస్తం న నిందంతి ప్రణమంతి స్వశక్తితః, యే ద్విషంతి చ నిందంతి గురుమిష్టం సురాత్పరం, పచ్యంతే తేఽంధకూపేచ యావచ్చంద్రదివాకరౌ = అని మూలము.

సర్వస్వము దొంగిలించినను నిష్ఠురముగా శపించినను సాధువు లాతని హింసింపకుండుటయే కాక నమస్కరింతురు. దేవతల కంటె నెక్కుడగుగురువు నెవరు దూషింతురో ద్వేషింతురో వారునరకంబులం దధమం బనంబడు నంధకూపంబునం బడుదురు.

అనిపలికి జనకునిపాదములకుఁ బ్రణమిల్లి తమకృత్యములఁ జేయఁబూనిరి. బ్రహ్మయు సిగ్గుపడి శరీరమును దృజింపఁ బూనెను. యోగబలంబున షట్చక్రములను భేదించి సర్వప్రాణముల నిరోధించి వానిని బ్రహ్మరంధ్రమును జేర నాకర్షించి బహిర్నిర్గతములఁ గావించెను. మనసున శ్రీహరిని స్మరించుచు నమస్కరించెను. ఓ భగవంతా! నామది పరద్రవ్యమం దాసక్తము గాకయుండఁ గాపాడుము. సజ్జనులకుఁ బ్రాణత్యాగమున కంటె దుఃఖము దుష్కీర్తియు వేఱొండుకలదా? ఇట్లు బ్రహ్మ భావించుచుఁ బ్రాణములవదలి పరబ్రహ్మమునందు లీనుఁడ య్యెను. ఆ కన్యకయుఁ దండ్రిమృతుఁడగుట కెంతయు దుఃఖించెను. ఇఁక నేనుండి లాభమేమని యోగమునఁ బ్రాణములను దృజించి బ్రహ్మయందు లీనయయ్యెను. ఇట్లు మృతుఁడగుతండ్రిని సోదరింగాంచి స్వాత్మారాముఁడగు శ్రీహరిని స్మరించిరి. విలపించిరి. రాధాదేవీ! మదంశసంభూతుఁడగు నారాయణుఁడు కరుణచేఁ బొడచూపి బ్రహ్మను సంజీవితుంజేసెను. తత్పుత్రికను బ్రదికించెను. పరమేష్ఠియు నెదుటనున్న శ్రీనారాయణుంగాంచి వరము వేఁడుచు నీపాదభక్తి యొసంగుము. అది సదా నిశ్చలతంగాంచవలయు నని ప్రార్థించెను.

నారాయణమూర్తియు సృష్టివిముఖుఁడగు బ్రహ్మను గాంచి కరుణచెలువార నీతిసారమై మనోహరమునగు వాక్యము నిట్లు చెప్పెను. పంకజాసనా! ఇంచుక మొగమెత్తి నా మాటల నాలకింపుము. హృదయజ్వరరూపిణి యగులజ్జను వదలుము. సత్కీర్తియు నపకీర్తియు సుప్రతిష్ఠయు నుపద్రవము క్షుద్రులకు మహాత్ములకుంగూడ స్వకర్మవశమునఁ గలుగుచుండును. అన్నింటికంటెఁ గర్మము బలవత్తరము. కావుననే సాధువులు సదా సత్కర్మము నాచరింతురు. కొందఱు సర్వకర్మనిర్మూలనమును జేయుదురు. తొలుతఁ దాఁజేసినకర్మమునకుఁ దగినఫల మనుభవింపవలయును. కుకర్మమువలన నప్రతిష్ఠ చేకూరును. దానలజ్జకలుగును. సత్కర్మవలన సుప్రతిష్ఠలభించును. దిగంతవ్యాప్తసుయశస్సు చేకురు. రజోగుణమున బలము రూపము గలుగును. మోహము దుష్కీర్తియుఁ గలుగును. కాలానుసారముగా ఋణావ్రణాపవాదములు లభింపకమానవు. మహాత్ములకుంగూడ నివి తప్పక యలవడును. పరస్త్రీలయందుఁ బరవస్తువులయందు నపకీర్తి వసియించును. కావుననే సజ్జనులు స్వల్పేశకారణమందు ఖేదమొందరు. కావున మనమున నన్ను స్మరింపుము. సర్వము మదర్పణముచేయుము. నీ మది పరవస్తులోలముకాకుండ నిల్పుము. నా మాయ స్త్రీరూపమున వెలయును. అది యెల్లర మోహింపఁ జేయఁజాలును. విలాసమున నెల్లరకు మోహమునుగల్పించును జుమీ అనురాగవంతులకు నానావిధ సుఖోచితదేశమందు రతి గుదురును. మాంసపిండమే స్తనాహ్వా

యమునననలరు. జొల్లుగార్చు నపరిశుద్ధాంగమున కధరమని పేరు. శ్రోణీవక్త్ర స్తనములు కామదేవాలయముగా లెక్కింపఁబడును. కావున ధర్మభీరువులగు సజ్జనులు వానిం జూడనైనఁ జూడరు *ఎవరిమనస్సు పరస్త్రీలయం దాసక్తమగునో వారికి ధర్మమేమి? యశస్సెట్టిది? ప్రతిష్ఠయెట్లు? తపస్సేమి ? బుద్ధియేలాగు ? విద్య యేరీతి ? దానమెట్టిది ? అట్టివారేమిచేసినను వ్యర్థమగును. పరస్త్రీసమాసక్తహృదయుల కీలోకమున నపకీర్తియుఁ బరలోకమున దుఃఖము గల్గును. నరకదుఃఖములు విశేషించి కలుగును.

సుఖము దుఃఖబీజమని యెఱింగియుండియు మూఢులు దైవదోషమువలనఁ బ్రీతిమీఱఁ బరస్త్రీలను సేవించుచుందురు. మత్పదాంభోజసేవన ముత్తమము. సత్కర్మానుష్ఠానము మధ్యమము. పరస్త్రీసేవన మధమము. పరవస్తువుల గోరువారలకు విపత్తులు సదా కలుగుచుండును. విశేషించి పరస్త్రీసక్తులకుఁ గల్గును. ఎవఁడుదైవతంత్రమున బరకాంతనుజూచినంతనే హరిస్మరణము చేయఁదగు. ఆకాంతను మఱువఁ దగు. స్వర్ణమును స్పృశించినవెంటనే జలముతో హస్తప్రక్షాళనము చేయవలయును. అపుడతఁడు పరిశుద్ధుఁడగును. సాధువులు స్వభార్యలయందుఁ గామమున నాసక్తులుగారు. అది సర్వాపన్మూలమని వారెఱుంగుదురు. తపస్వులు తపస్సునందును, బండితులు శాస్త్రచింతలయందును, యోగులు యోగచింతలయందును, వైదికులు

*శ్లో॥ ధర్మః కిం యశస్తేషాం కా ప్రతిష్ఠా చ కిం తపః, కిం బుద్ధిర్విద్యా దానంచ పరస్త్రీషు చ యన్మనః. అని మూలము.

వేదార్థములందును, సాధ్వీజనములు పతిసేవనములందును, గృహస్థులు గృహకృత్యములందును, విషయాసక్తులు విషయములందును, నాభక్తులు నన్ను సేవించుపనులందును దమకాలము వినియోగింతురు. సభలయందు నిది యిట్లని సిద్ధాంతము చేయఁబడినది. వేదోక్తాచారము సజ్జనపరికీర్తితము. తద్విరుద్ధాచారము నిందితము. సన్మార్గవర్తుల నెల్లరు ప్రశంసింతురు. దుర్మార్గప్రవర్తకులను పాలికులుగూడ నాక్షేపింతురు.

చతుర్ముఖా! నీమది పరస్త్రీద్రవ్యములం దాసక్తిగలది గాకుండుఁగాక! ఇది మొదలు నావరప్రభావమున నీమది నిర్మలమగుఁగాక! నాయానతి మెయి మెలంగుము. నాయిచ్ఛాకార్యములను జేయుము. సర్వవిఘ్నములఁ బోనడచు నాపదాంబుజచింతను మానకయుండువుగాక! నీకన్యక యీమె కామదేవునకుఁ గామినియగుఁగాక! ఈమెపేరు రతి యనఁబడఁగలదు. రత్యధిష్ఠానదేవతయునగు. అని యిట్లు శ్రీనారాయణమూర్తి బ్రహ్మ నూఱడించి వైకుంఠమున కరిగెను.

## శంకరగర్వనిర్వాపణము.

* ఈకథను శ్రీకృష్ణుఁడు చెప్పఁగా రాధాదేవి ప్రాణనాథా! ఈనియమము చేతనేకదా బ్రహ్మ మోహినిని బరిత్యజించెను. అట్టికులటాశాపమున బ్రహ్మ యపూజ్యుఁడయ్యెనా? ఆతనికి దర్పభంగము నెట్లు కమలాపతి చేసెను ఈశంకలను దొలఁ

* ఈగాథ శ్రీకృష్ణజన్మఖండము ముప్పదియాఱవయధ్యాయము నుండి గ్రహింపఁబడినది.

గించుకథను వచింపుమూ యని ప్రార్థించెను. ఆప్రశ్నమున కానందించి రసికేశ్వరుండగు శ్రీహరినిగూఢమగు నితిహాసమును జెప్పఁబూని ప్రాణనాయికా! పూర్వము పంకజాసనుఁడు చిరకాలము తపమొనరించి నావలన వరములొంది బహు భంగుల సృష్టినొనర్చి విధాతృనామమును ధరించెను. తపఃఫల దాతయు సర్వశాస్త్రికర్తయు నయ్యెను. తన్ను నీశ్వరునిగా భావించి గర్వమును వహించెను. గర్వము బ్రహ్మాండముల మించునంతటిదయ్యెను. ఆవిధ మెఱింగి నేను బూర్వము చెప్పి నట్టు లాతనికిఁగలగర్వమును బోఁగొట్టితిని. బ్రహ్మాండములయం దెవ్వరెవ్వరికి గర్వ మెంతగలదో దానినెఱింగి వారివారికిఁదగి నట్లు శిక్షసేయుచునుందును. తొలుదొలుత బ్రహ్మగర్వమును దొలఁగించితినని యెఱుంగుము. దానివెంట శంకరునకుఁ బార్వ తికిని జంద్రునకు భాస్కరునకు నగ్నిహోత్రునకు దుర్వాసు నకు ధన్వంతరికిని వరుసగా గర్వభంగ మొనరించితిని. ఎట్లెట్లు చేసితినో చెప్పెద నాలకింపుము. ప్రాణేశ్వరి! అల్పులుగాని అధికులుగాని గర్వయుతులైరేని వారిగర్వమును మాన్పు చుందును.

అని శ్రీహరిపలుక రాధ శుష్కకంఠోష్ఠతాలుకయై భీతయై దాన విహ్వలతఁగాంచి యిట్లు ప్రశ్నించెను. మహాను భావా! ఎవరికెవరి కేయేవిధమున గర్వమంకురింప దాని నడంచితివి? సర్వదర్పభంజనా! నాకాపద్ధతి వచియింపుమా యని వేఁడుకొనియె. రాధా! బ్రహ్మగర్వనిర్వాపణ మెట్లు

చేసితినో తెల్పితినిగదా. శంకరాదులగర్వము నడంచినపద్ధతిని వినుము. శంకరుఁడు మదంశసంభూతుఁడు. లయకర్త. తేజస్సుచే మత్సమానుఁడు. గుణజ్ఞానసంపూర్ణుఁడు. ఆమహనీయుని యోగులు సదా ధ్యానించుచుందురు. కావుననే శంకరుఁడు యోగీశ్వరేశ్వరుఁడు. గురువులకు గురువు నయ్యెను. జ్ఞానానందస్వరూపుఁడు. ఆమహాదేవునిచరిత్రమును వినుము. యుగషష్టిసహస్రములు విరామములేనితపస్సొనరించెను. మత్కళాపూర్ణుఁడై సర్వవిధముల మత్సమానుఁడయ్యెను. తపోతేజఃపూర్ణుఁడయ్యెను. భక్తకల్పపాదపమను ప్రఖ్యాతింగాంచెను. భానుకోటిప్రకాశముగలవాఁడునయ్యెను. యోగీశ్వరులామహాదేవుని ధ్యానించి ధ్యానించి తేజోరాశిమధ్యభాగమున నాశంకరుంజూడఁగల్గుదురు. పంచవక్త్రములుగలిగిశుద్ధస్ఫటికవర్ణాభుఁడై లోచనత్రయవిరాజితుఁడై త్రిశూలపట్టిసములు కరముల వెలయ వ్యాఘ్రచర్మాంబరముదాల్చి స్వాత్మయందుఁ దన్నే ధ్యానించుచు శ్వేతాంబుజబీజమాలికం దాల్చి స్మితమనోహరముఖమండలమొప్పార శీతాంశురేఖాభాసమానజటాజూటుఁడై పరాత్పరుఁడై శాంతుఁడై త్రిజగత్కాంతుఁడై భక్తానుగ్రహకాతరుఁడై యలరారుశంకరుని యోగులారాధింతురు. ఆయీశ్వరుఁడు సకలసంపదలు కోరినవారల కిచ్చుచుండును. కల్పపాదపము కోరినవారికోర్కులం దీర్చును. శంకరుఁడు భక్తుఁ డెవ్వఁ డేకోరికను గోరునో దాని ననుగ్రహించును. ఇట్లు కొంతకాలము

సాగఁగా శంకరుఁడు నాయంతవాఁడు లేఁడనుగర్వము మదిఁ దాల్చెను.

ఒకానొక కాలమందు వృకదానవుఁడు శంకరునింగూర్చి తపస్సుచేసెను. కేదారక్షేత్రమున విరామముకలుగకుండ నాతనితపస్సు కఠోరముగా సాగెను. శివుఁడు ప్రతిదిన మాతని చెంతకుఁ గృపచెలువారఁ బోవుచుండెను. వరముడుగుమా యనుచుండెను. కాని యాతఁడు వరమడుగకుండెను. సంవత్సరము పూర్ణముకాఁగా శంకరుఁడు సాక్షాత్కరించి యాతని మ్రోల నిలువంబడెను. భక్తిపాశబద్ధుఁడు కానఁ గదలక యందే క్షణకాలముండెను. సర్వైశ్వర్యములను సర్వసిద్ధులను భక్తిముక్తులను హరిపదమును వాఁడు గ్రహింపకుండెను. పాదారవిందముల ధ్యానించుచు వాఁడుండఁగా శంకరుఁడు భీతుఁడై యేమియు నడుగక నిశ్చేష్టుఁడై వాఁడుండుటం గాంచి దుఃఖించెను. దాన నాతనికి ధ్యానభంగము కల్గెను. ఆ రాక్షసుఁడు సర్వసంపత్ప్రదాత నెదుటం గాంచెను. భక్తిపూర్వకముగా వరమును గోరెను. అతనిహస్తతల మెవనిశిరమున నుంచిన వాఁడు భస్మము కావలయుననుకోరిక యావరమున కర్థము. శంకరుఁ డట్లే యగుఁగాక యని పోవుచుండ వాఁడు వెంటనంటెను. శివుఁడు వాఁడు వరమును బరీక్షింపఁగోరెనని తెలిసి మఱింతవేగముగాఁ బరుగిడెను ఆపలాయనకాలమం దతని డమరుకము వ్యాఘ్రచర్మము క్రిందఁబడియెను. దిగంబరుఁడయ్యును శివుఁడు పరుగిడెను. * భక్తవత్సలుఁడు గావున

* నహంతి తం చ కృపయా భక్తం చ భక్తవత్సలః, దుష్టానుహారం సాధుశ్చ న కరోతి కదాచన. అని మూలము.

శంకరుఁడు వాని వధింపఁ బూనఁడయ్యెను. సాధువు లెప్పుడును దుష్టుల ననుసరించి ప్రవర్తింపరుసుమీ! *సాధువులు తమ కపకారముచేసినవారిని హింసింతురుగాని యందుఁ బుత్రమిత్ర భృత్యులుండిన సూనుదురు. శివుఁడు వానివలనఁ దనకు మృత్యు వుకల్గునని యూహించి తా సర్వేశ్వరుఁ డన్నగర్వమును మానెను. పలుమాఱులు నన్నే స్మరించి స్మరించి నాశరణు వేఁడెను. నేనొకయాశ్రమము నచటఁ గల్పించుకొని యుంటిని. శివుఁడు పెదవులెండ నాలుకతడియాఱ నాయాశ్రమమున కరుదెంచెను. కృష్ణా! కాపాడుమా కాపాడుమా యని భయ విహ్వలుఁడై పలుకుచుండెను. నేను బ్రత్యక్షమై వారినడుమ నిల్చి రాక్షసునినిలిపి వృత్తాంతమేమని యడిగితిని. వారిరువురు వచించిరి. మాయచే నాయసురుని మోహింపఁజేసితి. వంచితుఁడై వాఁడు తనశిరమున హస్తము నిడుకొని భస్మరాశి యయ్యెను. ఆతరుణమున నన్నెల్లసురులు కొనియాడిరి. శివుఁడు లజ్జితుఁడయ్యెను. అంతలోనే యతనిగర్వము తొలఁగెను. నేను శంకరుని బోధించితిని.

మఱికొంతకాలమునకు శివుఁడు మరల గర్వమూని మా ర్కొనువారులేక విజృంభిఁగు త్రిపురాసురులంజంపంబూని తాను ముల్లోకములలో మృత్యుంజయుఁడన వినుతిఁగాంచితి నని యూహించి యీ రాక్షసు లెంత యని వారిపై కేఁగెను. నేనిచ్చి

---

* సాధవో ఘ్నంతి ఘ్నంతంచ భృత్యం పుత్రం ప్రియం వినా—అని మూలము.

నశూలమును గవచమును గొనిపోయెను. చిరకాలము యుద్ధము చెల్లెను. ఇర్వురు సమబలులు మారొక్కన నందెవ్వరోడుదురు ? రాక్షసుఁ డందొకరుఁడు మాయందాల్చి యేఁబదికోట్లయోజనములపొడవుగాఁ గనఁబడియెను. వానింజంప శంకరుఁ డెగిరెను. నిరాధారస్థలంబున నొకమాసము సంగరముసాగెను. శంకరుని ధనురస్త్రముల నారక్కసుఁడు ఖండించెను. రథము శిథిలమయ్యెను. దాన నాగ్రహించి శంకరుఁడు వానిఁ బిడికిటఁబొడిచెను. వాఁ డావజ్రముష్టిఘాతమున మూర్ఛిల్లెను. క్షణమున స్మృతినొంది మహాకోపమున శివునిబట్టుకొని భూమిపై వైచెను. హరుఁడు క్రిందఁబడఁగా దేవర్షులు భీతులై నన్ను నుతించి కావుమా యని వేఁడిరి. నిర్భయుఁడై శివుఁడును నన్నే స్మరించెను. నేనపుడొకకళచే వృషభరూపమునుదాల్చి భూతలమునఁబండుకొనియున్న శంకరుని గొమ్ములచే నెత్తి నెత్తిన నిడుకొని నాకవచము నస్త్రమునొసంగితిని. వానిని గ్రహించి శివుఁడు నేనొసంగినశూలమున వానింగొట్టెను. దర్పహంతను నన్నుగానే ధ్యానించెను. రాక్షసుఁడు చూర్ణరాశియై పడియెను. దేవతలు మునులు శంకరుం బొగడిరి. అత్తఱి శంకరుఁడు గర్వమును విడనాడెను. జ్ఞానానందస్వరూపుఁడై సర్వకర్మములందు నిర్లిప్తుఁడయ్యెను. అదిమొదలు నే నాశివుని వృషభరూపమున మోయుచున్నవాఁడను. శివునికంటెఁ బ్రియతముఁడు నాకొకండు లేఁడు. బ్రహ్మ నామనస్స్వరూపుఁడు. శంకరుఁడు నాజ్ఞానస్వరూపుఁడు. భగవతియగుదుర్గ నాబుద్ధిస్వరూపిణి. ఆమెయే మూలప్రకృతి.

ఈశ్వరియునగు నిద్రాదిశక్తు లేవేవికలవో యవన్నియుఁ బ్రకృతికళలు. వాగధిష్ఠానదేవియే సరస్వతి యనంబడును. మత్కల్యాణాధిదైవతము గణనాయకుఁడగు. పరమార్థమే ధర్మమగు. భక్తుఁడు హుతాశనుఁడు. గోలోకవాసులందఱు నాయైశ్వర్యస్వరూపులు. ప్రాణాధిష్ఠాతృదేవివినీవే. నా ప్రాణములకంటె నీవే యెక్కుడు. గోపాంగనలెల్ల నీయంశజనితలే యగుదురు. గోలోకమున నను బూజించువారే గోపకులు. నా తేజస్సే సూర్యుఁడు. ప్రాణములే వాయువులు. జలాధిదైవము వరుణుఁడు. మన్మలోద్భూత పృథ్వి. శూన్యమగుమన్మహాకారమే మదనుఁడు. ఇంద్రాదులందఱు నాకళాంశాంశసంభూతులు. ఇదియే మహదాదిసృష్టిబీజములు. అన్నింటికి బీజభూతుఁడను నేనే. నిరాశ్రయుఁడను. జీవుఁడు నా ప్రతిబింబరూపుఁడు. కర్మభోగాధికారకుఁ డతఁడే. నేను సాక్షిమాత్రుఁడను. నిరీహుఁడను. సర్వకర్మముల ననుభవించువాఁడను గాను. * స్వేచ్ఛాస్వరూపుఁడనగు నాకు భక్తులు ధ్యానించుకొఱకు దేహ మలవడుచుండును ప్రకృతియు నేనే. పురుషుడను నేనే. మా యీ యిర్వురకును భేదము లేదు. పరాత్పరుఁడను నేనే.

రాధాదేవీ! శివదర్పవిమోచన పద్ధతి యిది. దీని నామూలముగాఁ జెప్పితిని. ఇఁకఁ బార్వతీదర్పభంగపద్ధతి యెట్టిదో చెప్పెద నాలకింపుము. అని శ్రీకృష్ణుఁడు వచింపఁగా నాలకించి

---

* భక్తధ్యానార్థదేహోఽయం మమ స్వేచ్ఛామయస్య చ, ప్రకృతిః పురుషోఽహం చ ఏకఏవ పరాత్పరః-అని మూలము.

రాధాదేవి యోభగవానుఁడా, సర్వబీజస్వరూపుఁడవు నీవే. సనాతనుఁడవు నీవే. నాకు సకలసంశయములు తొలఁగునట్లుప దేశింపుము. శంకరుఁడు సర్వజ్ఞానాధిదేవుఁడు. సర్వతత్త్వవిదుఁడు. మృత్యుంజయుఁడు. కాలకాలుఁడు. త్వత్సమానుఁడు. అట్టి శంకరుఁడు విభూతిపరిలిప్తగాత్రుఁడు, పంచవక్త్రుఁడు, త్రిలోచనుఁడు, దిగంబరుఁడు, జటాధారి, నాగసంఘాతభూషణుఁడునగుటయేల? నిరుపమానవాహనములఁ గైకొనక వృషభము నెక్కి తిరుగనేల? రత్నహారములవదలి యుండ నేటికి? మృదులాంబరముల మాని శార్దూలచర్మమును ధరింప నేమి హేతువు? పారిజాతప్రసూనముల మాని యుమ్మెత్తపూవులఁ దాల్చును గదా ఏల? రత్నకిరీటేచ్ఛమాని జటాధారణేచ్ఛ యామహాదేవున కేల కలిగెను? పరిశుద్ధమణిప్రదేశములవదలి శ్మశానవాసము పూన నేమియో? చందనాదులను సుగంధిసుమములనువదలి బిల్వగంధమును బిల్వపత్రమును గోరునుగదా. ఏటికి? ఈప్రశ్నములకు నుత్తరముల వినఁగోరుచున్నదాన నామనస్సు నన్నుఁ దర్వరపెట్టుచున్నయది.

### శంకరుమాహాత్మ్యము.

అని యిట్లు ప్రశ్నించు తనకళత్రమును రాధికను జూచి శ్రీకృష్ణుఁడు చిఱునవ్వు మొందు పరుగిడుచుండఁగా నామెను కౌఁగిటనిడుకొని కథనుజెప్ప నారంభించెను. ప్రాణేశ్వరీ! చక్కఁగా నాలకింపుమా. యుగషష్టిసహస్రములు మహేశ్వరుఁడు మున్ను తపస్సొనరించి నన్ను మది ధ్యానించుచుఁ దప

ప్సమాధిని వదలెను. అప్పుడ నే నాశంకరునియెదుట నిల్చితి అప్పటి నాదేహము శ్యామసుందరము. కమనీయతమము. కిశోరాకృతి దోఁపింపఁజేయునదిగానుండెను. అనిర్వచనీయమగు నాతను లావణ్యయుతమగు నాదేహమును గాంచి త్రిలోచన ములఁ గాంచియు దృప్తినొందఁజాలఁడయ్యెను. నిమేష విర హితలోచనములం జూచియు నిఁకఁ జాలునన్నభావము గాం చఁడయ్యెను. భక్త్యతిశయమున నొడలెఱుంగక వగచెను. ప్రేమవిహ్వలుఁడయ్యెను. సహస్రవదనములుగల యనంతుఁడు చతుర్ముఖములుగల బ్రహ్మయు నదృష్టవంతులు. అనేకనయనము లఁ జూడఁగలరు. పెక్కుముఖముల నీదివ్యాకృతి నుతింపఁగల రు. నే నట్లు చూడను లేను. వినుతింపనుజాలను. మూఁడుకన్నుల తోడను, ఒక్కముఖముతోడను జూచి వినుతించెను. ఈనాల్గును జాలవనియతనిభావమైనందున ముఖములునాలుగయ్యెను. పూర్వ ముండున దొకటి కలిసి యైదుముఖము లయ్యెను. ఒక్కొక్క ముఖమునందును మూఁడులోచనము లలరుచుండెను. కాఁబట్టి శంకరునకుఁ బంచవక్త్రుఁడనియుఁ ద్రిలోచనుఁడనియుఁ బేరుగ ల్గెను. స్తుతించుటకంటె నా శ్యామసుందరవిగ్రహమును గాంచు టయం దెక్కుడుప్రీతిగలదు. కాన ముఖములకంటె నేత్రము లెక్కుడుసంఖ్య గలవయ్యెను. ఆ పరమేశ్వరునినేత్రములు గుణ రూపములు. మూఁడుకన్నులు సత్వరజస్తమోగుణస్వరూపము లని యెఱుంగుము. సత్వగుణనేత్రమున సజ్జనులం జూచుచు రక్షించును. రజోగుణనేత్రమున రజోగుణులం గాంచి

కాపాడును. తమోగుణనేత్రమునఁ దమోజంతువులఁ గాపాడును. లలాటపరిశోభితతమఃప్రధాననేత్రముననే జంతువులను దహించును. ఆ శంకరునకుఁ గ్రోధ మెపుడుకల్గునో అప్పుడే తృతీయనేత్రమున హుతవహుఁడు పొడసూపును. ఆ యగ్ని కోటితాళప్రమాణజ్వాలలు వెలయఁ గోటిసూర్యప్రకాశ మలర నొప్పును. ఆ యగ్ని ముల్లోకముల నొక్కక్షణమునఁ గాల్పఁగలఁడు. సతీదేవి యాయనభార్యకదా. ఆసాధ్వి యోగాగ్నిచే దహింపఁబడెను. ఆ భస్మము నతిప్రీతితో శివుఁడు ధరించును. ప్రేమభావమున నామె యస్థిమాలను దగ్ధభస్మమును ధరించును. స్వాత్మారాముఁడయ్యు నీశ్వరుండయ్యు నొకసంవత్సరకాలము సతీదేహమును బట్టుకొని తిరిగెను. బహుభంగులం బలవించెను. ఆసతీదేవియే యేయవయవముల యొక్కుక లేయే తావులఁబడెనో యా స్థలములు సిద్ధపీఠము లనఁబడి సర్వసిద్ధుల నొసఁగఁజాలెను. ఒకచోట నామెకళేబరమును వక్షమున నిడుకొని యట్లే పండుకొనియెను. అత్తఱి నేనటఁ దోఁచి యా శంకరుని భుజాంతరమున నిడుకొని బోధించితిని. శోకము తొలఁగునట్లు దివ్యజ్ఞానము నొసంగితిని. అప్పుడు తృప్తి నొంది శివుఁడు తనలోకమున కరిగెను. ఆ సతీదేవియే రూపాంతరమున నా శంకరునకు భార్యయయ్యెను. దివ్యస్రగ్ధరణుఁడు కావునఁ గుసుమమాలాధారణమునఁ బ్రీతిలేదు. సదా తపోనిరతుఁడు కావున జటావళి ధరించును. యోగులకుఁ గేశసంస్కారమున నిష్టముకలుగదు. అట్టివారికిఁ జందనమందును

బంకమందును, మృత్తికయందును రత్నమునందును సమభావమే యుండునని నమ్ముము. గరుడునికి శత్రువులగునాగములు శంకరుని శరణుచొచ్చెను. శరణాగతములు కానఁ గృపానిధి యగుట వానిని స్వాంగమున ధరించును. *నేను వృషభరూపమున శంకరుని మోయుదును. వేఱొకఁడామహాత్ముని వహింపఁజాలఁడు. త్రిపురాసురసంహారమునకుఁ బూర్వ మాశంకరుఁడు పారిజాతాదిసుగంధికుసుమముల నాకర్షించెను. కావున మరల వానిని ధరింపఁబూనఁడు. సువాసనలేనిదని దుత్తూరము నీచమని తలంపక శంకరుఁడు దానినే ధరించు. బిల్వగంధముగూడ బరిమళహీనమని యాక్షేపింతురని యతఁడాగంధమునే పూసికొనును. వ్యాఘ్రచర్మము యోగిష్టము. దివ్యలోకమునందు, దివ్యతల్పమునందును జనసామాన్యమునకుఁ బ్రీతియలరును. నిర్లిప్తుఁడగుశంకరున కవ్వానియందుఁ బ్రీతియుండదు. శ్మశానమతిరహస్యస్థలమాట నందుండి నన్ను సదా ధ్యానించుచుండును. ఆబ్రహ్మస్తంభపర్యంతము సమముగా శివుఁడు భావించును. అనిర్వచనీయమగు మద్ధ్యానపమునం దాశివుని మానసము మగ్నమయియుండును. బ్రహ్మ నశించుదనుక నుండు కాలమెల్ల శివున కొక్కక్షణమాత్రముగాఁ దోఁచును. †కావున శంకరునాయుఃప్రమాణము నే నెఱుంగఁజాలను. ఇఁక

*వాహనం వృషరూపో౽హమన్య స్తం వోఢుమక్షమః. అని మూలము.

† తస్యాయుషః ప్రమాణం చ నాహం జానామి కా శ్రుతిః. అని మూలము.

వేదమేమి నిర్ణయింపఁగలదు ? మృత్యుంజయుఁడు జ్ఞానశూల
మును ధరించును. అది నాతేజస్సుతో సమమగు తేజస్సుగలది.
నేనుదప్ప నింకొకఁడు శంకరుని జయింపలేఁడు. శంకరుఁడే
నాపరమాత్మ. ప్రాణాధికుఁడు. నాచిత్తము సదా శంకరుని
యందు లగ్నము. అంతకంటెఁ బ్రియుఁ డింకొకఁడు లేదు.
ఏశంకరునిమాయచే బ్రహ్మాండసంతతినెల్ల నేను నాచ్ఛాదించి
యుందునో, అట్టిశంకరుని మోహింపఁజేయువాఁ డెవ్వఁడు?
నేను గోలోకమునందును వైకుంఠమునందును, నీవక్షస్థలము
నందును నివసింపను. శంకరునిహృదయమున సదాయుందును.
శంకరుని ప్రేమపాశములు నన్ను బంధించినవి. స్వరసిద్ధమై
సాధుతాళాన్వితమైనగానమును శంకరుఁడు పంచవక్త్రములతోఁ
జేయును. సదా నాపద్యావళులఁబాడును. కాన సదా శంకరుని
చింతనుందును. ఏశివుఁడు భ్రూభంగవిలాసమున సృజించునో
నాశనమొనర్చునో అట్టిశంకరునికంటె యోగి మఱియొకఁడు
లేఁడు. సకలదేవతలను మృత్యువును బుట్టింప సంహారింపఁజాలు
శంకరునికంటె జ్ఞాని లేఁడు. నాభక్తిని దాస్యమును ముక్తిని సర్వ
సంపదలను గరుణనీయఁజాలుశంకరునికంటె దాత లేఁడు. ఐదు
ముఖములచేత సదా మన్నామమును స్తుతించుచు నారూప
మును ధ్యానించుశంకరునికంటె భక్తుఁడు లేఁడు. నేనును
నాసుదర్శనము శివతేజస్సమానులము. బ్రహ్మసృష్టికర్తయయ్యుఁ
దత్సముఁడుకాఁడు. రాధాదేవీ ! నీవు కోరినట్లు బదులిడితిని.
శంకరు దర్పభంగమును మున్నే చెప్పితిఁగదా. ఇంక నేమివినఁ
గోరెదవు ? అని కృష్ణుఁ డూరకుండెను.

పాఠకమహాశయులారా ! మోహిని బ్రహ్మను మోహించుట, అది మంచిదికాదని యతఁ డామె కుపదేశించుట, మహర్షు లరుదెంచుట, వారు మోహినిచిత్రచరిత్రమును వినినవ్వుట, అదియెఱింగి మోహిని బ్రహ్మను శపించుట, ఆశాపమునకు వెఱచి యతఁడు వైకుంఠమున కరిగి నారాయణమూర్తిని దర్శించి తనస్థితిని దెల్పుకొనుట, నారాయణమూర్తి బ్రహ్మకు ధర్మముల నుపదేశించి యతనికింగలగర్వమును వదలింపఁగోరుట, అంతలో బ్రహ్మ లనేకులువచ్చుట, వారింగాంచి గర్వముమాని బ్రహ్మ శాంతుఁడగుట, అంతలో శంకరాదులచ్చటి కేతెంచి నారాయణమూర్తిని వినుతించుట, గంగాదేవి సాక్షాత్కరించుట, తన్మహిమను, బ్రహ్మను గంగలో స్నానమొనరింపుమని విష్ణు వాజ్ఞాపించుట, ప్రకృతిమహిమమును దెలిపి యోజననిని దూషించితివిగాన శాపఫల మనుభవింపుమని యాజ్ఞాపించి మోహినిం బరిగ్రహింపుమని సెలవిచ్చుట, సర్వతిని బ్రహ్మ గోలోకమునఁ గాంచుట, బ్రహ్మ మదనబాణహతుఁడై పుత్రికఁ గవయఁగోర నామె పరుగిడుట, బ్రహ్మపుత్రులగు సనకసనందనాదులు తండ్రికి హితముదెలుపుట, బ్రహ్మ తనకృత్యమునకురోసి దేహమును ద్యజించుట, ఆపుత్రికయు నటఁ జచ్చుట, నారాయణమూర్తి వారిబ్రదికించుట, బ్రహ్మ కనేకభంగుల నీతి నుపదేశించి శాంతచిత్తునిగా నొనర్చుట, శంకరగర్వనిర్వాపణము, వృకదానవుని(భస్మాసురుని) చరిత్రము, శంకరునిమాహాత్మ్యము నను నీగాథలం బఠించి

తిరి. వీనినుండి గ్రహింపఁదగినవిషయము లనేకములు గలవు. దానిని సంగ్రహముగఁ దెలిపెద. ఆలకింపుఁడు. నా వ్రాసినవియే గాక యింకను మీకేవేని దోఁచిన వానిని వీనితోఁ గూర్చి కొనుఁడు. సావధానులరుగండు.

బ్రహ్మ వేదవేత్తలలో నగ్రగణ్యుఁడు. అమహనీయుఁ డెఱుంగని వేదరహస్యము లేదు. కావుననే మోహిని తన్ను మోహింప నామెకు లలితభణితుల నీతి నుపదేశించెను. వృద్ధు నింగోరుట న్యాయము కాదని మందలించెను. సమానవయస్కుల కూడిక సుఖప్రదమను ననుభవమును దెల్పెను. తనమనస్సు చంచలతనొందకుండ భగవత్పాదాంబుజముల ధ్యానించెను. ఇంతే దనుక మనమాలోచించిన బ్రహ్మ జ్ఞానసంపన్నుఁడనియే స్పష్టము. మోహినిమాత్రము వివేకములేనిదియా కాదు. జ్ఞానప్రధాన జన్మము కలదిమాత్రము కాదు. నలువ తనమాయలకు లోఁ బడకపోఁగా నితాంతదుఃఖముల పాలయ్యెను. ఆహారనిద్రల మాని కృశించెను. అట్టిదానిని భగవంతుఁ డేల నశింపఁజేయ లేదని ప్రశ్నింపరాదు. వయోధర్మ మట్టిది. దేవతాంగనలు లోకోపకారముననే సృజింపఁబడిరి. వ్యభిచారముకూడ లోకో పకారకమా యని వెక్కిరింపకుఁడు. నీచు లున్నతపదవినిగోరి తపస్సుచేయుదురు. అట్టివారిధైర్యము నీఱుచేయ నీయంగనలు వలంతులు. వీరిసోయగముఁ గాంచియు ధీరుఁడయ్యెనేని వానికిఁ దపస్సు ఫలించును. అట్లు ధైర్యమును మాని వీరిమాయలకు లోఁబడి రొందఱో తపస్సుమానిరి. వారివలనఁ గలుగనున్న

లోకాపకారము వీరివలననే చెడినది. తదర్థమే దేవలోకమున వారికిఁ దావీఁబడినది. కాని కులట లందుండుటకుఁ జోటుగల దా. కేవలసుఖమునే కోరి పుణ్యకార్యములు చేయువారికి స్వర్గసుఖముగలదన్న వీరిమూలముననే కదా కలుగఁదగు. కావున నచ్చరలు సామాన్యకులటలవంటివారు కారు.

మోహిని దుఃఖమును రంభతీర్ప నెంచి కాము నారాధింపుమనియె. అది యట్లే యొనరించెను. కాముఁడు ప్రసన్నుఁడయ్యెను. బ్రహ్మను మోహపరవశునిగఁ జేయబూనెను. కాని బ్రహ్మమానస మల్పపాత్రముకాదు. అందు జ్ఞానజల మనంతముగాఁగలదు. కావున మన్మథునియల్పవీర్య మట ఫలింపదయ్యెను. దాన బ్రహ్మయుఁ గోపించి యకార్యకరణఫల మనుభవింపుమని వసంతుఁడు నీవు భంగపడుదురు గాక యని శపించెను. ఆశాపఫలమే వాఁడు శంకరనేత్రాగ్నింబడుటకు హేతువయ్యెనని యెఱుంగందగు.మదనుని శపించి మోహినిని శపింపఁడయ్యె. ఏల? అది వాంఛించుట తప్పుకాదు. అది పరనారికాదు. కాఁబట్టి మంచిమాటల దానికి బుద్ధిగఱపెను. ఆర్తయగు వనిత తన్నువలచినదానివాంఛితముం దీర్చుట సామాన్యప్రజల ధర్మముకాని తపోనిరతులధర్మము కాదని శాసించెను. లోకాచారవిరుద్ధమనియుఁ దెల్పెను. పురుషుఁడు స్త్రీని గోరఁదగు. పురుషుని వనిత తనంతన గోరరా దనునదియే లోకాచారము.

మోహిని కర్మసిద్ధాంతములను బ్రహ్మకుం దెల్పెను. తన్నుఁ గులటనుగాఁజేసినదియుఁ గర్మమేకదా. దానిని దాఁటు

టెట్లని ప్రశ్నించెను. నీవు గర్వివని బ్రహ్మను హెచ్చరించెను. ఉత్తమమధ్యమాధమపద్ధతుల నేర్పఱచినది. కర్మమే యని తేట పఱచెను. నీవు వరప్రదాతవు. నే నీవరమడిగితిని. దానిని ఫలింపఁజేయవలదా యని ప్రార్థించెను. అట్టితటిఁ గామదేవుఁడు బ్రహ్మమానసమును జలింపఁజేసెను. కాని యించుక చలించిన హృదయమును బదిలపఱచుకొని భగవంతు నభ్యర్థించెను. ఈయాపత్సముద్రమునఁ బడకయుండ నుద్ధరింపుమా యని ప్రార్థించెను. అంతట మోహిని వదలిపోయెనా. లేదు. మఱియుఁ బ్రార్థించి ప్రార్థించి సమీపించి చేలాంచలమును బట్టి లాగెను. నలువమనోధైర్య మప్పటికిని గదలకుండెను. చక్కనిహితము నుపదేశించుచుండెను.

ఎట్టివానికేని మనసున నేవిషయమునఁగాని గర్వముండిన నది యెట్టులేని దొలఁగించునుపాయము భగవంతుఁడు వెదకును. బ్రహ్మకుఁ దాను సృష్టికర్తననియుఁ గర్మఫలములకుఁ దగినట్లు వరము లిచ్చువాఁడనని, జ్ఞానులలో శ్రేష్ఠుఁడనని, జితేంద్రియులలోఁ బ్రథమగణ్యుఁడనని, యించుక యహంకారము కలదు. దానిని దొలఁగించినఁగాని యతనియుత్తమచరిత్రము ప్రఖ్యాతముకాదని భగవదిచ్ఛ. అందుల కేదిసమయమో యప్పుడేదైవము దానిని ఫలింపఁజేయును. మోహిని యెదుటనున్నది. నలువ నీతుల నుపదేశించుచున్నవాఁడు. ఆసమయమున బ్రహ్మను దర్శింపమహర్షులు పెక్కురు చనుదెంచిరి. వారు రాఁగా మోహిని యవ్వలికిం బోయెను. మును లీదేవదాసి యిటనుండ నేల

యని ప్రశ్నించిరి. శరస్వతీనేతము దానిపాండిత్యమును దేటపఱిచి సత్యము మఱుఁగుపఱచుట న్యాయముకాదు కావునఁదద్భావము తేటపడ నవ్వెను. మును లేమి సామాన్యులా. సర్వజ్ఞులు. తత్సత్యము నెఱింగిరి. పక్కుననవ్విరి. ఆపరిహాసమును విని మోహిని వేగంబ యచ్చటికి వచ్చెను. దాసురాలను. వినీతను. శరణుచొచ్చితిని. అట్టి నన్నవమానించితివి కావున నీ వపూజ్యుండవు కమ్మని శపించెను. ఎట్టివారి నే నవమానింపరాదన్న సూక్తిని మీఱిన బ్రహ్మకుఁ దత్ఫలముగలిగెను. ఆపాపమునకు ఫల మనుభవింపవలసివచ్చెను. ఇదియే భగవదిచ్ఛ. కులటాశాపము నన్నుసోఁకెఁ గావున నాసర్వేశ్వరత్వ మేపాటిదన్న సద్బుద్ధిగలిగెను. ఇట్టియూహ పొడసూపవలయుననియే పరాత్పరుఁ డెంచెను. కులటాముఖమునుండి వాక్కు భగవదాజ్ఞచే వెలువడియె. దాన బ్రహ్మ పరితాపమందెను. వెంటనే వైకుంఠమున కరిగి నారాయణమూర్తిని బ్రార్థించెను. భగవంతుఁ డారహస్యము నెఱింగెను. మందమందమృదూక్తుల వత్సా! స్త్రీ నేల పరిహాసించితివి? స్త్రీని బరిహాసించుట యనఁ బ్రకృతిని బరిహాసించినట్లే. ప్రకృతిని బరిహాసించినచోఁ దత్పాపఫల మనుభవింపక తప్పునా. అంతియగాక భారతవర్షము కర్మభూమి. అందు ప్రాణులధర్మములు వేఱు. స్వర్గాదిలోకమునసుండుప్రాణులధర్మములు వేఱు. ఆలోకములు క్రీడాక్షేత్రములు ఇందలిప్రాణుల కావాసరాదు లనవసరములు. మర్త్యలోక మట్టిదికాదు మనుష్యలోకమున నీవుండఁగా మోహిని నిన్ను మోహించెనేని జితేంద్రియత్వము నీకు నుండఁ

దగు. క్రీడాక్షేత్రమునుండి త్వదేకశరణనని దీనరై వేఁడువని తం దక్షజించితివి. అంతతోనుండక పరిహాసించితివి. ఇది నీకుఁ దగదు. అని పలుకుచు నీతఁడు సృష్టికర్త నన్న గర్వముగలిగియున్నవాఁడు. దానిని దొలగించెదనని యూహించెను. అంతలో ద్వారపాలకుఁడు బ్రహ్మ రాకను దెలిపెను. అంతలోఁ బదితలలు గలబ్రహ్మయు, నూఱుతలలుగలబ్రహ్మయు వేయితలలుగలబ్రహ్మయు వరుసగానరుగుదెంచిరి. వారిచతుర్ముఖునకు ముందుభాగమునఁగూరుచుండిరి. వారితో నారాయణమూర్తి యాయాయి బ్రహ్మాంశములఁగల విచిత్ర దేవతలవార్త లడుగఁగా బ్రహ్మకు గర్వము తగ్గుచువచ్చెను. అనేక బ్రహ్మాండములుగలవనియు, నన్ను మించిన బ్రహ్మ లందున్నవారనియు వీరిలో నేనేపాటివాఁడను గాననియు నలువ నిశ్చయించుకొనునంతలో వారెల్లఁ దమతమ నెలవుల కరిగిరి. నారాయణమూర్తి నలువా! ఇపుడేమి చూచితివో చెప్పుమన సిగ్గుపడి యతఁ డూరకుండెను.

చతుర్ముఖునిగర్వమును దొలఁగించుటకే భగవంతుఁ డీ చమత్కృతిని గనఁబఱచెను. నాకన్న వేఱొకఁడు సృష్టికర్తకలఁడా యనునభిమానము విరించికుండెను. అనేకబ్రహ్మాండములఁ గల్పింపఁగల భగవంతునియెదుట నాకంటె వేఱొకండుకలఁడా యనుగర్వముగలవాఁ డుండరాదుకదా. ఆగర్వమే పురోవృద్ధికి భంగము. జ్ఞానియగు కమలసంభవునకీచిన్ని గర్వము పొడసూపరాదని భగవదిచ్ఛ. అది యీరీతిగాఁ జూపఁబడినది. దానిచే

బ్రహ్మగర్వము తొలంగెను. ఇదియే బ్రహ్మదర్పభంగపద్ధతి. దీని నుండి గ్రహింపదగినవిషయములు పెక్కులున్నవి.

నారాయణమూర్తి బ్రహ్మతో నేమనిపల్కెను ? స్త్రీని దూషించినఁ బ్రకృతిని దూషించినట్లే కదా యని. లోకముం స్త్రీలకుఁ బురుషులకును దపోనియతివిషయమునఁ దారతమ్యము కలదు. స్త్రీలకుఁ దపస్సు త్వరగా ఫలించును. పురుషుల కంత వేగముగా ఫలింపదు. కారణమేమనఁ బ్రకృత్యంశము స్త్రీజాతియం దెక్కుడు వ్యాపించును. సర్వార్థప్రదాత్రి కదా ప్రకృతి. ఇదియుఁగాక స్త్రీచిత్తమతిచంచలము. దాని నియమించుటయే మహాకార్యము. ఆకార్యము క్షణము కొనసాగెనా త్రిలోకము లల్లలనాడించుశక్తి వారికింగల్గును. కావున మోహిని కొలఁదిదినములు తపస్సొనరించి బ్రహ్మకు శాప మిచ్చునంతటి మనశ్శక్తిని సంపాదించెను. మనస్సు నిగ్రహించుటయే తపస్సు అదియే యోగము దానికిమించినతపస్సుగాని యోగముకాని లేదు. ఆకార్యము నెఱవేఱకున్నఁ జేసినజపము నిష్ఫలము కనుక మనోనిగ్రహము ప్రధానమని భగవంతుని యుపదేశము. ఈవిషయమే శ్రీకృష్ణునింగూర్చి యర్జునుఁడు,

శ్లో. చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహంనిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరమ్. ౬అ. 3౪.

"వ్యా. చంచలం స్వభావేనైవ చపలం. కించ ప్రమాథి ప్రమథనశీలం. దేహేంద్రియక్షోభక మిత్యర్థః. కించ బలవత్.

విచారేణాపి జేతు మశక్యం కించ దృఢం. విషయవాసనానుబద్ధ తయా దుర్భేద్యమ్. అతః యథాకాశే దోధూయమానస్య వాయోః కుంభాదిషు నిరోధనమశక్యం. తథా తస్య మనసోఽపి నిగ్రహం నిరోధం సుదుష్కరం సర్వథా కర్తు మశక్యం మన్యే.
శ్రీధరాచార్యః."

అని ప్రశ్నించెను. మనోనిగ్రహమునకంటె దుష్కర కార్యము లేదే. అదెట్లు శక్యమగునని యర్జునుని ప్రశ్నసారము. భగవంతుఁ డీప్రశ్నమును విని యతనిసంశయమును దీర్పనెంచి,

శ్లో. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే. 35

భా. "అభ్యాసో నామ చిత్తభూమౌ కస్యాంచిత్సమాన ప్రత్యయావృత్తిశ్చిత్తస్య. వైరాగ్యం నామ దృష్టాదృష్టేష్టభోగేషు దోషదర్శనాభ్యాసాత్ వైతృష్ణ్యమ్" అని శంకరాచార్యులు.

సమాధివిషయమున యోగశాస్త్రము.

మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మాకారతయా స్థితిః,
యా సంప్రజ్ఞాతనామాసౌ సమాధిరభిధీయతే.

అని బోధించుచున్నది.

శ్లో. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః. 36

అని శ్రీకృష్ణమూర్తి సమాధానము చెప్పెను. ఈప్రశ్నోత్తరముల సారమేమి ? మనోనిగ్రహము దుష్కరకార్యములలో దుష్కరకార్యమని, దాని నిగ్రహించుట యోగము సభ్య

సించుటచేతను వైరాగ్యముచేతను సాధ్యమనియే కదా. మనో నిగ్రహామునకు యోగము ప్రథమసోపానము. యోగాభ్యాసముచేయక పొడిమాటలుచెప్పు డాంభికులు నర్థలుబ్ధులు నగు. వారిపల్కులకుఁ జెవియొగ్గరాదు. వారు కపటనాటకసూత్రధారులు. దుర్వృత్తులు. తొలుదొలుత యోగము నభ్యసించి వైరాగ్యసంపదగలిగినఁగాని మనస్సు నియమబద్ధముకాదు. వశముకాదన్నమాట. అది కొనసాగకున్నచోఁ దపము వ్యర్థము. అదియుఁ బురుషులకంటె స్త్రీలకు మఱింతకష్టము. కాఁబట్టియే,

'స్త్రీబుద్ధేవస్థిరత్వాచ్చ'

అని స్మృతి హెచ్చరించెను. కావుననే మిక్కిలి చంచలమగు మనస్సును నిగ్రహించి వనిత క్షణకాల మారాధించినను భగవదనుగ్రహాము కలుగును. దాననే మోహినికిఁ దప మల్పకాలమున ఫలించెను

శ్లో. యోషాతిరూపసంపన్నా గర్వితా మదశాలినీ,
మమరూపైవ సా జ్ఞేయా పుష్పేణాపి న తాడయేత్.

అని కాళి వచించెను. స్త్రీ నవమానించుట నన్నవమానించి నట్లే యని కాళికాంబికాభావము. ఈవిషయమే నారాయణమూర్తి బ్రహ్మకు,

'స్త్రీణాం విడంబనే నైవ ప్రకృతేశ్చ విడంబనమ్'

అని తెలిపెను. స్త్రీనింద చేయరానికార్యములలో మొదటిదనియు, నది ఫలము నీయక తప్పదనియు నారాయణమూర్తి యుపదేశసారము. అది పరమేష్ఠిచేసేదుష్కల మనుభవించెను.

కులటాశాపము ఫలించునా యని శంకింపఁబనిలేదు. మనపాపమే తన్ముఖమునుండి వెలువడి తత్ఫలమును గల్పించును. ఇది సర్వదా సర్వథా సిద్ధాంతము. మోహిని స్వర్గపురవేశ్య. దానికి శాపాధికారముగలదా యని ప్రశ్నింపరాదు. బ్రహ్మ విధి విహితముగాని స్త్రీతిరస్కరణ మొనర్చెను. గావున నాపాపము మోహినీశాపమూలమున ఫలము నిచ్చెనని గ్రహింపవలయును. కాఁబట్టియే మనుస్మృతి,

శ్లో. పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా,
పూజ్యాభూషయితవ్యాశ్చబహుకల్యాణమీప్సుభిః. ३ ८ ॥ ५ ॥
యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః,
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః. ॥ ८
శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులం,
న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా. ॥ 2
తస్మాదేతాస్సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః,
భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ. ॥ ७

అని శాసించుచున్నది. దీనింబట్టి స్త్రీలు నిందింపఁదగినవారు కారని తన్నింద దుష్ఫలప్రదమని తేలుచున్నది. అట్టి యకార్యమును బ్రహ్మ యొనరించి పాపఫల మనుభవించెను. కులటా శాపము ఫలించునా ఫలింపదా యన్నప్రశ్న మిటఁజేయరాదు. స్వకర్మఫలమనుభవింపక యెట్టివారికైనందప్పదను విషయమే ప్రధానము. ఈశాపముచేతనే బ్రహ్మ కాపాపము తొలఁగ లేదు. పుత్రికాగమనము చేయఁబూనుట తనమానసపుత్త్రులగు

సనకసనందనాదులు నీతినిదెల్పుట దాన సిగ్గుపడి దేహమును ద్యజించుట యనునీకార్యములతో నాపాపము తొలంగెను. స్త్రీనిందాపాప మెంతగొప్పదియో యోజింపుఁడు. బ్రహ్మ యంతవానికిఁ దప్పక ఫలము నొసంగెను. ఇఁక సామాన్యుల మాటయిటఁ జెప్పనేటికి ?

ఇట్లు స్మృతులు పురాణము వితిహాసములు అవియివి యననేల! తుదుముమొదలు దేవతార్చనమువఱ కన్నట్లు ప్రతి గ్రంథములు స్త్రీల మర్యాదగాఁ జూడవలయునని యుపదేశించుచుండఁ గొందఱు భారతవర్షమున స్త్రీలకు మర్యాదతక్కువ యని వెక్కిరించుచుందురు. ఇది యన్యాయముకాదా! స్త్రీలను దిరస్కరించిన మహాపాపమనియు నది బ్రహ్మాదులుకూడ ననుభవించిరనియు నెత్తిన నోరుపెట్టుకొని మనగ్రంథములు ఘోషించుచున్నవి. వానిం బరిశీలింపనియలసులు దూషింపఁగా భారతపుత్త్రులు కొందఱు నిజమే యని యంగీకరించుచుండుట విచిత్రముకాదా. ఏ గ్రంథములఁ బరిశీలించినను స్త్రీలు మన్నింపఁదగుదురనియే బోధించుచున్నట్లు కనఁబడును. గ్రంథపరిశీలనము చేయని పాపమున కిది ఫలమనుటకంటె మఱొకమాట మనమనఁజాలము. ఇది బ్రహ్మశాపకథనుండి గ్రహింపఁదగు నీతిజాలము.

ఇఁక శంకరదర్పవిమోచనమునుగూర్చి యించుక విచారింతము. ఆ చర్చనుండియే భక్తిమార్గము కనఁబడును. మతభేదము లసంగతములని తేటపడును. శంకరుఁడు తపస్సుచేయు

వృకదానవునకు వరమునీయ నా దానవుఁడా వరమును బరీక్షింపఁగోరి శివునిదగ్గరకు రాఁగా నతఁడు పరుగిడుచుండ విష్ణువు పాడసూపి యుపాయమున నా దానవునిహస్తమును వాని నెత్తిపైఁబెట్టుకొనం జేసి వాఁడు చావఁగా నీశ్వరునిభీతిని బాపెననియు దాన శంకరునిగర్వము పోయెననియుఁ గథాసారము. దీనిచేత నీశ్వరునికంటె శ్రీ మహావిష్ణు వధికుఁడని తేటపడుట లేదా యని కొందఱందురు. అది పొరపాటు. భేదము బుద్ధికల్పితము. అది సిద్ధాంతము కానేరదు. విష్ణుమహిమమును దెల్పునపుడు విష్ణు సర్వోత్కృష్టత్వము చెప్పఁబడవలసినదియే. అట్లే శివమహిమమును దెల్పుతావున శివసర్వోత్కృష్టత పేర్కొనఁబడవలసినదియే. ఈ రెండును సిద్ధాంతములే. ఎట్లని ప్రశ్నింపుఁడు. భగవంతుని సర్వాంతర్యామి యని యంగీకరించినవారుకూడ లక్ష్యశుద్ధికై యొకరూపమును గల్పించుకొనియే ధ్యానముచేయుదురు. అరూపుని ధ్యానింప సాధ్యముకాదు కదా.

"భక్తధ్యానార్థదేహోఽయం మమ స్వేచ్ఛామయస్య చ." అని యీ కథయందే పొడకట్టెడు. ఆ కల్పితరూపమును కొనసాగించవలయును. ఆ నామస్మృతి, తద్రూపధ్యానము భక్తుఁడు చేయఁదగుపని. అది నెఱవేర్చినఁగాని కృతకృత్యుఁడు కాఁజాలఁడు. ఆ భక్తుఁడు తద్రూపమును ఎట్లు ధ్యానింపవలయును? ఈతఁడే భగవంతుఁడు. సర్వదేవతాధిపతి. సర్వాంతర్యామి. సర్వేశ్వరుఁడు అనియేకదా. తదితరము తదంశసంభూతమనియే

ధ్యానింపందగు. ఇట్లే మఱొకఁడు మఱియొకరూపమును గల్పించుకొని యొకనామమును బెట్టి పూజించును. ధ్యానించును. వినుతించును. ఈ యిద్దఱికిని భక్తి సమాన మనుకొందము. ఫలము సమానమే కాక తప్పదు. ఇందుత్కృష్టత్వనికృష్టత్వము లెట్లు ? ఈ రెండును గల్పితరూపములే కదా. వీరిరువురును దమతమదైవము భగవంతుఁడనియే భావింతురు. అపరాధ మిందుఁగలదా. లేదు. ఏల ? భగవంతుఁ డరూపుఁడు. అనాముఁడు. నిశ్చంచలుఁడు. అట్టివాఁడు బుద్ధిగ్రాహ్యుఁ డగు నెట్లు ? కల్పితరూపముచేతనే కాని వేఱుపద్ధతిచేఁ గాదు.

మూ. అనేజదేకం మనసో జవీయో నైవ ద్దేవా ఆప్నువ
న్పూర్వమర్షత్. తద్ధావతోఽన్యాన త్యేతి తిష్ఠత్ తస్మిన్న
పోమాతరిశ్వాదధాతి. ౪.

ఈశావాస్యోపనిషత్తు.

ఈ మంత్రము భగవత్థ్సితిని దెల్పుచున్నది. మఱియు,

శ్లో. మూ. యద్వాచాఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే.

కేనోపనిషత్తు. ౪.

ఏది కేవలచైతన్యస్వరూపమై వెలయునో అది వాక్కుచే వర్ణింప శక్యముకానిది. వాగాదీంద్రియములచేఁ దెలియఁబడనియే పరబ్రహ్మస్వరూపముచేత వాగాదీంద్రియములు ప్రకాశించునో ఆ స్వరూపమునే పరబ్రహ్మస్వరూపమని తెలిసికొనుము. భిన్నోపాధులతోఁగూడిన యనాత్మస్వరూపమును బ్రహ్మ

స్వరూపమని యుపాసించుచున్నారు. ఆ స్వరూపము పరబ్రహ్మ ముకాదు. అని పై మంత్ర సారము.

పరబ్రహ్మస్వరూపము మనోవాగతీతమని దీనినుండి స్పష్టము. కాని యద్దానిచే నివన్నియుఁ బ్రకాశించుచున్నవ నియు స్పష్టము. కల్పితరూపములు భగవత్తత్త్వము కాదనియు సిద్ధాంతము.

మూ. యన్మనసా నమనుతే యేనాహుర్మనోమతమ్,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే. ౫.
యచ్చక్షుషా న పశ్యతి యేనచక్షూంషి పశ్యతి,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే. ౬.

కేనోపనిషత్తు.

ఈమంత్రములచే భగవత్స్వరూపము దుర్జ్ఞేయమని తేలెడిని. కాఁబట్టియే భక్తులు ధ్యానార్థ మొకరూపమును గల్పించుకొందురు. దాని కొకపేరిడుదురు. అందఱు నొకరూపమునే కల్పించుకొనవలయుననిగాని, ఒక్కవిధమగునామమునే పెట్టుకొనవలయుననికాని, తదారాధన మొక్కరీతినే యుండవలయునని కాని సిద్ధాంతములు లేవు. కల్పితములగురూపములందొక్కటి యుత్కృష్టమనియు, నింకొకటి నికృష్టమనియుఁ జెప్పనెట్లు? చెప్పినచో నది సత్యమని నమ్మవలయునను టెట్లు? కనుకనే భక్తుఁడు తనయుపాస్యదైవము భగవంతుఁడని సర్వదేవతాస్వరూపుఁడని తలంచుట న్యాయము. అందఱు భక్తులు నిట్లే తలంతురుకదా. వీరు పరస్పరము ద్వేషింప

నవకాశమైనఁగలదా. ఏవిధమునఁ జూచినను గానరాదు. ఈసిద్ధాంతమునే ఉపనిషత్తులు పురాణము లితిహాసములును దెల్పుచున్నవి. ఒక్కొక్కపురాణమొక్కొక్కదేవతనుసర్వోత్కృష్టుఁడని తెల్పును. అంతియకాని తక్కినదేవతల నుపాసించిన మహాపాపమని తెల్పుట గానము. సర్వదేవత లీతనిస్వరూపులే యని తెల్పును. దీనిసారమేమి? ఎవ్వని కేదేవతయందు దృఢభక్తి కుదురునో ఆదేవతనుసర్వదేవతాస్వరూపునిగాభావించి యుపాసింపవలయు ననుటయేకదా. భగవంతుఁ డారూపమున నాభక్తునకు వాంఛితముల నొసఁగును. తనరూప మిది యని తన్మనః ప్రతిఫలితరూపమునఁ బ్రత్యక్షమగును. ఇది సర్వమతసమ్మత సిద్ధాంతము. దీని ననుసరించిన దేవతాభేదమున కవకాశమెక్కడిది? అట్టిరూపముల ధరించి భక్తుల ననుగ్రహించువాఁడు శ్రీమహావిష్ణువేయన్నను బాధయేమి? సర్వదేవతాస్వరూపుఁడును, సర్వనామవాచ్యుఁడును నైనభగవంతుఁడు విష్ణువేయైనను దూషణముల కవకాశ మెక్కడిది? సర్వనామములు లావిష్ణుమూర్తికి లేవన్నచోఁ బరాత్పరత్వములేదు. కలవన్నయెడల భేదబుద్ధికిఁ జోటులేదు. ఇట్టులుండ శివకేశవులకుఁ దారతమ్యము కలదను టెట్లొకో తెలియరాకున్నది. స్వల్పబుద్ధులై కొందఱు భక్తాభాసులు దేవతాంతరదూషణ మొనరింతురు. దానవారు భగవత్కృపకు దూరులగుటయేకాని వేఱొండుపురుషార్థమును సాధింపఁజాలరు.

ప్రకృతవిషయమున శ్రీకృష్ణుని బ్రధానముగా భావించి చెప్పినది యీపురాణము. కావున శ్రీకృష్ణమూర్తి శంకరు నార్తివారించెనన్నచో శంకరునకు నల్పత్వమెక్కడిది? భక్త వశుఁడుకదా భగవంతుఁడు.ఆర్తిహరత్వ మిటవిష్ణుగుణముకదా యన్న దీనితరువాతికథను బరికింపుఁడు. శ్రీకృష్ణుఁడే వృషభ రూపమున శంకరుని వహించెనని కనఁబడియెడి.

"వాహనం వృషరూపోఽహ మన్యస్త్వం వోఢుమక్షమః."

ఈవచనముచే నొకరు హెచ్చని చెప్పవచ్చునా. మఱియొకతావు న శ్రీవిష్ణువే,

"తస్యాయుషః ప్రమాణం చ నాహం జానామి కా శ్రుతిః".

అని వచించినట్లు గలదు. శంకరునాయుఃపరిమితి నేనెఱుం గను. ఇఁక వేదము నిర్ణయింపఁగలదా యన్నచో దీనిసారమే మి? శంకరుఁ డాద్యంతరహితుఁడని స్పష్టముగా శ్రీకృష్ణమూ ర్తి చెప్పినట్లేకదా. కాఁబట్టి ప్రతిస్థలమునందు నిట్టివచనములు దొరకును. వాని నాధారముచేసికొని తమయజ్ఞానమును బయ లుపఱచుచు దేవతలదూషింపఁబూనుటకన్న వెఱ్ఱితనము వేఱొ కటి యుండఁబోదు. కావున నార్యమహాశయులారా! శివకేశవ తారతమ్యమును గనఁబఱుపక యొక్కరినినమ్మి సర్వదేవతలు తత్స్వరూపులే యని భావించి తత్పాదారవిందముల మది నిల్పి నిర్మల మనస్సునఁ దద్రూపమొకదానిం గల్పించుకొని ధ్యానించి తదనుగ్రహపాత్రులు కావలయును. కాని స్వల్ప బుద్ధులై భగవంతుని రూపభేదముల దూషింపరాదని యీాళ

థలన్నియుఁ దెల్పుచున్నవి. ఇట్టు లిప్పట్టున శ్రీకృష్ణపరబ్రహ్మమే భక్తులకు భక్తిమార్గమును, దపోనియతిని, బరులఁ బరిహసింప రాదనియు, దానఁ జెడుగువాటిల్లుననియు మనకు బోధించెను: ఆయుపదేశమును వేదతుల్యమని మదినమ్మి తద్భక్తులమై తదారాధనతత్పరులమగుట మనవిధి. వృథాకాలమును బుచ్చక భగవద్వాక్యమును దాఁటక సత్కర్మముల నాచరించుచు సదా భగవన్నామపారాయణపరాయణులమై యుండఁ బ్రయత్నించుట మనము కడ తేఱుమార్గము.

శ్లో. యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి. ౧౬అ. ౨౪.

అను నీభగవద్గీతావాక్యముల నమ్మి యొకశాస్త్రోక్తమార్గమును దృఢముగ విశ్వసించి తదుక్తప్రకారమున నిరపాయమగు భక్తిమార్గమునఁ బ్రవర్తింపవలయును. ఇఁక నీవిషయమును వదలి తరువాతికథాంశమును విన్నవించెదను.

ఆర్యులార! పూర్వోక్తకథయందు శ్రీకృష్ణపరబ్రహ్మము రాధకుఁ దనమహిమమును దెల్పుచుఁ బార్వతీశచీపతిసూర్యహుతవహ దుర్వాసో ధన్వంతరిప్రభృతులకు దర్పభంజన మొనరించితినని చెప్పెను. అవన్నియు శ్రీకృష్ణమహిమమును బ్రతిపాదించునవియే. ఐనను దత్కథలచే గ్రంథము నింపుటకు శక్తుఁడను గాకున్నవాఁడను. కావున వదలి శ్రీకృష్ణలీలలను

మాత్రము వ్రాసి భగవదవతారఫలమును వ్రాసెదను. కాఁబట్టి యీ కథలవదలిన యపరాధమును మన్నింప వేఁడుచున్నవాఁడను. బృందావనమున విహారము సల్పుగాథల నీకథతో విరమించినట్లే భావింపవచ్చును. ఇపుడు వ్రాయఁబూనిన గాథా మాధవనామక్రమమును జిత్తగింపుఁడు. భగవన్నామమేకదా భవార్ణవతారకము. దానిని వ్రాయుట యనవసరముకాదు. కావుననే వ్రాయఁబూనితిని.

శ్లో. కరిణామలంఘ్యగతివైభవం భజే
కరుణావలంబితకిశోరవిగ్రహమ్,
యమినామనారతవిహారిమానసే
యమునావనాంతరసికం పరం మహః. 3 ఆ. 3

శ్లో. కందర్పప్రతిమల్లకాంతివిభవం కాదంబినీబాంధవం
బృందారణ్యవిలాసినీవ్యసనినం వేషేణ భూషామయమ్,
మందస్మేరముఖాంబుజం మధురిమవ్యామృష్టబింబాధరం
వందే కందళితార్ద్రయౌవనవనం కైశోరకం శార్ఙ్గిణః. 38

## రాధామాధవనామమహిమము.

* ఇట్లు రాధాదేవికి శ్రీకృష్ణపరబ్రహ్మ మనేకగాథలం దెల్పి దేవీ! శంకరాదులకు గర్వభంగ మెట్లుచేసితినో తెల్పితిని. గొప్పవారికిని గొలఁదివారికింగూడ గర్వముపోఁగొట్టుట యే నాపని. ఆకృత్యము నెఱవేర్చినఁగాని నాకు సంతోషముగ

*ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము ౫౨వ అధ్యాయమునుండి సంగ్రహీతము.

నుండదు. నీ కీకథలనెల్లఁ దెల్పుచు నీరాసమండలమునఁగాలము గడపితిని. మన మింక బృందావనమున కరుగుదము. గోపికలు నాదర్శనమునుగోరి యాత్రినొందుచుందురు. కాన వారికి వేవేగ దర్శనమొసంగవలయును. అనవిని భగవన్మానసస్వరూపిణి యగురాధిక శ్రీకృష్ణా! నన్ను బృందావనమును జేర్పుము. నే నింక నడువఁజాల. నావిని మధుసూదనుఁడు నవ్వి నాపై నెక్కుము. మోచికొనిపోయెద ననిపలికి హరి యదృశ్యుఁ డయ్యెను. శ్రీకృష్ణుఁ డదృశ్యుఁడుకాఁగా రాధిక బిట్టు రోదనముచేసెను. ఇటునటు పరికించి యెందునుగానక బృందావనమున కరిగెను. అందుఁ జందనవనమును దొలుతఁ బ్రవేశించి వగచుచు శోకార్తలై భయవిహ్వలలై యున్నగోపికలం గాంచెను. వారెల్ల మోము రక్తవర్ణమును దాల్పఁగా నయనములు శోకభారమున భీతికరములై కనంబడ నడవినెల్లెడల నాథానాథా యని తిరుగుచుండిరి. ఆహారమును మాని రోషాన్వితలై యుండిరి. వారినిజూచి రాధికయు శ్రీకృష్ణుఁడు నిర్దయుఁడై యెటకేగెనో యని భీతిల్లుచు వారితో శ్రీహరి కనఁబడకపోవుటను దెల్పెను. వారివార్త నాలించి బిట్టు రోదనము చేయఁ దానును విలపించెను. కొంతసేపు నిర్దయుఁడవని హరి దూఱెను. క్రోధావేశమునఁ జూడుము నిన్నేమిచేసెదనోయని భయపెట్టెను వారింగూడి దేహత్యాగముచేయ నిశ్చయించెను.

ఇట్లు వారుత్తలపాటొందుచుండ నాచందనకాననమున శ్రీహరి తనదివ్యరూపమును గనఁబఱచెను. గోపికలం గూడి.

చింతించుచున్నరాధిక శ్రీహరిని దనప్రేమేశ్వరుని గాంచి సస్మితాస్యపంకేరుహయై ప్రాణవిభునిచెంతకుఁ బరుగిడెను. పులకాంచితసర్వాంగయష్టి యయ్యెను. వేగంబ శ్రీకృష్ణుని గౌఁగిలించుకొని మురళిని గోపమున విసరివైచెను. వనమాలను ద్రెంచెను. పీతాంబరమును దీసివైచెను. మరలఁ బ్రేమపూర్ణాంతఃకరణమున మనోహరముగాఁ బీతాంబరమును వనమాలికను భగవంతున కర్పించెను. వినోదమురళినిగూడఁ గరమునఁ గైచేసెను. చందనచర్చల మేను నలంకరించెను. పలుమరు తనివిసనని చిత్తమున శ్రీపతిముఖకమలమునుగాంచి ముద్దిడుకొనెను. క్షణకాలము దుడుకుతన మిట్లు చేయ న్యాయమా యని భయపెట్టెను. క్షణకాలము స్తుతిరాజముల వినుతించెను. అంతలోఁ గర్పూరతాంబూలము నిచ్చెను. గోపికలును దర్శనమీయ కున్నందులకై వగచిరి. తమతమచింతల విన్నవించుకొనిరి. దేహత్యాగప్రయత్నము, ఆహారమును వదలుట, సదా ప్రతివనమును వెదకుట మొదలగుతమకృత్యములఁ దెల్పిరి. రవంతసేపు కృష్ణా ! ఇది నీకుఁదగునా యని యాక్షేపించిరి. క్షణమునకే భక్తిభావమున నుతించిరి. ఒకర్తుక కృష్ణా ! నన్నువదలకుమా రక్షింపుమా యని ప్రార్థించెను. వేఱొకతె యింకొకపర్యాయ మిట్టిపనిచేయకుమా యని హెచ్చరించెను. మఱికొంద ఱీకృష్ణుని నడుమ నునుచుకొనుఁడు. ఎచ్చటికిఁ బోవనీయకుఁడు. ప్రేమపాశముల బంధింపుఁడని హెచ్చరించెను. ఇంకనుం గొంద ఱీకృష్ణుఁ డిట లేఁడు. ప్రఖ్యాతియు లేదు. మనశ్చోరుఁడగు

నీతనిఁ బ్రయత్నమునఁ బరికింపుఁడనిరి. మఱియుఁ గొందఱు గోపాలబాలుఁడు కఠినుఁడు. నరఘాతి. అతికోపనుఁడు. మమ్ము మఱచినవాఁడు. మిమ్ములను మఱువలేదేమో యని మఱి కొందఱంగాంచి పలికిరి.

ఇట్లు మాటలాడుచు నాశ్రీపతింగూడి నిర్జనారణ్యముల నెల్లం ద్రిమ్మరిరి. శ్రీకృష్ణునినడుమ నిడుకొనియే పోవుచుండిరి. పాపమాగోపిక లాహరి సర్వాంతర్యామి యని యెఱుంగరు. ఇట్లుతిరుగుచుఁ దిరుగుచు మరలరాసమండలమును బ్రవేశించిరి. ఆరాసమండలమున ధర్మ నిర్మితపీఠమున నారసికేశ్వరుఁడు కూరుచుండెను. తారాగణపరికీర్ణచంద్రమండలముభాతి గోపికా మధ్యభాగమున శ్రీకృష్ణుఁ డొప్పియుండెను. * అనేకరూపములుదాల్చి వారలంగూడి యాశ్యామసుందరుఁ డుండెను. ఒక్కొక్కగోపికయు నొక్కొక్కశ్రీకృష్ణునింగూడియే యుండెను. వారికి శ్రీపతింగూడి కూరుచుండుభాగ్యము లభించెను. హరియుఁ దనకేలుదమ్మి రాధాకరారవిందమును బట్టుకొని రహస్యభాగమునఁ నుండెను. ఆపీఠము విశ్వకర్మనిర్మించినది. రాధాకాంతుఁను స్మరించి యందుండెను. నానావిధశృంగారముల నలరారుచుండెను. ఎవరి కేకాంతుఁగలదో వారి కాకాంతుఁ డాయునట్లు పొడకట్టెను. రాధామాధవు లారాసమండలాభ్యంతరమునఁ జాలసేపుండిరి. వారిరువురకుఁ బ్రీతినిష్ఠయేగాని విరతి కలుగలేదు. రాధమాధవు లెట్లుండిరో గోపికలెల్ల శ్రీకృష్ణునిం గూడియే యట్లుండిరి.

---

*నానామూర్తి ర్ద్విధాయాత్ర సహ తాభిర్జనార్దనః. అని మూలము.

అనవిని నారదముని శ్రీమన్నారాయణా! తొలుదొలుత రాధానామము నుచ్చరించి పిదప శ్రీకృష్ణనామమును సాధువు లుచ్చరింతురు. భక్తజనప్రియుఁడవు కావున దీనికి నిమిత్తమును దెలుపుమా యని ప్రార్థింప నారాయణుఁ డిట్లు పలికెను. నారదా! దీనికి నిమిత్తము త్రివిధము. విను మెఱింగించెద. జగన్మాత ప్రకృతి. జగత్పిత పురుషుఁడు. తండ్రికంటెఁ దల్లి త్రిజగంబుల శతగుణముల నెక్కుడండ్రు. రాధాకృష్ణ యని గౌరీశ యని వేదములయందుఁ గన్పట్టెడిని. కృష్ణరాధయని ఈశగౌరియని లోకమున నెవ్వరు నుచ్చరించినట్లు వినఁబడదు. "రోహిణీచంద్రా! ప్రసన్నుఁడవగుము. నేనిచ్చునర్ఘ్యము గ్రహింపుము. సంజ్ఞాసహితభాస్కరా! నేనిచ్చునర్ఘ్యమును గృపఁ బరిగ్రహింపుము. కమలాకాంతా! కరుణించి నాయిచ్చుపూజ నంగీకరింపుము." అని సామవేదమునఁ గానంబడియెడిని. రాశబ్దోచ్చారణముచేత నే మధుసూదనుఁ డుత్సాహయుక్తుఁడగు. ధాశబ్ద ముచ్చరించినఁ ద్వరపడి యచటికిఁ బరుగిడును. ఎవఁడు తొలుతఁ బురుషు నుచ్చరించిపిదపఁ దల్లి నుచ్చరించునో వాఁడుమాతృఘాతి యనఁబడు. వేదాతిక్రమణపాపమునకుఁ బాత్రుఁడగును. ముల్లోకములందు భారతవర్షము ధన్యము. కర్మక్షేత్ర మదియే. పుణ్యప్రదానదక్ష మదియే. అందును బృందావనము పరమపవిత్రము. అది రాధాదేవీపాదాంబుజపరాగసంకలితము. రాధాదేవీ పాదారవింద పరాగలాభార్థ మఱువదివేలసంవత్సరములు బ్రహ్మ తపస్సుచేసెను. కావున నారాధానామము తొలుదొలుత నుచ్చరింపఁ

దగును. అని నారాయణమూర్తిపలుక నారదుఁ డానందపరవశుఁ డయ్యెను.

మహామనీషాభూషితులారా! భగవన్నామప్రాశస్త్యము గల యధ్యాయ మీయది యుత్తమోత్తమ మనకతప్పదు. భగవన్నామమహిమ మపారము. దాని నీయధ్యాయము దెలుపును. ఇందు భగవన్నామమహిమమే గాక వేఱొకరహస్యము కలదు. చక్కఁగా నాలకింపుఁడు. వ్యాకరణము ననుసరించి "అల్పాచ్చు వులుగల శబ్దము ముం దుచ్చరింపఁదగు" నన్నసిద్ధాంతము ప్రకృతము చర్చింపఁదగదు. శ్రీకృష్ణనామమునకు ముందు రాధానామ ముచ్చరింపవలయుననియు లేకున్న భగవంతుఁ డాగ్రహించుననియు నిటఁ జెప్పఁబడుట సముంజసముగ నున్నది. భగవంతునకు రూపము నామము గలుగు టెప్పుడు? సృష్టియందు సృష్టికార్యోన్ముఖుఁడగునపు డతనికిం బేరేమి? సగుణబ్రహ్మమని. ఆయనస్థితి యెట్టిది? ప్రకృతి నాశ్రయించుట. సృష్టికార్యమునఁ బ్రధానాధికార మెవరికి? ప్రకృతికి. ఇందులకుఁ బ్రమాణము కలదా? ప్రమాణముకాదు. ప్రమాణములు కలవు. భగవద్గీతోపనిషత్తునందు,

శ్లో. ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్. ౯అ.౮

శంకరభాష్యము ప్రకృతిం స్వాం స్వీయా మవష్టభ్య వశీకృత్య విసృజామి పునః పునః, ప్రకృతితో జాతం భూతగ్రామం భూతసముదాయం ఇమం వర్తమానం, కృత్స్నం సమస్తం, అవశం,

అస్వాతంత్ర్యం అవిద్యాదిదోషైః పరవశీకృతం, ప్రకృతేర్వశాత్, స్వభావవశాత్ అని.

శ్రీధరాచార్యవ్యాఖ్యా. స్వాం స్వాధీనాం ప్రకృతి మవష్టభ్య. అధిష్ఠాయ ప్రళయే లీనం సంతం చతుర్విధమిమం సర్వం భూతగ్రామం కర్మాదిపరవశం పునఃపునర్వివిధం సృజామి. విశేషేణ సృజామీతి వా కథం ప్రకృతే ర్వశాత్ ప్రాచీనకర్మనిమిత్తతత్స్వభావబలాత్. అని.

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు. ౯.

శం.భా. తర్హి తస్య తే పరమేశ్వరస్య. భూతగ్రామమిమం విషమం విదధతః తన్నిమిత్తాభ్యాం ధర్మాధర్మాభ్యాం సంబంధస్స్యాదితి. ఇద మాహ భగవాన్.-

న చ మామీశ్వరం తాని భూతగ్రామస్య విషమసర్గనిమిత్తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ. తత్ర కర్మణా మసంబంధిత్వే కారణమాహ. ఉదాసీనవత్. ఆసీనం యథా ఉదాసీనః ఉపేక్షకః కశ్చిత్. తద్వదాసీనం ఆత్మనోఽవిక్రియత్వాత్ అసక్తం ఫలాసంగరహితం అభిమానవర్జితం అహంకరోమీతి తేషు కర్మసు, అతోఽన్యస్యాపి కర్తృత్వాభిమానాభావః.ఫలాసంగాభావశ్చాసంబంధకారణం అన్యథా కర్మభిర్బధ్యతే. మూఢః కోశకారవదిత్యభిప్రాయః, అని.

శ్రీధరాచార్యకృతవ్యాఖ్యా. నను ఏవం నానావిధాని కర్మాణి కుర్వత స్తవ జీవవద్బంధః కథం న స్యాదిత్యాశంక్యాహ.- తాని

సృష్ట్యాదీని కర్మాణి మాం న నిబధ్నంతి. కర్మాసక్తిర్హి బంధహే తు స్వాప్తకామత్వా న్మమ నాస్త్యతఉదాసీనవద్వర్తమా నస్య మే బంధనం నాపాదయంతి. ఉదాసీనత్వే కర్తృత్వానుప పత్తే రుదాసీనవత్థ్సిత మిత్యుక్తమ్. అని.

పాఠకమహాశయులారా! పైగీతాప్రమాణమును బరికించితిరి. భాష్యమును వ్యాఖ్యను దిలకించితిరి. భగవంతుఁడు స్వీయప్రకృతి ననఁగా నిచ్ఛాశక్తి నాశ్రయించును. అనఁగా సృష్టి చేయ నూహించును కాని యుదాసీనుఁ డయియేయుండును. ఆప్రకృతి యనఁగా భగవంతునియిచ్ఛాశక్తి యథాపూర్వముగా భూతాళిని సృజించును. ఆసృష్టిస్థితిలయ సంబంధికార్యముల నంటక భగవంతుఁ డుండును అని తాత్పర్యమును గ్రహింపుఁడు ఇపుడు ప్రకృతియే సర్వకార్యముల నొనరించునది. పరమాత్మ చూచుచుండును. సర్వసాక్షియనికదా శ్రీపతికిఁ బేరు. సగుణబ్రహ్మము నారాధించువారు తొలుతఁ బ్రకృతి నారాధింపవలయును. అట్లే నామపారాయణముచేయునపుడు ప్రకృతినామము ముందుచ్చరింపఁబడగినది. కావుననే రాధామాధవులని పారాయణము చేయఁదగినది. 'ఎవ్వఁడు రాధానామము నుచ్చరింపక మాధవనామ ముచ్చరించునో వానికిఁ దత్ఫలములేదని భగవదాజ్ఞ. కావునఁ బ్రకృతియన నుపాస్యదైవము కాదన్న దుర్వాదము పోయినది. భగవదుక్తి యిదియేకదా. కనుకనే శంకరాచార్యులుగారు,

అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యాః ప్రభవతి.

అని యుపదేశించిరి. ప్రకృతిపురుషుల నుపాసించుట క్రమమను సిద్ధాంతము కృతపుణ్యులకే యలవడునని శ్రీశంకరు లాజ్ఞాపించిరి. అట్టి పూర్వసంస్కారము లేకున్న నది రుచించదు. ఏజన్మమున నది రుచించునో ఆజన్మమున భగవతి నుపాసించినఁగాని భగవత్కరుణ కలుగదన్న సిద్ధాంతము తెలియఁగలదు. అవి తెలిసినఁ గృతార్థుఁ డగును. కాఁబట్టి రాధామాధవులనామస్మరణము ముఖ్యమైనది. పరమేశ్వరుఁడు రాధానామమునం దతిశయప్రీతిగలవాఁడు. తన్నామపారాయణమున సంతుష్టుఁ డగును. ఇదియే యీకథాసారము. దీనిని జక్కఁగా మదిఁ దాల్చి రాధామాధవనామస్మరణమును జేయుఁడు. దాన భగవత్కృపకుఁ బాత్రులగుదురు. ముమ్మాటికి నీమాట యథార్థము. ఇఁకఁ దర్వాతి శ్రీకృష్ణలీల నాలకింపుఁడు.

## భాండీరవనవిహారము.

*రాసవిహారానంతరము భగవంతుఁ డేరహస్యమును గల్పించి విహరించెనో తెలుపవలయునను నారదముని ప్రశ్నమునకు శ్రీమన్నారాయణమూర్తి బదు లిట్లు చెప్పుచున్నాఁడు.- రాసేశ్వరుఁడు రసికశిఖామణియునగు శ్రీకృష్ణపరబ్రహ్మము రాసేశ్వరిం గూడి రాసమండలవిహార మొనరించి భక్తులఁ

*ఇయ్యది శ్రీకృష్ణజన్మఖండమున నేఁబదిమూఁడవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

బాలించి త్రిదశుల సంతుష్టులం గావించి మునీంద్రుల కానంద మును గల్పించి యమునాపులినతలమునకుంబోయెను. అందు స్నానమొనరించి జలంబులం ద్రావి నిర్మలజలంబుల గోపాంగ నలతోఁగూడి జలవిహారమును సల్పెను. ఆవనవిహార మంతటి తోఁ బూర్తియయ్యెను. గోపాంగనలెల్ల భగవదనుమతింగొని తమతమగృహముల కరిగిరి. వారిచిత్తములు భగవద్విరహమునఁ దపించుచుండెను.

శ్రీకృష్ణమూర్తి యటనుండక రాధాద్వితీయుండై భాండీరవనమునకుఁ బోయెను. అందొక్క భాగమునకు మాల తీవనమని పేరుగలదు. అందు రాధామాధవు లుండిరి. అందు మాలతీశయ్యల విహరించి వాసంతీకాననమునకుం బోయెను. వసంతపుష్పసంభరితమగు నాకాననమున విహరించి చందన కాననమున కరిగెను. ఆవనమునఁ బరిమళచందనమును బరి గ్రహించి చందనపల్లవశయ్యల విశ్రమించి యారాత్రి సంపూర్ణ చంద్రమండలము వెలుఁగుచుండ రాధామాధవు లట సుఖ నిద్రచేసిరి. అటనుండి చంపకకాననమున కేగి విమలతరమృదుల తమచంపకపల్లవకల్పితశయనీయంబుల సుఖముగఁ గూరుచుండి యందు రాధామనస్సుఖమును గల్పించి పద్మవనమునకుం బోయెను. పద్మపత్రసమాకీర్ణతల్పమున శీతలపంకజవాయుసుఖ దంబగు భూభాగమున రాధాంబికంగూడి నిద్రించెను. నిద్రిత యగుప్రియురాలి సమాధృతిం గాంచెను. స్వేదబిందుసమాకర్ణ తన్మనోహరముఖమును గనుంగొనియెను. నేత్రకువలయములు

ముకుళింపఁబడియుండెను. రత్నకుండలయుగళము మోమున కొకవింతకాంతిని గూర్చుచుండెను. గజరాజకుంభ సంభూతవి నిర్మలమౌక్తికహారములు తనరారుచుండెను. శ్రీపరమాత్మ సుసూక్ష్మాంబరాంచలమున మెల్లన విసరెను. భక్తవత్సలున కది ధర్మమేకదా. కేశసమ్మార్జన మొనరించి కబరిని జక్కఁబఱిచెను. మాధవీమాలతీ మాలాజాలముల నాకబరి పరిశోభితముగున ట్లొనరించెను. ప్రేమభరంబున నాసుందరమందయాన కనే కాలంకృతు లొనరించి నిదురలేపెను. స్వపక్షమునఁ దస్ముఖ మును జేర్చుకొనియెను. రత్నదర్పణమును గనఁబఱిచెను. ముఖ చంద్రునిస్వేదబిందువిరహితునిగా నొనరించుటసకలాలంకృతులఁ గై సేయుటయుఁ గనఁబఱచుటకే యాముకురప్రదర్శనమని యెఱుంగనగును. తాఁబ్రియుఁడు గావునఁ బ్రియురాలికి మేనఁ జందన మలందెను. పరమేష్ఠి రాసమండలవిహారమునఁ దన కర్పించినపారిజాతకుసుమమును రాధాదేవి కిచ్చెను. పరశంక రుఁడు సహస్రదళభాసురంబగు పంకజము నర్పింప దానిని మహా దరంబున రాధాదక్షిణకరకమలమున నునిచెను. ధర్ముఁడు తన కర్పించినకౌస్తుభరత్నమును బ్రియురాలి కిచ్చి ప్రీతిం దొల్పెను. దస్రదత్తమగు నాసవము రత్నపాత్రమునఁబోసి యర్ధాంగ లక్ష్మి కొసఁగెను. అది కామప్రదీపకమని యామహాత్ముఁ డెఱుఁ గును. సులలితమందారాదిపుష్పదామములఁ బ్రీతిమై నిచ్చెను. ఆపుష్పహారము వాక్పతి తనకొసంగియుండినదియే. వరుణుఁడు తనకిచ్చియున్న మృదుతమామూల్యవస్త్రమును రాధకుం దగిన

దని యర్పించెను. దేవేంద్రుఁ డొసంగినగజరాజమూర్ధజనిత మగు స్థూలమౌక్తికములు నాసికాభూషణార్థ మిచ్చెను.

ఇట్లు రాధ కలంకారవస్తువుల నిచ్చి యానందించుచుండునంతలో రాధాపరిచారికలగు నలువదిమందిగోపికలు తమతమపరిచారికలంగూడి నూపురధ్వనులచేఁ దమరాకఁ దెల్పుచు నరుదెంచి భగవంతుని సేవాతత్పరతనుండిరి. కొంద అందు చందనహస్తలు గలరు. మఱికొందఱు చామరధారిణులు కలరు. కొందఱు తాంబూలమును ధరించియుండిరి. ఇట్లనేకసేవాద్రవ్యములం గొనివచ్చిరి. కొందఱు సంగీతవిద్యావిశారదలు గలరు. రాధాదేవిసేవార్థముగోలోకమునుండి కొందఱవతరించియుండిరి. వారెల్ల రాధాసేవానిరతలైరి. భగవంతుఁడు వారి సేవానిరతింగాంచి పరమానంద నిమగ్నుఁడయ్యెను. వారొసంగినమాధ్వీకమును ద్రాగెను. తాంబూలము నంగీకరించెను. రాధాదేవింగూడి సకలశృంగారచేష్టలం గల్పించెను. ఇట్లు బహువిధశృంగారచేష్టలం గాలము గడపుచుండెను. మునీంద్రా! ఇది రాసక్రీడావిధానము. ఈవిహారము కల్పితవిలాసమే కాదు. భగవంతుని కిదిలేకున్న బాధయేమి? *పరాత్పరుఁడు స్వేచ్ఛామయుఁడు. పరిపూర్ణతముఁడు. నిర్గుణుఁడు. స్వతంత్రుఁడు. ప్రకృత్యతీతుఁడు. బ్రహ్మావిష్ణుశివాదిదేవాధీశులకుఁ

* స్వేచ్ఛామయస్యాత్మనశ్చ పరిపూర్ణతమస్య చ, నిర్గుణస్య స్వతంత్రస్య పరస్య ప్రకృతేః ప్రభోః, బ్రహ్మావిష్ణుశివాదీనా మీశ్వరస్య పరస్య చ. అని మూలము.

ప్రభవు. అట్టి యీశ్రీకృష్ణుని కీరాసక్రీడయుఁ గల్పితసంతోష ప్రదము. ఇట్లు శ్రీకృష్ణజన్మరహస్యము, బాలక్రీడావిడంబనము, కిశోరచరితము విస్తరించి చెప్పితిని. ఇంకేమి వినఁగోరుదువని యడిగెను.

పాఠకమహాశయులారా! ఈ లీలనుండి గ్రహింపఁదగిన విషయజాలమునఁ బ్రధాన మొక్కఁడు గలదు. అది గ్రహించినచో సంసారతాపత్రయబాధ తప్పును. ఈ రాసక్రీడ ప్రకృతివిలాసమేకాని భగవంతున కేదియులేదు. ప్రకృతిస్వరూపిణియగు రాధాదేవి భగవంతునిగూడి విలాసములఁ గల్పించెను. నిర్లిప్తుఁడయ్యు భగవంతుఁడు తానుగూడ నాసక్తుఁడైనట్లు లోకులకుఁ గనఁబఱచెను. పద్మపత్రము నీటనుండియు దానినంటకయుండునట్లు సర్వవిలాసములు ప్రకృతిసంబంధములని యెఱింగి తాను నాసక్తునివలె నటించెను. ఇదియే భగవంతుని యాశయము. సకలవిలాసములు భగవంతునిచేఁ గల్పితములు కావనియుఁ బ్రకృతిలీలాకల్పితములని యెఱుంగవలయును. ప్రకృతి భగవత్సన్నిధిబలము వలదనుట నిర్వివాదము. కాని తదిచ్ఛామాత్రమున క్షణకాలమునసకలబ్రహ్మాండములఁ గల్పింపఁజాలు. తచ్ఛక్తియనుపమానము. తెలిసికొనన శక్యము. ఈవిషయమునే శ్రీమచ్ఛంకరభగవత్పాదులు సౌందర్యలహరియందు,

శ్లో. త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవచరణయోర్యా విరచితా,

తథాహి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితాస్సర్వే శశ్వ స్ముకులితకరోత్తంసమకుటాః. ౨౫
విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం
వినాశం కీనాశో భవతి ధనదో యాతి నిధనం,
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా,
మహాసంహారేఽస్మిన్ విహరతి సతి త్వత్పతిరసౌ. ౨౬.

అని వివరించిరి. కావున నీ రాసమండలవిహారమంతయు శ్రీరాధాంబాహృదయేచ్ఛాకల్పితమేగాని నిర్గుణుఁడగు శ్రీకృష్ణ కల్పితముకాదని యెఱుంగునది. సర్వమనుభవించుచు నానందించుచుఁ దనసర్వసాక్షితను వెల్లడించుచుండును. సర్వము భగవతియిచ్ఛచేతనే కల్పితము. ఇట్లుండ శ్రీకృష్ణుని దూషింప నవకాశమును గల్పించుకొని కసిదీఱ దూషించుట పూర్వజన్మకృత పాపఫలముగాక యింకేమనవలయు. ఇది గ్రహించి కడుజాగ్రత్తగ మెలఁగుట భక్తజనులకు శ్రేయము. శ్రీ రాధామాధవ పాదారవిందపూజనము భుక్తిముక్తిఫలప్రదము. దానినిమాన వేలోకనాక సంసారసాగరమును దరింపఁజేయునది కానరాదనుట సిద్ధాంతము. ఇది బృందావనవిహారము. ఇంతట నీ విషయముజ్జగించి భగవంతునిమహత్తరకృత్యముల వివరించెదను. దానికి ముందు పరమమంగళప్రదమగు శ్రీలీలాశుకమహాకవికృతస్తుతిని బఠించుటుత్తమముకదా.

శ్లో. నిఖిలాగమమౌళిలాలితం పదకమలం పరమస్య తేజసః,

వ్రజభువి బహు మన్మహేతరాం సరసకరీరవిశేషదూషితం.
3 ఆశ్వా. ౧౦

ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం
ముదా ముహు రుదీర్ణయా మునిమనోంబుజామ్రేడితం,
మదాలసవిలోచనవ్రజవధూముఖాస్వాదితం
కదాను కమలేక్షణం కమపి బాలమాలోకయే. ౧౧.

మహామతులారా! రాసమండలవిహార మించుమించుగాఁ బూర్తియైనట్లు భావింపవచ్చును. శ్రీకృష్ణావతారమునకు ఫల మనేకవిధములుగ నుండును. బాల్యమునందే పూతనాశకటాసురాదిదానవవధము చేయఁబడిరి. అర్జునద్రుమములకు శాపముక్తి ప్రసాదింపఁబడినది. గోపికలకు స్వమహిమము చూపఁబడియె. ఆవల రాసక్రీడాదులచేఁ దనపరాత్పరత్వము విస్తరింపఁబడియె. ఇఁక భూభారహరణప్రయత్నము కావలయును. తత్ప్రయత్నము చేయుకథల వ్రాయ మొదలిడుచున్నవాఁడును. దానికిం దొలుత శ్రీకృష్ణమహిమను దెల్పుట యవసరము. దానిని వదలుటకంటె నజ్ఞానము వేఱొకటికలదా. దానిం దెల్పి తరువాత శ్రీకృష్ణమూర్తి బృందావనమునుండి ప్రయాణము చేసిన చరిత్రమును వ్రాసెదను.

## శ్రీకృష్ణప్రభావవర్ణనము.

* నారదమునీ! శ్రీకృష్ణపరమాత్మయే భగవంతుఁడు.

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున నేఁబదియైదవ యధ్యాయమును గ్రహించి వ్రాయఁబడియెనని గ్రహింపఁదగు.

సర్వాంతర్యామి. పరమపురుషుఁడు. దురారాధ్యుఁడు. బహుళతరకష్టతపస్సాధ్యుఁడు. సర్వారాధ్యుఁడు. సకలసుఖప్రదుఁడు. స్వభక్తజనసులభుఁడు. స్వభక్తజనారాధ్యుఁడు. భక్తజనదృశ్యుఁడు. అభక్తజనాదృశ్యుఁడు. అట్టిభగవంతునిచరితము దెలియ శక్యము కాదు. ఆమహాత్మునిమాయచే నెల్లవారును మోహితులయియున్నవారు. ఆమాయ తెలియసాధ్యముకాని శక్తిగలది. దానివలని భీతికై వాయువు వీచెడిని. నిరాధారమైనకూర్మము భూమిని మోయుచున్నయది. ఆ మాయవలనిభీతిచేతనే యనంతుఁడు భూవాహకుఁడయ్యెను. సహస్రశీర్షుఁడగు పురుషుఁ డేకశీర్షుఁడు నగును. సప్తసాగరములు సప్తద్వీపములు సప్తకులాచలములు, మహత్తరపుణ్యారణ్యములుగల యీ వసుంధరయు, సప్తపాతాళలోకములు, సప్తస్వర్గలోకములు, ఇతరబ్రహ్మాండములు కృత్రిమములని పరికీర్తితములు. భగవదాజ్ఞానుసారమే ప్రతిసృష్టియందును బ్రహ్మసృష్టి కార్యముసాగించును. ఇట్టి సృష్టికర్తలుగల బ్రహ్మాండములసంఖ్యములు. రోమకూపములైనను లెక్కింపవచ్చును. బ్రహ్మాండముల లెక్కింపరాదు. ఏపరమేశ్వరునాజ్ఞచే బ్రహ్మ సృజించునో, విష్ణువు పాలించునో కాలాగ్నిరుద్రుఁడుసంహరించునో, ఎవరియుత్తరువున యోగి విరాగియగునో, అగ్ని దహించునో సూర్యుఁడు తపింపఁజేయునో, శతముఖుఁడు వర్షించునో, మృత్యువు, సంచరించునో, యముఁడు శాసించునో, సకలజంతువుల భూమి వహించునో, ప్రకృతి మహదాదిపంచతన్మాత్రలతోఁ గూడ సృజించునో యట్టిపరమేశ్వరు నభిప్రాయము నిది యని

కనుఁగొనుటకు శక్య మెట్లగును? ఎవఁడెఱుంగఁగలఁడు? బ్రహ్మా విష్ణుమహేశ్వరులైననేమహాత్ముని ప్రభావము నెఱుంగరో అట్టి పరమేశ్వరునిమహిమమును మందబుద్ధినగు నేనెట్లు కనుఁగొనఁగలను? బృందావనమును వదలి మధురానగరమున కెట్లు పోయెనో, గోపికలను ప్రాణాధికురాలగు రాధను విసర్జించి యెట్లు విసర్జించెనో, యశోదను, బాంధవాదులను నందుని నెడఁబాసి దూర భూమి కెట్లు పోయెనో, దర్పప్రదాతయు దర్పహారుఁడు సర్వప్రదాతయునగు పరమేశ్వరుఁడుసుదామునిశాపకారణమున రాధాదర్పము నెట్లు తగ్గించెనో, వచింప శక్యముకాదు. భావనాబలమున బ్రహ్మప్రాప్తిని బ్రసాదించువాఁడు పరమాత్మ. అట్టి మహావిష్ణువు బ్రహ్మకు దర్పభంగమును గల్గించెను. బ్రహ్మావిష్ణుశేషశంకర ధర్మయమ సాంబభాస్కర శీతాంశుగరుడవహ్ని దుర్వాసులకు జయవిజయులను ద్వారికులకు సురాసురులకు నారదుఁడవగు నీకును, గామశతక్రతులకు, లక్ష్మణార్జునబాణాసుర భృగుమునులకు, సుమేరువునకు,సముద్రములకు, వాయువరుణులకు, సరస్వతికి, దుర్గకు, లక్ష్మికి, భూమికి, సావిత్రీగంగానదులకుఁ బ్రాణాధికురాలగు రాధాంబికకు, దర్పభంగముగావించి ప్రసాదము వారిపై వ్యాపింపఁజేసెను. ఇఁక సామాన్యులకు దర్పభంగముచేయుట యొకగొప్పపనియా. కర్తయు, హర్తయుఁ బాలకుఁడును, స్రష్టయు, నగుపరమేశ్వరు వినుతించుటకుఁ బంచవక్త్రములుగలశంకరునకును శక్యముకాదు. చతుర్వక్త్రములుగల బ్రహ్మయు శక్తుఁడుకాఁడు. సహస్రవదనములు గలశేషువునకు

శక్యమా. విష్ణువునకుమాత్రము వినుతిసేయుయోగ్యతకలదా. సగుణబ్రహ్మమునకేని శక్యమా. ఆపరాత్పరుని మ్రోలఁ ప్రకృతియు గడగడలాడుచుండును. సరస్వతి వినుతింపఁబూని మహాపరాధము చేసితినని సిగ్గుపడును. ఆపరమాత్మప్రభావమును దెలుప వేదములు శక్తములుగావు. నారదా! భగవత్ప్రభావవర్ణనమిదియే. నిర్గుణుండగు శ్రీకృష్ణుని ప్రభావమిది యని వర్ణింపఁదరముకాదు. మఱేమి వినఁగోరుదువు? అని నారాయణమూర్తి యడిగెను.

భక్తులారా! ఈయధ్యాయమునగలవిషయము వాస్తవమును దెలిపెను. భగవంతుని ప్రభావమును వర్ణింప శక్యముకాదని దీనిసారము. తత్సమానవస్తువు లోకమున నింకొకటిలేనపుడు దాని నిట్టిదని పోల్చుటెట్లు? ఇఁక నేవో నాల్గుమాటలు చెప్పినను నవి నిస్సారములుగా నుండును. ఈయర్థమే.

మంత్రము. యద్వాచా నభ్యుదితం యేన వా గభ్యుద్యతే,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే. ౪
యన్మనసా నమనుతే యేనాహు ర్మనోమతం,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే. ౫
యచ్చక్షుషా నపశ్యతి యేన చక్షూంషి పశ్యతి,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే. ౬
యచ్ఛ్రోత్రేణ నశృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతం,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే. ౭
యత్ప్రాణేన నప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే,

తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే. ౭

కేనోపనిషత్తు.

అని యుపనిషత్తు తెల్పుచున్నది. అట్టిపరాత్పరుని వినుతింప దర్శింప నెట్లు శక్యము. కావుననే యది నిర్గుణము నిరంజనము నవాఙ్మానసగోచర మని విమర్శింపఁబడినది. వెఱ్ఱిమొఱ్ఱిమాటలు నాలుగు చెప్పిన నవి సత్యార్థప్రతిపాదకములు గావు. కావున నదియెఱుంగ శక్యముకానిదని తెల్పఁబడినది. దాని నమ్మి తెలిసి నట్లు నటింపకుండుట బుద్ధిమల్లక్షణము. ఇంతకంటె భగవత్ప్రభావవర్ణనమునఁ జెప్పఁదగిన విషయములు లేవు. ఇఁకఁ దరువాతి కథను వ్రాసెదను.

విష్ణుప్రభృతులగర్వమును శ్రీకృష్ణమూర్తి తొలఁగించుట.

* భగవత్ప్రభావమును వీనులార విని నారదముని శ్రీమన్నారాయణమూర్తిం జూచి మహాత్మా! అత్యద్భుతమగు వార్తను వింటిని. శ్రీకృష్ణుఁడు మహావిష్ణువుదర్పభంగ మెట్లు చేసెను ? యెవ్వరెవ్వరి కెట్లెట్లు దర్పభంగ మొనరించి వారిని గృతకృత్యులనుగాఁ జేసెనో తెల్పుము. శ్రీకృష్ణచరిత మత్యంతసుందరము. పరమపవిత్రకావ్యము. నా విని నారాయణుం డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. నారదా! వినుము. ఒకానొకతఱి విష్ణువునకించుకగర్వ ముదయించెను. సర్వప్రపంచములు నాలోమకూపములనుండి వెలువడినవి. వానికెల్ల నేనే ప్రభుఁడను. అన్న

*ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండమున నేఁబదియాఱవయధ్యాయము నుండి సంగ్రహింపఁబడినది.

గర్వము మదిఁ బొడసూపెను. శ్రీకృష్ణపరమాత్మయు నిది యుండఁదగనిదిగావునఁ దొలఁగింపవలయును. ఇదిపురోవృద్ధికి భంగము. అని యూహించి సంహారభైరవుఁడై శ్రీవిష్ణువు దేహమును మ్రింగెను. అంత విష్ణువు శిరస్సుమిగుల దీనుఁడై సంస్తుతింపఁ బ్రసన్నుఁడై భీతుఁడైయున్న యతని భీతి మాన్పి విష్ణువుశరీరము నెప్పటియట్ల ప్రసాదించి స్వస్థానమున నుండ నియమించెను. బ్రహ్మకు సకలవేదకర్తను సృష్టికర్తను నే నన్న యహంకారము గలిగెను. నాకంటె లోకమునఁ బూజ్యుఁడు లేఁడని యతఁడు భావించెను. ఈరీతి గర్వముదయింపఁగానే దానిని బాపనెంచి శ్రీకృష్ణపరమాత్మ బహుబ్రహ్మల గావించి గోలోకమునఁ దనసమీపమునఁ గూరుచుండఁజేసి వారితోఁ జేయుసంభాషణమువలన జతుర్ముఖునకుం గల్గిన గర్వమును సంపూర్ణముగాఁ దొలఁగించెను. నలువయుఁ బంచవక్త్రదశవక్త్ర శతవక్త్ర సహస్రవక్త్రముల విరాజిల్లు బ్రహ్మలంగాంచి సిగ్గుపడి దేహత్యాగము చేయఁబూన హిత ముపదేశించి యతని స్వస్థానమున నుంచెను. కాలాంతరమున మోహినీశాపహేతువున నపూజ్యుఁడగునట్లు చేసెను. తనపుత్త్రికం గాంచి మోహించు నంతటియజ్ఞానమును గల్పించెను. ఆదర్పము శంకరుని ద్వారా తొలఁగించి తనదేహమును విడువ మరల దేహము నను గ్రహించి పూజ్యతను బ్రసాదించి వెలయించెను.

* ఒక్కతఱి శ్రీమహావిష్ణువునకు జగత్పాలకుఁడనుగాన

---

*విష్ణోర్బభూవ గర్వశ్చ జగత్పాతాహమీశ్వరః, తమాత్మవిస్మృతం కృష్ణశ్చకార రామజన్మని. అని మూలము.

నాకంటె మిన్న లీలోకమున నెన్న లేరన్న గర్వసంపన్నత్వ మంకురించెను. రామావతారమున నాత్మవిస్మృతిం గల్పించి దానిం దొలఁగించెను. ఆదిశేషునకు నేను బ్రపంచమును మోయుచున్న వాఁడనను దర్పము మనమునఁ బొడకట్టఁగా గరుడుని బుట్టించి దానిని జూర్ణముగా నొనరించెను. ఒకానొక ప్పుడు శ్రీకృష్ణవాహనమగు గరుడుఁడు నాగములచేఁ బూజితుఁడై యనంతుఁడు తనను బూజింపమి కాగ్రహించి యతని నోడించి దర్పమడంచెను. ఇది యనంతునిగర్వధ్వంసనపద్ధతి. పిమ్మట నాయనంతునిం గరుణించి గరుడభీతి లేక యుండఁజేసి కాపాడెను శంకరుఁడు జితేంద్రియుఁడనన్న గర్వ మూని వివాహము మానియుండెను. శ్రీకృష్ణపరమాత్మ మాయచే శివుని మోహితునిగా నొనర్చించి సదా కాంతాయుతునిగాఁ జేసెను. దక్షపుత్రిక సతి మృతినొందునట్లు చేసి యాకళేబరమును మోయుచు నొకవర్షము దుఃఖపడునట్లు చేసి నానాస్థానముల శివుఁడు తిరుగునట్లు చేసి యాసతీదేవికి జన్మాంతరమును బ్రసాదించి పార్వతియనుపేరఁ బ్రఖ్యాతిం గాంచునట్టు లొనరించి దక్షశాపమున శంకరుఁడు విస్మృతజ్ఞానుఁడగునట్టు లొనరించి యాంగిరసునిద్వారా స్వస్థితిని స్మరించునట్లు కల్పించెను. మఱియొకకాలమున శంకరుఁడు త్రిపురాసురుల సంహరించునట్లు చేసెను. త్రిపురారియనుపేరు ప్రఖ్యాతమగునట్లు తనమహిమ మునఁ గూర్చెను. సకలవరములఁ బ్రసాదించు సామర్థ్యము శంకరునకు నొసంగెను. వృకాసురుఁడు తపస్సొనరించి వర

మడుగునట్లు మాయఁ గల్పించి శివుఁడు వరము ననుగ్రహించునట్లు, వాఁడు శంకరునిశిరమున హస్తతలము నునుపఁబూనినట్లును, దాన శంభుఁడు భయపడి తనను శరణమును వేఁడునట్లును, గల్పించి శంకరుని గాపాడుపొంటె దానవుఁడు పొలియునట్లు చేసెను శివుఁడు మఱియొకతరుణమున బాణాసురుని గాపాడఁబూని తనతో యుద్ధమొనరింప నాతని జృంభకాస్త్రమున జడీభూతునిగాఁ జేసెను. దక్షయజ్ఞమున దంభమున వచ్చుశివునిఁ దా నావిర్భవించి హస్తమునఁ గంఠముం బట్టుకొని నివారించెను. ఇది శంకరుదర్పభంగకథ.

ధర్మదేవత కేదారకన్యకశాపమునఁ గృశించి యమవసనిశియందుఁ జంద్రునిచందమున నుండి భీతిచే శ్రీకృష్ణుని బ్రార్థింప నామహాపురుషుఁడు కృతయుగమునఁబూర్ణతం గాంచునట్లును, త్రేతాయుగమునఁ ద్రిపాదముగ నుండునట్లు, ద్వాపరమున సగముగా నుండునట్లు, కలికాలమున నొకభాగముగ నుండునట్లు, కలియుగాంతమున క్షయించి షోడశాంశశేషము గలుగనుండునట్లు, మరలఁ గృతయుగమునఁ గ్రమముగా వృద్ధిని గాంచునట్లు నియమము చేసి కాపాడెను. ఇది ధర్మగర్వభంగకథ.

యముఁడు గర్వింప మాండవ్యమునిశాపమున శూద్రయోనిం బుట్టునట్లు కల్పించి శతవత్సరాంతమున ముక్తిని శాపమునకుఁ గలుగునట్లుచేసి పరిశుద్ధుని గావించెను. సాంబుఁడు

వి మాతృశాపమున గళత్కుష్ఠుఁడయ్యెను. శ్రీకృష్ణమూర్తి యతని కాదోషమును దొలఁగించి కాపాడెను. చంద్రుఁ డహంకరించి గురుదారాగమనమున యక్ష్మరోగగ్రస్తుఁడయ్యెను. సూర్యుఁడు తేజోబలంబున విఱ్ఱవీఁగి శంకరకింకరుఁడగు వీరభద్రుని వధింపఁ దలంచెను. దాన నతనికిఁ బర్వతముం గూర్చి పలాయనము గల్గెను. తనకిరణములనావిషయమును బ్రదీప్తముగావింపనందున్న సుమాలియను దైత్యుఁడు భీతిల్లి శంకరుని మఱుఁగుఁజొచ్చెను. శంకరుఁ డాసూర్యు నహంకారము నెఱింగి శూలాయుధమును ధరించి పైకిరాఁగా సూర్యుఁడు పరుగిడసాగెను. కాశీనగరమున రవిని శూలమునఁ బొడిచెను. ఆపోటున రవి మూర్ఛిల్లెను. దాననతని దర్ప మడఁగెను. అపుడు సాంద్రాంధకారము జగమున నెల్లతావుల నావరించెను. మహాదేవుఁ డతఁడు మూర్ఛిల్లుటకు జాలిపడికరుణానిధి కావున శీతలవాతముఁబోలయ నాతని నుపలాలించెను. సూర్యుఁడు తెలివినొంది సిగ్గుపడియు శంకరుని వినుతించెను. ఆవినుతికి నలరి యర్కు నాశీర్వదించి తననిలయమునకుం బోయెను.

శంకరుఁడు వైకుంఠముననున్న శ్రీమహావిష్ణువును దర్శింప వచ్చుతఱి గరుడగర్వభంగము చేయందలంచి వెనుకనున్న శివునివాహనమగు వృషభము వైకుంఠమునకు గరుడునిదాఁటి ముందు వచ్చునట్లుచేసి లజ్జితుండై గరుడుఁడు తలవంప నతనిం గరుణించెను అగ్నికిఁ గల్గినగర్వము భృగుమునిశాపమున సర్వభక్షకత్వము గల్గునట్లుచేసి యడంచెను. దేవగురువునకుఁ గల్గిన

దర్పము నతనిభార్యను జంద్రుఁ డపహరించుటచేఁ దలవంపులు గలుగుట రూపుమాసెను. దుర్వాసునకుం గల్గినయహంకార మంబరీషనరపతిద్వారా నశించెను. విష్ణుచక్రము వెంటనంట నాముని తుదకు నంబరీషునే శరణువేఁడునట్లు శ్రీకృష్ణమూ_ర్తి కల్పించెను.

జయవిజయుల కొకానొకసమయమున మనసుల నహంకార ముత్పత్తిల్లెను. భగవంతుఁ డదియుండరాదని భావించి మునివర్యులశాపము గల్గఁజేసెను. దాన వారిరువురు హిరణ్యాక్ష హిరణ్యకశిపులను దానవులై పుట్టిరి. భగవంతుఁ డాదివరాహ రూపమున హిరణ్యాక్షుని, నృసింహరూపమున హిరణ్యకశిపుని బొలియించెను. మరల వారు రావణకుంభకర్ణులను దైత్యులై పుట్టఁగా రామావతారమె_త్తి వారిరువురఁ బొడవడంచెను. మూఁడవజన్మమున నాజయవిజయులే శిశుపాలదంతవక్త్రు లనఁ బుట్టిరి. శ్రీకృష్ణావతారమున వారిఁ బొలియించెను.

దేవతలు స్వర్గనివాసమున నించుక గర్వించిరి. భగవంతుఁ డాగర్వమును దైత్యులద్వారా పోఁగొట్టెను. అసురవరగర్వము దివిజులద్వారా వారికోటమిని గల్పించి తగ్గించెను. నారదా ! నీకుఁ బొడసూపినగర్వమును విధిద్వారా యొనరించెనుగదా. నీవు మున్ను బ్రహ్మకుఁ దనయుఁడవైతివి. పితృశాపమున గంధర్వుఁడవైతివి. పిదప శూద్రపుత్రుఁడవైతివి. శ్రీకృష్ణ పరమాత్మకరుణచే మరల నిపుడు నారదుఁడవయి యున్నవాఁడవు. నీవృత్తాంతమును నీవే యెఱుంగుదువుకదా. ఈప్రపంచ

మునెల్ల నేనే సాధింపఁగలనన్న గర్వము కామునకు నంకురించెను. హరకోపానలమున వాఁడు భస్మమయ్యెను. మరల ననుగ్రహామున శ్రీహరి వాని బ్రదికించి గర్వశూన్యునిగా నొనరించి కాపాడెను. శరసంధానమున నాకంటె మేటిలేడన్న లక్ష్మణుని గర్వము రావణాసురప్రయుక్తశక్తిద్వారా పోఁగొట్టెను. రామచంద్రుఁడు స్తుతింప మరల నాలక్ష్మణునిఁ బ్రదికించెను. అత్తఱి శ్రీరామచంద్రుఁడు బ్రహ్మశాపమున విస్మృతవిష్ణుభావుఁడుగ నుండెను.

కార్తవీర్యార్జునుఁ డవార్యగర్వమేదురుఁడై యుండఁగాఁ బరశురామునిద్వారా తత్పరశుధారచే మృతిఁగల్పించెను. పాండవమధ్యముఁడగు నర్జునుఁడు గర్వించు టెఱింగి విప్రపుత్రమరణవిషయమందును, శ్రీకృష్ణపత్నుల దొంగలు పరాభవించు విషయమునందును, గర్ణునితో సంగరము సంఘటిల్లు సమయమందును దద్గర్వమును హరించెను. బాణాసురుని దర్పము నుషాకన్యకాహరణప్రస్తావమున బాహువులఁ ద్రెంచి యడంచెను. భృగుమహర్షి యవార్యగర్వమును దక్షయజ్ఞమున వీరభద్రునినుండి నశింపఁజేసెను. పరశురామగర్వమును శ్రీరామవివాహానంతరము వారయోధ్య కేగుచుండ నడ్డపడినపుడు శ్రీరామచంద్రునిద్వారా హరించెను. సుమేరువు నాయంతపర్వతము లేదని యహంకరింప వాయువుచేఁ దచ్ఛృంగభంగముగలుగఁజేసి మాయించెను. సముద్రము లహంకరింప దాని నగస్త్యమహర్షి జలపానమునఁదొలఁగునట్లు చేసెను. అకా

లమున సృష్టిఁజెడఁగొట్టఁబూని తనపుత్రమృతికై వగచివాయువు మదినెక్కించుకొనినదర్పమును దొలంగించెను వరుణునకుఁ గల్గిన గర్వమును బాణాసురగోహరణహేతువున శాపముగలుగఁజేసి. రూపుమాపెను. నారాయణమూర్తిమ్రోల గంగతోఁ గలహించినసరస్వతిని త్యజించి తద్గర్వము నిర్మూలించెను. దర్పమున విఱ్ఱవీఁగుదుర్గను హిమాలయమునందు శివుఁడు వదలిపెట్టిన ట్లొనర్చి హరించెను. కాముని బూదిచేసి యాశంకరుఁడు తపస్సుచేయఁబూనెను. ఆదుర్గాదేవి లజ్జనొంది గర్వము మాని యుండెను. అంత నాపార్వతి శివప్రాప్తికై విష్ణువుంగూర్చి తపస్సుచేసి శ్రీహరి వరప్రభావమున శంకరుని భర్తనుగాఁ బడసెను. సకలైశ్వర్యసంపన్నురాలయ్యెను. స్త్రీలయందు మేటియై విశ్వపూజ్యయై సురాసురసన్నుతికిఁ బాత్రురాలయ్యెను.

ఒకానొకతరుణమున మహాలక్ష్మి గర్వమూని జయవిజయులచేఁ దిరస్కరింపఁబడియె. ఎట్లన. భర్తృగేహమును బ్రవేశించుతఱి ద్వారికులువలదనిరి. ఆతిరస్కారమున కోర్వకసాభిమానయై శ్రీహరిపాదారవిందములసంస్మరించి దేహమును వదలఁబూనెను. అత్తఱి బ్రహ్మశంకరవిష్ణుధర్మభాస్కరచంద్రమన్మథవైశ్వానరధనేశ్వరులు, ఋషులు, మునులు, మనువులు లోనగుమహామహులెల్ల నందావిర్భవించి యామె విలాసము నాపి మూలప్రకృతియై యీశ్వరియగు నామహాలక్ష్మిని వినుతించిరి.

*ఈస్తుతిరాజము పరమపవిత్రము. మహాలక్ష్మీమహిమబోధకము. దానింబఠించిన మహాలక్ష్మీప్రసాదము కలుగు.

పాఠకమహాశయులారా! ఈకథ నీతికి హృదయస్థానము. జ్ఞానమునకాకరము. లోకాచారములకుఁ బట్టుకొమ్మ. కావున దీనింగూర్చి నాలుగుమాటలు వ్రాయకతప్పదు. విష్ణువు లోనగు వారికిఁ గల్గినగర్వమును శ్రీకృష్ణమూర్తి తదనురూపసంవిధానమునఁ బోఁగొట్టిన ట్లీకథ తెల్పుచున్నయది. విష్ణు వెవ్వఁడు! కృష్ణుఁ డెవ్వఁడు? అన్నప్రశ్నము వలదు. ఇట శ్రీకృష్ణుఁడనఁగా నాదితత్త్వము. రూపనామక్రియాశూన్యము. విష్ణ్వాదులు

---

సర్వదేవకృతమహాలక్ష్మీస్తుతిరాజః.

*క్షమస్వ భగవత్యంబ క్షమాశీలే పరాత్పరే, శుద్ధసత్త్వస్వరూపే చ కోపాదిపరివర్జితే. ౧. ఉపమే సర్వసాధ్వీనాం దేవీనాం దేవపూజితే, త్వయా వినా జగత్సర్వం మృతతుల్యం చ నిష్ఫలం. ౨. సర్వసంపత్స్వరూపా త్వం సర్వేషాం సర్వరూపిణీ, రాసేశ్వర్యధిదేవీ త్వం త్వత్కలాస్సర్వయోషితః. ౩. కైలాసే పార్వతీత్వం చ క్షీరోదే సింధుకన్యకా, స్వర్గే చ స్వర్గలక్ష్మీస్త్వం మర్త్యలక్ష్మీశ్చ భూతలే. ౪. వైకుంఠే చ మహాలక్ష్మీ ర్దేవదేవీ సరస్వతీ. గంగా చ తులసీ త్వం చ సావిత్రీ బ్రహ్మలోకతః. ౫. కృష్ణప్రాణాధిదేవీ త్వం గోలోకే రాధికా స్వయం, రాసే రాసేశ్వరీ త్వం చ బృందా బృందావనే వనే. ౬. కృష్ణప్రియా త్వం భాండీరే చంద్రా చందనకాననే, విరజా చంపకవనే శతశృంగే చ సుందరీ. ౭. పద్మావతీ పద్మవనే మాలతీ మాలతీవనే, కుందదంతీ కుందవనే సుశీలా కేతకీవనే. ౮. కదంబమాలా త్వం దేవి కదంబకాననేఽపి చ, రాజలక్ష్మీ రాజగేహే గృహలక్ష్మీర్గృహే గృహే. ౯. ఇత్యుక్త్వా దేవతాస్సర్వే మునయో మనవ స్తథా. రురుదు ర్నమ్రవదనాః శుష్కకంఠోష్ఠతాలుకాః. ౧౦. ఇతి లక్ష్మీస్తవం పుణ్యం సర్వదేవైః కృతం శుభం, యః పఠేత్ప్రాతరుత్థాయ సవై సర్వం లభే ద్ధ్రువమ్. ౧౧.

దీని తాత్పర్యము సులభము కాన వ్రాయలేదని విన్నవించువాఁడను.

తదంశసంభూతులు. త్రిమూర్తులు నాఁబడుదురు. వీరికిఁ బ్రపంచోపాధిదేవత లనిపేరు. వీరే ప్రపంచము సాగించువారు. కావున మనకుఁ బరమోపాస్యులు. కాని భగవంతునకుఁ దేజస్స్వరూపము. ఆతత్త్వమే ప్రకృతిని సృజించును. అనఁగాసృష్టిచేయ నూహించును. ఆయూహయే ప్రకృతి. ఆమె భగవదిచ్ఛాశక్తి యనంబరఁగి త్రిమూర్తుల సృజించును. కావుననే యాదిశక్తి యనఁబరఁగును. ఆ త్రిమూర్తులే సకలప్రపంచమున కాధారభూతులు. కాని మనకంటె నధికులనుకారణమున మనము వారి నెట్లు పరదైవతములనుగా భావింతుమో వారికంటె నెక్కుడు శక్తిగల భగవంతుని వారు నట్లే తలంతురు. వీరినందఱిని నిర్మించినవాఁడు నిర్గుణపరబ్రహ్మము. ఆయన సర్వసాక్షియనఁబడును. విష్ణ్వాదులకుఁ ద్రిగుణసంబంధము లాయాయిసమయములందుఁ గలుగకమానవు. రజోగుణ ముద్రేకింపఁగా నహంకారము పుట్టకుండ మానునా. అదికూడఁ గూడదని భగవంతుఁడు గర్వము నిర్మూలించెననుటలో నాశ్చర్య మేమాత్రము గాని పింపదు ఈవిషయమును జక్కఁగా నాలోచింపఁగా భగవంతుఁడీలోకముల నెవ్వఁడేఁ దనంత వాఁడు లేఁడని భావించునో వానికిఁ దగినప్రాయశ్చిత్తము చేయకమానఁ డనుట స్పష్టము. ఆభగవచ్ఛక్తి యింతయని వచింప సాధ్యముకానిది. కావుననే దుర్జ్ఞేయమని యుపనిషత్తులు బోధించి మఱి నిర్ణయింపఁజాలక మానినవి. ఇంకఁ దక్కినపురాణము లేమి నిర్ణయింపఁగలవు? పాపము నాలుగుకథలఁ దెల్పి బ్రదికితిమిరా స్వామీ యని విర

మించినవి. వీనింబరిించిన కుక్షింభరు లాతత్త్వము నేమని నిర్ణ యింతురు? ఆతత్త్వము బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులగర్వము నడఁచుట యన నొకక్షుద్రకార్యము

ఈయధ్యాయమున వేఱొకవిషయమును బరిశీలింపవల యును. సత్వరజస్తమఃప్రధానులగు దేవతలందఱు తమవలనఁ బ్రపంచము లున్నవనుకొనువారే. అదియే యహంకారము. దానిని భగవంతుఁడొక్కొక్కరిద్వారా దొలఁగించు చుండును. ఇఁక మానవులకుఁ గలుగుగర్వము నడఁచుట యొక్కపనియా. ఎవ్వఁడుకాని నే నీకార్యముచేసితినని భావించినచో సర్వజ్ఞుఁ డగు పరమేశ్వరుఁ డాతని క్షుద్రబుద్ధికిందగిన ప్రాయశ్చిత్త మొనరించును. ఇదియే యిందలిసారము. ఇట్టివిషయ మింకొ క్కటి లేకపోలేదు.

"తుష్టువుశ్చ మహాలక్ష్మీం మూలప్రకృతిమీశ్వరీమ్."

అని దేవతలు లక్ష్మీదేవిని వినుతించినట్లు పొడకట్టెడిని. వైకుంఠ మున వేంచేసియుండు శ్రీమన్నారాయణమూర్తిపత్నియగు శ్రీమహాలక్ష్మిని మూలప్రకృతయనియు నీశ్వరి యనఁగా సర్వ లోకాధిష్ఠాతృదేవి యనియు నిటఁ జెప్పఁబడినది. మూలప్రకృతి యనఁగాఁ బార్వతియనియుఁ దదుపాసకులే శాక్తులనఁబడుదు రనియు నెగిరి యెగిరి మాటలాడుమూర్ఖుల కిది ప్రాయశ్చిత్త మనం జనునుగదా. వారిమాటలు తెలివితక్కువప్రసంగము లనియు నిదియంతయు భావనయనియు స్త్రీవ్యక్తియంతయుఁ బ్రకృతియనిచెప్పనొప్పుననియు, నెవరెవ రెట్లెట్లు భావించి

ఘూజించినను, అపరదేవి వాంఛితములనొసంగుననియు గ్రహించుట బుద్ధిమల్లక్షణము. కావుననే దేవీభాగవతమునందు

"సర్వే శాక్తాస్సముద్దిష్టా న శైవా న చ వైష్ణవాః"

అని వర్ణింపఁబడినది. ఇది సత్యము. విష్ణుభక్తులు శ్రీదేవిని బ్రకృతి యని తలఁపఁజను. నారాయణమూర్తియే పరబ్రహ్మము. ఇట్లుపాసించినచో వారును శాక్తులే. కావున శాక్తులనువారొక తెగవారుకారని సగుణబ్రహ్మోపాసకు లెల్లరుశాక్తులే యనియు గ్రహించుటయే సరసము. అట్లు తలంపకున్నను రూపనామములఁ గల్పించి యుపాసించిన నది శాక్తమేయగు. శాక్తులముకామని చెప్పుకొన్నను వారు చేయువిధి శాక్తవిధియే. ఇప్పట్టున ఘంటాకర్ణునికథ స్మృతిగోచరమగుచున్నయది. అట్లే వీరు కూడఁ దరించవలయునని వారక కోరుచున్నాఁడను. మతభేదముల కవకాశమును బురాణములు కల్పించుటలేదని వీనివలనఁ గనుఁగొనవచ్చును. ఏఘట్టమున నాదేవతయే పరదేవతయని చెప్పునట్టిపురాణములు హితబోధము లనుటకంటె మిక్కిలిగాఁ జెప్పఁదగిన దేమున్నది ? ఎవ్వఁ డేదేవతయందు భక్తిగలవాఁడైనను ఫలము సమానమని తెల్పుచున్నవి. దేవతాభేదబుద్ధి పనికిరాదని హెచ్చరించుచున్నవి. సకలదేవతాసమత్వము నలవాటుచేసికొనుఁడని బుద్ధిచెప్పుచున్నవి. ఇంతకంటె హిత ముపదేశించున వేవియుండును ? కావున బుద్ధిమంతులమై భక్తిగలిగి శ్రీపరాత్పరుని శ్రీకృష్ణాదిరూపముల యథామతి నర్చించి తన్నామస్మరణముచేసి కృతకృత్యుల మగుట సమంజసము.

మహాత్ములారా! మఱొక్కపర్యాయము శ్రీరాధామాధవుల స్మరింపుఁడని విన్నవించి తరువాతిభగవల్లీలనువ్రాయఁబూనెదను.

మహాలక్ష్మి పతివ్రతామహిమమును బ్రహ్మకుఁ జెప్పుట.

*మహాలక్ష్మి దేవతావినుతుల నాలకించి వగపుమాని ప్రసన్నాననపంకజయై వారిస్తుతులకుఁ బరమానందమునంది యిట్లు పలికెను. దేవతలారా! ఈనాదేహమును వదలుచున్నదాన క్రోధమున. గాని వైరాగ్యమునఁగాని కాదు. ఈచెప్పఁబోవువిషయమును దలంచియే యీతనువును వదలఁదలంచితిని. సర్వేశుఁడై మహాత్ముఁడై నిర్గుణుఁడై, సర్వాత్ముఁడై, సదానందుఁడై తృణశైలములనుసమముగాఁ జూడఁగలిగి భ్రూభంగలీలచే నావంటి మహాలక్ష్మిలక్షసంఖ్యను బుట్టింపఁగలిగియలరారు భగవంతునకుఁ బత్నినైయేమిప్రయోజనము గడింపఁగల్గితిని? నేనుదత్సేవకులతో సమానురాలనే యైతిని. ఆపరమపురుషునకు బత్నినై ద్వారపాలకునిచేఁదిరస్కరింపఁబడితిని ఆతిరస్కరణమిపుడే కలిగెనుగదా. కావున నిఁక నీదేహము గౌరవార్హముగామివదలెదను. ముందు పరను కల్యాణము గలుగవలయునని కోరి యగ్నికాహుతిగాఁ జేసెదను. లోకమున నేకాంతామణి భర్తృప్రీతిపాత్రురాలుకాదో యాకామిని యసౌభాగ్యయే యని చెప్పనొప్పును. శయనాసనభోజనములయందు నాపురంధ్రికి సుఖములేదు. దాని జీవనము వ్యర్థము. ఏవనితకుఁ బ్రియునిప్రీతి యలరదో దానిజన్మమే

*ఈచరిత్రము శ్రీకృష్ణజన్మఖండమున నేఁబదియేడవయధ్యాయము నుండి గ్రహింపఁబడినది తెలియఁదగు.

నిరర్థకము. ఇఁక నట్టికుటుంబినికిఁ గలపుత్రధనసుఖరూపసంపద్యౌవనములఁ జెప్పనేటికి? అవన్నియు నిరర్థకములే. కాంతునియం దెవ్వతుక భక్తిఫలింపదో ఆ కామ్యాతి యశుచియే. ధర్మహీనయే. సర్వకర్మవివర్జితయే. సాధ్వికిఁ బతియే బంధువు. పతియే గతి. భర్తయే దైవతము. నాథుఁడే గురువు. అందఱికంటె మిన్నగ నెన్నఁదగినవాఁడు ప్రాణనాథుఁడే. ఆతనికిమించినగురువీలోకముల లేఁడు. తల్లిదండ్రులు సుతభాతృప్రముఖులు కష్టపడి ధనము నీఁగల్గుదురు. ప్రాణేశుఁడు సర్వస్వదాత. మూఢచిత్తలగుస్త్రీల కీవిషయము తెలియదు కాఁబోలు. ఓ దేవతలారా! పడఁతులలో నొకానొకసుచరిత్రయే భర్తను భగవంతునిగా నెఱుంగఁగలదు. ఆ కాంత సత్కులప్రసూతయు, సుశీలయుఁ గులపాలికయునై నఁగాని భర్త నెట్లు భావింపవలయునో తెలిసికొనఁజాలదు. అసత్కులమునఁ బుట్టువుంగాంచి, దుశ్శీలయై ధర్మవర్జితయై వాక్పారుష్యముగలిగి యేకమతి లేకయుండువనిత భర్తృదూషణముచేయును. ఏస్త్రీ విష్ణుసమానుఁడై, గురువై సర్వాధికుఁడై యొప్పు భర్తను ద్వేషించునో యాస్త్రీ కుంభీపాక మనునరకకూపమునఁ బదునలుగు రింద్రులుండుదాఁక నుండఁగలదు. వ్రతముల నాచరించుట, నిరశనదీక్షలఁ బూనుట, దానము చేయుట, సత్యవాక్యనిరతిగల్గియుండుట, ఇతరపుణ్యకార్యము లొనరించి సుకృతము నార్జించుట, దుష్కరతపము చేయుట యను నీలోనగుసత్కార్యములు పతిభక్తిలేనికాంతకు భస్మమున హోమము చేసినట్లు నిరర్థకములు. ఇంతకంటెఁ గఠిన

వాక్యమును జెప్పఁదలపోయను. భగవంతుని భృత్యులు చేసిన యపరాధమునకై నాదేహమును వదలెదను. ఇది నిశ్చితము. మహాసాధ్వి యగువనిత పతిదోషము గనఁబడుచున్నను భర్తను దూషింపదు. ఆయపరాధ మోర్వరానిదగునేని ప్రాణముల వదలవలయును. పతిసేవయే వ్రతము. అదియే తపస్సు. అదియే పరమధర్మము. దేవార్చన మన నదియే. నిరుపమానసత్యపరాయణత్వ మాపతిసేవయే. దాన తీర్థానుకీర్తనముకూడ భర్తృసేవయేకాని వేఱొకటిలేదు. స్వామి సర్వదేవతామయుఁడు, శుచియు నతఁడే. సర్వపుణ్యస్వరూపుఁడు, జనార్దనుఁడు నతఁడే.

ఏనారీమణి పతియుచ్ఛిష్టమును భుజించి తత్పాదోదకమును ద్రాగునో, ఆసాధ్విని దర్శింపఁగోరి దేవతలు తిరుగుచుందురు. తద్దర్శనమున సర్వతీర్థములు పాపములఁ బోఁగొట్టినట్లు సర్వానర్థములు నశించును. అనిపలికి యామహాలక్ష్మి పలుమాఱులు విలపించెను. అత్తఱిఁ బరమేష్ఠి భీతుఁడై భక్తిచే శిరమును వంచి తల్లీ! జయవిజయులకుఁ దగినఫలము గలుగఁగలదు. వారిని నీవు శపింపవలదు. మూర్ఖులగువారలఁ బ్రియాపరాధభీతవగు నీవు శపింపనేల? అపరాధియని యెఱింగియు నెవఁడతనిని శపింపఁడో యాయపరాధికి దాననే సర్వసౌభాగ్యములు నశించును. ఇది యచిరకాలముననే సాగును. భగవంతుఁడు శపింప సమర్థుఁడు కాకపోలేదు. దండింప నశక్తుఁడు కాఁడు. సాపరాధుఁడగుపురుషునకు ధర్మమే దండమును విధిం

చునన్న సత్య మెఱుంగుదు గాన నూరకున్నవాఁడని నమ్ముము. ఓ జననీ! ఈసర్వవిధాపరాధములను సహింపుము. ప్రియుఁడగు మహావిష్ణువు చెంతకు దయచేయుము. భవన్నాథభక్తుఁడనగు నన్ను సృష్టికార్యమున నుండ నాజ్ఞాపింపుము.

అని ప్రార్థించుచుఁ జతుర్ముఖుఁడు దేవతలను మహర్షులను బురస్కరించుకొని మహాలక్ష్మిని బిలుచుకొని వైకుంఠనగరమును బ్రవేశించి విష్ణువును దర్శించి యిట్లు ప్రార్థించెను. వేదస్వరూపము నెఱిఁగినచతుర్ముఖుఁడు వేదస్వరూపుఁడైన శ్రీమన్నారాయణమూర్తిని వినుతించుట యవ్యర్థముకదా! ఆప్రార్థనము నాలకించి మహాలక్ష్మిని గాంచి నమ్రవదనయై విలపించుచునుండు టెఱింగి యిట్లు ప్రశ్నించెను. కమలసంభవా! నేను సర్వజ్ఞుఁడను. సర్వాత్ముఁడను, సర్వపాలకుఁడను, సర్వశాస్త్రను. కాన సర్వము నెఱుఁగుదును. నాకు భక్తునియందును, గళత్రమునందును, బంధువునందును, సమత్వమే యుండును. విశేషించి మద్భక్తుఁడు కళత్రమునకన్న నధికప్రీతిపాత్రుఁడని నాభావము. నాభక్తులు నీకు బుత్రులునగు ద్వారపాలకులు దండింపఁదగరు. మహాలక్ష్మీ! ఓర్పుగలదానవు కమ్ము. నాయపరాధముగాఁ దలంపుము. వారు భక్తులుగావున క్షమింప నర్హులు. నాభక్తిరసముచే నిండియుండు మనస్సుగలవాఁడు బలవద్దైత్యులకుఁగూడ భయపడఁడు. భక్తిమాధ్వీకదుర్మదుఁడగుభక్తుఁడు నాచక్రముచే రక్షింపఁబడుచుండును.

అనిపలికి మహాలక్ష్మిని జేరఁదీసికొని స్వవక్షమున నిడికొనియెను. ద్వారపాలకుని బిలిపించి వత్సా! భయపడకుము. సుఖముగా నుండుము. నే నీకండగానుండ భయ మేల నీకుఁ గల్గును? నాభక్తులను శిక్షించువాఁ డెవ్వఁడు? నీపదమున నీవుండుము. అని వచియించి శ్రీమహావిష్ణు వూరకుండెను. దేవతలందఱు పరమేశ్వరునకు నమస్కరించి తమతమనెలవులకుం బోయిరి. నారాయణవాక్కుల నాలకించి ద్వారపాలకుఁ డగు జయుఁడు భక్తిచేఁ దలవంచి యిట్లు ప్రార్థించెను. మహానుభావా! జగదీశ్వరా! దేవతలకు నేభయపడువాఁడనుగాను. లక్ష్మీదేవికిని భీతిల్లను. మహర్షులకును భయపడను. సదా నాచిత్తము మీపాదారవిందములయందే వ్రాలియుండునుగాన నేసాధ్వసములు నాకుం గలుగవు. అనిపలికి తనపదముననుండి భగవంతు నారాధించుచుండెను.

జ్ఞానధనులారా! ఈవిచిత్రకథనుండి తెలియఁదగినవిషయము లనేకములుగలవు. జయవిజయులు మహాలక్ష్మి నంతఃపురమునకుం బోవకుండ నడ్డిరని దాన నాజననికిం గ్రోధ ముదయించెనని, దానిచే విలాపముచేయునంతటి దుస్థితి వాటిల్లెనని కనఁబడియెడిని. స్త్రీస్వభావమును సామాన్యముగా నాలోచింపఁగా నిది స్వభావవిరుద్ధ మేమియుఁగాదు. భగవదాజ్ఞ లక్ష్మీదేవినిగూడ రానీయవలదనియుండునా యని యాలోచించిన నసంగతముగాఁ దోఁచును. కాని భగవదిచ్ఛ యెట్టిదో యని మన మెఱుంగఁజాలము. కాని దీనినుండి మనము చేయఁ

దగుసిద్ధాంత మొండు కలదు భక్తజనపక్షపాతి భగవంతుఁ డనునదియే యది.

"భక్తే కళత్రే బంధౌ చ సర్వత్ర సమతా మమ."

అన్న భగవద్వాక్యమే పైమాటను దృఢపఱచుచున్నది. ఇదియే భగవంతునిపరమైశ్వర్యము. భక్తానుగ్రహతత్పరత్వము నీకథ సిద్ధాంతముచేయుచున్నది. సర్వసముఁడనఁగా సర్వసాక్షియను భావము గ్రహింపఁదగినది. దుర్జనులయందు సజ్జనులయందు సముఁడని గ్రహించినచో నవలక్షణసిద్ధాంతముగా నుండును. స్వస్వకర్మానుసారముగా జీవులు సుఖదుఃఖముల ననుభవించుచుండఁ దాఁజూచుచుండునని దీనిసారము.

శ్లో. సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

భగవద్గీత ౯ అ. ౨౯ శ్లో.

అపి చే త్సుదురాచారో భజతే మామనన్యభాక్
సాధు రేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః. ౩౦
మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపియాంతిపరాంగతిమ్.

అను నీగీతావాక్యములు పైసిద్ధాంతమును దృఢమని హెచ్చరించుచున్నవి. అంతియగాక యెట్టివాఁడు భగవంతుని సేవించినచో నాతనిదృఢభక్తియే సకలపాపములను దొలఁగించి సాధుత్వ మాతనియందుఁ గల్పించి భగవదనుగ్రహపాత్రునిగాఁ జేయుచున్నది. దీనిచే భగవంతునిదగు సర్వసమత్వము

సిద్ధాంతమగుచున్నది. మఱియు లక్ష్మీదేవి యుపదేశించిన పతివ్రతాధర్మము లుత్తమోత్తమములు. అవి భారతవర్షమహోన్నతస్థితిని దెల్పుచున్నవి. పతినిమించిన దైవము వనితకు లేదన్న సూక్తి భారతవర్షమునఁ గాక మఱెందుండెను. భర్త భుజించిన పిదప భుజింపఁదగునన్న సూక్తి సత్యముగా మఱేలోకఖండమునఁ గలదా. ఆయుచ్ఛిష్టమును దినవలయునన్న విధి యెందైనఁగలదా. ఆవిషయముఁ జక్కఁగా గుఱుతింపఁదగినది. దానిం గూర్చి పెక్కుపర్యాయము లీవఱకే వ్రాయఁబడినది. ఈధర్మముల ననుసరించినఁగాని పతివ్రతకాదన్నసిద్ధాంతము ప్రాచీనకాలమునుండి యున్నయది. ముందెట్లు మాఱునో తెలియదు కాని సర్వేశ్వరుఁ డానియమములు మాఱకుండ నుండఁజేయవలయునని మనమెల్లఁ బ్రార్థింపవలయును.

జయుఁడను ద్వారపాలకునిం బిలిచి శ్రీనారాయణమూర్తి వచించినపలుకులు వేదసారము లనఁదగియున్నవి. నాయందున్న నిన్ను భయపడఁజేయువాఁడు కలఁడా యన్న భగవద్వాక్యము భక్తరక్షాపరత్వనియమము భగవంతునకుఁ దప్ప వేఱొకరికి లేదన్నవిధిని వెలిపుచ్చుచున్నది.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహాం.

గీతా ౯ అ. ౨౨. శ్లో.

ఈగీతావాక్యమునఁ బైసిద్ధాంతమును భగవంతుఁడే ప్రతిపాదించెనుగదా. అనఁగా భగవద్భక్తులకుఁ గీడుచేయువాఁ

డీసృష్టియందు లేఁడని సారము. సర్వజ్ఞుఁ డగుభగవంతుఁ డీవిచిత్రవార్తను నడపించు టేల యని యొకరు ప్రశ్నింపవచ్చును. భగవదిచ్ఛకార్యాంతమునఁగాని తెలియ శక్యముకాదు. జయవిజయులకుఁ గర్మానుసారము దనుజయోనిం బుట్టువుం గాంచవలయునన్న నియమమును గాపాడు టొకఫలము. భక్తులకుఁ దనయవ్యారూపమును గనఁబఱచుట వేఱొకఫలము. ఎట్టివాఁడుగాని కర్మఫలము ననుభవింపక తప్పదనునియమమును బ్రకటించుట యింక నొకఫలము. సాధువులకించుక యపకారమొనరించి దనుదుష్ఫల మనుభవింపక మానరాదన్నసూక్తిని దృఢపఱచుట మఱియొకఫలము. ఇట్టు లీలక్ష్మీతిరస్కారరూపకార్యమున లోకమున కిన్నివిధముల గుణపారమును జెప్పఁదలంచెను. కాఁబట్టి యీకథనుండి యీవిషయములు నేర్చుకొని వాని ననుభవము నకుఁ దెచ్చుకొనుటయే మంచిమార్గము ఇట్టు లీకథనుబఠించి సారమును గ్రహింపుఁడు.ముక్తికిం బోవఁదగుమార్గమును సదా అన్వేషించుచుండుటయే మనుజకృత్యము. ఇంతట నీవిషయమునుండి వేఱొకభగవల్లీలను దెలుప మదిని నియమించెదను.

## భూదేవి మొదలగువారిగర్వమును శ్రీహరి పోఁగొట్టుట.

*నారదమునీ! భూదేవికి నేను సర్వాధారను గావునఁ బ్రధానభూతురాల ననుగర్వము గలిగెను. దానిని బృథుచక్ర

---

*ఇకథయు శ్రీకృష్ణజన్మఖండమున నేఁబదియొనిమిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

వర్తిద్వారా భగవంతుఁ డడఁచెను. అట్లే సావిత్రికి నేను వేద మాత నన్నయభిమాన ముదయింప భగవంతుఁ డెఱింగి సపుత్ర యగు సావిత్రిని గనఁబడకయుండఁజేసెను. గంగాదేవికిని ముక్తి నొసంగు సామర్థ్యము తనకుఁ గలదనుదర్పము పొడసూపెను. పరాత్పరుఁ డది యుండరాదని భావించి జహ్నుమునిద్వారా దానింబోఁగొట్టెను. మనసాదర్పమునుదుర్గాద్వారాపోఁగొట్టెను. రాధాదేవి మున్ను విరజాకాంతచెంతనున్న కృష్ణునిం దిలకించి మహాగ్రహమున రాసగృహము ప్రవేశించుతఱి ద్వారమును గాచు గోపికలచేఁ దిరస్కారణముగలుగఁజేసి వేత్రములచేఁ గొట్టించి యవమానించెను. ఆదర్పమును భగవద్భక్తుఁ డగు సుదాముఁడు శపించి పోఁగొట్టెను. ఆశాపవశమున గోలోకము నుండి రాధ భూలోకమునకు రావలసివచ్చెను వృషభాను పత్నియగు కలావతికిం గూఁతురుగాఁ బుట్టెను.

శ్రీహరియు రాధాప్రార్థనముచేతనే కంసవధవ్యాజమున నందునిగృహమునఁ బుట్టుకంగాంచెను. కనుక హరికినే నంద నందనుఁ డనుపేరు గలిగినది. సుదాముఁ డొసఁగినశాపమును దొలఁగించి పాలించుటకై మరల మధురానగరమున కరిగెను. శ్రీకృష్ణుని వాస్తవాభిప్రాయ మిదియని యెవ్వఁ డెఱుంగఁజా లును. మధురానగరమునఁ బుట్టి గోకులమున కెట్లు పోయెనో యదిమొద లింతదనుక శ్రీహరియొనరించినయత్యద్భుతవార్తలు గలచరిత్రమును దెల్పితిని. ఇఁక మధురాప్రవేశవృత్తాంతముల వివరించెదను. ఎట్లు శ్రీకృష్ణుఁడు మధురకేగెనో, నందుఁడు

యశోదయు నెట్లు వగచిరో, గోపకులు, గోపికలు, గోవులు, బృందావనవాసులు నెట్లు దురపిల్లిరో తెల్పెదను రాధాదేవి శ్రీకృష్ణుఁడుమధుర కరుగఁగనే ముందు విహరించినవనములు. జలాశయములు, రాసమండలము నీమొదలగుచోట్ల దుఃఖాభిభూతరాయె వెదకెను. గృహమును వదలి వెదుకసాగెను. చేత నాచేతనవస్తువుల నడిగెను. ప్రతివృక్షమును శ్రీపతిని జూపుమా యని ప్రార్థించెను. తల్పమును జేరి దుఃఖించెను క్షణకాలమైనను విశ్రాంతిగానక పరితపించెను.

పాఠకులారా ! ఈకథయు లోపలికథవంటిదే. ఆభావము లే యిచ్చటఁగూడ గ్రహింపఁదగును. విశేషాంశములులేవు. మే మతిప్రీతిపాత్రుల మని భావించి యెట్టివారేని అహంకారమును దెచ్చిపెట్టుకొన్నచో భగవంతుఁడు తద్గర్వభంగమును జేయకమానఁ డనునీతి నీకథయును దెల్పుచున్నయది. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు

## శ్రీకృష్ణమూర్తి యింద్రగర్వభంగ మొనరించుట.

*నారదమునీ ! వింటివికదా శ్రీహరి గర్వముగలవారి నెట్లు శిక్షించెనో, ఇఁక నింద్రునిగర్వమును దొలఁగించినకథ నెఱుకపఱచెద. ఆలకింపుము. ఒకానొకదినమున శతమఖుఁడు సుధర్మయందు రత్నసింహాసనమునం దధిరోహించి ముప్పదిమూఁడుకోట్లదేవతలు గొలువ మహోన్నతవిభూతి నలరారు

*ఈకథయు శ్రీకృష్ణజన్మఖండమున నేఁబదితొమ్మిదవ యధ్యాయమునుండి వ్రాయఁబడినదని యెఱుంగఁదగు.

చుండెను. ఆసమయమున సురగురు వరుదెంచెను. బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడనిగానిఁ గురువని కాని, ఆపత్పరిహారకుఁడని కాని, తలంపక గర్వమున మిట్టిపడి యింద్రుఁడు లేచి మర్యాదచేయ కూరకుండెను. బృహస్పతి తదవమానజనితమహాగ్రహమున నటనుండక యప్పుడ వెడలిపోయెను. అంతియకాని యింద్రునం దున్నకరుణచేత శపింపకపోయెను. శాప మీయకున్నను మహాత్ములరోషము ఫలము నొసంగకమానదు. ఇంద్రుఁడు కాక మఱెవ్వఁడే నవమానించినచో వెంటనే శాపానలమున వానిని బృహస్పతి దహింపక వదలిపెట్టఁడని యెఱుంగుము. బృహస్పతి యందుఁ బొడసూపినధర్మమే యింద్రు నధఃపతితుని గావింపక మానునా. ఏధార్మికుఁడు సాపరాధుఁడు హింస్రకునిఁ గోపమున శపించునో ఆయపరాధమంత నశించును. తనధర్మమును బోగొట్టుకొనినట్లగును. కావున ధార్మికుఁడు శపింపకయుండు టుత్తమము. ఆయనధర్మమే యపరాధిని హింసించును. గురువు నవమానించినపాపమే యతనికి బ్రహ్మహత్యారూపమునఁ బొడ కట్టెను. తద్దర్శనముననే శతక్రతువు భీతుఁడై స్వర్గరాజ్యమును వదలి యెందో పోయిపోయి యెచ్చటనో యొకసరోవరమునఁ బద్మసూత్రము నంతరమున నివసించెను.

ఆబ్రహ్మహత్యయుఁ బరమపవిత్రమగు నావిష్ణుసరోవర మును బ్రవేశింపఁజాలక యూరకుండెను. ఆసరోవరము భారత వర్షమునఁ దపోనిరతులకుఁ బ్రధానస్థలమై యొప్పుచుండునది గాని సామాన్యకమలాకరముగాదని యెఱుంగఁదగు. ఆసరస్సు

నే మహాత్ములు పుష్కరతీర్థమని పిలుతురు. రాజ్యభ్రష్టుండై యింద్రుం డరుగుట యెఱింగి హరిభక్తుం డగునహుషుం డాసు రరాజ్యమును బాలింపఁబోయెను. స్వర్గరాజ్యము నాక్రమించి సంతానహీనురాలయియున్న శచీదేవింజూచెను. ఆదేవి యొక నాఁడుమందాకినీపావనపయస్సులస్నాన మొనరింపఁబోవుచువిధి వశమున నహుషుని కంటఁబడెను. తద్దర్శనమున నహుషునిహృ దయము కంపించెను. ఆశచీదేవి నవయౌవనస్ఫురణముగలది. కోమలాంగి. సౌందర్యవిభూషిత. మహాసాధ్వియునగు. నహు షుండాత్మనిగ్రహములేనివాఁడు గాన మూర్ఛిల్లెను. కాముఁ డాతని నెత్తికెక్కెను. వెంటనే నహుషుం డామె పురోభాగ మున నిలిచి దాసునివలె వినీతుండై యిట్లు తలంచెను.

సుందరీ ! నలువయూహ యెఱుంగ శక్యముకాదు. అది విచిత్రతమము. సజ్జనులుగూడ దాని నెఱుంగఁజాలరు. పరనారిగా నీమె నేల సృజించెను ? పరపత్నులయందు నిట్టి కాంతారత్నముండిన నియమము దాఁటకుండ శక్య మెట్లగును? ఈయన్నులమిన్నముందఱ రంభ యేపాటి ? ఊర్వశి యెంత ? తిలోత్తమయన నేమిసుందరి ? మేనాప్రభృతి కాంతాతిలకము లెందఱైన నీమెసౌందర్యమునఁ బదాఱవభాగమునకు సరివ త్తురా ? ఎంతమంధబుద్ధిగలవాఁడైన నిట్టియందముల నింపొంద జేయు మందయానం జూచి ముందడుగుపెట్టఁగలఁడా. నాభా ర్యలందఱు నీమెకడ దాసీతుల్యలుకాని వేఱుకాదు. ఇది సత్యము. అని యూహించి పట్టరానితమిపెల్లిదంబున నామెతో

నో? సరసిజాక్షీ! నను మంగీకరింపుము. ఈకింకరుని యెడఁ గరుణ యుంచుము. గోలోకమున నెట్లు రాధాదేవి శ్రీకృష్ణవక్షఃస్థలమున రాజిల్లునో, శ్రీనారాయణమూర్తి యురఃస్థలమున మహాలక్ష్మి భాసిల్లునో, బ్రహ్మలోకమున వాగ్దేవి పరమేష్ఠికడ విరాజిల్లునో, ధర్మునివక్షస్థలమున మహాసాధ్వి యగు మూర్తి దేవి యలరారునో, అనంతునిహృదయమునఁ బాతాలలక్ష్మి యెట్లు చెలువారునో, గణనాథునియందుఁ బుష్టి యనఁబరఁగు వనితారత్నము చెన్నారునో, కుమారునికడ దేవసేన వెలయుచుండునో, వరుణు నంకమున వరుణాని వఱలుచుండునో, హుతాశనునిచెంత స్వాహావధూమణి విలసిల్లుచుండునో, కామదేవు నంసతలమున రతీదేవి సంతోషమున నుండునో, సూర్యునిదగ్గర సంజ్ఞాదేవి ప్రకాశించుచుండునో, వాయువునంతరమున వాయుపత్ని యొప్పారుచుండునో, శీతాంశునిసన్నిధియందు రోహిణీ మనోహరాంగి సంతోషాంబుధి నోలలాడుచుండునో, దేవమాతయగు నదితి నీమాయగు కశ్యపునిసన్నిధిని బ్రీతిపాత్ర యగుచుండునో, హిమాలయమూర్ధమున మేనాకాంతామతల్లి యుల్లసిల్లుచుండునో, అగస్త్యమహర్షినికటమున లోపాముద్రాదేవి యెట్లుల్లసిల్లుచుండునో, బృహస్పతిపరిసరమునఁ దారాదేవి యెట్లుండునో, కర్దమముని యంతికమున దేవహూతి యమరి యెట్లుండునో, వసిష్ఠమునికడ నరుంధతి యలరుచుండునో, మనువు సవిధి శతరూప వెలసియుండునో, నలభూజానిసమీపమున దమయంతి చెన్నుమీఱుచుండునో, యట్లు

నీవు నావశమున నొప్పుచుండుము. బాహువిలాసమున నూఱు గురనింద్రులనైన జయింపఁజాలువాఁడను. త్రిలోకాధిపతిని. నారిమణి తనభర్తకంటె బలవత్తరుఁడగు జారుని వాంఛించును.. మేరుభూధరమున దుర్గమమగు రహస్థ్సలమున్నదని వినఁబడిన నచటికే పోవఁగోరును. మలయపర్వతమునందునుఁ జందనగంధ వహుఁడు మెల్లనవీచు మనోహరస్థలమునందుఁగాని, నందన వనమునఁగాని, శతశృంగపర్వతమునఁగాని, పుష్పభద్రానదీతీర మునందుఁగాని, గోదావరీమనోహారినదీనీర నికటమునఁగాని, చంపావతీనదీప్రాంతమునఁగాని, ఇంకను బెక్కునదీనదములయం దుఁగాని, ప్రతిపర్వతమునందుఁగాని, ప్రతికందరమునందుఁ గాని, ప్రతిద్వీపమందుఁగాని, సర్వజంతువివర్జితనదీపులినతలం బులఁగాని, విదగ్ధయగు కాంతామణి విదగ్ధపురుషునితోఁ గల యఁగోరుట సహజము.

శచీకాంతారత్నమా! పుష్పచందనపంకసంకులశయ్యల యందు ననుంగూడి విహరింపుము. పరమేష్ఠి వరప్రభావమున జరామృత్యువులులేక యలరు నన్ను భర్తనుగాఁ గాంక్షించి యంగీకరింపుము. నావంటియందగానిని నిన్ను వేఁడుచున్న వానిని ద్రిజగత్పతిని వదలుట మంచిదిగాదు. నాకెప్పుడును బరకాంతలయం దాశపొడముటలేదు. ఇపుడు నిన్నుంజూడఁ గనే స్పృహగలిగినది. రత్నభూషణభూషితలగు భార్యల వద లెదను. నీ వాపనివలదన్న వారినెల్ల నీకు దాసికలనుగా నొన రింతును. వరుణుఁడిచ్చిన రత్నేంద్రమాలికను నీకొసంగెదను.

మున్ను బ్రహ్మాస్త్రప్రభావమున వరుణు నోడించి యీరత్నసార హారమును గైకొంటిని. హవ్యవహుని జయించి వస్త్రయుగ్మ మును సంపాదించితిని. అది యమూల్యమని నమ్ముమా. ఈ రెంటి నిపుడే సమర్పించి కృతకృత్యుండ నయ్యెద. నన్ను ననుగ్రహా మునఁ జూడుము. ఇంతియగాక దేవతల నోడించి యదితిమకర కుండలముల సంపాదించితిని. కరకంకణయుగళమమూల్యమును సమార్జించితిని. అది రోహిణీచంద్రుల శ్రీతిలఁజేసి సంపాదించి తిని. వాని నిచ్చెద. యుద్ధమున భీతుఁడనుగాను. కాని నినుం గాంచి భయంపడితిని. కావున నన్నాదరింపుము. సర్వసంపదల నొసంగఁజాలు కేయూరములను సమాదృతి నిచ్చెదను. రత్న దర్పణము నిచ్చెదను. అది కామపత్నిని గామునిభీతి నొందించి తెచ్చితినిజుమీ. శ్రీలక్ష్మీదేవి నాతపంబున కలరి వాడిపోక మనోహరముగ నొప్పుపంకజము నాకనుగ్రహించెను. దాని నిచ్చెదను. అంగుళీయకరత్నముల సావిత్రీదేవి నారాధించి సంపాదించితిని. అవి ప్రపంచమున నిఁక నొరకునవి కావు. వానినిగూడ సమర్పించుకొనియెదను. శారదాదేవి వాయించి యానందించువిపంచికను నాజననిం బ్రార్థించి యెట్లో తెచ్చి యిచ్చెదను. తల్లాభమునకై నారాయణవ్రతము నాచరించి దను. విశ్వకర్మ నిర్మించినరత్నరాశి నిచ్చెదను. కుబేరపత్ని ధరించు పాదుకాంగుళిరత్నకదంబము నొసఁగెదను. అని పలు కుచు శచీదేవి పాదయుగళముపైఁబడి ప్రార్థించెను.

రాజమార్గమునఁ దనప్రాభవ మెఱుఁగక దీనుఁడై పల్కు నహుషునిం గాంచి భీతయై యాతని లేవ ననుజ్ఞయిడి కంఠమెండఁగా నిట్లు న్యాయసమ్మతముగాఁ బలికెను. అత్తటి నాసాధ్వీమణి చిత్తము భర్తృపాదారవిందద్వంద్వముపైఁ బరఁగుచుండెను. వత్సా! మహారాజా! తండ్రీ! నామాట నాలకింపుము. నీవు జగములకుఁగలుగు భయమును బోఁగొట్టు వాఁడవు. ఆర్తత్రాణపరాయణుఁడవు. ముల్లోకములను బాలించు వాఁడవు. జనులకుఁ దండ్రివి. నాభర్త స్వర్గరాజ్యలక్ష్మినిఁ బోఁగొట్టుకొనెను. ఆపదవికి నీవువచ్చితివి. ప్రభువు ప్రజలకుఁ దండ్రి, రక్షకుఁడు, గురుపత్నియు, రాజపత్నియు, దేవపత్నియుఁ గొమరితయుఁ, బితృస్వసయు, శిష్యపత్నియు, భృత్యపత్నియు, మాతులియుఁ, బితరులపత్నులు, భ్రాతృపత్నులు, భగినియుఁ, గోడలు, గర్భధాత్రియు, నిష్టదేవియు ననునీపదాఱుగురు తల్లు లని చెప్పఁబడుదురు.

ఇంతియకాక నీవు మనుష్యుఁడవు నేను దేవభార్యను. కాని నీకు నేఁదల్లిని. నన్ను నీవు దేవతవలెఁ జూడఁదగుదువు. నహుషా! నీవువలచిన మీతల్లి నదితికడకుంబోయి ప్రేమిం పుము. ఎల్లపాతకులకుఁ బ్రాయశ్చిత్తముకలదుగాని మాతృగా మికిఁ బ్రాయశ్చిత్తములేదు. అట్టి మహాపాతకుఁడు కుంభీపాక మునఁబడి మరలఁజాలఁడు. అందున్న పురుఁగులు వానియవ యవములఁబట్టి భక్షించుచుండును. ఎన్నియోకల్పములుండి మరలఁ బుట్టువుఁగాంచుచో మ్లేచ్ఛుఁడైపుట్టి కుష్ఠురోగబాధ

తుఁడై. సప్తజన్మము లాబాధ ననుభవించును. ఇది బ్రహ్మ వచించినమాట. ఇట్లే క్షత్రియవైశ్యశూద్రులకు బ్రాహ్మణపత్నీసంగమమునఁ బాపఫలము గలుగఁగలదని యెఱుంగుము. అంగిరసుఁడీపాతకులకు వేదోక్తమగు నిష్కృతిలేదనియె. సంసారులకు స్వర్గసంపత్తిభోగమే పరమమని తలంపఁ బడుచుండును. ముముక్షువులకు ముక్తియే పరమము. తపోనిరతులకుఁ దపస్సే పరమసుఖము. బ్రాహ్మణులకు బ్రాహ్మణ్యము, మునులకు మౌనము, వైదికులకు వేదాభ్యాసము, కవులకుఁ గావ్యవర్ణనము, వైష్ణవులకు విష్ణుదాస్యము నివి పరమసుఖములుగాఁ బరికీర్తితములు. విష్ణుభక్తులు భగవద్దాస్యమునువదలి ముక్తినింగూడఁ గోరరు. మలభూయిష్ఠములై దుఃఖప్రదములునగు స్త్రీలయంగములను గాంచి ప్రమాదము నొందనేల? రాజాధిరాజులవంశమునఁ బుట్టితివి. అందును బరమపవిత్రమగుభారతవర్షమునఁ బుట్టుకం గాంచితివి. బహుజన్మసుకృతఫలముగా భారతవర్షమునఁ బుట్టుక కల్గును. చంద్రవంశ్యపద్మములకు దీప్తిగల్గించుటకై తేజస్వివగు నీవు గ్రీష్మమధ్యాహ్నభాస్కరునివలెఁ బుట్టితివి. సర్వాశ్రమములకు స్వధర్మముత్తమోత్తమము. స్వధర్మహీనులు నరకమునఁబడుదురు.

## వర్ణధర్మములు.

బ్రాహ్మణులకు స్వధర్మము సంధ్యాత్రయకృత్యము శ్రీహరిపూజయు విధినియతములు. తత్పాదోదకనైవేద్యభక్షణము సుధాధికము. హరినైవేద్యముకానియన్నము మలము. హరి నభి

షేకింపనిజలము మూత్రము. అట్టివానిని భజించువిప్రులు సూకరరూపములఁ బుట్టుదురు. ఏకాదశియం దుపవసించినచో ఆజీవ ముపవసించినపుణ్యము కల్గును. శ్రీకృష్ణజన్మదినమందును శివరాత్రియందు నుపవసించినచోఁ బూర్వోక్తఫలము కల్గును. శ్రీరామనవమియందు నట్లే. ఇది బ్రాహ్మణులముఖ్యధర్మమని బ్రహ్మ తెల్పెను. పతివ్రతలకుఁ బతిసేవయే వ్రతము. అదియే తపస్సు. పరపతి పుత్త్రతుల్యుఁడు. ఇది పరమధర్మము. రాజులు ప్రజలను దమపుత్త్రులవలెఁ బాలింతురు. ఇతరులపత్నులను దమ తల్లులవలె గారవింతురు. విష్ణుయజ్ఞ మనఁగా దేవవిప్రసేవయే. దుష్టులను బాఱఁదోలుట, శిష్టులఁ బాలించుట యనునవి రాజులకుఁ బరమధర్మములు. ఇవి క్షత్త్రియధర్మములని పరమేష్ఠి శాసించెను. వైశ్యులకు వాణిజ్యము ధర్మసారము. శూద్రులకుఁ బెద్దలసేవ పరమధర్మము. భగవంతునియందు సర్వస్వము నర్పించుట సన్న్యాసులకుఁ బరమధర్మము. రక్తైకవాసస్సుదాల్చి మృత్కమండలువును జేతఁబట్టుకొని సర్వత్ర సమదర్శనుఁడై నారాయణుని స్మరించుచుండవలయును. ఒక్కయింటనుండక తిరుగుచుండవలయును. ధనలోభమున విద్యామంత్రములనొరులకుఁ జెప్పఁజనదు. ఆశ్రమమును గల్పించుకొనక మఱియొక విషయమున మదిఁజొనుపక పరసంగతి మాని నిర్మోహుఁడై స్వాద్వాహారమును భుజింపఁదలంపుగొనక ఆసక్తిచే స్త్రీముఖమును జూడక యేపదార్థమునుగాని తినవాంఛింపక గృహస్థులయిండ్లకు భిక్షార్థముపోఁదగు. ఇది సన్న్యాసులకు ధర్మమని కమలోద్భవుఁ డాజ్ఞాపించెను.

వత్సా! ధర్మపద్ధతులఁ దెల్పితిని. కాన నిష్టముకోలఁదిని బొమ్ము అనిపలికి శచీదేవి యూరకుండెను. నహుషుఁడు కంఠముఁ నుద్రిప్పి శచీదేవితో నిట్లుపలికెను. దేవీ! నీవుచెప్పినదంతయు విపరీతధర్మకథనము. సత్యమగుధర్మమును వేదప్రతిపాదితముగానేను వచియించెదను. ఆలకింపుము. సర్వకర్మఫలభోగము స్వర్గమందని పాతాళమందనికాని వేదములయందుఁ జెప్పఁబడ లేదు. పరమపవిత్రమగుభారతవర్షమునఁ బుణ్యకర్మము లొనరించి తత్ఫలము వేఱొకతావున ననుభవించును. ఇది కర్మరుల కర్మఫలము. హిమాలయముమొదలు సముద్రపర్యంతభూభాగము భారతవర్ష మనంబడును. సర్వభూభాగోత్తమము. ఇది తపస్వులకుఁ దపోయోగ్యస్థలము అందుఁ బుట్టువునుగాంచినవారు కొందఱు విష్ణుమాయచే వంచింపఁబడుచుందురు. హరిసేవ మాని యితరవిషయములఁ బ్రవర్తింతురు. ఆభారతవర్షమున గొప్పపుణ్యము లొనరించి స్వర్గలోకమును జేరుదురు. ఇందలి వనితలం గైకొని చిరకాలసుఖ మనుభవింతురు. మానవతనువును వదలిసురపురికేతెంచును. నేనట్లుగాకమానవతనువునుధరించియే యిటఁజేరితిని. నాపుణ్య మెట్టిదో యోజింపుము. అనేకజన్మసుకృతఫలముగానిచ్చటికివచ్చితిని. కావున నేపుణ్యవిశేషముననో నీవు నాకంటఁబడితివి. ఇంతీ! ఇది కర్మస్థలముకాదు. స్వర్భోగస్థలము. భోగస్థలమునందు భోగాభిలాషముగలవారి గాంచి త్యజించుట నీతిగాదు. భావానురక్తవు. రసికురాలవు. భోగులకు భోగ్యురాలవు. అస్వామికద్రవ్యమును భోగ్యమై సుఖప్రదమే యైన మందమతితప్పఁ దక్కినవాఁడు విడువఁడు. అవిరోధసుఖ

త్యాగి పశుతుల్యుఁడనుటకు శంకలులేవు. కాంతామణీ! ఇఁక నాయింటికిరమ్ము, మనోహరతల్పము నిర్మింపుము. రసికుఁడగు వరుని నన్నుఁగా భావింపుము.మనమున వైధ్వమును నెలకొల్పా కుము. నిరుపమానమందిరముల నన్నానందింపఁజేయుము. నాకుం గల సకలామూల్యవస్తువుల నీస్వాధీనముచేసెదనని నహుషుఁ డార్తుఁడై మార్గము నడ్డగించి పలికెను. పిదపఁ బాదము లపైఁబడి వేఁడెను.

పులోమజాతయు నహుషుని ప్రలాపముల నాలకించి తనభర్తను మరల మరల స్మరించుచు నిట్లు పలికెను. అచేత నుఁడై మూఢుఁడై కార్యాకార్యముల నెఱుఁగకయుండు కామాతురుని బహువిధములఁ గనఁబడుకథను వినఁజాలితిని. మధుమత్తుఁడు సురామత్తుఁడు కామమత్తుఁడు ననువీరు బుద్ధిలే నివారు. అందుఁ గాముకుఁడు మృత్యువును లెక్కింపఁడు. కామ మాతనిమనసును హరించుటయే యందులకుం గారణము. మత్తుఁడా! నన్ను వదలుము. నేనీకుఁ దల్లిని. రజస్వలను. నేఁడు ఋతుదినములలోఁ దొలిదినము. తొలిదినమున స్త్రీచండాలీ తుల్యురాలగును. రెండవదినమున మ్లేచ్ఛయనంబడు. మూఁడవ దినమున రజకీతుల్య యనంబడు. నాల్గవదినమున భర్తృవిషయ మునఁబరిశుద్ధురాలగుంగాని దైవపైత్రృకకార్యముల కపరిశుద్ధు రాలే యనంజను. ఇతరకార్యవిషయమున నాల్గవదినమున నస చ్ఛూద్రీసమానురాలని యెఱుంగవలయు. తొలిదినమున రజ స్వల నెవ్వఁడు కామించునో బ్రహ్మహత్యాచతుర్థాంశపాప

మాతనికిం గల్గును. అంతియగాక వాఁడు కర్మార్హుఁడుగాఁ బరిగ ణింపఁబడఁడు. వాఁ డధముఁడని, అయశస్కరుఁడని నిందింపఁ బడుచుండును. రెండవదినమున రజస్వలనుగోరిన యాకామా ర్తుఁడు గోహత్యాపాపమును బొందు సంశయము లేదు. వాఁడు దేవపితృకార్యములయందు బ్రదికియుండునంతదాఁక నధికారి కాఁడు. అంతియగాక వాఁడు మనుష్యగణనలోఁ జేరక యశస్సు పోఁగొట్టుకొనునని యాంగిరసుఁడు శాసించెను. మూఁడవదిన మున రజస్వలయగు భార్యను గామించువాఁడు భ్రూణహత్యను బొందును. గోహత్యాపాపమునకుఁ గలఫలము లెందును గలవు. నాల్గవదినమున వనిత యసచ్ఛూద్ర యనంబడు అట్టి సుదతిని గోరరాదు.

మూర్ఖుఁడా! నీకుఁ దల్లినగునన్ను బలముచే గ్రహింప నెంచితివి. ఋతుకాలదివసములు నాలు గతిక్రమించినపిదప గ్రహింతువుగాక. అని శచీదేవి పలుక నహుషుఁడు నవ్వి సువ్ర తయగు శక్రపత్నిం జూచి మధురభంగి నిట్లు పలికెను. దేవపత్ని సదా పరిశుద్ధురాలు. ఆన్యూనత మనుష్యపత్నివిషయమై వర్తిం చును. శయనమందు భోజనమందును దేవవనిత మానవదృష్టిచేఁ బరిశుద్ధురాలే యనఁదగు. రజస్వలాగమనము కర్మక్షేత్రమగు భారతవర్షమునందే పాపప్రదము. నీచెప్పినపాప మీస్వర్గలోక మునలేదు. కర్మక్షేత్రమగు భారతవర్షమునందును వేదోక్త కర్మము బ్రహ్మతేజస్సుచేఁ బ్రజ్వలించువిష్ణుభక్తులకు నస్వాయిం పదు. ప్రదీప్తాగ్నియందు శుష్కేంధనములు దహింపఁబడునట్లు

సకలపాపములు విష్ణుభక్తునియందు భస్మములగును. వహ్నిసూర్యవిప్రులకంటె విష్ణుభక్తుఁడు తేజోవంతుఁడగు. ఆతని విష్ణుచక్రము కాపాడుచుండును. వాఁడు స్వతంత్రుఁడగు. ఎట్టిపాపకర్మముల నతఁడొనరించియున్నను వానికి ఫలము గలుగదు. సామవేదమునందుఁ గౌథుమియనుభాగమునం దీవిషయము వ్రాయఁబడినది. సత్యముగునా కాదా యని బృహస్పతి నడుగుము.

చంద్రవంశ్యులమగు మేమెల్ల వైష్ణవులమని యందఱెఱుంగుదురు. చంద్రవంశ్యులగు రాజులు హరిని వదలి యితరదేవత నారాధింపరు. సద్వంశప్రభవుఁడు బ్రాహ్మణుఁడుగాని క్షత్రియుఁడుగాని దైవమాయావంచితుఁడైనచో విష్ణుమంత్రమును గ్రహింపక మానునుగాని లేకున్న మానఁడు. నన్ను శాసించువాఁడెవ్వఁడు? ఏ మంత్రము? ఏ దేవత? యముఁడుకూడ నన్ను దండింపఁజాలఁడు. ఎల్లరనుదండింప శక్తుఁడును జుమీ. త్రిమూర్తులుతప్ప నాశిక్షకులోఁబడనివాఁడు వేఱొకఁడు కానరాఁడు. కావున నోపౌలోమీ! ఇంటికింబోయి శయ్యను రచింపుము. నేనును వేగంబ నీయింటికిం జనుదెంతు. ఋతుమతీగమనపాపము నాకువచ్చిన రానిమ్ము. దాన నీకేమి? అనిపలికి యానహుషుఁడు ప్రఫుల్లవదనేక్షణుండై రత్నయానము నెక్కి నందనవనమునకుం బోయెను.

శచీదేవియు దుఃఖితయై స్వమందిరమునకుంబోవక బృహస్పతియింటికింబోయెను. కుశాసనమున నాసీనుఁడైయున్న బృహ

ప్పతిం గాంచి పాదార్చనాసక్తమతియగు తారాంబనుజూచి బ్రహ్మతేజస్సుచేఁ బ్రజ్వరిల్లుచుండుసురగురుమహత్త్వమున కచ్చెరుపడి శ్రీకృష్ణమంత్రజపనిరతుఁడై యక్షమాల కరమున నొప్పార నిరుపమానమాహాత్మ్యమున వెలయుచుఁ బరమానంద స్వరూపుఁడై సనాతనుఁడై నిర్గుణుఁడై నిరీహుఁడై స్వతంత్రుఁడై ప్రకృతికంటెఁ బరుండై స్వేచ్ఛామయుండై భక్తానుగ్రహవిగ్రహుఁడై జగదీశ్వరుండై తనరు శ్రీకృష్ణునిధ్యానించుచునున్నయాగురువును సమీపించి తత్పాదములకుఁ దలసోఁక మ్రొక్కి సాశ్రునేత్రయై విలపించుచు. భక్తిసాగరమున నిమగ్నయగుచు శోకసాగరమును దరించునుపాయము నన్వేషించుచు, హృదయమునఁ బరితపించుచు, భీతయై యాగురువును వినుతించెను. తనయార్తి నీరీతిగాఁ దెలుపుకొనెను.

## గురుప్రభావము.

మహాత్మా! రక్షింపుము. రక్షింపుము. శరణాగతురాలను. సాధ్వసప్రచలితహృదయను. నాకు నీవేదిక్కు. ప్రభువవు. నీదాసికను. శోకసాగరనిమగ్నను. ప్రభుత్వములేకపోనీ, అది యుండనీ, బలవంతుఁడుకానీ, దుర్బలుఁడుగానీ, ఇంద్రుఁడు నీకు శిష్యుఁడు. నేనింద్రపత్నిని. నాపుత్త్రులను నన్ను శాసించు నధికారము మీకుఁగలదు తమశిష్యుఁడు. స్వర్గరాజ్యమునువదలి చాలదూరదేశమున నున్నవాఁడు. ఆదోషమునకు శాంతి కల్గెను. ఇఁక నను గ్రహింపుము. అనాథనై సర్వశూన్యనగు నన్నును, శూన్యముగాఁ దోఁచునమరావతిని, సంపచ్ఛూన్య

మగునామందిరమునుగృపచే రక్షింపుము. శత్రుగ్రస్తనైతిని.ఇట్టి నన్నీయాపత్తునుబాపి కాపాడుము. నీశిష్యుని బిలువఁబంపుము. నీపాదసేవాపుణ్యముగలుగఁజేసి శుభాశీషములఁ బ్రసాదించి. రక్షింపుము. * జన్మదాతయగు తండ్రి యందఱికంటె నధికుఁడు. తండ్రికంటెను దల్లి నూఱుగుణము లధికురాలు. పూజ్యురాలు. విద్యాదాతయు మంత్రోపదేశకుఁడు జ్ఞానబోధకుఁడు, హరిభక్తిని గల్గించి కాపాడువాఁడును వీరెల్లఁ దల్లికంటె శత గుణంబులచే నధికులు.మంత్రాద్యుద్ధిరణమున నే గురువని చెప్పఁబడును. అజ్ఞానతిమిరాంధునకు జ్ఞానాంజనశలాకచే నేత్రము నెత్తి చూపుగల్గునట్లు చేయునట్టిగురువునకు నమస్కారము. అదీక్షితుఁడగుమూర్ఖునకు నిష్కృతియే లేదు. ఇది నిశ్చితము. అట్టివాఁడు సర్వకర్మానర్హుఁడై పశుతుల్యుఁడై నరకమునఁబడును. తండ్రియు నన్నదాతయుఁ దల్లియు నితరగురువులును ఘోర సంసారసాగరమును దరింపఁజేయఁజాలరు. విద్యామంత్ర జ్ఞానదాతయగు గురువు సంసారసాగరతరణమునందు నిపుణుఁడు. ఆగురువే శిష్యు నుద్ధరించుటకు నీశ్వరుఁడు. గురువు విష్ణువు, గురువు బ్రహ్మ, గురువు మహేశ్వరుఁడు, గురువు ధర్మము, గురు వనంతుఁడు. సర్వాత్మయు నిర్గుణుఁడు నగుదైవము గురువే యగును. సర్వతీర్థాశ్రయుఁడు, సర్వదేవాశ్ర

* సర్వేషాం చ గురూణాం చ జన్మదాతా పరోగురుః, పితుశ్శతగుణా మాతా పూజ్యా వంద్యా గరీయసీ. విద్యాదాతా మంత్రదాతా జ్ఞానదో హరిభక్తిదః, పూజ్యో వంద్యశ్చ సేవ్యశ్చ మాతుశ్శతగుణో గురుః. అని మూలము

యుఁడు. సర్వదేవస్వరూపుఁడు, గురురూపియగు శ్రీ హరియే. *అభీష్టదేవత యాగ్రహించిన గురువు కాపాడఁగలఁడు. గురువు రోషయుక్తుఁడగునేని రక్షించువా రింకెవ్వరును లేరు. సర్వగ్రహములు సర్వదేవతలు బ్రాహ్మణులు ద్వేషించినను నీవు రక్షింపఁగలవు. గురువు సర్వదేవమయుఁడుకదా. ఆత్మయు గురువుకంటెఁ బ్రియముకాదు. సుతుఁడును గురువుకంటెఁ బ్రియుఁడు కాఁడు. ధనముకూడఁ బ్రియముకాదు. భార్యయుఁ బ్రియురాలుకాదు. ధర్మము, తపము, సత్యము, పుష్పమును బ్రియములు కావు. గురువుకంటె శిక్షకుఁడు లేఁడు. బంధువు లేఁడు. తదధికుఁడు రాజు దైవము లేఁడు. శిష్యులకుఁ బరమగతి గురువేయని యెఱుంగవలయు. అన్నదాత యెంతదనుక నన్నమిడునో యంతదనుక శాసకుఁడగు. గురువు ప్రతిజన్మమునందును శిక్షింపనర్హుఁడగును. మంత్రము విద్యాగురువు దైవము పూర్వజన్మపుణ్యమువలననే దొరకుదురు. వనితకు భర్తయు నట్లే. ప్రతిజన్మమునందును బూర్వజన్మసంబంధముగలదు. పితయు మాతయు ఇతరగురువులు బ్రదికినంతదాఁక నమస్కరింపఁదగుదురు. గురువుమాత్రము ప్రతిజన్మమునందును నమస్కరింపఁదగినవాఁడే.

మహానుభావా! నీవు విప్రులలో శ్రేష్ఠుఁడవు. తపస్వులలో గరిష్ఠుఁడవు. బ్రహ్మవేత్తలలో బ్రహ్మిష్ఠుఁడవు. ధర్మాత్ములలో ధర్మిష్ఠుఁడవు. మహర్షీ! సంతుష్టుఁడవుకమ్ము. నన్ను నీత

* అభీష్టదేవే రుష్టే చ గురుశ్శక్తో హి రక్షితుం, గురౌ రుష్టే ఒభీష్టదేవో న హి శక్తశ్చ రక్షితుం. అని మూలము.

మఖుని రక్షింపుము. నీవు సంతుష్టుఁడవైన సర్వదేవతలు సర్వ గ్రహములు సంతుష్టములగును. అనిపలికి యాపౌలోమి బిట్టు రోదనముచేసెను. ఆరోదనమునువిని తారయు నుచ్చైర్విలాప ముచేసెను. అంతియగాక యాసాధ్వి భర్తృపాదములపైఁబడి శచీదేవి కష్టదశను దొలఁగింపుఁడని వేఁడెను. గురువును గరు ణాతరంగితాంతఃకరణుఁడై యపరాధమును క్షమించితినని తుష్టుఁడై బృహస్పతిచెప్పెను. తారా! లేలెమ్ము. శచీదేవికి సర్వ భద్రములు చేకూరఁగలవు. ఇపుడే మహేంద్రునిబడయఁగ లదు. అనిపలికి గురు వూరకుండెను. దానఁ దృప్తినొందక తార మరలఁ బాదములపైఁబడి విలపించెను. శచీదేవిని గౌఁగి లించుకొనెను. అధ్యాత్మరహస్యములఁ బెక్కింటి నుపదేశించెను.

శచి యొనరించిన యీగురుస్తోత్రము పూజాకాలమునఁ బఠింపఁదగినది. భగవంతుఁడు హృష్టుఁడగును. విష్ణుభక్తి దృఢ మగును. సకలాభీష్టములు ఫలించును. గురుభక్తి హీనునకే పుణ్యకార్యములును ఫలింపవు. మనస్సు పరిశుద్ధముకాదు. మనస్సు పరిశుద్ధముకాదేని యేమంత్రములు సిద్ధినొసంగఁజా లును? కావున గురుభక్తి ప్రప్రధానమైనది. దానిని మించి నది వేఱొక్కటిలేదని చెప్పఁగలను. కావున నియతుఁడై సదా యేమానవుఁడు గురుభక్తిసల్పునో వాని కన్నిమంత్రములు ఫలించును. దేవతలెల్లఁ బ్రీతులగుదురు. జ్ఞానము తనంతన లభిం చును. సర్వాభిలాషములు వేగంబ ఫలోన్ముఖములగు. సర్వేశ్వ రుఁడాభక్తునిం గాపాడుచుండును

మహామతులారా! ఈకథనుండి ప్రధానవిషయములు రెండు నేర్చుకొనవలసియుండును. మొదటిది గురుభక్తి, రెండవది యైశ్వర్యము గర్వమూలకారణమనునది. ఇవియే యారెండును. ఎట్టివారికైన నాపదలు రాకమానవు. అవి బుద్ధిపూర్వకమగుపాపమువలనఁ గలిగెనేని వానిని లోకులు నిందింతురు. ఈకథయందు నింద్రునకు దర్ప మేలకలిగెనో దానినేఫల మనుభవించెనో చెప్పఁబడినది. ఆదర్పముభగవంతుఁ డేరీతిఁగాపించెనో ముందు మీరెఱుంగఁగలరు. శచీదేవి నహుషునకుం దెల్పిననీతులు భారతవర్షపరమైశ్వర్యము లనఁదగినవి. స్త్రీలమర్యాదలే దేశౌన్నత్యమును దెలుపుచుండును. ఇక్కాలమున నవి మార్పునొందినవో తెలిసికొనవచ్చును. కావునఁ బైవానింగూర్చి విచారించుట న్యాయము.

### గురుభక్తినిగుఱించి

దేవతలు మంత్రనిబద్ధమతులు. మంత్రమనఁగా మనముచేయ రక్షించునది. మంత్రమున బీజవర్ణములుండును. అవి తద్దేవతాప్రీతికరములుగఁ గూర్పఁబడియుండును. ఈబీజవర్ణములభక్తిమై నుచ్చరించినంతఁ దదధిష్ఠానదేవత మనసుకదలును. దానిచే నాదేవత భూలోకమునఁ దన్నెవ్వఁడో యుపాసించుచున్నట్లు తెలిసికొనును. ఆమంత్రజపము తీవ్రమగు కొలఁదిని ఆదేవతాచిత్తము భక్తరక్షణకృత్యమునఁ ద్వరపడుచుండును. ఈభక్తునినుండి యాదేవతయందు తావువఱకు నొకయదృశ్యపాశముగలదు. ఏదే నొకనూలుచే నిర్మింపఁబడినదార మది కాదు.

తేజోరూపమున నవియుండును. ఆ తేజస్సే భగవత్కళ. కాఁబట్టి మంత్రజపమునఁ దదధిష్ఠానదేవత ప్రసన్నుఁడగును. ఉపాసకుఁడు దృఢమతికాఁడేని యాజపము దేవత నాకర్షింపఁజాలఁడు. ఎంతకాలము జపముసల్పినను ఫలింపదు. జపమునకుఁ బ్రధానము దృఢబుద్ధి. అనఁగా నిశ్చలబుద్ధియని భావము. అట్టిదృఢబుద్ధిని గల్గునట్లు చేయునది మంత్రప్రభావము. అది గుర్వాధీనము. దేవతాసాక్షాత్కారమునకు నిశ్చలచిత్తముగల్గుటకు ముఖ్యకారణభూతుఁడు గురువని తేలినది. మూలము నశించిన వృక్షశాఖలన్నియు నశించునట్లు గురుభక్తితగ్గిన నన్నియు నశించును. అదియున్న నన్నియు ననుకూలము లేయగు చిత్తశుద్ధికి యోగాభ్యాసము ప్రధానమనుట నిర్వివాదము. ఆయభ్యాసము గల్గఁజేయువాఁడు గురువు. అట్టిగురువునందేమాత్రము భక్తితగ్గినను జపాదినియమములు నిష్ఫలములగును. కులార్ణవతంత్రమందు,

శ్లో. యదృచ్ఛాలాభసంతుష్టో గుణదోషవిభేదకః,
ఇత్యాది లక్షణోపేతశ్శ్రీగురుః కథితః ప్రియే.
శ్రీబీజాద్యం యదా జప్యాత్తదా లక్ష్మీరచంచలా,
కామాద్యం జపనాదేవ సర్వలోకం వశం నయేత్.
గురుం వినా మంత్రజపే దోషశ్శ్రవణ ఏవ చ,
అత్రినేత్రశ్శివస్సాక్షాదచతుర్బాహురచ్యుతః.
అచతుర్వదనో బ్రహ్మా శ్రీగురుః కథితః ప్రియే.
జిహ్వా దగ్ధా పరాన్నేన కరౌ దగ్ధౌ ప్రతిగ్రహాత్,

మనోదగ్ధంపరస్త్రీభిః కథంసిద్ధిర్వరాననే. నారదీయసంహితా.
ఇట్లు గురులక్షణములు చెప్పఁబడినవి. జపము ఫలింపకుండు టకుఁ బరాన్నము ద్రవ్యప్రతిగ్రహము పరస్త్రీవాంఛయను నీమూఁడును గారణములుగా సిద్ధాంతము చేయఁబడినవి. గురువు మూఁడవకన్నులేని యీశ్వరుఁడని, చతుర్భుజుఁడు మాత్రముకాని మాధవుఁడని, చతుర్వదనములులేని బ్రహ్మ యని వర్ణింపఁబడినది. అనఁగాఁ ద్రిమూర్తితుల్యుఁడని భావము గ్రహింపఁదగునని హెచ్చరింపఁబడినది. ఇట్టిభావ మేలయనఁగా గురుభక్తి తపస్సిద్ధిమూలకందముగాన దానిని పెటఁబుచ్చిన సన్నియు నశించునని తేటపడునట్లు చెప్పఁబడినది. ఇన్నివిధముల గురుస్తుతి చేయఁబడియుండుటచేతనే శ్రీశంకరభగవత్పాదా చార్యులుగూడ "నాద్వైతంగురుసన్నిధౌ" అని తెల్పిరి. అద్వైతము గురువువిషయమున భావించిన నుపదేశక్రమమే నశించు నని వారెఱుంగుదురు. కాఁబట్టి గురుభక్తి ప్రప్రధానమని యెఱుంగవలయు.

దేవత ద్వేషించినచో గురువు కాపాడుననఁగా భావ మేమి ? మంత్రము జపించునియమములవదలి యిచ్ఛానుసారము జపించుచుఁ దగనికోరికలఁ గోరునపుడు మంత్రాధిదైవ మా యుపాసకున కనభిముఖుఁడగును. అట్టితఱి నుపాసకునకు భీకర రూపము లగపడును. అప్పుడు గురువు మఱుఁగుచొరఁగా నా దేశికుఁడు నియమములనుదెల్పి యాబాధలుకలుగకుండఁజేయు ను. గురుభక్తియే లేనిచో నధోగతియేగాక యూర్ధ్వగతి యెట్లు

వచ్చును. ఇట్లెన్నివిధముల నాలోచించినను గురుభక్తి సర్వార్థమూలమనియు, నదిలేకుంట సర్వానర్థమూలమనియుఁ దేలుచున్నది.

## ఐశ్వర్యము గర్వకారణము.

ఎన్నిజ్ఞానముకలవాఁడైనను ధనరాశి చేకూరినచో గర్వముదయింపకమానదు. దానిని బూర్వజన్మసుకృతవిశేషముగలవాఁడు క్రమక్రమముగా నాపుకొనును. అదిలేనివాఁడు దానికి లోఁబడి నశించును. దేవేంద్రుఁ డెన్నియోవిధముల గురుభక్తి నెఱుంగును. ఐనను దిరస్కరించెను. దానఁ బదభ్రష్టుఁడాయెను. శాంతధనుఁడై శతాశ్వమేధము లొనరించి తపశ్శాలియునగు నహుషు నింద్రపదవికిం దగినవాఁడని దేవతలు ప్రార్థించిరి. అట్టివాఁడు త్రిజగచ్ఛ్రీమాధురంధరుఁడైనంతన కన్నుమిన్నుగానక మహాపతివ్రతాశిరోమణియగు శచీదేవిం గాంచినంతనే తన్ను వరింపుమని కోరెను. అంతతోనుండక తనప్రతాపములు వేనోళ్లఁ బొగడెను. ఈ రెండుదృష్టాంతములనుబట్టి యూహించిన నైశ్వర్యము గర్వజనకమని స్పష్టముగాకమానదు. ఈ విషయమే శ్రీమద్భాగవతమునందు,

> అసతశ్శ్రీమదాంధస్య దారిద్ర్యం పరమాంజనమ్,
> ఆత్మౌపమ్యేన భూతాని దరిద్రః పరమీక్షతే.
>
> ౧౧ స్కం. ౧౦ అ. ౧౩ శ్లో.

అని చెప్పఁబడినది. దీనికే,

శా. సంపన్నుం డొరుఁ గాన లేఁడుతనవుక్ సంసారముక్ నమ్మి హిం
సింపం జూచుదరిద్రుఁ డెత్తువడిశుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకుక్ సములుగాఁ జింతించు నట్లౌట నీ
సంపన్నాంధున కంజనంబువినుమీ దారిద్ర్యమూహింపఁగన్.

అని పోతనమహాకవి వ్రాసెను.

ఇన్ని క్రతువులుచేసి పెద్దలసేవించి మహర్షులతో సదాసంభా షించుచునుండుపై యిర్వురకేగర్వముపొడసూపఁగా నిఁకసామా న్యులు ధనమదాంధులగుట యొకవిచిత్రమా? కాఁబట్టి ఐశ్వ ర్యము గర్వకారణమనుట విస్పష్టము. శచీనహుషసంవాదము నుగుఱించి యీ పటకే పెక్కుపర్యాయములు వ్రాసితిని గాన మరలఁ బతివ్రతామహిమమును విశేషించి వ్రాయఁదలంపను. ఋతుకాలదినములు నాలుగుగడచినపిదపఁ బరిగ్రహింతువుగాక యని పలికెను. దీనిచే నామె యసత్యమాడినట్లుగాని, లేదా తానంగీకరించినట్లుగాని భావముకాదా యన్నప్రశ్నమునకు నాలుగుమాటలు వ్రాయవలయును. శచీదేవిభావ మది కాదు. ఈ నాల్గవదినమునకు వీఁడు బుద్ధిమంతుఁడై పెద్దలనడిగి యీ ప్ర యత్నము మానెనా బ్రదుకును. లేకయున్న నాఁడే శపించి నశించునట్లు చేయుదునుగాక యనియే యని గ్రహింపవలయును. ఎట్టిజెట్టినైన శాపాగ్నిజ్వాలల మండఁజేయఁగలనన్న మనోధైర్య మా యింద్రపత్నికిం గలదు. కాని తపోభంగముచేయుట పాడి గాదని యెంచి వేఱొకయుపాయమున్నదాని ననుసరించుట మేలని భావించియే గురుగృహమునకుంబోయెనని యూహింప

వలయు. ఇదియే యిటఁ జెప్పఁదగినది. ఇఁకఁ దరువాతికథ నాల కింపుఁడు.

## గురుకరుణచే నింద్రుఁడు స్వపదము నధిష్ఠించుట.

* ఇంద్రపత్నియగు శచీదేవి తన్ను నుతింప విని బృహస్పతి పరితుష్టాంతరంగుఁడై యిట్లు పలికెను. పుత్రికా! భయము వదలుము. నేనుండునంతదనుక నీకు భయముగల్గుట కల్లఁ కచునిపత్ని యెట్టిదో నీవు నట్టిదానవు. కొడుకెట్లో శిష్యుఁ డట్టివాఁడే. పుత్రశిష్యులకు భేదము కానరాదు. తర్పణపిండదానపాలనపరితోషణములయం దిర్వురు సమానులు. పుత్త్రుఁ డెట్లదాతయగునో శిష్యుఁడుకూడ నట్లే యగును. ఇది నిశ్చితము. అని కణ్వశాఖయందు బ్రహ్మ ప్రతిపాదించినట్లు కనఁబడి యెడిని పితయు, మాతయు, శిశువు, ననాథబాంధవులు నను వీరు పురుషునకు సదా పోష్యులు. ఇది బ్రహ్మాశాసనము. ఇట్లు బ్రహ్మాశాసనమును బరిపాలించనిచో నాపాపాత్ముఁడు సర్వకర్మభ్రష్టుఁడగును. ఏ మనుష్యుఁడు తల్లిదండ్రులను గురువును మనుష్యమాత్రులనుగా భావించునో వాని సర్వకార్యములు ఫలింపక చెడును. సంపన్నత్తుఁడై యేనరుఁడు స్వగురువును బరాభవించునో స్వల్పకాలముననే యతనిసర్వస్వము నశించును. శచీదేవీ! సభామధ్యభాగమున నింద్రుఁడు నన్నుం గాంచి లేవకపోయెను.ఆతిరస్కారణఫలమును దాననుభవించుచున్నవాఁడు.

---

* ఇయ్యదియుం శ్రీకృష్ణజన్మఖండమున నఱువదియవ యధ్యాయము నుండి గ్రహింపఁబడినది.

ఇది యిపుడే యనుభవమునకు వచ్చినది. చూచుము. అతనికి దోషవిముక్తియు నీకు దుఃఖవిముక్తియు నగునుపాయ మొనరించెదను. శాసించుటకు రక్షించుట కెవ్వఁడు శక్తుఁడో వాఁడే గురువనంబడును. పతివ్రతాతిలకమా! హృదయశుద్ధిగల నీవంటిస్త్రీలుండుట యరుదు. ఏనాతిమానసము కిల్బిషయుతమో ఆమెధర్మము నశించును. నీమహత్త్వము దుర్గాదేవీమహత్త్వ సమముకాఁగలదు. మహాలక్ష్మివంటిప్రతిష్ఠయు, నామెకుఁ గల్గుయశస్సు నీకుఁ గలుగుఁగాక. రాధికాతుల్యసౌభాగ్యము కల్గును. ఆమెకుంగలప్రేమము భర్తయందు నీకుంగలుగుఁగాక. రాధికాతుల్యగౌరవము ప్రీతియుఁ బ్రాధాన్యము నీయందు నీ భర్తకుఁ గలుగుఁగాక. రోహిణివంటియపేక్షయు, భారతివంటిపూజ్యతయు సావిత్రివంటినిర్మలత్వము నీకుఁ గలుగుఁగాక!

ఇట్లు బృహస్పతి యాశీర్వదించుచుండునంతలో నహుషుని పరిసరమునుండి దూత యరుదెంచెను. వినయమునఁ జేతులొగ్గి యిట్లు పలికెను. మహాత్మా! లెమ్ము. శీఘ్రింబ నహుషునిం జూడవలయును. నందనవనమునఁ గ్రీడింప ననువగుముహూర్తమును జెప్పవలయును. అనుదూతపలుకులు విని బృహస్పతి యిట్లు ప్రశ్నించెను. ఆతనియవయవములు వడఁకుచుండెను. లోచనము లెఱ్ఱవాఱియుండెను. దూతా! నీవుపోయి నహుషునితో నామాటగా నిట్లు పలుకుము. నీవు శచీదేవితోఁ గ్రీడింపఁగోరుదేని యపూర్వయాన మెక్కి పోఁజనును. నీశిబికను సప్తర్షులు మోయఁజనును. దానినెక్కి సువేషభూషితుఁడవై పోవఁ

జను. వాక్పతిపలుకులను విని దూత యరిగి నహుషునకుం దెల్పెను. ఆపలుకులువిన్నంతనే నవ్వి కింకరునితో నీవు వేగంబ పోయి సప్తర్షులను బిలుచుకొనిరమ్ము. నా విని వాఁడరిగి నహుషునియానతిం దెలుపఁగా వా రప్పుడ యరిగిరి. వారింగాంచి వలగొని నహుషుఁ డిట్లు పలికెను. మీ రెల్ల బ్రహ్మపుత్త్రకులు. బ్రహ్మ తేజః ప్రజ్వలితులు. బ్రహ్మకు నీడగువారు. భక్తవత్సలులు. నారాయణభక్తులరు. శుద్ధసత్వగుణులరు. మోహమాత్సర్య హీనులరై దర్పాహంకారవర్జితులరై యశస్తేజముల నారాయణుంబోలినవారు. గుణకృపాప్రేమముల నారాయణునికి నీడుచేయఁదగుదురు. అనిపలికి నహుషుఁడు ప్రణమిల్లి దుఃఖించెను. పరహితపరాయణులుకాన వారెల్ల రతనిచింతంజూచి యిట్లుపలికిరి. వత్సా ! నీమనమునఁ గోరినవర మడుగుము. ఏది యడిగిన నియ్యఁజాలుదుము. మా కశక్యకార్యము కానరాదు. ఇంద్రత్వమునుగాని మనుత్వమునుగాని చిరాయుస్సునుగాని సప్తద్వీపాధిపత్యమునుగాని శాశ్వతసుఖముగాని ఇంక నేమేని వాంఛించిన నిత్తుము. నీవిపు డడుగఁదలఁచినదేది ? దాని నొసంగి తపస్సున కరుగుదుము. మాకు క్షణకాలము శ్రీకృష్ణార్చనము లేకయున్న యుగలక్షలు జరిగినట్లుండును. శ్రీకృష్ణ ధ్యానముచేయనిదినము దుర్దినమని భావింతుము. భగవత్సేవను వదలి మఱియొకవిషయము నెవఁడు వాంఛించునో వాఁడ మృతముమాని ప్రాణములఁదీయువిషమును ద్రావఁబూనిన మూర్ఖుఁడే యగును. బ్రహ్మాయు శివధర్ములు విష్ణుమహావిరాట్టు

వులు. గణేశదినేశశేషసనకాదులు నేమహాపురుషుని పాదాం బురుహముల రేయింబగళ్లు ధ్యానించి జన్మమృత్యుజరావ్యాధి హరమని భావింతురో ఆమహాత్మునిధ్యానాసక్తులము మేమని పలుక, నహుషుఁడు లజ్జితుఁడై నమ్రవక్త్రుఁడై మాయామోహిత మానసుండై యిట్లు పలికెను. మహానుభావులారా! మీరు భక్తవత్సలులరు. సర్వవాంఛితముల నీఁజాలుదురు. నాకిపుడు శచీదానమునిండు. అది య నాకోరిక. సప్తర్షి వాహనముగల కాంతు నాపులోమజాత కోరుచున్నది. కాన నాకీవర మను గ్రహింపుఁడు.

అని నహుషుఁడు పలుక మహర్షులు పరస్పరముఖావ లోకనంబులు చేసికొనుచు గట్టిగా నవ్విరి. విష్ణుమాయా మోహితుఁ డీతఁడయ్యెనని తలంచిరి. కరుణచే దీనవత్సలులు గావున నట్లే యొయ నంగీకరించిరి. ముక్తామణి విభూషితశిబి కను భుజశిఖరములపై నునుచుకొనిరి. సువేషుఁ డై నహుషుఁ డందుఁగూరుచుండి కన్నుమిన్నెఱుంగక వారుమెల్లగాఁబోవుట కోర్వక వారినదలించెను. త్వరగాఁబొండని మందలించెను. ప్రొద్దు పోయెనని హెచ్చరించెను. నహుషుఁ డిట్లు తిరస్కరింప నాము నులు తల్లడంపడుచుండ నందున్నదుర్వాసుఁ డాగ్రహంబునఁ దానగ్రగామిగా నున్నవాఁడు కావున నతనితిరస్కరణ మందఱి కంటె దన్నెక్కువ బాధింపఁగా నహుషా! గర్వమున నొడ లెఱుంగక మాకీనీచకార్యము నాదేశించుట చాలక తిరస్కా రణమునుగూడఁ గల్గించి బాధకల్గించితివి. కాన నీవాకకొండ

చిలువవై పడియుండుదువు. మహాత్మా! అట్లు కొంతకాలముండి ధర్మపుత్త్రునిదర్శనమున ముక్తినొందుదువు. అవ్వల వైకుంఠమున కేగఁగలవు. నీవొనరించినపుణ్యకర్మములు నిష్ఫలములుగావు సుమీ. అనిపలికి యాశిబిక నందుఁ బాఱవైచి యందఱు నవ్వుచుఁ దమదారిని బోయిరి.

నహుషుఁడామునిశాపమున సర్పమై భూమిపయిం బడియె. ఆశుభవార్తవిని శచీదేవిగురువునకునమస్కరించియమరావతి కరిగెను. బృహస్పతియు నింద్రుఁ డేసరోవరమునఁ గమలనాళమున దాఁగియుండెనో యచటి కేగెను. సురేశ్వరా! యని గట్టిగాఁ బిలిచెను. అప్పుడు బృహస్పతి ప్రసన్నవదనుఁడు కృపానిధియు ననఁజెప్ప నొప్పియుండెను. ఇంద్రా! నేనుండ నీకు భయ మేలాగు కలుగును? భయమును బాఱఁదోలుము. నేను బృహస్పతిని. వచ్చియున్నవాఁడను. రమ్ము. రమ్ము. నావిని యాకంఠస్వరము బృహస్పతిదని యెఱింగి మహేంద్రుఁడు హృష్టమానసుఁడై సూక్ష్మరూపమును వదలి యథాపూర్వరూపమున వెడలివచ్చెను. భక్తిభారమున దండమువలె గురుచరణపంకరుహములపైఁ బడియెను. విలపించుచు మహాభీతిఁ గలఁత నొందియున్నమహేంద్రుని బృహస్పతికరమునఁ జెంతకుందీసికొని యభయదాన మొసంగి యాతనిచే సోమయాగమును విధియుతముగఁ జేయించెను. ఆయాగము ప్రాయశ్చిత్తార్థమని యతనిభావము. గురువాశతమఖుని రత్నసింహాసనాసీనుం జేసి పరమైశ్వర్యము నొసంగెను. అది పూర్వమున కన్నఁ జతుర్గు

ణాధికమయ్యెను. అప్పుడే సర్వదేవత లరుదెంచి మహేంద్రుని సేవించిరి. త్రిదశేశ్వరుఁడగు మహేంద్రుని భర్తఁ బడసి శచీదేవి హృష్టురాలయ్యెను. ఆమెపరమానందమున కంతము లేకుండెను.

నారదా! ఇది యింద్రగర్వభంజనకథ. శచీపాతివ్రత్య రక్షణ మొనరించినకథయు నిదే. నావిని నారదుఁడు శ్రీమన్నారాయణమూర్తీ! సోమయాగవిధాన మెట్టిదో యొఱిఁగింపుము. గురు వెట్లు దానింజేయించెను. దానిఫల మెద్ది? అని ప్రశ్నింప నారాయణుండు మునీంద్రా! సోమయాగము బ్రహ్మహత్యను బోఁగొట్టును. ఒక్కవర్షము యజమానుఁడు సోమలతాపానము చేయుచు రెండవసంవత్సరము ఫలముంభుజించి మూఁడవ వత్సరము జలమును ద్రావియుండవలయును. ఇది మూఁడుసంవత్సరము లాచరింపఁదగువ్రతము. సర్వపాపప్రణాశనము. భూతతృప్తికొఱ కెవ్వఁడు మూఁడుసంవత్సరములవఱకుఁ దగిన ధాన్యము నుంచుకొనఁగలఁడో యాతఁడే సోమపానముచేయ నర్హుఁడు. మహారాజుగాని దైవముగాని యీయాగముచేయ ధికారి యగునని చెప్పవచ్చును. ఇది సర్వజనసాధ్యమగు యజ్ఞము కాదు. భూతతృప్తి యధికముగాఁ జేయవలయు. బహుదక్షిణల నీవలయును.

ఆర్యవర్యులారా! బృహస్పతి శచీదేవి కొసంగిన యభయదానమును వింటిరి. నహుషుఁడు మునులఁ బ్రార్థించుటయు, వారలానందించి వరమడుగుమనుటయు, నామీఁదఁ నతఁడు వారిని గామాతిశయమునఁ దిరస్కరించి శాపమును బొందుటయును

దెలిసికొంటిరి. గురు వింద్రునకుఁ బూర్వ రాజ్యము లభింప సోమయాగము చేయించుటయు వింటిరి. ఈకథనుండి మనమె ఱుంగఁదగుధర్మములు కొన్నిగలవు. వాని నవధరింపుఁడు.

"ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్. గీత ౬ అ. ౨౭

అనుగీతోక్తి ననుసరించిన సద్గుణములుకలవాఁడే సుఖియగునని తేలుచున్నయది. బృహస్పతి పరమశాంతమూర్తి. చిరకాల మట్టివారికిఁ గోపము మది నిలువదు. సదా పరుల కుపకారము చేయనే వారు కోరుచుందురు. శచీదేవి తనవ్యథను దెలుపఁ గనే వారిమనస్సు దయామయ మయ్యెను. అరుంధతియు మిగులఁ బ్రార్థించెను. అభయదాన మొసంగెను. వారిమన శ్శక్తి యపారసామర్థ్యముకలది. అది మునుల కాగ్రహమును గల్పింపఁజాలెను. దాన నహుషునకు మహేంద్రత్వ మూడి పోవుటయే గాక మర్త్యలోకమునఁ గొండచిలువయై చిరకాలము పడియుండవలసినగతియుఁ బట్టెను. పతివ్రతలమనోవిచారము సాధువులహృదయఖేదము ననునీరెండు నెంతటివారెడరు నైనఁ బుట్టింపఁగలవు.

సోమయాగము నింద్రునిచే బృహస్పతిచేయించి యతని మహాపాపములఁ బోఁగొట్టెను. దాన నతఁడు పరిశుద్ధుఁడై మరల నింద్రత్వమును బొందఁజాలెను. సోమయాగము సర్వ జనసులభము కాదు. మనోస్థైర్యముగలిగినవారికే చేయశక్యము. అది మూఁడుసంవత్సరములు చేయఁదగినది. తొలివత్సరము

సోమలతాసారమును ద్రావియు, రెండవవత్సరము ఫలముల భుజించియు, మూఁడవసంవత్సరము జలపానమొనర్చియు నియమమునఁ గాలముపుచ్చవలయుననియే దానిప్రధానవిధి. యజ్ఞములు ఫలార్థుల కవశ్యాచరణీయములు. ఫలముల నపేక్షింపనిచోఁ జేయకున్నఁ బాపము కానరాదు. అందు నవశ్యము చేయఁదగినవి. కొన్ని గలవు. వానికి మహాయజ్ఞము లనిపేరు. మనుస్మృతియందు మూఁడవయధ్యాయమునందు,

శ్లో. తాసాం క్రమేణ సర్వాసాం నిష్కృత్యర్థం మహర్షిభిః,
పంచక్లృప్తా మహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినామ్. ౬౯

వ్యా. గృహస్థానాం పంచమహాయజ్ఞాః ప్రతిదినం మన్వాదిభిరనుష్ఠేయతయా స్మృతాః. ఏవంచ నిష్కృత్యర్థమిత్యభిధానాత్ హింసాస్థానత్వేన చ కీర్తనాత్. ప్రత్యహమిత్యభిధానాత్ ప్రతిదినం తత్పాపక్షయస్యాపేక్షితత్వాత్సంధ్యావందనాదివన్నిత్యత్వమపి న విరుధ్యతి. అని కుల్లూకభట్టు.

అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్,
హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్.

వ్యా. అధ్యాపనశబ్దే నాధ్యయన మపి గృహ్యతే. అతోఽధ్యాపనమధ్యయనం చ బ్రహ్మయజ్ఞః. "అన్నాద్యేనోదకేన వా" ఇతి తర్పణం వక్ష్యతి సపితృయజ్ఞః. అగ్నౌహోమో వక్ష్యమాణో దేవయజ్ఞః. భూతబలిర్భూతయజ్ఞః అతిథిపూజనం మనుష్యయజ్ఞః. అధ్యాపనాదిషు యజ్ఞశబ్దో మహాచ్ఛబ్దశ్చ స్తుత్యర్థం గౌణః.

శ్లో. పంచైతాన్యో మహాయజ్ఞాన్న హాపయతి శక్తితః,
స గృహేఽపి వసన్నిత్యం సూనాదోషైర్న లిప్యతే. 20
దేవతాతిథిభృత్యానాం పితౄణామాత్మనశ్చ యః,
న నిర్వపతి పంచానా ముచ్ఛ్వసన్న స జీవతి. 21
అహుతం చ హుతం చైవ తథా ప్రహుతమేవ చ,
బ్రాహ్మ్యం హుతం ప్రాశితం చ పంచయజ్ఞాః ప్రచక్షతే. 23
జపోఽహుతో హుతో హోమః ప్రహుతో భౌతికో బలిః,
బ్రాహ్మ్యం హుతం ద్విజాగ్ర్యార్చా ప్రాశితం పితృతర్పణమ్.

ఇవి మహాయజ్ఞములు. ఇవి తప్పక యాచరింపఁదగినవి. వీనిని వదలవీలులేదని భావము. జ్యోతిష్టోమాదులకు యజ్ఞములనియే పేరు. కాని మహాయజ్ఞము లన్నసూక్తికిఁ బాత్రములు కావు. అవి కేవలస్వర్గాదిఫలములను గోరియే యాచరింపఁదగినవి. వాని నొనరింపకున్న దార్బ్రాహ్మణ్యమొదవునని చెప్పఁబడినది. కాని యవి హింసాప్రధానములు. కలియుగమున నవి ప్రధానములు కావు. మాంసభక్షణము నిషేధింపఁబడినపుడు జీవహింసయు నిషేధింపఁబడినట్లే తెలిసికొనుట మంచిది. మహాయజ్ఞముల నాచరింపక యజ్ఞముల నాచరించువారు పతితులగుదురు. సంధ్యావందనమునుమాని యితరమంత్రజపము చేయుట యెట్టిదో యిదియు నట్టిదియే. కావుననే నిత్యనైమిత్తికకర్మములన్న విభాగము కలిగెను. నిత్యములు సదానుష్ఠేయములు. నైమిత్తికము లిచ్ఛాధీనములు. అవియు ఫలమును గోరక యాచరింపవలయునని శ్రీకృష్ణభగవానుఁడు శాసించెను. ఎట్లన,

శ్లో. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగస్సమాచర. గీత. 3 అ.

వ్యా. యజ్ఞోఽత్ర విష్ణుః. యజ్ఞో వై విష్ణురితి శ్రుతేః. తదారాధనార్థా త్కర్మణోఽన్యత్ర తదేకం వినాఽయం లోకః కర్మబంధనః. కర్మభిర్బధ్యతే. నత్వీశ్వరారాధనార్థేన కర్మణా. అతస్తదర్థం విష్ణుపూజార్థం ముక్తసంగో నిష్కామః సత్కర్మ సమ్యగాచరేత్. అని శ్రీధరాచార్యులు.

శంకరాచార్యభాష్యమున మూఁడవయధ్యాయారంభమునందు,

అథ శ్రౌతైస్స్మార్తైశ్చ గృహస్థస్యైవ సముచ్చయో మోక్షాయ. ఊర్ధ్వరేతసాం తు స్మార్తకర్మమాత్రసముచ్చితాత్ జ్ఞానాన్మోక్ష ఇతి. దీనిచే ఊర్ధ్వరేతస్కులగు జ్ఞానులకు స్మార్త కర్మము చాలునని తోఁపక మానదు. పైశ్లోకమునకు శంకర భాష్యమును దిలకింపుఁడు.

యజ్ఞోవైవిష్ణురితిశ్రుతేః యజ్ఞ-ఈశ్వరః. తదర్థం యత్క్రియతే తద్యజ్ఞార్థం కర్మ. తస్మాత్కర్మణోఽన్యత్ర అన్యేన కర్మణా లోకోఽయమధికృతః. కర్మకృత్ కర్మబంధనః కర్మైవబంధనం యస్య సోఽయం కర్మబంధనః లోకః. నతు యజ్ఞార్థాత్. అతస్తదర్థం యజ్ఞార్థం కర్మ కౌంతేయ. ముక్తసంగః. కర్మఫలసంగ వర్జితస్సన్ సమాచర. నిర్వర్తయ.

శ్లో. సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోఽవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వమేషవోఽస్త్విష్టకామధుక్. ౧౦

దేవాన్ భావయతానేన తేదేవా భావయంతు వః,
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ.
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. ౧౨
యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
తే త్వఘుం భుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్ ౧౩

శంకరభాష్యము. దేవయజ్ఞాదీని నిర్వర్త్య తచ్ఛిష్టమశనమమృతాఖ్యమశితుం శీలం యేషాం తే. యజ్ఞశిష్టాశినః, సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః సర్వైః పాపైః చుల్ల్యాదిపంచసూనాకృతైః. ప్రమాదకృతహింసాదిజనితైశ్చ. అన్యే యే త్వాత్మంభరయః, భుంజతే. తేత్వఘుం పాపం స్వయమపి పాపాః....

వ్యా. వైశ్వదేవాదియజ్ఞావశిష్టం యేఽశ్నంతి తే పంచసూనాదికృతైః సర్వైః కిల్బిషైర్ముచ్యంతే. అని శ్రీధరాచార్యులు.

భక్తజనులారా! ఈభగవద్గీతావాక్యములనుబట్టి గట్టిగా నాలోచించినచో యజ్ఞములనఁగా పంచమహాయజ్ఞములేకాని హింసాకర్మము గలవికావని తేలకమానదు కదా. శ్రీకృష్ణపరమాత్మ యభిప్రాయమిట యజ్ఞములనఁగా బంచమహాయజ్ఞములనియేగాని జ్యోతిష్టోమాదులు గావని స్పష్టము. కాఁబట్టియే విభూతియోగాధ్యాయమునందు,

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః. ౨౫
అని యుపదేశించిరి. శ్రీధరాచార్యులుగారీశ్లోకమునకు వ్యాఖ్య

వ్రాయుచు, "యజ్ఞానాం శ్రౌతస్మార్తానాం మధ్యే జపరూపో యజ్ఞోఽహమస్మి." అని వ్రాసిరి. కావున జపయజ్ఞము సర్వోత్తమమని, జ్యోతిష్టోమాదులకంటెఁ బంచమహాయజ్ఞము లుత్తమములు నిత్యములు నగునని స్పష్టమగును. మహాదోషములు గలిగినపుడు వానిఁ దొలంగింప సోమయాగాదులు విధింపఁబడినవి. జ్యోతిష్టోమాదులు కామ్యములను గోరువా రాచరింపఁ దగినవని యెఱుంగఁదగు. హింసాలేశములేని మహాయజ్ఞముల మానుకొని హింసాప్రధానములగు యజ్ఞముల నొనరించిన నేమిలాభమో యెఱుంగఁబడదు. జనకుఁడు, పితామహుఁడు ప్రపితామహుఁడు యజ్ఞముచేయకయున్న దార్బ్రాహ్మణ్యదోషము కలుగుననియు నది తొలఁగుటకై యాధానమం దొకపశువు నెక్కువగా హింసింపందగుననియు విధి కనుపట్టుచున్నది. ఈవిధి మాంసాహారము కలిగియున్న కాలమునఁ జెల్లినఁజెల్లుఁగాని మాంసనిషేధము కలకాలమున నావిధి పనికివచ్చుననుట సాహసమేయని నే నభిప్రాయపడుచున్నవాఁడను.

నాత్మార్థం పాచయేదన్నం నాత్మార్థం పాచయేత్పశూన్,
దేవార్థే బ్రాహ్మణార్థేవా హన్యాన్మేధ్యపశూన్ ద్విజః.

అన్నసూక్తి కనుపట్టెడిని. ఈనియమ మేకాలమున నుపయుక్తమని యాలోచించుట బుద్ధిమల్లక్షణము. మాంసాహారముగల కాలమున దానిని వారింపఁబూని పెద్దలు జనసామాన్యము నలవాటు నొక్కసారి నివర్తింపఁజేయ సాధ్యముకాదని తలంచి యీనియమము చేసియుందురని యూహించుట ప్రమాదము

కాదు. అట్టికాలమున బైనియమమున్న నుండఁజనుఁగాని మాంసభక్షణమే నిషేధింపఁబడిన కాలమునం దాప్రాఁతనియమములఁ బట్టుకొని యాఁగులాడుట వెఱ్ఱితనముగాఁ దోఁపక మానదు. ఆసూత్రములఁ బఠించి వేదవిహితమని యుద్ఘోషించుటయు సాహసమనక తప్పదు. కావునఁ గలికాలమునఁ బంచ మహాయజ్ఞముల నాచరించుటయే సకలయజ్ఞములు చేసినట్లగు నని యూహింపవలయును. పశుహింసాబోధక వాక్యముల న్నియుఁ బ్రమాణములేకాని యవి మాంసభక్షణనిషేధము నకు ముందని నిశ్చయింపవలయును. ఇక్కాలమున ననఁగా మాంసము నిషేధించినతఱి యజ్ఞము లెట్లుచేయవలయునో మహర్షులే యాజ్ఞాపించిరి. మహర్షులశాసనము లేకపోయినచో,

శ్లో. న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే,
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా.౫అ.౫౬

అన్నమనుస్మృతి వాక్యము ప్రమాణయ కావలసివచ్చును. కావున మహానుభావులగు ఋషులు కాలానుసారము కర్మముల విధించిరి. యజ్ఞ మెట్లు చేయవలయునో యని నిర్ణయింపఁబూని,

శ్లో. "మహర్షయస్తు తా౯ దృష్ట్వాదీనా౯ పశుగణాంస్తదా,
పప్రచ్ఛురింద్రం సంభూయ కోఽయం యజ్ఞవిధిస్తవ.
అధర్మో బలవానేష హింసా ధర్మేప్సయా తతః,
తతః పశువధశ్చైష తవ యజ్ఞే సురోత్తమ.
అధర్మో ధర్మఘాతాయ ప్రారబ్ధః పశుహింసయా,

నాయం ధర్మో హ్యధర్మోఽయం న హింసా ధర్మ ఉచ్యతే.
ఆగమేన భవాన్ యజ్ఞం కరోతు యదిహేచ్ఛతి,
విధిదృష్టేన యజ్ఞేన ధర్మేణావ్యపసేతునా.
యజ్ఞబీజైస్సురశ్రేష్ఠ యేషు హింసా న విద్యతే,
త్రివర్షం పరమం కాలముషితైరప్రరోహిభిః,
ఏష ధర్మో మహాప్రాజ్ఞ విరించివిహితః పురా."

బ్రహ్మాండపురాణము,అనుషంగపాదము, ౩౦ అధ్యాయము.అని శాసించిరి మూఁడుసంవత్సరములు దాఁటినందునమరలఁ జల్లినచో మొలచుశక్తిలేనిధాన్యములు యజ్ఞబీజములని నిర్ణయింపఁబడినవి. ఔరా! ఎంతటిభూతదయ! ఎంతటివిజ్ఞానము! ఎంతటిదూరదృష్టి! ఎంతటిధర్మజ్ఞత! ఇట్టివారు కనుకనే మహామును లనఁబరఁగిరి. త్రేతాయుగమునందే భూతహింసకూడదని నిషేధింపఁదగినదని మహర్షులభావము. మాంసాహారము విధివిహితమగు నాకాలమునందే యజ్ఞమున కర్హములు ధాన్యములని మహామును లభిప్రాయమును దెలిపియుండఁగా మాంసాహారము విప్రులకు నిషేధింపఁబడిన యీకలికాలమునందా ప్రస్తావమేలయో తెలియరాకున్నది.ప్రాచీనాభ్యాసములు వదలిపోవుట కష్టతమమేమో! ఏదియెట్లున్నను శ్రీకృష్ణపరబ్రహ్మతాత్పర్యము యజ్ఞములలో జపయజ్ఞము శ్రేష్ఠమనియేకదా. స్మృతులు మహాయజ్ఞములని హింసాలేశములేని బ్రహ్మయజ్ఞాదులను జేర్కొనినవి. కాఁగా పోఁగా స్వర్గాదిసుఖములను గోరువారు చేయఁదగినవి జ్యోతిష్టోమాదులని స్పష్టమైనది.

యజ్ఞములచే దేవతల నారాధించుట విధివిహితము. అట్టియజ్ఞములు నొనరించినఁగాని లోకమునకు సుఖము కలుగదు.

"అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. ౧౪
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. ౧౫
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి." ౧౬

భగవద్గీత. 3 అ.

ప్రపంచమునకు మహోపయోగమును గల్పించునది వర్షము. దానికి హేతువు యజ్ఞము. అట్టులగుట నుత్తమోత్తమ మనక తప్పదు. ఉత్తమోత్తమమని యెన్నికంగన్నకర్మము హింసాప్రధానముగా నుండఁజనునా యని సంశయము బాధించెడిని. భగవంతునిభావ మిట యజ్ఞమర్చనరూపమే యని తోఁచుచున్నది. అట్టియజ్ఞములు విరళములైనందున ననావృష్టికలుగుచున్నదని కొందఱనుటయు న్యాయవిరుద్ధము కాదు. దేవతారాధనమునఁగాని జనులకు మేలుచేకూరదు. ఆయారాధనము పంచమహాయజ్ఞరూపము, జపయజ్ఞరూపము నగు. లోకక్షేమమును గోరి బహువిధయజ్ఞములు విహితములై యున్నయవి. ఏ విధముననైన దేవతల నారాధించి లోకక్షేమమును గల్గించునూహ గలవారు పెక్కుమంది యుండవలయును. ఆ కృత్యముమానిన లోకమునకు మేలుచేకూరదు కావుననే భగవంతుఁ డిట్టిశా

స్త్రము ననుసరింపకున్న వానిజీవితము వ్యర్థమని పెూచ్చరించెను తదుక్తికంటె నధికప్రమాణ మేమియున్నది? వేదములుకూడఁ దదుక్తినే తెల్పుచున్న వనవచ్చును. కావున భగవదుక్తి ననుసరించి చేయుకృత్యములు ఫలించి భక్తిని సమకూర్చి ముక్తిని బ్రసాదించును. అట్టులగుట సత్కర్మముల నాచరించి భక్తి నలవఱచుకొని యనన్యశరణులమగుట మానవవిధి. ఇంతట నీ విషయమునుమాని తరువాతి భగవచ్చరిత్రమును వ్రాసెదను.

## ఇంద్రుఁడు సహస్రాక్షుఁ డగుట.

* ఇట్లు శ్రీమన్నారాయణమూర్తి నారదముని గౌరవింగించి మరల నిట్లు పలికెను. మునిచంద్రా! ఇంద్రదర్పభంజనము నించుకంతయె తెల్పితిని. మఱియు నింద్రునిగర్వమును శ్రీకృష్ణమూర్తి యేరీతినడంచెనో వినుము. క్షీరసాగరమును మథించి యమృతమును బడసి తత్పానమున దేవేంద్రాదు లమర్త్యులైరి. అప్పుడే శ్రీహరిసాయమున దైత్యవధయు సాగెను. దాన మహేంద్రునకు గర్వ మధికమయ్యెను. ఆ విధ మెఱింగి శ్రీకృష్ణమూర్తి బలిచక్రవర్తిని బ్రేరేపించి స్వర్గము నాక్రమించునట్లు చేసెను. ఇంద్రాదులు దిక్కులేక తిరుగుచుండ బృహస్పతి భగవంతు నారాధించెను. అదితియు నియతివ్రత మాచరించెను. ఈ రెండుకార్యములచేఁ దృప్తినొంది శ్రీకృష్ణుఁడు స్వాంశ

* ఈ గాథయుం శ్రీకృష్ణజన్మఖండమునం దఱువదియొకఁడవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

మున నదితికిఁ బుత్త్రుఁడై జనించి వామనుఁ డనఁబరఁగెను. బలి ధర్మాత్ముఁడు కావున నతని జయింపఁబూనక యాచించి యింద్రునకు రాజ్యమొసంగెను. దాన నింద్రునకు గర్వభంగ మయ్యెను.

మఱియుఁ గొంతకాలమునకు నింద్రుఁడు గర్వమున విఱ్ఱవీఁగసాగెను. శ్రీహరి దుర్వాసునిద్వారా దానిని బోఁగొట్టెను. దుర్వాసునిశాపమువలన నశించినరాజ్యమును గృపానిధి కాన మరల నింద్రున కొసంగెను. మరల శతమఖుఁడు గర్వియై గౌతమపత్నిని గామించెను. గౌతమమునిశాపమున నాదర్ప మడఁగెను. ఆ శాపమున నింద్రుఁడు యాతననొందెను. స్వాంగభంగముగలవాఁడయ్యెను. ఆమహేంద్రునిం గాంచి మునులు మనువులు పకపకనవ్విరి. దేవతలు సిగ్గుపడిరి. బృహస్పతికిఁ దలవంపులుగల్గెను. ఆవల శచీపతి వేయియేండ్లు సూర్యునిం బ్రార్థించి రవివరప్రభావమున సహస్రాక్షుఁడయ్యెను. ఆ నేత్రము లతని దృష్టికిఁ గళంకములే యయి కనఁబడుచుండును. తారాపహరణమునఁ జంద్రున కెట్లు కళంకముగల్గెనో సురపతికి నట్లే కల్గెను. అనవిని నారదముని నారాయణమూర్తిం జూచి యింద్రుఁడు గౌతమమునిపత్ని నెట్లు కామించెనో తెలుపుము. అహల్య మహాసాధ్వి. భువనపావని. త్రిజగత్పూజ్య. పరిశుద్ధమతి. *నిర్మలాశయ. లక్ష్మ్యంశసంభూత. ఈ మహాసాధ్వి నవివేకియై కామించినచరితను వినఁగోరెదను. అనవిని శ్రీమన్నారాయణుం డిట్లనియెను.

---

* శుద్ధాశయాం మహాభాగాం నిర్మలాం కమలాకలామ్. అనిమూ.

ఒకానొకకాలమునఁ బుష్కరతీర్థమును సూర్యగ్రహణ కాలమున సేవింపఁబోయిన యహల్యను బాకశాసనుఁడు చూచెను. ఆమెచక్కఁదనమునుగాంచి యచ్చెరువందెను. మఱుదినమా యహల్యను మందాకినీతటమునఁ గనుఁగొనియెను. అత్తఱి నా మహాసాధ్వి విగతాంబరయై స్నానము చేయుచుండెను. ఆమె యవయవములవైఖరిం గాంచి కామార్తుఁడౌట మూర్ఛిల్లి తెలివి రాఁగా లేచి యామెచేరువకుంబోయి మనోహరవాక్కులతో వినయ ముట్టిపడ నామె మహాసాధ్వి యని యూహింపక యిట్లు పలికెను. రూపము, శీలము, నూత్నయౌవనము, నిండుచంద రుంగేలిసేయుముఖలావణ్యము నివియెల్లను మెచ్చఁదగినవి. పురుషచిత్తవికర్షణచణమగు కుటిలకటాక్షము ప్రశంసింపందగినది. పద్మప్రభామోచనదక్షమగు నీ నేత్రములజంటవినుతింపఁదగినది. గజఖంజనభంజనమగుగమనము మర్యాదచేయఁదగినది. పీయూషాధికదుర్లభమగు మృదుతమవాక్యము సంస్తుతిపాత్రమైనది. గౌతమముని యెట్టితపస్సొనరించి నిన్నుంబడసెనో యెఱుంగఁజాలకున్నవాఁడను. విష్ణుమాయయు, సనాతనియునునగు దుర్గాంబను సేవించి తత్ఫలముగా నిన్నుఁ బడసెనో యని యూహించెదను. కామశాస్త్రవిశారదుఁడు నిన్నుఁ బాలింపఁదగువాఁడని నా నమ్మకము. కాముఁడు కాముకుఁడగుచంద్రుఁడు పాలింపఁదగుదురేమో. గౌతముఁ డితఁ డేమి యెఱుంగును? లోకమునఁ గామశాస్త్రవిశారదులందఱు నన్నుఁ బొగడుచుందురు. అచ్చరలలో మిన్నయను పేరెన్నికంగాంచిన యూర్వశియు

నన్నే తలంచుచుండును. ఓవరాననా! శచీదేవి నీకు దాసికగా నొసంగెదను. త్రిలోకరాజ్యలక్ష్మిని గైకొనుము. ముదుసలి గౌతముని వదలుము. అతఁడు కామశాస్త్రానభిజ్ఞుఁడు. మఱియు దుర్బలుఁడు. అంతియకాక తపోనిరతుఁడు. నీతోఁ గలిసియుండఁ దగినవాఁడు కాఁడు. నిష్కాముఁడు. సదా నారాయణపరాయణుఁడు. వస్తువిశేషము నెఱుంగనివిధాత మిమ్మిద్దఱను గూర్చెను. విదగ్ధుఁడేయైన సకలలోకనారీమణులలో మిన్నవగు నిన్ను ముదుసలి తపసికిం గూర్చునా. అనిపలికి కాముకుఁడగు యమరనాయకుఁడు తత్పాదారవిందములపైఁబడెను. ఆయింద్రునింజూచి. మహాసాధ్వి న్యాయము నతిక్రమింపక యిట్లు పలికెను.

దేవాధినాయకా! బ్రహ్మాయభాగ్యమువలన మరీచి పాపమువలనఁ గశ్యపముని యదృష్టహీనతవలన నీవు పుత్త్రుఁడవై యదితికడుపునఁబుట్టితివి. పాపమానసుఁడవు. జపతపోమౌనవ్రతములు సురార్చనము తీర్థస్నానము లోనగుసత్కార్యములన్నియు నెవ్వాని మది స్త్రీచే నపహృతమగునో యతనికి ఫలము నీఁజాలవు. కాముకుల మనోమోహనార్థమే స్త్రీరూపము నిర్మింపఁబడినది. అదిలేకున్న సృష్టి నశించును. ఇది విధాతృనాజ్ఞ. ఈస్త్రీసృష్టి మాయాస్థానము. ధర్మమార్గార్గళము. తపస్సుల నశింపఁజేయుపదార్థము. సకలదోషములకు మూలము. కర్మబంధనిబంధులకుఁ గఠిననిగడము. మీనములకు గాలమెట్టిదియో, కీటములకు బ్రదీపమెట్టిదియో, పురుషుల

కీరూప మట్టిది. రమణీరూపము పయోముఖవిషకుంభము. తొలుత మధురముగనుండిపరిణామమందు దుఃఖబీజమై నరకసోపానమై తనరారు. కాఁబట్టియే సనకాదిమహామునులు వివాహము చేసికొనరైరి. ఎవరిమనసు పరస్త్రీలయం దాసక్తమయియుండునో యతఁ డొనరించినసుకృతమెల్ల నిష్ఫలంబేయగును. పరస్త్రీసేవన మీలోకమందును యశోహానిం గలిగించునది; పరలోకమున నరకబాధనాపాదించును. అనిపలికి యామహాసాధ్వి కాముకుఁడగు శచీపతిని వదలి తనగృహమునకుం బోయెను. తపస్వియగు గౌతమున కావార్త నెఱిఁగించెను. ఆమహర్షియు నింద్రుని కుచేష్టకు రోయుచు నుండెను.

ఒకానొకప్పుడు గౌతముఁడు శంకరాలయమునకుం బోయెను. శక్రుఁ డవ్విధమెఱింగి గౌతమరూపమునుదాల్చి యహల్యంగూడెను. ఈవిషయము జ్ఞాననిధియగు గౌతమునకు మనోగోచరమగుడు వేగంబ తనయింటి కరుదెంచెను. అప్పుడే మహేంద్రుఁ టచ్చోటుపాసి పోవుచుండి మునికంటఁబడియె. దిగంబరయగు నహల్యను జూచెను. మహోగ్రహమూని గౌతమముని శతమఖునంగములెల్ల భగాకృతులందాల్చుఁగాక యని శపించెను. భయవిహ్వలయై విలపించుభార్యనుజూచి నీవు పాషాణరూపమున మహారణ్యమున నుండుమా యని శపించెను. శతక్రతుఁడు సిగ్గుపడి తనచేఁతకు వ్యాకులంపడుచు నమరావతికింబోయెను. అహల్యయు భీతురాలయి శోకకర్శితుఁడగు ప్రాణనాథునింజూచి మృదువాక్కులనిట్లు ప్రార్థించెను.

ధర్మజ్ఞుఁడవగు నోమహాత్మా! నిర్దోషురాలగు నీదాసికను వదలి యెట్లు పోఁగలవు? నీవు వేదవిదులలో నుత్తముఁడవు. ధర్మతత్త్వమును విమర్శింపుము. నావిని గౌతమముని యోకళత్రమా! *నీవు మనశ్శుద్ధిగలదానవు. పతివ్రతవు. సువ్రతురాలవు. ఈవిషయము నెఱుంగుదును. ఐనను బరవీర్యమును భరించుచున్నదానవుగాన నిన్నుఁ ద్యజించెదను. పరభోగ్యయగు నారి సర్వకర్మములందు నపవిత్రురాలగు. దానిని గామించువాఁడు నరకదుఃఖము ననుభవించును. ఆమె చేసిన యన్నము పురీషతుల్యము. తదానీతజలము మూత్రసమము. ఆస్త్రీ నంటరాదు. అంటినచోఁ బురాతనపుణ్యము నశించును. అనిచ్ఛచేతనైన శృంగారమునఁ బరపురుషునిచే దుష్టురాలుగఁ జేయఁబడునో అది పతివ్రతయేయైయున్నను దత్కర్మమున దుష్టురాలేయగును. నీవు దేవేంద్రుని భర్తగా భావించి గృహమున సుఖించితివి. నన్నుఁజూడఁగనే జ్ఞానము నీకుఁగలిగినది. ఇది సత్యముకదా. ఇఁకఁబొమ్ము. పొమ్ము. మహారణ్యమునఁ బాషాణరూపమును దాల్పుము. భవిష్యద్రామావతారమునఁ దద్రామచంద్రపాదారవిందస్పర్శమున నప్పుడే పవిత్రురాలవగుదువు. నీసుకృతమువలన మరల నన్నుఁ గూడియుండఁగలవు నీవిఁకఁ బొమ్మా యనిపలికి యమ్ముని తపమునకుం బోయెను. ఇది మహేంద్రదర్పభంజనము ఆనిర్జరాధిపతి మరల శ్రీకృష్ణానుగ్రహమున నైశ్వర్యమును బడసెను.

---

*త్వాం జానామి మనశ్శుద్ధాం సువ్రతాం చ పతివ్రతాం త్యక్ష్యామి చ తథాపి త్వాం పరవీర్యం చ బిభ్రతీమ్. అని మూ.

పాఠకవర్యులారా ! ఇంద్రునకు మరల గర్వము పొడ సూప నహల్యాకారణమున నది యడంగుటయేకాక యవయవములెల్ల వికారరూపమును దాల్చుటయు నవి భగవంతుని కటాక్షమున నేత్రములుగాఁగనఁబడుచుండుటయు నహల్యా దోషమెఱుంగకున్నను శాపము ననుభవించుటయునను నీకథలను జదివితిరి. ఇవి కథామాత్రములుకాక లోకుల కుపదేశములుగ నున్నవి. ఈకథ శ్రీమద్రామాయణమునఁ గనఁబడుకథకంటె నిట నించుక భేదముగాఁగనుపట్టుచున్నయది. ఇందేది వాస్తవము ? అని ప్రశ్నింపరాదు. మహర్షు లొక్కవిషయమునే యించుకమార్పులచే బహుగ్రంథములయందుఁ జేర్తురు. ప్రధానవిషయమును మార్పునొందింపరు. దానిచే నాకథ క్రొత్తదిగా నుండుటయేగాక చదువునప్పుడు విసుగును బుట్టింపక యుండును. కథాసారము నీతనిబోధించుటయే ఫలముగాఁగలదియైనఁ జాలునని మునీశ్వరులభావము. వారిది యుదారదృష్టి. ఆక్షేపించువారి దల్పదృష్టి. ఒక్కరీతిగా నన్నిపురాణములలోఁ జేర్చిన నది పఠనార్హముగాకయుండును. మార్పునొందియుండినఁ బఠనమునకుఁ దగియుండును. మఱొక్కమాట వినుఁడు. మనముకలిసి యొకయుత్సవమును జూచివచ్చి దాని నితరులకుఁ దెల్పునపుడే విషయమొకరీతిగా నుండక యించుకమార్పు నొందును. ఇది సహజము. మహర్షు లతీంద్రియులుకాన నట్టిభేదము కన్పడఁగూడదుకాని యెట్టిమార్పుచేసిన నది పునఃపునః పఠనార్హమగునో యట్లు మార్చుట మనపూర్వులకు నైజము.

దాన మేలులేకపోదు. ఆభావమెఱుంగక యాక్షేపించుట న్యాయము కాదు.

అహల్య యాత్రార్థము పోయియుండ నింద్రుఁడు కామాతిరేకమున నాతన్వింజూచి మోహించినపు డాయహల్య వచించిననీతులు వేదసారము లనందగినవి. నీవంటి యవివేకిని గోడుకుఁగాఁ గాంచుట మీ వంశమున కపకీర్తియనియెఁగదా. ఇదొక్కటి చాలదా.

'అపకీర్తిభాజనంబైనట్టిపుత్త్రుండుపుట్టినేమి యతండుగిట్టి' నేమి.అన్నసూక్తి కనఁబడియెడిని. సుపుత్త్రునిచే సద్వంశ మనఁబడు. ఎవ్వఁడు పరస్త్రీరతుఁడో వానికంటెఁ గుపుత్త్రుఁ డెవ్వఁడు కలఁడు? కామినింజూచి మోసపోవుట నైజము. ధీరోదాత్తుఁడు స్త్రీలవలలలోఁ బడఁడని తెలిపెను. ఇట్టినీతుల కవకాశము గలుగఁజేయఁబూని మహాత్ము లించుక మార్పున నీ కథను బలుతావులఁ దెల్పుదురు. అహల్య పరమపవిత్రమానసయని దీనఁ దేటపడియెను. ఇంద్రుఁడు పాదాక్రాంతుఁడైనను లక్ష్యముచేయక యింటికింబోయెను. కాఁబట్టియే పతివ్రతలలో నీమెపేరు కూడఁ జేర్పఁబడినది. మరల నింద్రుఁడు గౌతమముని వేషమున నామెంగూడెను. దీన నామాన్నిని దోషముగలదా అన్నదియే ప్రశ్నము. గౌతమముని శపించినపుడు సాధ్వి యామె చెప్పిన న్యాయ మిదియే. మునియు నీయందు దోషము కానరాదు. ఐనను బరవీర్యమును ధరించితివి కావున నిన్ను వదలుచున్నాఁ డననియె. ఇవి న్యాయసమ్మతమా యనునదియు నొకప్రశ్నము.

"హృతాధికారాం మలినాం పిండమాత్రోపజీవినీం,
పరిభూతా మధశ్శయ్యాం వాసయే ద్వ్యభిచారిణీం. ౭౦
వ్యభిచారాదృతౌ శుద్ధి ర్గర్భే త్యాగో విధీయతే.
గర్భభర్తృవధాదౌ తు తథా మహతి పాతకే." ౭౧

అని యాజ్ఞవల్క్యస్మృతియందుఁ గనుపట్టెడిని. ఇట్టిదోషములు లేనితఱి గౌతముఁ డామెను శపించుటగాని పరిత్యజించుట గాని చేయఁదగునా యన్నప్రశ్నము న్యాయసమ్మతముగనే కనఁబడును. సామాన్యశాస్త్రమును విశేషశాస్త్రము బాధించును.

"పరభోగ్యా చ యా కాంతా సా౽శుద్ధా సర్వకర్మసు.
తాం యో గచ్ఛేన్మహామూఢో నరకం తస్య.కల్పకమ్."

అనునది విశేషశాస్త్రము. ఏ కారణముననైన నేమి పరసంగము గలిగెనేని ఆకాంత సర్వకర్మానర్హ యని ముని యెఱుంగును. శ్రౌతస్మార్తకర్మముల కుపయోగింపని స్త్రీ దుష్టయని మహర్షులభావము. కాని యామె మనస్సున దోష మెఱుంగదు. కాఁబట్టియే భగవత్పాదరజస్స్పర్శమున శాపము త్రియు భర్తృసంగమము కలుగునని కరుణమెయిం బలికెను. ఎంతకాలమున శాపాపముపోయి యామెపరిశుద్ధురాలగునో యంతవఱకు శాపమనుభవింపవలసినదే యని మహర్షి జ్ఞానదృష్టిం బరికించెను. త్రికాలజ్ఞులుగాన రామావతారకాలము నెఱింగెను తత్పాద రజస్సంబంధము గలుగఁగలదనియు నెఱింగెను. కాఁబట్టి మునియు వసందర్భముగా శపించినవాఁడు కాఁడని మన మూహింపవలయును. ధర్మములమార్గములు సూక్ష్మములు. వానిగతుల

నెఱుంగుట చాలకష్టము. రామావతారమున నెవ్వరెవ్వ రామ హాత్మునిదర్శనమునఁ బవిత్రులు కాఁదగుదురో వారికందఱు కొక్కొక్కకారణమున నొక్కొక్కయపరాధము గలుగును. వారెల్లఁ దదపరాధఫల మనుభవించుచుండి భగవత్సందర్శన మునఁ బవిత్రులగుదురు. కావున నీయహల్య యించుకదోషము నొనరించెనని ముని తెలిసికొని తత్ఫలము నీశాపమున ననుభవింపఁజేసెనని యెఱుంగునది. ఇఁకఁ దరువాతికథను జిత్తగింపుఁడు.

## అహల్యాశాపవిముక్తి.

* నారదముని కథాశ్రవణానంతరమాదరమున భగవంతుని జూచి నారాయణమూర్తీ! గౌతమమునిపత్ని శాపమును శ్రీరామచంద్రుఁ డేయుగమున నెట్లు తొలఁగించి ధన్యంజేసెను? శ్రీ రామావతారమునుగూడ వినఁగోరెద. అది మిగుల మనోహరమైనది. నావిని నారాయణుండు తత్కథం జెప్పఁబూని యిట్లు పలికెను. బ్రహ్మ ప్రార్థింపఁగా విష్ణువు దశరథునకుఁ గొడుకై కౌసల్యాగర్భమునఁ ద్రేతాయుగమునఁ బుట్టెను. కైకకుమారుఁడు భరతుఁడు. రామతుల్యగుణశాలి. లక్ష్మణశత్రుఘ్నులు గుణసముద్రులు సుమిత్రాపుత్రులు. విశ్వామిత్రప్రోత్సాహమున శ్రీరాముఁడు లక్ష్మణునింగూడి సీతాగ్రహణనిమిత్తము మిథిలానగరమునకుం బోవుచుండెను. రామమూర్తి

*ఇది శ్రీకృష్ణజన్మఖండమున నఱువదిరెండవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

మార్గమునడుమఁ బాషాణరూపమున నున్న కాంతామణిని గాంచెను. ఇట్లుండ నేల యని విశ్వామిత్రు నడిగెను. విశ్వామిత్రుఁ డారహస్యమును సర్వము రామునకుం దెలిపెను. లోకపావనుఁడగు రాముఁడు పాదాంగుళిచే స్పృశించినంతనే యది యహల్యగా మాఱెను. ఆసాధ్వి శ్రీ రామమూర్తిం గాంచి మునిపత్నిగాన ననేకాశిషంబు లొసంగి భర్తచెంత కేగెను. గౌతముఁడు భార్యను గారవించి శాపముక్తి ననుగ్రహించిన రామమూర్తికి శుభాశిషము లిడియె.

రామచంద్రుఁ డిట్టు లహల్యకుముక్తి ననుగ్రహించి జనకుపురమున కరిగి శివధనుర్భంగమును జేసి సీతను వివాహమాడి పరశురామునిదర్ప మార్చి యయోధ్యంజేరెను. దశరథుఁడు రాము నభిషేకింపఁబూనిన భరతునితల్లి యోర్వఁజాలక దానినాపి పూర్వము తన కిడినవరముల నిమ్మని యడిగి రామునకు వనవాసము భరతున కభిషేకము చేయింప హెచ్చరించెను. రాజు ప్రేమభరమున వరమీయఁబూనకున్న రాముఁడు తండ్రిం గాంచి, మహారాజా! తటాకశతదానమున నేపుణ్యముకలుగునో వాపీ (బావి) దానమున దానినిమించినఫలము గలుగును దశవాపీప్రదానమున నేపుణ్యము లభించునో దానిని మించినపుణ్యము కన్యాదానమున లభించును. దశకన్యాప్రదానపుణ్యమును మించినపుణ్య మొక్కయజ్ఞముచేసినఁ గలుగు. శతయజ్ఞలబ్ధసుకృతమును మించినపుణ్యము పుత్రప్రాప్తివలన నొదవు. శతపుత్రలాభపుణ్యమున కన్న మిన్నయగుపుణ్యము సత్య

పాలనమునఁ బడయనగు. సత్యమును మించినపుణ్యము, అసత్యమును మించినపాతకము లేవు. గంగానదీతుల్యమగు తీర్థము, కేశవునిమించినపరదైవము, ధర్మమును మీఱిన బంధువు, ధనము లేవు. కావునఁ దండ్రీ! ధర్మమును రక్షింపుము. ఒక్క ధర్మమును రక్షించినచో సకలశుభములు యశస్సు, ప్రతిష్ఠయు, ప్రతాపము, మర్యాదయు లభించును. పదునాల్గువత్సరములు గృహసుఖములను మాని వనవాసము సాగించి సత్యమును బాలించెదను. ఏనరుఁ డిచ్ఛచే నొండె నినిచ్ఛచేనొండె సత్యము చెప్పి దానిఁ బరిపాలింపఁడో అతనిజన్మము వ్యర్థము. కుంభీపాకనరకమునఁబడును. ఆమీఁద మర్త్యలోకమునఁ బుట్టిమూఁగగాని కుష్ఠురోగపీడితుఁడుగాని అయి యప్లేడుజన్మము లాపాపము ననుభవించును. అని విన్నవించి జటావల్కలములం దాలిచి సీతాలక్ష్మణసహితుఁడై వనముల కరిగెను.

దశరథుఁడు పుత్రశోకపీడితుఁడై తనువువదలెను. రాముఁడడవులఁదిరుగుచుండ రావణునిచెలియలు శూర్పణఖ రామునింగాంచి కామబాణపీడితయై కాంక్షించెను. ఓరామా! ఘనశ్యామా! సకలసద్గుణధామా! నిన్నుగోరి పరితపించునన్నుం బరిగ్రహింపుము. రామచంద్రుఁ డాతరుణినుడులు విని ధర్మమును స్మరించి శాపభీతిచే నిట్లు మృదుభాషితం బలికెను. అంబా నేను భార్యంగూడియున్నవాఁడను. నాతమ్ముఁడు భార్యను వదలియున్నవాఁడు. వానికడ కరుగుము. రెండవభార్యను గోరుట దుఃఖానుభవముకొఱకే. ఒక్కస్త్రీకతో విహరించుట సుఖాల

యము. ఆమాటలు రామునినోటనుండి వెడలంగనే యామె లక్ష్మణుని చెంతకుం బోయి శాంతుఁడై కాంతుఁడై సకలలక్షణవిచక్షణుఁడై యున్న యతనిఁ గాంచి నన్నుం బరిగ్రహింపుమాయని పలుమారులు వేఁడెను. లక్ష్మణుఁడు కుతూహలమున నోకాంతాతిలకమా! జగత్పాలకుఁడగు రాముని వదలి దాసుఁడనగు నన్నుఁ గోరుట న్యాయముకాదు. నాభార్య సీతకు దాసిక. నేను దాసుఁడను. నీవు సీతకు సపత్నివగుదువు. కావున రాము నాశ్రయింపుము. నీకు నేను బుత్త్రుఁడ నయ్యెదను. సీతకు నేఁ బుత్త్రుఁడనే. నావిని కాముఁడు చిత్తమును హరింపఁగా నతనిం జూచి యోమూఢుఁడా! కామాతురనై నాయంతట నేవచ్చిన నన్ను వదలిపెట్టుట న్యాయముకాదు. మీయిరువురకు ఘోర విపత్తు రాఁగలదు. ఇందులకు సంశయములేదు. బ్రహ్మాయు మోహినిని వదలిపెట్టి లోకమున నపూజ్యుఁడయ్యెను. దక్షుఁడు రంభాశాపమున భాగమస్తకుఁడయ్యెను. స్వర్వైద్యుఁడూర్వశీ శాపమున యజ్ఞభాగవిహీనుఁడయ్యెను. మేనాశాపమునఁ గుబేరుఁడు రూపహీనుఁడయ్యెను. ఘృతాచీశాపకారణమున మన్మథుఁడు శివునిచేఁ గాల్పఁబడియెను. మదాలసాశాపమున బలిచక్రవర్తి రాజ్యభ్రష్టుఁడయ్యెను. మిశ్రకేశీశాపముననే బృహస్పతి హృతభార్యుఁడయ్యెను. ఇపుడు నేనిచ్చు శాపమువలన రాముఁడు హృతభార్యుఁడగును. కామాతురనై, ప్రాయమునఁ గన్నుమిన్నెఱుంగక, తానే వలచివచ్చిన భార్యను ధర్మభీతిగలవాఁడు త్యజింపరాదు. మాధ్యందినశాఖయం దిది కనఁ

బడియెడిని. త్యజించినచో నిచట నాపదలఁబొంది పరలోకమున నరకఫల మనుభవించును.

## శూర్పణఖ కుబ్జగాఁ బుట్టుట.

ఇట్లు శూర్పణఖ పలుకఁగా రామచంద్రు నానతి నొక విధముగాఁ గైకొని లక్ష్మణుఁడు క్షురధారచే దానిముక్కు కోసి వైచెను. దానియన్నయగు ఖరాసురుఁడు యుద్ధమొనరించి దూషణుని సేనలంగూడి లక్ష్మణాస్త్రముల యమమందిరమున కరిగెను.పదునాలుగు వేల రాక్షసులు మృతులగుటంగాంచి శూర్పణఖలంకకుం జని రావణుని దూలనాడెను.విషయమంతయు నెఱింగించి పుష్కరమునకుం బోయెను. దుష్కరంబగు తపంబొనరించి బ్రహ్మ నలరించెను. నిరాహారయై తపోనియతిందప్పని శూర్పణఖంగాంచి తన్మనోభావ మెఱింగి కృపాసింధువు గావున నలువ శూర్పణఖా! శ్రీరామచంద్రునిగోరి యతఁడు లభింపని కతన ఘోరతపస్సు చేయుచున్నదానవా. జితేంద్రియులలో మేటి ధర్మలక్షణుఁడుకదా లక్ష్మణుఁడు. శ్రీరాముఁ డనఁగా, * బ్రహ్మవిష్ణుశివాదుల కీశ్వరుఁడు. ప్రకృతిపరుఁడు. ఓవరాననా! జన్మాంతరమున భార్యవై యాతనివలన సుఖము లందఁగలవు. అనిపలికి బ్రహ్మ తనయింటికింబోయెను. ఆశూర్పణఖ యగ్నిని బ్రజ్వరిల్లంజేసి యందుఁ దనదేహము నునిచి భస్మమయ్యెను. ఆశూర్పణఖయే జన్మాంతరమునఁ గుబ్జయయ్యెను.

---

* బ్రహ్మవిష్ణుశివాదీనామీశ్వరం ప్రకృతేః పరం. అనిమూలము.

అటు రావణుఁడు శూర్పణఖావాక్యమువలన నాగ్రహ మునొంది దాన సర్వాంగములు కంపింపఁగా మాయచే సీత నపహరించెను. రాముఁడు సీతనుగానక పలుభంగుల విలపించి యాప్రాంతములనెల్ల వెదకిచూచి మునుల యాశ్రమములు వెదకి సుగ్రీవునితో సఖ్యముచేసి వాలిని బొలియించి రాజ్యము సుగ్రీవున కొసంగి యతఁడు సీతను వెదుక వానరుల సకల దిక్కులకుం బంప నాతనికడ ననుజుంగూడి యుండెను. హను మంతునకు దీవనల్చి యంగుళీయకము నిచ్చి పంపఁగా నాహ నుమ యంగదాదులంగూడి దక్షిణదిక్కున కరిగి రాముఁడు తన్నుఁ గౌఁగిలించుకొని నందుల కతిప్రీతుఁడై సీతాన్వేషణకా ర్యనిరతుఁడై * తాను రుద్రకళోద్భవుఁడు గావున సముద్ర మునుదాఁటి లంకానగరమున నుపవనమున నశోకవిటపిక్రింద శోకమునఁ గృశించి నిరాహారయై తన్వంగియై యమవస నిశి యందలి చంద్రకళవలె రామనామజపము ననవరతము చేయుచు, జటాభారమును మోయుచు, దప్తకాంచనవర్ణ మొప్పారఁగా, రేయింబవళ్లు భర్తృపాదాంభోరుహములనే ధ్యానించుచుం బతివ్రతాశిరోమణియై సువ్రతయై సుశీలయై మహాలక్ష్మీ లక్ష్మ విరాజమానయై స్వతేజః ప్రధర్షిత సర్వభూతయై సకలతీర్థస్నాన పుణ్యము నొసంగఁజాలి భువనపావనియునై యున్న జానకిం గాంచెను.

చాయునందనుఁ డాలోకపావనికి నమస్కరించి రామ మూర్తి దగురత్నాంగుళీయకమునొసంగెను. ఆమెను దర్శించి

* రామాదదధీతసందేశో యయా రుద్రకళోద్భవః. అని మూ.

విలపించెను. సీతాజీవనలక్షణమగు శ్రీరామసందేశమును విన్న వించెను. తల్లీ! సముద్రము నవ్వలిగట్టునకు దూరముగాఁ సలక్ష్మణుఁడై శ్రీరామమూర్తి యున్నవాఁడు. శ్రీరామమిత్త్రుఁడగు సుగ్రీవుఁడున్నవాఁడు. రామమూర్తివాలిందునిమి రాజ్యమాసుగ్రీవున కొసఁగి వాలి హృతయగుభార్యను మరల నిప్పింపనతఁడు మిమ్ములను వెదకింపఁ బ్రతినపూనెను. తదాజ్ఞ వానరులెల్ల సకలదిక్కులకుం బోయిరి. నావలన మీశుభవార్తను శ్రీరామమూర్తి వినఁగలఁడు. గంభీరావర్ణవమును బంధించి త్వరలో శ్రీరామమూర్తి లంకకు రాఁగలఁడు. సపుత్త్రబాంధవముగా రావణుని వధించి తల్లీ! నీకీదుఃఖవిముక్తిని బ్రసాదించును. ఇపుడు రత్నపూర్ణయగు లంకాపురమును నీయనుగ్రహమున భస్మమయముగాఁజేయఁగలను. నాకీలంక కోఁతిపిల్లవలెఁ గనుపట్టుచున్నది. మూత్రకుండముగా సాగరము కనఁబడియెడిని. భూతలమెల్ల శరావమని తలంచెద. రావణుని నాతనిసైన్యమును బిపీలికాసంఘముగా భావించెదను. వీరినెల్ల నొకయర్ధముహూర్తమున సంహరింపఁజాలుదును. కాని శ్రీరామప్రతిజ్ఞారక్షార్థమై సంహరింపఁబూనను. నీవు స్వస్థచిత్తవు కమ్ము. భయమును బాఱఁదోలుము.

సీతయు నిట్లుపలుకు వానరవచనములవిని భృశము విలపించెను. భీతయై యిట్లు పలికెను. నాదారుణశోకార్ణవమున మునింగియున్న రాముఁడు జీవించియున్నాఁడా? కౌసల్యానందనుఁడగు నాప్రాణేశుఁడు కుశలముగ నున్నవాఁడే కదా! ఎట్లు

కృశించియున్నవాఁడు! సీతాజీవనుఁడుకదా రాముఁడు! ఏమిప దార్థమును భుజించును! సముద్రపు టవ్వలిగట్టున శ్రీరాముఁడు న్నమాటసత్యమేకదా! నాదుఃఖభారమునహేతుఁడు కాఁడుకదా! స్వామిదుఃఖప్రదురాలనగునన్ను స్మరించునా? నాకొఱ కెట్టిదుఃఖ ము ననుభవించెను? పూర్వ మానంద మనుభవించుకాలమున హారమునుధరించునంతవ్యవధానము నోర్వఁజాలకుండెను. ఇపు డు మాయిర్వరకునడుమ శతయోజనములపారముగల సాగర మున్నది. కరుణాసాగరుని రాముని జూడఁగల్గుదునా ధర్మని ష్ఠుఁడై శాంతుఁడై దాంతుఁడునైయుండు శ్రీరాముని సేవించు భాగ్యము నాకుంగలదా? పతిసేవావిహీనయగు నారీమణిజీవన ము వ్యర్థము. పావనీ! ధర్మమూర్తి సౌమిత్రి సత్యముగా జీవిం చియున్నాఁడా! నాశోకసాగరమున మునిఁగి భగ్నదర్పుఁడయ్యె గదా! నామఱఁది వీరాగ్రేసరుఁడు. ధర్మరక్షణపరాయణుఁడు, దేవకల్పుఁడు. నామఱఁది యెపుడు యుద్ధమొనర్తునా యని సన్నద్ధుఁడై యున్నవాఁడుకదా! ధర్మలక్షణు నాలక్ష్మణుని నిశ్చ యముగాఁ జూడఁగల్గుదునా? ఆపలుకులువిని హనుమ యత్యు గ్రాకారుఁడై లంకను భస్మమగునట్లు దహించెను. మఱల జానకిం గాంచి కుశలమును దెల్పి ధైర్యమును గల్గించి రామునిచెంత కుం బోయెను,

అటనున్న రామమూర్తి హనుమంతునిరాకకు వేచియుం డెను. హనుమయు లంకాపురినున్న సీతాంబికావృత్తాంతము నెల్ల స్పష్టపఱచెను. అవార్తవిని రాముఁడు బిట్టు విలపించెను.

లక్ష్మణుఁ డన్నకంటె మిన్నగ దుఃఖించెను. సుగ్రీవునకు స్మృతియే తప్పెను. వానరు లొడలెఱుంగకయే పడిపోయిరి. ఆవల రాముఁడు వారినెల్లం గూడి పోయి లవణార్ణవమును గట్టి లంకాపురిం జొచ్చి రావణుని దద్భటులను ద్రుంచి సీతకు దుఃఖవిముక్తి ననుగ్రహించెను. పుష్పకవిమానమున నధివసించి, సీతాదేవిం గూడి యయోధ్యకే తెంచియందు జానకియానందించునట్లు కాలము గడుపుచుండెను. సర్వపృథ్వీపతియై రాముఁడుండ ఆధివ్యాధి విరహితయై భూదేవి యలరెను. ఆశ్రీరామునకు నిర్వీరకొడుకులు కుశలవులనువా రుదయించిరి. వారి పుత్రపౌత్రులచే సూర్యవంశమెల్ల వ్యాపించెను నారదా! ఇది శ్రీరామచరితము. పుణ్యమును ముక్తిని బ్రసాదించునది. కావున వినిపించితిని.

పుణ్యమనీషులారా! శ్రీకృష్ణావతారతత్త్వమున నీకథ లేల యని మొదటఁ దోఁపవచ్చును. ఇంద్రదర్పభంగమునుండియే పెక్కు లుదాహరణములు భగవన్మహిమమును బోధించునవి దొరకెను. ముందు వ్రాయఁబోవుకథలోఁ గుబ్జాకాంత నుద్ధరించుపట్టు రాఁగలదు. కుబ్జయన నెవ్వరో తెలియఁదగియుండు. శూర్పణఖ కుబ్జయని యీకథనుండియే తేలెనుగదా? కావున నీచరిత్రమువ్రాయుట సుసంగతమే కాని యసంగతము కాదు. ఈచరిత్రమును విమర్శించెదను. శ్రీమద్రామాయణమున లక్ష్మణుఁడు శూర్పణఖముక్కును జెవులను గోసివైచినట్లున్నయది. ఇందు నాసికాచ్ఛేదముమాత్రమే చేసినట్లున్నది. రామమూర్తి

ఖరదూషణాదుల వధించినట్లు శ్రీమద్రామాయణమునఁ గలదు. ఇట లక్ష్మణుఁడే వారినెల్ల నర్థముహూర్తమున వధించిన ట్లగప డియెడిని. ఇందేది యథార్థమను ప్రశ్నము రాకపోదు. దీనికి సమాధాన మిద్దానికిఁ బూర్వము వ్రాసినకథలో వ్రాసితిని. మరల నాచర్చ చేయుట పిష్టపేషణమువంటిదే యగు.

ఇఁక నీకథ నించుక విమర్శించి దీనినుండి నేర్చుకొనఁదగిన నీతుల దెల్పెదను. భగవత్సందర్శనమున సకలపాపములు నశించి యుత్తమపురుషార్థ మలవడును. ఇది సత్యము. లేకున్న భగవత్సం దర్శనము వ్యర్థమగును. అట్లు కాఁగూడదు కదా. కావున శూర్పణఖ యెట్టిదుష్టాత్మురాలైనను శ్రీరామచంద్రుని గన్నులారఁ గని సంభాషించెను. ఆసుకృతము మేరుతుల్యము. వ్యర్థ మగునా? అందును శూర్పణఖ శ్రీరాముని దివ్యమంగళవిగ్ర హమును జూచి మోహించెను. ఆవాంఛ ఫలింపవలదా? ఈ రెండును ఫలమునీయక వదలుననుట పాపము కాదా. కాఁబట్టి యే శ్రీకృష్ణావతారమున నామెవాంఛను భగవంతుఁడు ఫలిం పఁజేసెను. ఈవిషయమునే గీతాశాస్త్రమునందు శ్రీకృష్ణపర మాత్మ స్పష్టముగాఁ దెలిపెను.

"యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః. ౪అ.౧౧శ్లో".

వ్యా. యథా యేన ప్రకారేణ సకామతయా నిష్కా మతయా వా యే మాం భజంతి తానహం తథైవ తదపేక్షిత ఫలదానేన భజామ్యనుగృహ్ణామి. నతు యే సకామా మాం వి

హాయేంద్రాదీనేవ భజంతేతానహాము పేతు ఇతి మంతవ్యం. యతః సర్వశః సర్వప్రకారైరింద్రాదిసేవకా అపి మమైవ వర్త్మ భజన మార్గ మనువర్తంతే. ఇంద్రాదిరూపేణాపి మమైవసేవ్యత్వాత్. అని శ్రీధరాచార్యులు.

భాష్యము. యే యథా యేన ప్రకారేణ యేన ప్రయోజనేన యత్ఫలార్థితయా మాం ప్రపద్యంతే తాం స్తథైవ తత్ఫలదానేన భజామి అనుగృహ్ణామి. అహామిత్యేతత్. తేషాం మోక్షం ప్రత్యనర్థిత్వాత్. నహ్యేకస్య ముముక్షుత్వం ఫలార్థిత్వం చ యుగప త్సంభవతి. అతో యే ఫలార్థినః తాన్ తత్ఫలదానేన యే యథోక్తకారిణ స్త్వఫలార్థినో ముముక్షవశ్చ తాన్ జ్ఞానప్రదానేన, యే జ్ఞానినః సన్న్యాసినో ముముక్షవశ్చ తాన్ మోక్షప్రదానేన తథా ఆర్తాన్ ఆర్తిహారణేన, ఇత్యేవం యథా ప్రపద్యంతే యే తాం స్తథైవ భజామీత్యర్థః. "తం యథా యథోపాసతే తం తమేవ ఫలం లభతే" ఇతి శ్రుతేః నపునః రాగద్వేషనిమిత్తం వా కించిద్భజామి సర్వథాపి సర్వావస్థస్య మమేశ్వరస్య వర్త్మ మార్గమనువర్తంతే మనుష్యాః. యత్ఫలార్థితయా యస్మిన్ కర్మణి అధికృతాః యే ప్రవర్తంతే తే మనుష్యా అత్ర ఉచ్యంతే. హేపార్థ సర్వశః సర్వప్రకారైః. అని శ్రీశంకరాచార్యులు.

మహాశయులారా! భగవద్గీతావాక్యమును వింటిరిగదా. ఏభక్తుఁడేవాంఛ మదినిల్పి నన్ను భజించునో ఆతని కావాంఛ నొసంగి కాపాడెదను. నన్ను భజింపక యింద్రాదిదేవతలను భజించిన ను ఆరూపమున నేనే వారికి ఫలముల నొసఁగెదను. కావున

నెల్లవారు నన్నే యాయాయిప్రకారముల ననుసరించు చున్నారు. అని పైదానిసారము. దీనిచేత మతభేదము లంత రింపలేదా. ఏరూపమున నేనామమున నెవని నుపాసించినను ఆరూపమున నున్నభగవంతుఁడే ఫలము నిచ్చుచున్నాఁడనఁగా భావమేమి? సర్వరూపములనుండువాఁ డొకభగవంతుఁడే యని కాదా! ఇట్టులుండఁగా దేవతలలో హెచ్చుతగ్గులేల వచ్చెనో తెలియకున్నయది. ఏభక్తుఁ డేరూపమున నేదేవతను సేవించినను దృఢభక్తి యతనిమదిఁ గుదురునేని ఫలము సమా నమే. ఏల? ఫలప్రదాతయొక్కఁడే. కావున దేవతాభేదములఁ బాటింపక యన్యసేవ్యదేవతల దూషింపక యల్పబుద్ధుల మాని భగవంతుని సర్వరూపునిగా ధ్యానించిన భక్తుఁడు తరించునే. లేనిచో నరకకూపమునఁ బడును.

శ్రీరామావతారమున మహర్షులుగూడ నాదివ్యరూప మును జూచి మోహపరవశులై స్త్రీరూపమునెత్తిన బాగుండునే యని తలఁచినట్టు లొకప్రాచీనసూక్తి కలదని పెక్కుపర్యాయ ములు వ్రాసియుంటిని. ఆసూక్తి యీప్రకరణముల ననేకకథల వలన సార్థకమే యని కనఁబడుచున్నదికదా. శూర్పణఖ రాక్ష సాంగన. వికృతరూపిణి. స్వేచ్ఛాప్రవర్తకురాలు. అటులయ్యుఁ బుత్త్రశోకమునుగూడఁ బాటింపక శ్రీరామచంద్రుని మోహిం చెను. ఇఁక నీపురుషుఁడు దొరకకున్న దేహము వ్యర్థమే యని యూహించెను. ఎన్నియోభంగులఁ బ్రార్థించెను. స్మరార్త రాలను. నాకామమును దీర్చి రక్షింపుమా యని చేతులొగ్గి

విన్నపమొనర్చెను. కాని శ్రీరామమూర్తి తమ్మునిఁ బ్రార్థింపుమా యని పనిచెను. అసత్యమాడెనా. కాదు. భగవంతుఁడు భక్తులఁ బరీక్షించును. ఎన్నిపర్యాయము లాపరీక్ష యని శంకింపరాదు. తుదవఱకుఁ బరీక్ష సాగించుచునేయుండును. త్రిశుద్ధిగా నెట్టియిక్కట్టులందును మది చెదఱనిచో నాతని నను గ్రహించుట మహావిష్ణువు నాశయము. లక్ష్మణుఁ డేమి సామాన్యుఁడా? ఏకాంతసేవచేయుట కరణ్యము తగినస్థలమని సర్వము దృజించివచ్చిన మహానుభావుఁడు. సీతారాములకు నేదాసుఁడ ననియె.

"విహాయ రామం సర్వేశం హే మూఢే దాస మిచ్ఛసి,
సీతాదాసీ చ మత్పత్నీ సీతాదాసోఽహామేవ చ."

అనియె. ఇదియే ప్రపత్తిమార్గము. నాభార్యయు నేనును సీతకు దాసులమనియె. సర్వేశుఁడు రాముఁడు. అట్టిపరాత్పరుని వదలి కింకరుఁడనగు నన్నేల కోరెదవని యడిగెను. దీని భావమేమి ? ప్రకృతి సీత. పురుషుఁడు సర్వేశ్వరుఁడగు రామమూర్తి. వారికి మేమిర్వురము దాసులము అనియె. లక్ష్మణుని మది నిశ్చలమైనది. ఇంచుకంతయుఁ జలింపదు. ఏమాత్ర మవకాశమీయక రామునే యాశ్రయింపుమనియె. నాసికాచ్ఛేదము శ్రీరామాజ్ఞచేఁ జేసెను. ఇదిన్యాయమా ? స్త్రీగనుక మన్నింపరాదా యనఁగూడదు. ముఖమున కలంకారము నాసిక. అదిలేనిచో దానింజూచువారుండరు. ఇఁక దీని కీలోకసుఖము పోవలయు. నన్నుఁ జూచి కామించెను. దీనికోర్కెతీర్చుట కిది

యదనుగాదు. ముందు సాగించెద. శ్రీకృష్ణావతారముకదా యందుల కుపయోగింపఁజను. నన్నుంజూచిన దానిని మఱి యొకఁడు కామింపరాదు. నాసికకోసిన నీఁక దీనింజూచువారుం డరు. దీని కామమంత యడంగు. అని యూహించి నాసికకోసి వేయుమని యానతిచ్చె. లక్ష్మణుఁ డట్లే యొనర్చెను. శూర్పణఖ శపించెను. తచ్ఛాపము తప్పదయ్యెను. ఆర్తులవాక్యము ఫలిం చునని మోహినీప్రస్తావమునఁ జెప్పియున్నాఁడను. తనపంతము నెగ్గకపోయెనే యని తపించెను. తనవలన రామునిచే మృతి నొందఁదగినవారినెల్లఁ బురికొల్పెను. వారికెల్ల సుగతిని గల్పిం చెను. అంతఁ బుష్కరమున కరిగి తపస్సొనరించెను. బ్రహ్మ సాక్షాత్కరించి. భగవత్సంగతి జన్మాంతరమునఁ గలుగుఁగాక యని వరమొసంగెను. అప్పుడ హుతవహునియందుఁ బడి మృతినొందెను. ద్వాపరాంతమున మధురానగరమునఁ గుబ్జ యనుపేర వికృతరూపమునఁ బుట్టెను.

త్రేతాయుగమున మృతినొందినశూర్పణఖ ద్వాపరాంత మున మధురానగరమున జన్మించినదనుక నెందుండెనని ప్రశ్నింప వచ్చును. భగవంతుని దలంచుచు మృతినొందినవారలకుఁ బుణ్య లోకములందు నివాసముండుననియు, నేతరుణమున భగవంతుఁ డవతరించునో ఆ కాలమున మరల వారు పూర్వలక్షణములఁ బుట్టుదురనియు సమాధానము చెప్పవలయునేకాని వేఱువిధ ముగఁ జెప్ప నవకాశముగాని పురాణప్రమాణములుకాని కాన రావు. శ్రీమద్రామాయణమున శూర్పణఖ తరువాతివృత్తాం

తము కానరాదు. దానికిఁ బ్రసక్తియే యందు లేదు. ఇం దావిషయమే ప్రధానముగాఁ జెప్పఁబడినది. యుక్తియుక్తముగ నున్నయీగాథనుండి యనేకవిషయముల నెఱుంగవచ్చును. పూర్వజన్మమునఁ జేసినకృషి ఫలింపక మానదన్ననీతి ననుసరించి శూర్పణఖ కుబ్జగాఁబుట్టినను, భగవత్సందర్శనమాత్రమునఁ దన వాంఛితమును బడయఁగల్గెను. ఆ విషయమును ముందు మీరు వినఁగలరు.

మహాశయులారా! బృందావనచరితమును సంగ్రహముగా ముఖ్యవిషయములను జేర్చి వ్రాసితి. ఆ సందర్భమున గోపికావృత్తాంతమును వ్రాసితి. ఇంక నెన్నియోచరితములు బృందావనక్రీడావిషయమందు వ్రాయఁదగినవి కలవు. సాధారణముగా భాగవతముచదివి శ్రీకృష్ణచరిత్రము నెఱిఁగియున్నవారల కివి క్రొత్తవిగాఁ గనుపట్టును. ఇంకను వ్రాయుటకంటె వీని నిట నిలిపి భగవదవతారప్రధానఫలమగు భూభారహరణకథలను వ్రాసెదను. అందు నడుమనడుమ సందర్భానుసారముగా మఱికొన్నికథలను వ్రాసెదను. అవహితులరగుఁడు. భగవత్కథాశ్రవణకుతూహలమున సంసారతాపత్రయములు మది నంటకుండఁ జేసికొనుఁడు. ముందుగ భక్తాగ్రగణ్యులగు శ్రీలీలాశుకు లొనరించిన శ్రీకృష్ణస్తవమును బఠింపుఁడు. ఆవలఁ దచ్చిత్రచరిత్రమును నాలకింపుఁడు.

శ్లో. ఆముక్తమానుషమముక్తనిజానుభావ
మారూఢయౌవనమగాఢవిదగ్ధలీలమ్,

ఆమృష్టయౌవనమనష్టకిశోరభావ
మాద్యం మహః కిమపి మాద్యతి మానసే మే. ౩. ఆ. ౬.
వ్రజజనమదమోహిల్లోచనోచ్ఛిష్టశేషీ
కృతమతిచపలాభ్యాం లోచనాభ్యాముభాభ్యాం
సకృదపి పరిపాతుం తే వయం పారయామః
కువలయదళనీలం కాంతిపూరం కదా ను. ౩. ఆ. ౧౨.
లీలయా లలితయావలంబితం
మూలగేహమివ మూర్తిసంపదాం,
నీలనీరదవికాసవిభ్రమం
బాలమేవ వయమాద్రియామహే. ౧౪.

భక్తశిరోమణులారా! బృందావనమున భగవంతుఁడు బాలలీలలచే గోపికలను గోపకుల నానందింపఁజేయుచు నందాదుల నానందాబ్ధినోలలాడించి గర్గాదిమౌనివతంసులకు నిరుపమానానందమును సంధిల్లఁజేయుచు రాధాదేవీ మనస్సరోరుహోదయభానుఁడై తనలీలల నెఱుంగఁజాలక దివిజు లచ్చెరుపడుచుండ బ్రహ్మాదు లపరిమితామోదమునఁ దన్ను ధ్యానించుచుండ స్వేచ్ఛగా నుండును. బాల్యము కొంచెము తగ్గెను. ఆ మహాత్మునిలీల లవాఙ్మానసగోచరములు. ఎవ్వ రెవ్వరు తన్నే మేమికోరి సేవించుచుండిరో వారివారి కాయాయిభావములఁ గనఁబఱచి సంతసింపఁజేయుచుఁ దనమాయ నెవ్వరికిఁ దెలియనీయక విహరించుచుండెను. ఇట్లు కొంతకాలము సుఖముగా గడచెను. బృందావనప్రాంతముల నున్నదానవు లొక్కరొక్కరే వరుసఁగాఁ జంపఁబడిరి. మహర్షులకుఁ గ్రమక్రమముగా

దానవబాధ లడఁగసాగెను యాదవులకు నందలిమానవులకును గష్టపరంపరలు తగ్గుచువచ్చెను. ఇట్టులుండ నా బృందావనము బృందారకపురమును దిరస్కరించుచుండెను. ఈ విషయమున మహాకవి పోతన,

క. "గిరిచరమిథునములోలిం
బరికింపఁగఁ గృష్ణపాదపద్మాంకితమై
సురరాజునగిరికంటెను
దరుణీ బృందావనంబు తద్దయు నొప్పెన్."

అని వ్రాసిరి. దీనికి మూల మేమూలనున్నదో యిపుడేలగాని పద్యము మిగుల హృద్యముగ నున్నయది.

"బృందావనం సఖిభువో వితనోతి కీర్తిం
యద్దేవకీసుతపదాంబుజలబ్ధలక్ష్మీః."

అనునదియే దీనికి మూలమని కొందఱూహింపవచ్చును. కృష్ణపాదపద్మము లన్నమాటలకుఁ బై శ్లోకము మూలము కావచ్చునేమో. ఆ గొడవ యిపుడేల? పద్యార్థము మిగుల మనోహరము. భగవన్మహిమము నుద్బోధించునది. అట్టి బృందావనమహిమ మగణ్యము. సురావళుల కేని శరణ్యము. భక్తుల కయ్యది సిద్ధాశ్రమము. దానియందు భగవంతుని దర్శించువారే పుణ్యముచేసినవారు. వారినేత్రములే సఫలములు. అట్టి బృందావనమున శ్రీకృష్ణుఁడు కొలఁదివత్సరములు భూభారహరణప్రయత్నమును మాని గోపికలసేవల నంగీకరించుచు గోపకులతో నాడుకొనుచునుండెను. నందాదులు తమతమగోవులతో సుఖం

బుండిరి. శ్రీ కృష్ణునకు రాక్షసపీడ లేకుండుటయే వారికిఁ బర మానందముగా నుండెను. ఇచ్చటిచరిత్ర మిట్లుండఁగా మథు రానగరవృత్తాంతము నించుక విచారింతము. మథురానగరచరి త్రమే జగద్భారావతరణ మూలకందము. భగవంతుని దివ్యమ హిమమును, అమానుషశక్తిని, భక్తరక్షణత్వము, సర్వతోముఖ సామర్థ్యము నా చరిత్రమే వెల్లడించును.

కంసునకు దుస్స్వప్నములు పొడకట్టుట.

* బృందావనమున శ్రీ కృష్ణపరబ్రహ్మము మహానందమున మూలప్రకృతియగు రాధాదేవింగూడి తనకైంకర్యమును గోరినగోపికలకెల్ల సేవాసౌఖ్యము నొసఁగుచుఁ దనయమానుష లీల లెవ్వరికిని గోచరముగాకయుండ నుండెను. కంసాసుర ప్రేరితులగు దానవుల నెందఱినో వధించెను. ఆచర్యలం గాంచియు గోపకులు నందాదులు శ్రీకృష్ణుఁడు యాదవ మాత్రుఁ డగునా యని యూహింపఁజాలకుండిరి. క్షణమాత్ర మట్టి విజ్ఞానము వారికిం గల్గిన నది శ్రీకృష్ణమాయాచ్ఛాదితమై యడఁగుచుండెను. కావున నుత్తరక్షణమున నాజ్ఞానము పోవ సామాన్యునిగా భావించుచు నామహాపురుషుంగూడి వేడు

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము, గర్గసంహిత, బ్రహ్మపురాణములనుండి వ్రాయఁబడినదని యెఱుంగనగు. శ్రీ భాగవతమునం దీకథ యించుకమా త్రపుతోఁ గానఁబడియుండిని. విష్ణుపురాణము భాగవతమునే యనుసరించును. హరివంశము తనస్వాతంత్ర్యమును బ్రకటించును. కాన నిన్నింటిలోనివిశేష ములఁ గలిపి వ్రాసెదను.

కమైఁ గాలము గడపుచుండిరి. యశోదాదులు నాయనా రారా యని పిలుచుచునే యుండిరని యూహింప నవకాశము గలదు. ఇట్టు లీబృందావనస్థితి యుండెను.

మథురానగరమునఁ గంసుఁడు తనపంచినపూతనాదులు శ్రీకృష్ణహతులగుటకుఁ జింతించుచు నేయుపాయమున నంద నందనుల శ్రీరామకృష్ణులఁ బొలియింతునా యని యూహిం చుచు నుండెను. ఎట్టిమాయపన్నిన నది వ్యర్థమైపోవుచుండెను. గాన నతనికాకులత్వ మధికమయ్యెను ఇట్టులుండఁగానొకనాఁటి రేయి నాతనికి దారుణదుస్స్వప్నములు తోఁచెను. ఉలికిపడి లేచి వానిందలంచుకొని మఱిమఱి పరితపించుచు నిఁకఁ జేయఁ దగునుపాయ మెద్దియని యాలోచించుచు నేదియుఁ దోఁపమి దల్లడిల్లుచు నెట్లో యారాత్రిఁ గడపి భీతుఁడై కాల్యములం దీర్పక యుచితాహారమును గొనక యుత్సాహవిహీనుఁడై పుత్ర మిత్రబంధుగణంబులఁ బురోహితులను బిలుపించి పేరోలగమున నుండియే పొరలిపొరలి వచ్చుదుఃఖమున మోము వెలవెలఁ బాఱగా నిట్లు పలికెను. "నామేలుగోరు మీరెల్లఁ జక్కఁగ నాలకింపుఁడు. రాత్రి నాకుఁ గొన్నిభయంకరదుస్స్వప్నములు కనఁబడినవి. బంధువులు పురోహితులు లోనగువారుకదా నాకు శలమును సదా కోరుచుండువారు. కావుననే మీకుఁ దెల్పె దను. ఒకానొక క్రూరరాక్షసి రక్తపుష్పమాలికను ధరించి రక్తచందనమలంది రక్తాంబరమునుగట్టి తీక్ష్ణతరఖడ్గమును భయం కరకర్పటమును జేతులంబూని భయదాట్టహాసము పలుమాఱు

చేయుచు నాలుక నాడించుచు భయంకరరూపము కనంబడఁగా మిగులవృద్ధయై కాలునలుపుతనువు దృష్టిని చెదరఁజేయ నాన గరమున నాట్యము చేయుచున్నట్లు తోఁచెను. దానిశిరోజములు విరియఁబోసిన ట్లుండెను. నాసిక సగము తెగిపోయిన ట్లుండెను. విధవగా నది నాకుం దోఁచెను. మహాశూద్రి యని యూహిం చితిని. అక్రూరదానవి నన్నుఁ గౌఁగిలింపఁగోరుచున్నది. దానికిఁ గృష్ణాంబరములు ప్రియములుగానుండు నని తోఁచినది. మాసి పోయిన పైఁటచెఱఁగునఁ గొంతభాగము చించి చేతఁబట్టుకొని రూక్షమూర్ధజములు భీతిని బుట్టింపఁ జూర్ణతిలకమును ధరించి నావక్షమునఁ గపోలములఁజేర్చి నిలుచున్నట్లు పొడకట్టెను. పక్వములయి భిన్నభిన్నములయియుండు తాళఫలములను భయ దాట్టహాసములఁ బడఁగొట్టుచు నృత్యము చేయుచున్నట్లుండెను. మాసినవస్త్రమునుగట్టుకొని వికారముగ నాకారము కనుపట్టి రూక్షమూర్ధజుఁడగు నొకమ్లేచ్ఛుఁ డాక్రూరదానవికి మద్యము నొసఁగుచు నలంకారముల నందిచ్చుచుండెను. ఒకస్త్రీ మహా రోషముగలదిగను, దేవతాప్రోత్సాహితగను, బలిపుత్త్రులుగల దిగను దోఁచి శపించుచుఁ బూర్ణకుంభమును బ్రద్దలగునట్లు కొట్టెను. వాడనిపూలమాలలను ధరించి రక్తచందనచర్చ యలర నొప్పెను. ఒకబ్రాహ్మణుఁడు మహారోషమున మండిపడుచు నన్ను శపించెను. ఒకక్షణకాలము నిప్పులవాన కురిసెను. ఒకక్షణము భస్మవృష్టి కురిసెను. క్షణక్షణము రక్తవృష్టి కురియుచునే యుండెను. నానగరమంతయు రక్తవృష్టిని నిముఁ

గిన ట్లుండెను. వానరము, వాయసము, శునకము, భల్లూకము, సూకరము, ఖరము, వికారముగను భీతినిగల్గించునట్లును శబ్దము చేయుచుండఁగా నేఁజూచితిని. ఎండుకట్టెలరాశిని, అమ్లానకజ్జలమును, గోళ్లుతెగఁగోసికొనుచున్న వానరకాంతను, సూర్యోదయకాలమున నేఁగంటిని. ఒకానొకనారీమణి పీతవస్త్రధారిణియు, శుక్లచందనచర్చితయు, మాలతీమాలికాధారిణియు, రత్నభూషణభూషితయుఁ, గ్రీడాకమలహస్తయు, సిందూరబిందుశోభితయునై మహారోషమున నన్ను శపించుచు నామందిరమునుండి వెడలిపోయెను. పాశములు కరములఁ గనఁబడ వెంట్రుకల విరియఁబోసికొని భయంకరాకారులై చూడఁజాలనంత యెఱ్ఱగా నయనములుండఁగాఁ గొందఱు పురుషులు నానగరమును బ్రవేశించుచుండఁ జూచితిని. వస్త్రవిహీనరై ముక్తకేశులై వికృతాకారరై నాగృహములయందెల్ల నాట్యముచేయుచుఁ జిఱునవ్వునవ్వుచు నుండఁగా నేఁజూచితిని. నాసికావిహీనయు, దిగంబరయునగు నొకమహాశూద్రి (గొల్లపడుచు) మహాభీతినిగల్గించుచు నాదేహమునిండ నూనెపూయుచుండెను. నిర్వాణాంగారయుక్తములై భస్మపూర్ణములై దిగంబరములై విచిత్రరీతులఁ గనుపట్టుభూతములుదయభానునికరములు భూతలమున వ్యాపించుతఱి ననేకప్రకారముల నాకుం గనుపట్టెను. ఆభూతములెల్ల నవ్వుచునేయుండుటం గనిపెట్టితిని. నృత్యగీతమనోహరమగు వివాహమును గనుఁగొంటిని. రక్తవస్త్రములం గట్టి యెఱ్ఱని వెంట్రుకలుగలిగిన పురుషులం బెక్కండ్రఁ

గాంచితిని. దిగంబరుఁడై వికారముగా రక్తమును గ్రక్కుచు నాట్యము చేయుచుఁ బలుగిడుచు శయనించుచుఁ జెలునవ్వ్వి శనఁబలుచుచుండఁగాఁ గన్నులారఁజూచితిని. ఆకాశమున రవి చంద్రులు రాహుగ్రస్తులగుచుండినట్లు లగపడియెను. ఒక్కసమయమందే వారిరువురు రాహుగ్రస్తులై కనఁబడకపోయిరి. పురోహితవర్యా! ఉల్కాపాతము, ధూమకేతువు, భూకంపము, రాష్ట్రవిప్లవము, ఝంఝామారుతము, మహోత్పాతములు, పలుభంగుల నాకుం దోఁచెను. ప్రళయము వీచుచుండఁగా భూరిశాఖలు విరిగిపడ మహామహీరుహములు వేళ్లతోఁ గూలినట్లు లగపడియెను. ఆవాయువేగమునకుఁ దాళఁజాలక పర్వతములు పడిపోయినట్లు స్పష్టమయ్యెను. అత్యున్నతపురుషుఁ డొకఁడు శిరస్సు ఖండింపఁబడఁగా నృత్యము చేయుచుండ మండలాకారముగాఁ దిరుగుచు నాకగపడియెను. ఆతఁడు ప్రతియింట నున్నట్లు దృష్టికిం దోఁచెను. నివాసములెల్ల మండిపోవఁగా భస్మము సర్వత్ర వ్యాపింపఁగా నంగారములెల్లెడలఁ బర్వుచుండఁగా హాహాకారము లంతటఁ గావింపఁబడుచుండఁగా నగరమెల్లఁ జీకాకుపడుచున్నయట్లు నాకగపడియెను.” అనిపలికి కంసభూపతి మౌనముద్రం దాల్చెను.

బాంధవులు లోనగువారెల్ల రాదుస్స్వప్నముల విని నిట్టూర్పులం బుచ్చిరి. పురోహితుఁడగు సత్యకుఁ డుల్లి మూర్ఛిల్లెను. తనప్రభువగు కంసునకు వినాశనము తప్పదని యతనికిం దోఁచెను. కంసపత్నులెల్ల బోరున నేడ్చిరి. పితృమాతృ

వర్గమంతయు బెల్లుగ భీతిల్లెను. కంసునకు వినాశకాలము తనంతటతానే సిద్ధమగునని యెల్లవా రూహించిరి.

* పాఠకులారా! ఈదుస్స్వప్నవిషయము భాగవతాది పురాణములలోఁ గానరాదు. నారదవాక్యము ననుసరించి బలరామకృష్ణులం జంపఁ గంసుఁ డెంచెనని కనఁబడియెడిని. ఆవిషయము నిటఁ జేర్చుట న్యాయముగాన నించుక వ్రాసెద. † కంసుఁడు తనయనుచరులు పెక్కుమంది శ్రీకృష్ణునిచేతను హతులుకాఁగా నుత్తలంపడుచుండ దేవలోకమునుండి నారదముని యరుదెంచి కంసునిచేఁ బూజితుఁడై మహీపాలకా! నీ వానాఁడు దేవకికన్నకూఁతురని చంపఁబూని యథాపూర్వముగ నెగురవేయ నది మింటినుండి నీకుఁ జెప్పినమాటలు మఱచితివా. నిన్నుంజంపఁబుట్టినవాఁ డీసమీపమున నున్నవాఁడని వినలేదా. ఆతఁడే శ్రీకృష్ణుఁడు. అతఁడు దేవకీదేవిపుత్రుఁడని నమ్ముము. ఆపుత్రిక యశోదకూతురు. బలరాముఁడు రోహిణీపుత్త్రుఁడు. వసుదేవుఁడు నీవలనిభీతిచేఁ దనకొడుకుం గొంపోయి నందున కొసంగెను. ఆతనిపుత్రికనుం దెచ్చెను. నందవ్రజమున బలరామకృష్ణులు దినదినప్రవర్ధమానులగుచు

---

*గర్గసంహితయందు బ్రహ్మపురాణమునందు శ్రీభాగవతమునందు విష్ణుపురాణమునందును నైకథలేదు నారదునివాక్యమువిని కంసుఁడు రామకృష్ణులఁ జంపం బ్రయత్నించినట్లు కనఁబడియెడిని. దానిని విడిచిపుచ్చుట పాడిగాదని తోఁచి యిటఁ జేర్చితినని యెఱుంగునది. † కంసాయ ప్రాహ భగవాన్నారదో దేవదర్శనః. అని శ్రీభాగవతము.

శుక్లపక్షనిశాకరుని బోలియున్నవారు. నీపరిజనులను బూతనా శకటాసురప్రముఖులఁ జంపినది వారేయని తలంపుము. ఈ మోసమంతయు వసుదేవుఁడు చేసినదియే యని నమ్ముము. అనినంతనే కంసుఁడు మండిపడి దేవకీకుమారుఁడు కృష్ణుఁడై యుండ వానింగొనిపోయి వ్రజమున నందునిమందిరమున నునిచి నందనందనఁ గొనితెచ్చి నన్ను మోసపుచ్చిన వసుదేవునిం జంపుటొప్పునని కృపాణపాణియై వసుదేవునిచెంతకుంబోయినంతనే నారదుఁ డఁట బొడచూపి నాయనా! ఇది చేయరానిపని. నీవంటి భూపతు లిట్టి యకృత్య మాచరింపరాదు. అది తప్పక ముప్పు దెచ్చును. ఒకప్పుడు కృష్ణునిచే మరణము తప్పినను దప్పునేమో కాని యీతనింజంపినఁ దప్పక శ్రీకృష్ణునిచే మృతితప్పదు. నా మాట నమ్ముము. ఈ కార్యమును మానుమని వానియుద్రేకమును మరలించెను.

కంసుఁడు నారదవాక్యమును విని మానకున్న శోపించు నన్నభీతిచే వసుదేవుని దేవకిని బంధించి కారాగారమున నునుప నాజ్ఞాపించెను. నారదుం డదిమంచిదియే యని భావిగతుల నెఱింగినవాఁడౌటఁ గంసునకుఁ దెలుపఁదగినవిషయములం దెల్పి దేవకీవసుదేవుల కాతనివలనఁ బ్రాణభీతిలేకుండఁ గట్టుదిట్టములు చేసి తనదారిం బోయెను. నారదుఁడు హితముపదేశించి పోయినవెనుకఁ గంసుఁడు బలరామగోపాలవధప్రయత్నమున సమాదరుఁడై యుండెను.

భక్తవర్యులారా! ఈకథనుండి యెఱింగింపఁదగిననీతులు విశేషించిలేవు కానియొకవిషయముమాత్రమవశ్యముగ్రహింపఁ

దగినది లేకపోలేదు. కంసుఁడు బలరామకృష్ణులఁ జంపింప నెన్నియో ప్రయత్నములను జేయుచునే యుండెను. విసుగు వాని మదిఁ దోఁచుటయే లేదని మన మూహింపవచ్చును. కాలము సమీపించుకొలఁదిని దల్లక్షణములు హెచ్చరించుచుండవల యునని విధికదా! కర్మ మెన్నివిధములఁ దెల్పినను బ్రాకృతులు దానిగతుల నరయఁజాలరు. ధీరు లెఱింగి జాగ్రత్తగా నుందురు. ఈసిద్ధాంతమే యీకథ మనకుఁ దెలుపుచున్నయది. ప్రతిమానవునకు స్వప్నములు దోఁచుట స్వభావము. కొన్నికొన్ని సద్యః ఫలప్రదములు. స్వప్నముఫలముల నీఁజాలదన్నవాద మొకఁడు కలదు. అది నేనెఱుంగుదు. ఇప్పుడు కంసునకుఁ దోఁచినవని వ్రాసిన వట్టివికావు. సాధారణస్వప్నములవలెఁగాక విధిప్రేరితములై యశుభవస్తువులు స్వభావవిరుద్ధముగాఁ గనఁబడును. అంతియగాక మనయూహలుకూడ భావిఫలము ననుసరించి మాఱుచుండును. స్వప్నరూపములఁ గర్మమే భావిఫల మిట్టిదని తోఁపింపఁజేయుననుట నిర్వివాదాంశమని నాభావము. కంసునకుఁ దోఁచినయొక్కొక్కస్వప్నముశీఘ్రమరణమునుదోఁపఁజేయును. నీపరిజనులు నీగృహములు నీబంధువులు త్వరలో నశింతురని కొన్ని తెలుపఁజాలియున్నయవి. నీయదృష్ట మిదె తొలఁగుచున్నది. అనఁగా నీరాజ్యలక్ష్మినగునే నిదె పోవుచున్నదానను. నీకిఁక నిలపై నిలుచుప్రాప్తము లేదనియే నేనరుగుచున్నదానని కొన్ని తెల్పుచున్నవి. నీక్రూరకృత్యములకుఁ దగినదుష్ఫలమనుభవింపక తప్పదని కొన్ని తెలియఁజేయుచున్నయవి. ఇట్లు

స్వప్నములన్నియు నస్వాభావికములగుట నాశుమృతిని వెలియఁ జేయుచున్నవి. కాఁబట్టి మనము జేసికొనినకర్మమే భావిఫలము లిట్లుండునని నానాముఖముల హెచ్చరించుచుండుననుట స్పష్ట ము. కావున సాధారణములుగాని స్వప్నములుతోఁచినపుడు భగవన్నామసంకీర్తనము చేసి భగవంతు నారాధించుట సమం చితిమార్గము. దాన రాఁగలదుష్ఫలములు తొలఁగునా యన రాదు. కర్మములు రెండువిధములు దృఢమూలములు, నదృఢ మూలములు అని. దృఢమూలకర్మములకుఁ బరిహారములు లేవు. ప్రాయశ్చిత్తము లొనరించిన నవి ఫలింపకతప్పవు. అదృఢమూల ములగుకర్మముల కనేకవిధములఁ బరిహారములు గలవు. అవి యొనరించిన నవి ఫలింపకపోవచ్చు. ఆప్రాయశ్చిత్తములలో సక లాపత్పరిహారకమగు భగవన్నామసంకీర్తనము ప్రధానమనుట కెవ్వరి యాక్షేపము గలుగదని నాయాశయము. ప్రాయశ్చిత్త ములన్నియు భగవత్కరుణకుఁ బాత్రునిగాఁజేయుట కేర్పడినవని నావిశ్వాసము. అట్టులుండ నిఁక భగవన్నామము సకలాపత్పరి హారదక్షమనుట కెవ్వ రంగీకరింపరు? సర్వజనాంగీకారమును, సర్వమతసమ్మతమును బడసినది భగవన్నామము. దానిని స్మరించి నచోఁ బాయనియాపద లుండవు. కాఁబట్టి యిక్కట్టు లలము కొన్నపు డాపత్పరిహారకునినామస్మరణమే ముఖ్యము. తరువాతి కథ నాలకింపుఁడు.

కంసుఁడు పురోహితునివాక్యమురీతి ధనుర్యాగము చేయఁబూనుట.

* కంసుఁ డీరీతి దుస్స్వప్నవృత్తాంతములఁ దెలుపఁగాఁ బురోహితుఁ డగుసత్యకుఁడు వానిని విమర్శించి బుద్ధిమంతుఁడు శుక్రశిష్యుఁడుగాన నీతిశాస్త్రానుసారముగా నిట్లుత్తరము చెప్పెను. మహారాజా! భయము నవలం బాఱఁద్రోలుము. నే నీకుఁ బురోహితుఁడనై యుండ భయమెట్లువచ్చును? సర్వారిష్టవినాశనార్థమై మహాశయాగ మొనరింపుము. దానికి ధనుర్యాగమని పేరు. బహ్వన్నదానము చేయఁదగును. భూరిదక్షిణ లీవలయును. దుస్స్వప్నము లాయాగమునఁ దొలఁగు. శత్రుభీతి యీయాగకర్తకుఁ గలుగదు. ఆధ్యాత్మికము, నాధిదైవము, నాధిభౌతికమను తాపత్రయముల మొదలంట నిర్మూలించి మహత్తరైశ్వర్యమును జేకూర్చును. యజ్ఞము పూర్తికాఁగా శ్రీ పరమేశ్వరుఁడు సాక్షాత్కరించి జరామృత్యుహరమగువరము నొసఁగును. సర్వసంపత్ప్రదాతయగు శంకరుఁడు కనఁబడఁగాఁ గొఱంతయేమి యుండును ?

ఈ యాగమును మహాబలుండగు బాణాసురుండు మున్ను చేసెను. నందియుఁ బరశురాముఁడు భల్లుఁడు యాగమును దీని నొనరించిరి. పూర్వ మీ ధనుస్సును నందీశ్వరున కీశ్వరుఁ డొసంగెను. ఆనందీశ్వరుఁడు యాగఫలమును బొంది బాణా

* శ్రీకృష్ణజన్మఖండ బ్రహ్మపురాణ శ్రీభాగవత విష్ణుపురాణ హరివంశ గర్గసంహితలనుండి యీకథ వ్రాయఁబడును. అన్నింటియందలివిశేషము లిందుం డునని యెఱుంగునది.

సురుఁ డర్థింప నొసంగెను. *ఆబాణాసురుఁడు యాగమొనరించి భగవదనుగ్రహపాత్రుఁడై పుష్కరతీర్థమున రామున కిచ్చెను. ఆ పరశురాముఁడే ఆ ధనుస్సును నీకు ననుగ్రహించెను. కృపానిధులగు సజ్జనులు, పరోపకారమునకే పాల్పడుచుందురుగాని తనమేలునుమాత్రమే కోరరుకదా! ఆధనుస్సు వేయిహస్తముల పొడవుగలది. అతికఠినము. దశహస్తోచ్ఛ్రితము. అది శంకరేచ్ఛావినిర్మితము. పశుపతి పాశుపతము కోదండమునఁగూర్చ నెవరికేని శక్యము. అదియెల్లరం జంపఁగలదు. నారాయణమూర్తి నేమనఁజాలదు. ఈ యాగము శంకరప్రీతికరము. కావున నిమ్మఖమున ధనుఃపూజయు శంకరపూజయుఁ జేయఁదగినది. ఈ యాగమును శీఘ్రుంబ చేయఁ బ్రయత్నింపుము. రాఁదగినవారిని రప్పింపుము. భూపాలా! మఱియొకవిశేషము కలదు. ఈ యాగము పూర్తికాకపూర్వము ధనుర్భంగము సంభవించెనేని యజమానునకు వినాశము తప్పదు. ఇందులకు సందియమేలేదు. ధనుస్సు భగ్నముకాఁగా యాగము భగ్నమగును. ఇది నిశ్చితము. ప్రారంభించినకార్య మంతరాయదూషితమగునేని ఫలము నిచ్చువాఁడెవఁడు? ఆ ధనుస్సుమూల

---

* కృత్వా యాగం మహాసిద్ధో దదౌ రామాయ పుష్కరే. అనిమూలము. బాణాసురుఁడు ద్వాపరాంతమున నున్నవాఁడువీఁడుకాఁడని కొందఱందురు. భగవదనుగ్రహపాత్రునకమితాయుస్సు కలుగుట విచిత్రముకాదు. కావున నప్పటినుండి బాణుఁ డుండవచ్చునని యూహించినను బ్రమాదము లేదని నాయాశయము.

మున బ్రహ్మయు నడుమ నారాయణమూర్తియు నగ్రమున మహోగ్రమూర్తియగు భర్గుండు నుందురు. ఆధనుస్సు త్రిమూర్తిస్థానము. సద్రత్నఖచితము. గ్రీష్మకాలమార్తాండచండప్రభాప్రచ్ఛన్నకారణము నగునాధనుర్వరమును మహాబలుండగు ననంతుఁడైనను మోపెట్టఁజాలఁడు. సూర్యుఁడు కార్తికేయుఁడును మోపెట్టఁజాలరు. తక్కినవారిమాట యిట జెప్పనేటికి? ఈ ధనుస్సుదాల్చియే త్రిపురముల నొక్కత్తునఁగాల్చి త్రిపురారి యనంబరఁగి శంకరుఁడు లోకములఁ గాపాడెను. నిర్భయముగా మంగళలాభముకొఱకు మహోత్సాహమున నీయాగము చేయుము.

అని పురోహితుఁ డగుసత్యకుఁడు వచియింపఁగా విని కంసుఁడు తనకు సకలవిధములు మేలుగోరు నాప్తులనెల్లం గలయంజూచి యిట్లు పలికెను. ఆప్తులారా! వసుదేవు నింట నన్నుం జంపువాఁడు కులనాశనుఁ డొకఁడు పుట్టెనట. వాఁడిపుడు నందుని మందిరమున స్వచ్ఛందవృత్తిఁ బెరుగుచు నందనందనుఁ డన నున్నవాఁడఁట. నాకు బంధువులై శూరులై మంత్రులై సకలకార్యదక్షులగువారిని తోఁబుట్టువగు పూతనను నా బాలకుఁడు బలశాలియై వధించెను. ప్రతిక్షణవిలక్షణబలము కలవాఁడు కావుననే యొకకరమున గోవర్ధనాద్రి నెత్తెను. మహాశూరుఁడగుమహేంద్రునకుఁ బరాభవమును గల్గించెను. బ్రహ్మను గనఁబఱచెను. సనాతనబ్రహ్మరూపమును జూపి యెల్లర నాశ్చర్యరసనిమగ్నులనుజేసెను. చరాచరములగు వస్తువులెల్లఁ దనయవ.

యవము లయినట్లు కనఁబఱచెను. బాలవత్సనివహములనెల్లఁ గల్పించెను. ఇది యాతనియుదంతము. నే వింటిని. పురోహిత వర్యా! ఆ బాలుని వధించుట కనువగునుపాయము చెప్పుము. నాకీభూలోకమున నా బాలుఁడుతప్ప శత్రువే లేఁడు. స్వర్గపాతాళములయందుఁగూడ విరోధిలేఁడు. ఇది నిశ్చితము. పెక్కుమందిరాజులు నాకు మిత్రులు గలరు. బాంధవు లనేకులు గలరు. త్రిమూర్తులును మహాపూజ్యులు. నాయందు వారికిఁ గృపకలదు. ఈనందపుత్త్రుని వధించితినేని ముల్లోకములందును బూజ్యుఁడనే యగుదును. సప్తద్వీపములయందు నేఁజక్రవర్తినగుదును. దేవారులచే జయింపఁబడి దుర్బలుండగు దేవేంద్రు నోడించి మహేంద్రుఁడ నగుదును. భాస్కరు నోడించుట నాకు లక్ష్యము కాదు. నాకులమునకుఁ గూటపురుషుఁడై యక్ష్మగ్రస్తుఁడగు శశాంకుని జయించుటయు నాకు సులభకార్యమే. వాయు కుబేరవరుణయముల జయింపఁగలనన్న నమ్మకము నాకున్నది. సత్యకా! ఇపుడే ప్రయాణముచేయుము. నందవ్రజమునకుఁ బొమ్ము. నందనందనుఁ గృష్ణుని బలరామునిఁ గొనితెమ్ము. ఇపుడే ప్రయాణముచేయుమని పలుకుకంసుని నుడుల నాలకించి సత్యకుఁ డిట్టు లనియె. ఆవాక్యము హితమై నీతిసారమై కాలానుగుణమునై యుండెను.

మహారాజా ! నేఁబోవుట న్యాయముకాదు. బలరామ కృష్ణులఁ గొనితేర నక్రూరునిగాని, యుద్ధవునిగాని, వసుదేవుని గాని, పనుచుట యుక్తమని నాకుందోఁచెడిని. నావిని కంసుఁడు

కొలువునెల్లఁ గలయఁజూచి యం దున్నతాసనమునను న్న వసుదేవునింగాంచి యంతకుముందే కారాగారమునుండి విముక్తుంజేసి సభకుఁ బిలిపించియున్న వాఁడుగాన వసుదేవా ! నీతిశాస్త్రసారజ్ఞుఁడవు. ఉపాయ విశారదుఁడవు. నాకు బంధువవు. కావున నందవ్రజమున కరుగుము. అందు నీతనయుఁ డున్నవాఁడు. వృషభానుని, నందుని, బలుని, నందనందు, నింకను గోకులమునఁ గలమనవారినందఱిని ధనుర్యాగమునకుఁ బిలుచుకొనిరమ్ము. దూతలు శుభపత్రికలంగొని నలుదెసల కరుగఁగలరు. రాజులను మునిరాజులను బిలుచుకొనివత్తురు. అని మృదువాక్కులఁ దనభావమును దెల్పెను. ఆమాటలు వినఁగనే వసుదేవునకుఁ గంఠ మెండఁబాఱెను. నాలుకయెండెను. ఓష్ఠములు శుష్కములయ్యెను. హృదయ మదురసాగెను. ఇట్టి శ్రమములంబడుచు దీనత మోమునఁదోఁపగా నిట్లు పలికెను. మహారాజా ! ననుఁ బయనముచేయుట న్యాయముకాదు. నందవ్రజమున కరిగి నందునిఁ దన్నందనుని రమ్మని నియోగించుటయు నాకుఁదగినపనికాదు . నీవొనరించుయజ్ఞమహోత్సవమునకు నందతనయుఁడువచ్చునేని నీతో నతనికి విరోధము తప్పక కలుగును. నేనతనిం గొనివచ్చి నీతోఁగూర్తునన్న నమ్మకము నాకులేదు. దాన నాకు మేలులేదు. నీమహోత్సవమున కంతరాయము తప్పక కలుగును. ఒకప్పుడు నీచేత నతనికి మృతికల్గునేని తండ్రియే పిలుచుకొనివచ్చి కొడుకును జంపించెనని లోకులందురు. అతనిచే నీకేహానిగల్గునేని వసుదేవుఁడు కొడు

కును బురికొలిపి రాజును జంపించెనందురు. మీయిరువురిలో నొకరికి మృతి తప్పక కలుగును. శూరు లాయాహవమునం జెక్కుంద్రుపడుదురు. రక్తప్రవాహములేని సంగరము లేదు కదా !

అని వసుదేవుఁడు పలుకఁగనే కంసునినేత్రము లెఱ్ఱనై రక్తపంకజములవలెఁ గనఁబడియెను. వెంటనే కరమున ఖడ్గము ధరించి జళిపించుచుఁ గంసుఁడాతని వధింపఁబోయెను. సభయందెల్లెడల హాహాకారములు చెలరేఁగెను. ఉగ్రసేనుఁ డాసనమునుండి లేచి కొడుకును వారించెను. కంసుఁడు నారద వచనము స్మృతికి రాఁగా జనకుఁడు వలదనుటయు దానికిఁ దోడు పడఁగా వెనుకకు మరలెను. వసుదేవుఁ డాగ్రహమున నాపీఠమునుండిలేచి గృహమున కరిగెను. అవ్వలఁ గంసుఁ డక్రూరుంజూచి నందవ్రజమునకుఁ బంప నుద్దేశిగించెను. తనభావము నతనికిం దెలిపెను. ఆతఁ డాదరమున నంగీకరించెను. వెంటనే నలుదెసలకు దూతలు పంపఁబడిరి. *ఆసభయందుండియే కంసుఁడు యాదవుల నసూయనూని యాక్షేపించెను. ఈమహారాజులఁ బరిగణింపవలయుఁ గాఁబోలునని యెకసక్కెము లాడెను. రామకృష్ణు లెంతబలపరాక్రమసంపన్నులని విఖ్యాతిం గాంచిరో అట్టివారిని వధించుటకే గట్టిప్రయత్న మొనరించెద ననియె. మహావీరుఁడగు చాణూరుఁడు మహత్తరబలుఁడగు

*ఇటనుండి బ్రహ్మపురాణాదుల ననుసరించి కథ వ్రాయఁబడునని తెలియందగును.

ముష్టికుఁడు నాయొద్దఁ గలరు. మల్లయుద్ధమున వీరిచే నాబాలకుల వధింపఁజేసెదను. నాకడనున్న యిద్దఱు దుర్మదులు ఎట్టివారినేని దిట్టతనంబున మట్టుపెట్టఁగలరు. నందవ్రజమునుండి ధనుర్యాగమహోత్సవవ్యాజమున రామకృష్ణుల నెట్లో యిచ్చటికిఁ బిలిపించి యీశూరులచే వారిఁ దుదముట్టించెద. అని చూర మాలోచించి యది తనమదికి సరిపడఁగాఁ దప్పక నిట్లే చేయఁదగునని నిశ్చయించుకొనెను. ఉపాయము పన్ని బలరామకృష్ణుల మధురకుఁ బిలుచుకొని రాఁదగినవారిలో నక్రూరుఁ డుత్తముఁడని యూహించి మర్యాద యుట్టిపడఁగా నాతనిం జేరఁబిల్చి రహస్యముగా దానపతీ! నాకు హితము చేయఁబూనినవారిలో నీవే యగ్రేసరుఁడవు. కావున నీతోఁ జెప్పినకార్యము వృథకాదని తలంచెదను. నీ విటనుండియే యరదమెక్కి నందగోకులమున కరుగుము. అందు వసుదేవుని కుమారకు లిద్దఱు విష్ణ్వంశసంభూతులు గలరు. వారు ననుఁ బొలియింపఁ బుట్టినవారఁట. ఆదుష్టు లిర్వురు దినదినప్రవర్ధమానులగుచున్నవారు. ఇట ధనుర్యాగము రాఁబోవు చతుర్దశి యందుఁ గాఁగలదు. ఆదినమునకు వారినిద్దఱిని మధురాపురమునకుఁ దోడ్కొనిరావలయు. మల్లయుద్ధము చేయఁ బూన్చెదను. బాహుయుద్ధమున మనచాణురముష్టికులు త్రిలోకవీరులు కదా! వారితో వీరు బాహుయుద్ధముచేయ నెల్లరు జూతురుగాక. కువలయాపీడనామకగజరాజము నాయొద్దఁ గలదు కదా. అది మహామాత్రప్రచోదితమై వసుదేవతనయు

లగునాశిశువుల నిసువులు తోలఁగఁజేయఁ జాలియుండును. వారు తెగినంతన నేను వసుదేవుని, నందుని, నాతండ్రియగు నుగ్రసేనుని వధియించెదను. వీరెల్లఁ దుర్మతులు. నాకీడుకోరు వారు. వీరు తెగినపిదప సమస్తగోపకులను వారిగోధనములను, వారిరత్నరాసులను హరించెదను. ఏలయన వారిపుడు నాపై ద్వేషమూనియున్నవారు. నిన్నుఁదప్ప యాదవులనెల్ల వధింపఁ బ్రయత్నించెదను. వరుసగా నీకార్యముల నెల్లఁ జేయఁబూనె దను. అపుడు నారాజ్య మిది నిష్కంటకమై యాదవరహితంబై పాలుపారఁగలదు. ఈసాయము తొలుత నీవలనఁ గావలసి యున్నది. నిన్నుఁ గార్యాంతమున గౌరవించెద. దానపతీ! నీవు నాకార్యముపొంటె నందవ్రజమునకుం బొమ్ము. నీవచ టికింబోయి మాహిషసర్పియు దధియు గోక్షీరములు గైకొని యాదవులెల్లవచ్చునదియని వారికి నాసందేశముం దెల్పుము. అనిపలికి కంసుఁ డూరకుండెను.

అక్రూరుఁడు పరమభాగవతులలో నొక్కఁడు. సదా శ్రీకృష్ణపాదసేవచేయుభాగ్యము గల్గుఁగాక యని కోరువాఁడు. శమదమాదిసంపత్తిగలమాననీయుఁడు. కంసునకు నెచ్చెలి యని పించుకొన్నను మది నాతనికుత్సితకార్యములకు రోయుచుండు వాఁడు. శ్రీకృష్ణజననాదులరహస్యముల నాతఁ డెఱుంగును. శ్రీకృష్ణునిచేఁ గంసునకు మృతిగల్గునని యాతఁడెఱుంగును. భగవద్దర్శన మెప్పు డగునా యని యువ్విళ్లూరుచుండు మది గలవాఁడు. వినయవివేకధనుఁడు. దానపతి యనుబిరుదనామ

మతనికిం గలదు. అదియే యాతనిపేరని కొందఱందురు. స్వభావమునుబట్టి యక్రూరుఁడని యతని నందఱుం బిలుతురనియుఁ బైవారిభావము. అది యట్లుగాదు. అక్రూరుఁడని యతని పేరని కనుపట్టెడిని. పరమభాగవతులలోఁ జేర్పఁదగినవాఁడను సిద్ధాంతము మీఁది కథ వలన స్పష్టమగును. అట్టి యక్రూరుఁడు కంసు నాజ్ఞను విని పరమానందభరితుఁడయ్యెను. ఏవిధము ననో భగవద్దర్శనము కాఁగలదుకదా. అదియే జన్మఫలమని యతఁడు భావించెను. రేపే శ్రీకృష్ణదర్శనమగునుగదా యని సంతోషించెను. "కృతార్థోఽస్మి" యని నిశ్చితాంతఃకరణుం డయ్యెను. ఈశుభకార్యమునకుఁ ద్వరపడుటయే మేలని యప్పుడే పోవ నిశ్చయించుకొనెను. మహారాజా! భవదాజ్ఞను శిరసావహించెద. మీయానతిచొప్పున నాశక్తికొలఁదిని బని నెఱవేర్చెద. మీహితము నే కోరువాఁడఁగదా. అని రాజు నొద్ద సెలవుపుచ్చుకొని రథమెక్కి యింటికింబోయెను. ఎంత కాలమున కీజననము సార్థకమగుకాలము వచ్చెనని యూహించి మేరుపర్వతము నెక్కెను ఇఁక నాయక్రూరుఁడు దానిశిఖరాగ్రమునుండి దిగఁడు. ఇంటికింబోయి భగవత్సందర్శనోచితవేషము నలవరించుకొని మధురానగరమును జక్కఁగాఁజూచి పురమా! నీవిఁకఁ ద్రిజగత్ప్రసిద్ధిని గాంచఁగలవు. శ్రీహరిపాదపద్మములు నీతనువున సోఁకఁగలవు. కృతార్థజన్మము గలదానవగుదువు. త్వరగా శ్రీకృష్ణపరబ్రహ్మమునావిన్నపమాలకించి చనుదెంచును. క్రూరదానవుల నిర్మూలించును. ఏకందును బొందక నీవు విఖ్యాతిమై నలరఁగలవని తలంచుచు నందగోకులమునకుం బోయెను.

* అక్రూరుఁడు మధురానగరమునుండి ప్రయాణమై పోయినపిదప మధురానగరవార్తలను ముందు వ్రాయుచున్నవాఁడ. ముందు వెనుకలని యాలోచింపక కథనాలకింపవలయు. ఒక్కొక్కకథయుఁ దికమకగాకుండ వ్రాసినఁ దెలియునన్న యూహచే వ్రాయుచున్నాఁడను. అక్రూరుని బంపిన పిదపఁ గంసుఁడీకార్య మేలాగు నెఱవేఱునా యని చింతించుచుండెను. ముందే పంపఁబడినదూత లతిత్వరితగతిం బోయి యాయాయి దేశములయధిపతులకు శుభపత్త్రముల నిచ్చిరి. మహర్షుల చెంతకరిగి కంసునిప్రార్థనమును విన్నవించిరి. ఆవార్త చెవిఁబడఁగానే పరమానందమునఁ గొందఱు, రాజాజ్ఞ కదా పోవకయున్న నేమికీడుమూడునో యని కొందఱును బ్రయాణమును సాగించిరి. ఎంతవేగముగ రాఁదగునో యంతత్వరగా మధురానగరమును జేరిరి. రాజులు సపరిజనులై చతురంగబలములు వెంటరాఁగా నరుదెంచిరి. బ్రాహ్మణులు నరుదెంచిరి. తపోధను లాదరంబున మిక్కిలి శుభముకల్గునని యేతెంచిరి. సనక, సనంద, వోఢు, పంచశిఖ, సనత్కుమార, కపి, లాసురి, పైల, సుమంతు, సనాతన, పులహ, పులస్త్య, భృగు, క్ర, త్వంగిరో, మరీచి, కశ్యప, ద,త్తా త్రి, చ్యవన, భరద్వాజ, వ్యాస, గౌతమ, పరాశర, ప్రచేతో, వసిష్ఠ, సంవర్త, బృహస్పతి, కాత్యాయన,

---

*ఈభాగము బ్రహ్మవైవర్తపురాణమునుండియే వ్రాయఁబడుచున్నదని యు లోపల వ్రాసిన భాగమున కిది యనుబంధముగా నందున్నదనియుఁ దెలియఁదగు.

యాజ్ఞవల్క్య, ఔభ్రుత్తంక, పర్వత, దేవల, జైమిని, విశ్వామిత్ర, సుతపః, పిప్పల, శాకటాయన, జాబాలి, జాగలి, పిశలి, శిలాలి, కాస్త్రీక, జరత్కారు, కల్యాణమిత్రక, దుర్వాసో, వామదేవ, విభాండక, విభాండకపుత్ర, పథి, కవి, కణాద, కౌశిక, పాణిని, కౌ, త్సాఘుమర్షణ, వాల్మీకి, లోమహర్షణ, మార్కండేయ, మృకండు, పరశురామ, సాంకృ, త్యగస్త్య, వాంతమునిప్రభృతులగుమహాసీంద్రు లొయ్యన నరుగుదెంచిరి. వీరెల్ల శిష్యప్రశిష్యులు వెంటరాఁగా పుత్రులు శిష్యులంగలిసి వచ్చుచుండ విజయముచేసిరి. తపోనిరతులగు బ్రాహ్మణులును వచ్చిరి.

మును లరుదెంచినవెంటనే జరాసంధుఁడు, దంతవక్త్రుఁడు ద్రవిడాధిపతియగు దాంభికుఁడు, శిశుపాలుఁడు, భీష్మకుఁడు, భగదత్తుఁడు, ముద్గలుఁడు, ధార్తరాష్ట్రుఁడు, ధూమకేశుఁడు, ధూమ్రకేతుఁడు, శంబరుఁడు, శల్యుఁడు, సత్రాజితుఁడు, శంకువు, భూరిశ్రవసుఁడు, శాల్వుఁడు, కైకేయుఁడు, కౌశలుఁడు లోనగుమహాబలపరాక్రమోపేతులగు భూజాను లరుదెంచిరి. కంస భూపతి వారినెల్ల యథార్హముగా గౌరవించెను. ఆమర్యాదలకు వారెల్ల రానందపరవశులై తమతమవిడుదుల నివసించి స్వగృహముల మఱచిరి. పురోహితుఁడగు సత్యకుఁడు యజ్ఞదినమును నిర్ణయించి యందు సుముహూర్తకాలమును బ్రకటించెను.*

---

*లోపలికథయంతయుఁ శ్రీభాగవతాదులయం దింతవిపులముగా లేదు. బ్రహ్మవైవర్తపురాణములయందే విశేషించి వ్రాయఁబడినది. వానిం బ్రధానము

సాధుమతులారా! ఈకథ నీతిబోధకముకాదని తోఁచును గాని యిందొక్కవిశేషము కనంబడియెడిని. భగవంతుఁడే కర్మరూపుఁడు. కర్మమే ప్రాణులఁ బురికొలుపుచుండును. దానిగతి యప్రతిషిద్ధము. కంసునకు భూలోకసుఖానుభవకాలము ముగియుచున్నది. తదనుగుణములగు నాలోచనలు పొడకట్టకమానవు. ఏల యిట్టియూహాలు కలుగుచున్నవో యని యూహింపఁజాలము. ఎన్నియోవిధముల మనయూహాలు ప్రసరించుచుండనది బుద్ధివైశద్యమని తలపోయుదుము. కాని ముందేమిరానున్నదో పరికింపఁజాలము. కాఁబట్టియే

గహనా కర్మణోగతిః.

"యస్మాద్గహనావిషమాదుర్విజ్ఞేయా"(అనిశంకరభాష్యము) అని గీతాశాస్త్రము తెల్పుచున్నది. ఇట్టియూహాలు మనకేల కలుగవలయునని యెట్టివారైన నూహింపఁజాలరు. ఏలయనఁ గర్మము పరబ్రహ్మస్వరూపము. దానినెఱింగినఁ బరమాత్మయూహా యిట్టిదని మన మెఱుంగవచ్చు. అది శక్యముగు పనియా. కావుననే యెంతటివారైనను గార్యాంతరమున విధివశమని పలుకుచుందురు. బృందావనమున శ్రీకృష్ణునిచిత్తమునఁ దనయవతారఫలమును గనఁబఱుపవలయునని తోఁచెను. ఆయూహా వ్యర్థమగునా? భగవంతునిదగు నాయిచ్ఛయే కంసుని మదిని దనచావునకుఁ ద్రాళ్లు తెచ్చుకొనుటకుఁ బ్రోత్సహించెను.

---

లుగా భావించి తక్కినదానియందున్న కథను గలుపుకొనుచు వ్రాసితిని. విష్ణుపురాణమునందు బ్రహ్మపురాణశ్లోకములే కనంబడియెడిని. కావున నందీవిషయమున విశేషములు కానరావు.

దానిచేఁ బురికొలుపఁబడి కంసుఁడు తనమృతికిం దగుకృత్యములఁ జేయ నారంభించెను. ఏక్షణమున శ్రీహరిమది నూహ జనించెనో యాక్షణముననే కంసునకు దుస్స్వప్నములు పరంపరలుగాఁ దోఁచెను. వానిచే మనస్సు కలవిలపాటొందింపఁబడియెను. మఱుదినమే తనమృతికి హేతుభూతులగు వారినెల్ల రావించి వారితో నాలోచించెను. వసుదేవాదులును వానిమృతికిఁ దోడ్పడువారలే. ఆసభలోనున్న వారెవ్వరేని నీకిది పాడిగాదనికాని, శ్రీకృష్ణుని శరణుచొచ్చినఁగాని జీవింపవనిగాని, బోధించిరా? లేదు. వారివారికిఁ దోఁచినట్లుపదేశించిరి. పురోహితుఁడగు సత్యకుఁడు ధనుర్యాగముచేయుమని ప్రోత్సహించెను. పాపమాతనికి భవిష్యద్జ్ఞానము సుంతయు లేదు. పాండిత్యబలముగలవాఁడేకాని జ్ఞానబలము కలవాఁడుకాఁడు. పాండిత్యము జ్ఞానసాధనమనుట నిర్వివాదాంశమే. కానిదానికిప్రాగ్జన్మకృతసత్కర్మముతోడ్పడవలయును. సత్యకుఁడుశంకరునారాధించిన శత్రువిజయముగల్గునని యాదేశించెను. ఆతనికి శ్రీకృష్ణుఁడు భగవంతుఁడను జ్ఞానమే లేదు. రాజాస్థానమునఁదంత్రములు జరపుట యతనికిం దెలియునుగాని భగవద్విషయము తెలియదు. శంకరు నారాధించిన నతనికి మృతితప్పునా? శంకరుఁడుకర్మమునుమీఱి ప్రవర్తించునా? పాప మావిప్రప్రవరునకు శ్రీకృష్ణుఁడు విష్ణువని తెలియనందున శివకేశవుల కభేదమనుజ్ఞానమున్న నది యప్పుడు స్ఫురించినదికాదు. హితము చెప్పెడివారెల్ల నతని కెంత వేగముగా మృతిగల్గునాయని యూహించి తదుపాయము చెప్పినట్లున్న దియేగాని

వేఱుమార్గమునఁ గాదని మన మూహింపవచ్చును. కావున భగవదిచ్ఛ యప్రతిహతమైనది. దాని నడ్డఁజాలినదేదియు నీ ప్రపంచమునఁగాని మఱెందుఁగాని లేదు.

వసుదేవుఁడు హితముచెప్పినను గాలము మూఁడినందునఁ గంసున కది రుచించినదికాదు. వసుదేవునిమాటలవలనఁ గంసునకు మరణమా శ్రీహరివలనఁ గలుగఁగలదని స్పష్టమగు. కాని యది యప్పు డాకంసున కహితముగాఁ దోఁచెను. చాణూరముష్టికులు కువలయాపీడమను దంతివర్యము తన్నుఁ గాపాడునని నమ్మియుండెను. వారిరువురు నాగజము భగవంతునిచే మృతినొందు నదృష్టము గలిగియుండుటనే కంసునింట నుండుట సంభవించెను. మృతికి మనకర్మమే ప్రధానకారణమను సిద్ధాంతమునకు మార్పురాదని యిందువలన మన మెఱుంగవచ్చును. మహర్షు లీయాగమున కేల యరుదెంచిరి? కంసునకు మృతిగల్గునని మహర్షులకుఁ దెలియదా యనుప్రశ్న యొకఁడు వినరాకతప్పదు. దానివిషయమున నాలుగుమాటలు వ్రాసెద. జ్ఞానదృష్టి మహర్షులకుండుట నిశ్చయము. త్రికాలజ్ఞులే వారలగుదురు. కాని ప్రతిమనుజునకు భావికాల మేలాగుండునని వారాలోచించుచుందురా. వారి కితరకార్యములు లేవా. సదా భగవంతునిధ్యానించుచుండువారల కితరుల జోలితోఁబనియుండదు. సదా పరసేవయే చేయువారికి బహిర్దృష్టికూడ నశించును. ఇఁక నంతర్దృష్టి యొక్కడిది? కావున మహర్షులు సదా ఇతరుల భావిగతుల నాలోచించుచుఁ గాలమునువృథసేయువారు కారు.

కొంచెటెఱింగినను భగవత్సందర్శనభాగ్యము లభించుటయే చాలుననితలంతురు. తుచ్ఛులగుకంసాదులమృతి వారికి లోప ముగాఁదోఁపదు. ఎవ్వరెవ్వరికి భగవంతునిచే మృతిగల్గునో వారెల్లఁ బుణ్యాత్ములుగాన నట్టివారి కట్టియదృష్టము లభించుట చూడఁదగినదిగనే యుండునని వారు భావింతురని యూహించినను మహాపరాధముకాదు. ఇట్టు లీకథ భగవదిచ్ఛ ప్రకారము కర్మము మనుజులఁ బ్రోత్సహించునని సిద్ధాంతము చేయుచున్నయది. ఇఁకఁ దర్వాతికథను దెలిపెదను.

## అక్రూరునిమహానందము.

*ధర్మవేత్తలలో నుత్తముఁడగు నక్రూరుఁడు కంసునాజ్ఞనొంది యింటికింబోయి మహాశాంతుఁడగు నుద్ధవుని గను నిచ్ఛపొడమ నచ్చటికింబోయి పరమానందభరితుఁడై యిట్లు భాషించెను. ఈరాత్రి శుభముల నీఁజాలినది. ఈదినము నాకు మహత్తరశుభసంధాయకము. గురువులు బ్రాహ్మణులు దేవతలు నావిషయమునఁ బరమానందమునొందిరని తలంతును. కోటిజన్మార్జితసుకృతవిశేషము తనంతన నేఁడు నన్నుఁబొందెను. శుభరూపకర్మమంతయు నేఁడే చేకూరెనని నావిశ్వాసము. దుష్కర్మము నన్ను నిగడముచే బద్ధింపఁగా నాసత్కర్మము దానిబం

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున నఱువదిరెండవయధ్యాయమునుండి వ్రాయఁబడినది. తక్కినపురాణములఁగల విశేషము లిందుఁగలసియుండును. కంసుని యనుమతినొంది యక్రూరుఁ డింటికింబోయి ప్రయాణము సాగింపక ముందు జరిగినవిషయ మిందుఁ గలదని తెలియఁదగును.

ధనమును ద్రెంచివైచెను సంసారభూరికారాగారమునుండి ముక్తుఁడనై హరిపదము నొందెదను. విద్వాంసుఁడగుకంసుఁడు రోషముచే సుహృదర్థీకృతుఁడనైతిని. క్రోధముకూడ నాకు దైవవరముతో సమానమైనదయ్యెను. ఇపుడు వ్రజరాజును బిలుచుకొనివచ్చుటకు వ్రజమునకుం బోవుచున్నాఁడను. భుక్తిముక్తిప్రదాయకుఁడగు పరమపూజ్యుని శ్రీకృష్ణమూర్తిని దర్శింపఁగలను. నవ్యభవ్యజలధరశ్యాముఁడై, విలసదిందీవరదళలోచనుండై, పీతవస్త్రసమాయుక్తకటిదేశవిరాజితుఁడై ఘూలిధూసరితాంగుఁడై రుచిరచందనచర్చితుఁడై సుస్మితాననమనోజ్ఞుఁడై జ్ఞాననిలయుండై తనరారుశ్రీకృష్ణుని దర్శింపఁగలను. వినోదమురళిని మనోహరముగ వాయించుచు, సంతసమున గోసంతతుల నిటునటు కదలించుచు, స్వేచ్ఛగా నిలుచుచు, బోవుచు శయనించుచు వినోదించుశ్రీగోపాలకృష్ణునిజూడఁగలను. ఈనా నేత్రము లాపరమపురుషచరణసరసిజయుగళమును దృష్టిగాంఁ గాంచి ధన్యములు కాఁగలవు. ఔరా! నానేత్రములభాగ్యమేమందును? *బ్రహ్మవిష్ణుశివప్రభృతిదేవోత్తము లేపరమాత్మునిపాద ద్వంద్వమును మనఃపద్మములనిలిపి ధ్యానింతురో, ఏమహాత్ముని యాదిమధ్యాంతముల నెవ్వరే నెఱుంగఁజాలరో, ఏవిష్ణువు ననుగ్రహమును దేవతలు మహామునులు తెలియఁజాలరో, ఏదేవుని వినుతించుటకు సరస్వతీదేవి జడీభూతురాలగుచుండునో, ఏజ్ఞానరూపుని దాస్యమునందు మహాలక్ష్మీదేవి నియోగింపఁబడి

* యత్పాదపద్మం ధ్యాయంతే బ్రహ్మవిష్ణుశివాదయః. అనిమూలము.

యచ్చెరువునందునో, సత్వరూపిణియగుగంగాదేవి యేదేవాది దేవుని పాదపంకజమునుండి జనించినదో, తత్పాదప్రభావమున నామందాకిని జన్మమృత్యుజరావ్యాధులహరించుచు దర్శనస్పర్శనములచే మనుజులపాపముల హరింపఁజాలుచు వెలయుచున్నదో, దుర్గతినాశినియగుదుర్గాదేవి యత్పాదాంభోజమును ధ్యానించి, త్రిలోకజననియనియు, మూలప్రకృతియనియు, నీశ్వరియనియు విఖ్యాతినొందెనో, ఏమహావిష్ణువుయొక్క రోమకూపములనుండి విశ్వములుపుట్టునో, స్థూలములకంటె స్థూలము సూక్ష్మములకంటె సూక్ష్మము నయి యేవిరాడ్రూపము వెలయునో, ఏపరాత్పరునిమహిమమునఁ బదాఱవభాగమైనను దేవాధీశులు తెలిసికొనఁజాలరో యట్టి పరమేశ్వరునిఁ గరుణానీరరాశిని దర్శింపఁబోవుచున్నవాఁడ. ప్రియబంధూ! ఉద్ధవా! మాయామానుషరూపియై, సర్వాంతర్యామియై, సర్వజ్ఞుఁడై, ప్రకృతికింబరుఁడై, బ్రహ్మమై, జ్యోతిస్వరూపమై, భక్తానుగ్రహావిగ్రహమై, నిర్గుణమై, నిరీహమై, నిరానందమై, నిరాశ్రయమై, పరమమై, పరమానందమై, సానందమై, నందనందనవిఖ్యాతమై, స్వేచ్ఛామయమై, సర్వపరమై, సర్వబీజమై, సనాతనమై, వెలయుచుండు పరమాత్మరూపమును జూడఁగలను. యోగులు రేయింబవళ్లు మనఃపద్మముల నేశిశువును నిలుపుకొని ధ్యానింతురో, మన్వంతరసహస్రము నిరాహారుఁడై కృశోదరుఁడై పద్మభవుఁడు పద్మాసనసమావిష్టుఁడై తపస్సుచేసెనో, ఇంకను దపస్సుచేసి నన్నుఁ జక్కఁగా దర్శింపుమని బ్రహ్మ కేశిశువాజ్ఞయి

చ్చెనో, ఆయాజ్ఞయు శబ్దరూపమున వినఁబడియెనేకాని రూప దర్శనము కాకుండెనో, ఆరీతిగాఁ దపస్సు చేసి దర్శించి వరము లంబొందెనో అట్టి పరాత్పరుని వేదాంతవేద్యుని దర్శింపఁబోవు చున్నాఁడను.

పూర్వము శంకరుఁడు బ్రహ్మాయుఃపరిమితకాలము తపస్సు చేసి జ్యోతిర్మండలమునడుమ గోలోకవాసుని దర్శింపఁజాలెను. ఆభగవంతుఁడా శివునకు సర్వతత్త్వసారమును సర్వసిద్ధులను నాతత్త్వమును నెఱుంగుమని వరమిచ్చెను అంతఁ దత్పదారవింద భక్తిని బడసి శివుఁడు కృతకృత్యుఁడయ్యెను. భక్తవత్సలుం డగు పరమాత్మ సదాశివు నాత్మసమునిగా నొనరించెను ఓ యుద్ధవా! అట్టి శ్రీకృష్ణమూర్తిని సందర్శింపఁబోవుచున్న వాఁడను. సహస్రశక్రపాతాంత మనంతుఁడాయనంతుని గూర్చి దారుణతపం బొనరించి భక్తిసమాసక్తచిత్తుఁడై తదనుగ్రహా మున భగవత్సమానత్వమును వరమునుగాఁ బొందెను. అట్టిపర మేశ్వరుని దర్శింపఁబోవుచున్నవాఁడను. ధర్ముఁడుగూడ నసం తునివలె నంతకాలము తపస్సొనరించి సకలధర్మకర్మసాక్షియగు శిక్షకుఁడై ఫలదాతయై వెలయునట్లు వరములంబొందెను. ఆశ్యా మసుందరుని జూడఁబోవుచున్నవాఁడను. అమితాయుస్సుగల బ్రహ్మ యేభగవంతునిని మేషకాలమున లయించునో అట్టిసర్వే శ్వరుని దర్శింపఁ జనుచున్నాఁడను.

ఓయుద్ధవా! భూరజస్సుల లెక్కింప నలవి కాదు. బ్రహ్మ లను గణింపఁదరముగాదు. ప్రపంచముల నిర్ణయింపవలనుపడదు.

ఇవి యొకప్పుడు శక్యమైన నగునేమోకాని వీరందఱి కాధార భూతుఁడగు విరాట్టువు నెఱుంగఁదరమగునా. ప్రతిప్రపంచ మునకు బ్రహ్మవిష్ణుశివులు గలరు. మునులు మనువులు సిద్ధులు మఱియు నితరదేవత లెందఱో కలరు. వీరంద ఱామహాత్ముని ప్రభావమున లేశముకూడ నెఱుంగరు. ఆభగవంతుని గోపాల బాలునిఁజూడఁ జనుచున్నవాఁడను. అనిపలికి యక్రూరుఁడు పులకాంచితవిగ్రహుఁడై భక్తిభరంబున మూర్ఛితుఁడయ్యెను. మరల స్మృతిరాఁగా భగవంతునిపాదముల ధ్యానించెను. నిర్భరభక్తిపూరితస్వాంతుఁ డయ్యెను. ఆబాలగోపాలరూపమును దలఁచుచుఁ బ్రదక్షిణ మొనరించెను. అత్తఱి నక్రూరు నుద్ధవుఁ డాలింగనముచేసికొని పలుసారులు ప్రశంసించెను. అక్రూరాను మతిఁ దనయింటికింబోయి యుద్ధవుఁడు శ్రీకృష్ణనామమును జపించుచుండెను.

మహామతులారా! ఈకథ మనకు భక్తునిలక్షణము లిట్టి వని తెల్పుచున్నది. భగవద్దర్శనమును మించినసంతోషకార్యము లేదనుటయే సిద్ధాంతము. తాదనందమువంటి దింకొక్కటియుం డదు. కావున భక్తిరతుఁ డాత్మయందు సదా భగవద్దివ్యమంగళ విగ్రహమును దలంచుచుండును. హృదయఫలకమున భగవదా కారము చిత్రింపఁబడియుండును. ఆచిత్ర మేనాటికి మాసిపో దు నవనవోన్మేషమును గాంచుచుండును. కావుననే భక్త లేకాంతమును గోరుచుందురు. మనుజసంఘము నపేక్షింపరు. ఏలయన నది యతనిధ్యానమున కంతరాయమువంటిది. లోక

వ్యవహారములయం దతఁడు నిమగ్నుఁడుకాఁడు. సదా ధ్యానా సక్తుఁడుగనే యుండును. అదిలేనికాలము దుష్కాలముగాఁ గనుపట్టును. అక్రూరుఁడు భాగవతశిఖామణి. గోకులముననున్న లీలామానుషవిగ్రహుని దోడి తెమ్మని రాజానుజ్ఞ కాఁగానే యానందసాగరమున మునిఁగి భక్తవర్యుఁడగు నుద్ధవునితోఁ దనయానందమును దెలిపెను. తనయానందమును నెఱింగినవాఁ డుద్ధవుఁడని యక్రూరుఁ డెఱుంగును. అట్టివారితోఁ దెల్పక యితరులతోఁ దెల్పిన లాభము లేదుకదా? అనన్యాధీనమానసుఁడై సదా తనను నమ్మినవానిని భగవంతుఁడు ప్రాణాధికునిగా భావించును. ఆతనిసర్వకాంక్షితములఁ దీర్చుటయే తనకృత్యముగా భగవంతుఁడు భావించును. కాఁబట్టి సదా భగవత్కైంకర్యము చేయుటయే భక్తునికృత్యము. అట్టిభక్తిని మన మలవఱచుకొనఁ బ్రయత్నింపవలయు. ఇదియే సర్వశాస్త్రసారము. ఇఁకఁ దరువాతివృత్తాంతము నాలకింపుఁడు. మధురానగరప్రయాణమునకు ముందు కొన్నికథల వ్రాయవలయును. ఇపుడు వదలినచోఁ బిదప వానికిఁ బ్రసక్తి కలుగదు. కంసప్రేరితదానవులవిషయము ముందే వ్రాసితిని. కాని పురాణాంతరములు పరిశీలించుకొలఁదిని క్రొత్తగాథలు కనఁబడుచునేయుండును. కాని ముఖ్యవిషయములవదలక వ్రాయవలయునని నానిశ్చితము. ఏవో కొన్ని వదలినను బాధయుండదు. వానిచే శ్రీకృష్ణప్రభావమునకుఁ గొఱంతయు నుండఁబోదు. ప్రకృతము వ్యోమాసురుని జన్మవృత్తాంతమునుమాత్రము వ్రాసి యావల మధురాప్రయాణచరిత్రమును వ్రాసెదను.

## వ్యోమాసురచరిత్రము.

* బృందావనమున విహరించుచు రాధామనఃప్రీతిని గల్పించుచుఁ దనసేవకొఱకై యవతరించినగోపికలకు? సేవాభాగ్యమును బ్రసాదించుచు నపుడపుడుగోపాలకులంగూడి గోవుల మేపుచు బాలక్రీడలమానకయుండెను.ఒకనాఁడు శ్రీహరిగోపాలబాలకసంఘాన్వితుఁడై యావులం ద్రిప్పుచుఁ బోయిపోయి పర్వతభాగములయం దుండెను. అత్తఱి బాలకులందఱు విచిత్రరీతుల నాడుకొనుచుండిరి. కొందఱు దొంగలుగను, కొందఱు మార్గస్థులుగను, గట్టుపాటేర్పఱచుకొని విహరించుచుండిరి. మార్గస్థులు దొంగలు తమవస్తువుల నపహరింపఁగా వగచుచున్నట్లుగా నాయాట సాగుచుండెను.

వ్యోమాసురుఁ డొకఁ డబ్బాలకులలోఁజేరి తానును మాఱువేషమున వారిని మోసపుచ్చికొనిపోయి కొండగుహాలో నునిచి మరలవచ్చి యవశిష్టులం గొనిపోవుచు నిట్లు పెక్కుపర్యాయములు పెక్కుమందిని హరించెను. ఆగుహాద్వారమును భూరిపాషాణములఁ గప్పెను. ఆతఁడు మయుని కుమారుఁడు. పరాక్రమోపేతుఁడు. భగవంతుఁ డాతని వాస్తవముగా దొంగయని గ్రహించెను. వెంటనే యాదనుజుని రెండుచేతులంబట్టుకొని పలుసారులు త్రిప్పి భూమిపై వైచెను. ఆదెబ్బచేతనే వాఁడు తనువును వదలెను. ఆతనియొడలినుండి

* ఈయది గర్గసంహితయందుమాధుర్యఖండమున నిరువదినాల్గవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

ప్రాణములు జ్యోతీరూపమున వెడలి యటునిటు తిరిగి శ్రీకృష్ణునియందు లీనములయ్యెను. జయజయనినాదములు దిక్కులం బిక్కటిల్లెను. పుష్పవృష్టిం గురియించి దేవతలు తమయానందమును దెల్పిరి. అనవిని బహుళాశ్వుఁడు నారదా! వానిపూర్వవృత్తాంతము నెఱింగింపుమా యన ముని యిట్లు చెప్పంబూనెను.

కాశీనగరమున భీమరథుఁడను రాజు గలఁడు. అతఁడు దానపరాయణుఁడు. యజ్ఞముల నొనరించి దేవతల సంతృప్తిచేసిన మేటినైష్ఠికుఁడు. విష్ణుభక్తిపరాయణుఁడు. కొడుకును రాజ్యమున నునిచి మలయాచలమున దపంబొనరింపఁబోయెను. చిరకాలము నియతిమైఁ దపముచేసెను. ఒకనాఁ డాశ్రమమునకు శిష్యులం గూడి పులస్త్యముని యరుదెంచిన నాతనిం జూచి మర్యాదచేయక నమస్కరింపకయుండెను. దురభిమానదూషితుండగు నాతనింగాంచి ముని రాక్షసుఁడవుకమ్మని శపించెను. రాజు దానినెఱింగి శరణుచొచ్చి పాదములపైవ్రాలి రక్షింపుమా యని వేఁడెను. దీనవత్సలుఁడు కావున నాతనింజూచి కరుణించి యమ్ముని ద్వాపరాంతమున మధురాప్రాంతమునఁ బవిత్రబృందావనముననుండు శ్రీకృష్ణమూర్తి బాహువీర్యము చేమహర్షులుకోరు ముక్తి నీకుం గలుగఁగలదు. అని శాపమోక్షము ననుగ్రహించెను. రాజా! ఆభీమరథుఁడే యీవ్యోమాసురుఁడు. మయదానవతనూజుఁడయ్యెను. శ్రీకృష్ణభుజౌజఃప్రభావమున ముక్తి నొందెను.

ఆర్యులారా! ఇట్టిదానవులకథ లనేకములు గలవు. వానినెల్ల వ్రాయవలసినదియే కాని స్థాలీపులాకన్యాయమునఁ గొన్ని కొన్ని వ్రాసితిని. పురాణాంతరమునఁ గలచరిత్రభేదము గనఁబఱచుటకే యీకథ వ్రాసితిని. అరిష్టదానవుఁడును భగవంతునిచే హతుఁడయ్యెను. కంసుఁడు పంచినవారెల్ల హతులైరి. తనపని బృందావనభీతిఁబాపెనని పరమాత్మ యానందించెను. తరువాతి వృత్తాంతము నవధరింపుఁడు.

## రాధాదేవి దుస్స్వప్నములం గాంచుట.

* దానవులఁజంపి బృందావనమును నిష్కంటకముగావించి రాసమండలమును జేరి శ్రీహరి తనకృత్యమేదియో యోజించుచుండెను. అట నక్రూరుఁడు తనదర్శనమునకై రానుండుట యెఱింగి యానందించుచుండెను. రాధాదేవి మనస్సు పరమానందసాగరమున మునుంనగుట్లు చేయుచునుండెను. ఒకనాఁటి రాత్రి సంతోషవాక్కుల సుఖ మనుభవించుచుండ రాధాంబ నిదురించెను. ఆనాఁడాదేవికి దుస్స్వప్నములు తోఁచెను. వెంటనే మేలుకొని దీనయై ప్రాణేశ్వరునితో నిట్లు పలికెను ప్రాణేశా! చెంతకు రమ్ము. నిన్ను నాలింగనము చేసికొనియెదను. విధాత యేమిచేయఁదలఁచుకొన్నవాఁడో యెఱుంగఁజాలను అని దీనయై నాథునిఁ జేరఁదీసికొని యశ్రుపూరితనయనములం జూచుచుఁ గౌఁగిలించుకొనియెను. ఆదేవిమనస్సు కంపించుచుండెను.

* ఈచరిత్రము బ్రహ్మవైవర్తపురాణశ్రీకృష్ణజన్మఖండమున నలువదియాఱవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

దుఃఖము పొరలి పొరలి వచ్చుచుండెను. ఐనను ఇంచుకధైర్య మును దెచ్చుకొని యిట్లు పలికెను.

ప్రాణేశా! నేను రత్నసింహాసనమునఁ గూరుచుండి రత్న మయచ్ఛత్రచ్ఛాయనుంటిని. అత్తఱి నొకబ్రాహ్మణుఁడు రోష మున నాతపత్త్రమును లాగికొనియె. అంతతో నూరకుండక కజ్జ లాకారమై మహాఘోరమై దుస్తరమునగుసాగరమున దుర్బల నగునన్నుఁ బడఁద్రోసెను. ఆజలపూరమునందు శోకార్తనై మరల మరల మునుఁగుచుఁ దేలుచునున్నదానను. దానితరంగ ములుమహాత్తరములు. భూరినక్రసంకులములు. ఆతరంగముల వే గమునకుఁ దాళఁజాలక వ్యాకులాంతఃకరణనగుచున్నదానను. ప్రాణనాథా! కాపాడుము. కాపాడుమని పెక్కుసారులు నిన్నుఁ బిలిచితిని. వినలేదా. నిన్నుఁజూడఁజాలక పరితపించితిని. పిలిచితిని. భీతిచేదురపిల్లితిని. ప్రార్థించితిని. శ్రీకృష్ణా! ఆ సాగరమున నొక పర్యాయము మునుఁగుచు సుధాంశుమండలమును గాంచితిని. అది యంబరమునుండి శతఖండములై భూతలమునఁ బడుచుం డెను. మఱియొకక్షణముననే సూర్యమండలమును గాంచితి. అది చతుశ్శకలములై క్రిందఁబడియె. ప్రాణనాయకా! ఇంతి యగాదు. ఒక్కసమయముమునందే చంద్రసూర్యమండలములు కజ్జలాకారములై రాహువుచే మ్రింగఁబడియెను.

అంతట నొక్కబ్రాహ్మణుఁడు ప్రదీప్తిమంతుఁడై మహా రోషమున నాభుజముపైనున్న సుధాకలశమును బగులఁగొ ట్టెను. ఒక్కక్షణముననే యా భూసురుఁడు నా చెంతనున్న

నిన్నుఁగొనిపోయెను. నా చేతనున్న క్రీడాకపాలదండమును ఖండఖండములుగాఁజేసెను. నా చేతనున్న మణిదర్పణము నూడఁదీసికొని ముక్కముక్కలుగాఁజేసెను. నా హృదయమున సకలరత్నసారమగు పద్మరాగము మిగుల మలినాకారమై క్రిందఁ బడియెను. దంతములచేతను దారువులచేతను నిర్మింపఁబడినబొమ్మలు నృత్యముచేయుచు నవ్వసాగెను. బాహువు లప్పళించుచు, గానముచేయుచు రోదనముచేయుచు నుండెను. కృష్ణవర్ణమగు గొప్పచక్ర మొకండు పలుమాఱులు తిరుగుచు నంబరమునుండి పడుచు లేచుచు భయమును గలిగించుచుండఁ గాంచితిని. నా ప్రాణేశ్వరుఁడు సౌధాభ్యంతరమునుండి వచ్చి యోరాధా! విదళించియిమ్మా నేఁబోయెదనని యడిగెను. కృష్ణవర్ణముగల ప్రతిమయొకర్తు నన్నాలింగనముచేసికొని ముద్దుపెట్టుకొనియెను అది కృష్ణవస్త్రమును ధరించియుండుటఁ గంటిని. ఓప్రాణవల్లభా! ఇట్టివిపరీతములం గనుఁగొంటిని. నాకుడియవయవము లదరుచున్నవి. ప్రాణములు తల్లడిల్లుచున్నవి. హృదయము దుఃఖపరవశమగుచున్నది. మానసము సముద్విగ్నమగుచున్నది. వేదవిద్వరుఁడవగు నీవిట్టు లేలతోఁచెనో ఆలోచించి చెప్పుము.

అనిపలికి యారాధాదేవి శుష్కకంఠోష్ఠతాలుకయై శ్రీహరిపాదాంబురుహములపయింబడి భీతిల్లుచు శోకకర్శితయయ్యెను. ఆదుస్స్వప్నముల నాలకించి భగవంతుఁడా రాధను హృదయమునఁజేర్చి యాధ్యాత్మికయోగమున హితముదెల్పెను. ఆ యుపదేశమున నాదేవియు శోకమును వదలెను.

జ్ఞానమున నిర్మలాంతఃకరణ యయ్యెను. శాంతస్వరూపుఁడై భగవంతుఁడగు కాంతుని హృదయమునఁ జేర్చి యించుక యూఱడిల్లెను.

రాధ శ్రీకృష్ణు నతించుట.

*పరమేశ్వరుఁడగు కృష్ణమూర్తి విరహవ్యాకులరైయుంటఁ దెలిసికొని కామమోహనుఁడు కావునఁ గామినిని హృదయమునఁ గదియించుకొని క్రీడాసరోవరమునకుం జనియెను. రాజరాజేశ్వరియగు రాధాదేవి శ్రీకృష్ణవక్షమున నవీనజలదాంతరమున వెలయు సౌదామినివలెఁ జెలువారెను. కృపానిధియగు కృష్ణుఁ డామె నానందపరవశను గావించెను. స్వర్ణమణులలో మరకతమున్న యట్లు రాధ యపుడలరారెను. ఆ పర్యంకము రత్నస్థగితము దీపములు, రత్నదీప్తులు వారిరువురు రత్నభూషితులు. కావున మహాకౌతుకము ననుభవించిరి. ఆ రాసమండలమున రాసేశ్వరియగు రాధ రాసేశ్వరుం గాంచి యిట్లుపలికెను. మనోరథములు విరతింబొందకుండేఁగాని క్రీడవిరతిం బొందియుండెను.

నాథా! నీచెంత వికసించియుందును. నిన్ను వదలినతఱి వాడినట్లుగాని మృతనై కాని యుందును. ఉదయభానుఁడు ప్రకాశించుచుండ మహాపదిగణము లెట్లుండును? రాత్రియందు నిన్ను గూడియుందునేని దీపశిఖవలె నుందును. నిన్నుఁ గూడక

*ఈచరిత్రము శ్రీకృష్ణజన్మఖండమున నఱువదేడవయధ్యాయమునుండి వ్రాయఁబడినది.

యున్నఁ గృష్ణపక్షశశిరేఖవలె నుందును. నీహృదయమునఁ
నేనుండుతరుణమునఁ బూర్ణచంద్రప్రభనై యుందును. నిన్ను
వదలితినేని అమవసరేయి శీతాంశుకళవలె నుందును. త్వత్సం
గతిచే నేను ఘృతాహుతిప్రదీప్యమానహుతాశనశిఖవలెఁ గను
పట్టుదును. త్వత్సంగతివిహీననైనచో హేమంతపద్మినివలె సంత
రింతును. నీవు నన్నెడఁబాసి యెందేగినను జింతాజ్వరజరాగ్ర
స్తనై యుందును. సూర్యుఁడస్తమించి చంద్రుఁడుదయింప
కున్నపుడు ధ్వాంతగ్రస్తయగు ధరణివలెనే నేనుందునని
నమ్ముము. నీవు చెంతనుండవేని నా వేషము రూపము యౌవ
నము చేతనము నన్నియు నరుణోదయకాలమునఁ దారకావళి
వలె నుండును. అందఱకు నీవే యాత్మవు. విశేషించి నాకు
నాథుఁడవుకూడ నగుదువు. ఆత్మవిహీనమగు దేహమువలె నిన్ను
వదలిన నేనుందును. నీవే నాపంచప్రాణములు. అట్టి నిన్ను విడిచిన
మృతనే యగుదును. నిన్ను వదలిన నసంస్కృతయగుదును.
అపుడు తృణచ్ఛన్నధరణివలెఁ గనఁబడుదును. నీతోఁగూడిన
తఱిఁ జిత్రవర్ణయుతమృణ్మయప్రతిమవలెఁ గనుపట్టుదును ప్రాణ
నాథుఁడవగు నీవు నా చెంతనుండవేని జలములఁగడిగిన విరూప
యగుమృత్ప్రతిమవలె రూపఱుదును. గోపాంగనలశోభయం
తయు రాసేశ్వరుఁడవగు నీచేతనే. స్వర్ణమయహారమందు శ్వేత
వర్ణభాసమానమణివలె నీవలరుదువు. వ్రజరాజా! రాజరాజులం
దఱు నీ వలననే విలసిల్లుచుందురు. చంద్రునితోఁగూడియే
తారావళి ప్రకాశించును. యశోదశోభయు నందునితృప్తియు

నీవలననే. శాఖాఫలస్కంధములచేఁ దరువు విలసిల్లును. గోకులే శ్వరా ! గోకులవాసులెల్ల నీవలననే యలరుచున్నవారు. రాజ ధ్రాజుచే రాష్ట్రములెల్ల సంతోషమున నోలలాడును. ఈ రాస మండలప్రకాశమంతయు రాసేశ్వరుఁడవగు నీచేతనేకదా. అను రావతీప్రకాశ మింద్రసంబంధముననేగాని వేఱుకారణమునఁ గాదు. బృందావనవనరాజికెల్ల నీవే పతివి, గతివి. వనముల కధి పతి కేసరియగు. నీవో సకలమునకుఁ బ్రభువ వగుదువు. నిన్ను వదలినచో యశోదశోకసాగరనిమగ్న యగును. వత్సతోఁ గూడ నిసురభి సంతసిల్లుచుండునా. నీవు కనఁబడకున్న నందునిప్రాణ ములు హాయి చెందవు. మనస్సు దగ్ధమగును. అనిలికి రాధ శ్రీహరి పదసరసిజములపై వ్రాలెను.

పరమకారుణికుఁడగు శ్రీకృష్ణపరమాత్మ యారాధ కనే కాధ్యాత్మికవిషయము లుపదేశింపఁబూనెను. ఆధ్యాత్మికవిష యమే మహాయోగము. మోహాసంఛేదకారణమదియే. వృక్ష మునకుఁ బరశువు తీక్ష్ణధారచే నంతమును నెట్లుగల్గించునో యట్లు యోగము మోహచ్ఛేదకారణమగును. నావిని నారదముని మహాత్మా! ఆధ్యాత్మికయోగమును దెల్పుము. అది లోకులకు శోకచ్ఛేదకారణము. వినఁ గౌతుహలమగుచున్నది. అన విని శ్రీమన్నారాయణమూర్తి యిట్లు చెప్పఁబూనెను. నారదా ! ఆధ్యాత్మికమహాయోగము యోగులకును దెలియ నశక్యము. అది బహుప్రకారములుగ నుండును. శ్రీహరి యన్నిభేదముల నెఱుంగఁజాలును. పూర్వము గోలోకమున శ్రీపతి త్రిపురారికి

నించుక తెల్పెను దానిం దెలియంగోరి వేయిమందియింద్రులు మృతినొందునంతకాల మీశ్వరుఁడు తపమొనరించెను. ఆయో. గము శ్రేష్ఠము. యోగములలో నుత్తమము. తపోనిరతులకుఁ బ్రాణతుల్యము. ఒకకాలమందుఁ బంకజాసనుఁడు. పద్మాసనమునఁ గూరుచుండి పుష్కరతీర్థమునఁ దపమొనరించెను. శ్రీహరి యతనినియతికి మెచ్చి సాక్షాత్కరించి యించుక యుపదేశించెను. ధర్ముఁడు లోనగువా రెంతోకాలము తపమొనరించిరి. అనంతుఁడు, సనత్కుమారుఁడు, కపిలుఁడు, భాస్కరుఁడు చిరకాలతపమొనరించి దీని నించుక తెలిసికొనిరి. ప్రహ్లాదుఁడు, దుర్వాసుఁడు, భృగువు తెలిసికొనిరి. క్రీడాసరోవరమున శోకార్త యగురాధికకు శ్రీకృష్ణుఁడేది యుపదేశించెనో దానిందెల్పెద. రాధిక విగతానందయై కుందుచుండ నామహాత్ముఁడు చేరఁదీసికొని యాయోగసారము నుపదేశించెను.

## రాధకు శ్రీకృష్ణుఁడాధ్యాత్మికయోగము నుపదేశించుట.

ఓప్రాణనాయికా! రూపాంతరము నొందఁగనే నిన్ను నీవు మఱచుచున్నదానవు. స్మరించుకొనుము. సుదాముఁడు శాపమిచ్చుట లోనగుగోలోకవృత్తాంతముల మరలఁ దలంచుకొనుము. నీకు నావియోగము కొంతకాలము కలుగునట్లు శాపము కలదుకదా. అది ఫలించియే వదలునుగాని లేకున్న వదలునెట్లు! అప్రకారము మనకుఁ గొంతకాలము వియోగము సంభవించును. మరల సంయోగము కల్గును. మరల మన మిరువురము గోలోకమునకుం బోదుము. అదియగదా మనయా.

వాసము. గోలోకవాసులగు గోపాలకులు గోపికలు సేవింప నుందుము. ఇపు డాధ్యాత్మికయోగము నింకొక పదిం చెదను. వినుము. సుందరీ! అది శోకవినాశకము. పక్షపాదాపహము. సారభూతము. సుఖదము.

రాధాదేవీ! నేను సర్వాంతరాత్మను. సర్వకర్మములందు నిర్లిప్తుఁడను. అందఱియందుండువాఁడను. ఎందును గానరాకుం దును. సర్వవస్తువులందును గనఁబడక వాయువుండునట్లు నేనుం దును. దేని నంటక సాక్షీమాత్రుఁడనై సర్వకర్మములు చేయు చుండఁ జూచుచుందును జీవుఁడు మత్ప్రతిబంధుఁడు. సర్వ ప్రాణుల కాధారభూతుఁడు. శుభాశుభముల ననుభవించుచుఁ గర్మములను జేయుచునుండును. జలఘటములయందు సూర్య చంద్రమండలములు గనఁబడి యవి భగ్నములు కాఁగాఁ గనఁ బడనట్లు జీవులందఱు నాయందుఁ జేరుదురు. ప్రాణులు మృతు లు కాఁగా జీవుఁడు నాయందుఁ గలియును. మేమిద్దఱము సర్వ జంతువులయందుఁ గనఁబడువారము. నేనాధారుఁడను జీవుఁ డాధేయభూతుఁడు. కార్యకారణసంబంధము మాకుఁ గలదు. సర్వద్రవ్యములు చరములు. ఆవిర్భావతిరోభావములు విచిత్ర ములు. నాయంశజనితులగు దేవతలు కొందఱు గలరు. మత్క ళాజనితులు కొందఱు గలరు. మఱికొందఱు కలాంశాంశజని తులు. మఱికొందఱు వారివలనఁ బుట్టువారు. ప్రకృతి మదం శయే. మాతృ యనియుఁ జెప్పంబడును. అది పంచధా వ్యాప్య మానయగు. సరస్వతి, కమల, దుర్గ, నీవును (రాధ) సావిత్రి

యని యాఱైదుగురిపేరులు. *దేవతలందఱు ప్రకృతిసంభూతులు.

నేనాత్మను. శాశ్వతదేహముగలవాఁడను. భక్తధ్యానానురోధమువలననే నాకు దేహముండును. ఏదేవతలు ప్రకృతిసంభూతులో వారెల్లఁ బ్రకృతి లయింప లయింతురు. ముందును వెనుక నుండువాఁడను నేను. నేనెట్లో నీవునట్లే. క్షీరములకుఁ దెలుపుఁదనమునకు నెట్టిసంబంధమో మనయిరువురకు నట్టిసంబంధమే కలదు. మనయిర్వురకు భేదము లేదు ఎవనిలోమములనుండి యీప్రపంచములుపుట్టునో యావిరాట్టును నేనే. నామహాంశసంజనితురాలవు నీవు. నేను సృష్టికాలమున క్షుద్రవిరాట్టనఁబడుదును అట్టి నానాభిపద్మమునుండియే విశ్వముత్పత్తిల్లును. విష్ణులోమకూపమునందు నాకొకప్పుడు నివాసము కలుగును. ఆతనికి నీవు భార్యవగుదువు. ఒక్కొక్కమదంశపురుషున కొక్కొక్క బ్రహ్మాండము? కలదు? ప్రతిబ్రహ్మాండమునకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు గలరు.తదంశపురుషులు,తదంశాంశపురుషులు పెక్కుమందికలరు. వారెల్ల మత్కళలే యగుదురు. మత్కళలు, తదంశములు, తదంశాంశములు, ననునీరీతిగఁ జరాచరంబెల్లఁ బరంపరగ నాకళలచే నిండియుండును.

వైకుంఠమున నీవే మహాలక్ష్మివయి నెగడుదువు. నేను జతుర్భుజుఁడనై విష్ణు వనంబరఁగుచుందును. ఆమూర్తి బహి

---

* సర్వే దేవాః ప్రాకృతికా యావంతో మూర్తిధారిణః. అని మూలము.

రంతరముల వ్యాపించియుండుదు. సత్యలోకమున నీవే సరస్వతి యని సావిత్రి యని రెండుపేరులుగలిగి బ్రహ్మకుఁ బ్రియురాలివై యుందువు. శివలోకమున నీవే పార్వతియనం బ్రఖ్యాతి వహించి యుండుదానవు. మూలప్రకృతివి. ఈశ్వరివి. జయింప రానిదానవుల జయించి దుర్గ యనం బ్రసిద్ధిగాంతువు. అట్టి నీచే జయింప శక్యముగానివారినెల్ల జయించుచు దుర్గానామమున వ్యవహరింపఁబడుదువు. దుర్గవగునానీవే దక్షకన్యకవని శైలకన్యకవని పిల్వఁబడుదువు. కైలాసమునందు శివవక్షో నివాసినివై పార్వతివనఁ బిల్వఁబడుదువు. పాలసముద్రమందు శ్రీమహావిష్ణువక్షస్స్థలమున సింధుకన్యక యనుపేర నొప్పుచుందువు.

నేను మదంశమువలన బ్రహ్మవిష్ణువుల సృజింతును. నీవో సావిత్రి లక్ష్మి పార్వతి యను మూవురను వారికొఱకు సృజింతువు. గోలోకమున నీవే రాధ యనఁ బరఁగుదువు. రాసమండలమున రాసేశ్వరియని పిల్వఁబడుదువు. మనోహరబృందావనమున బృందానామము నీకుఁదగు. విరజాతటమున విరజాఖ్య నీకు నలరు. అట్టి నీవు సుదామునిశాపమునఁ బవిత్రమగు భారత వర్షమున కరుదెంచితివి. ఈఖండమును బృదావనమునఁ బరమపవిత్రముగాఁ జేయుచున్నదానవు. నీయంశాంశకలలుగనే యందఱు స్త్రీలు నగుదురు. స్త్రీ యెవ్వతెయైనను నీస్వరూపయే. పురుషుఁడెవ్వఁడైనను మదంశజనితుఁడే యగును. నేను గళచే వహ్నినగుదును. నీవు దాహకయగు స్వాహాదేవి వగుదువు.

నీతోఁగూడినపుడే దహింప సమర్థుఁడనగుదును. తేజస్వులలో నేను సూర్యుఁడను. నీవు ప్రభాకరివగుదువు. సంజ్ఞాదేవి వన నీవే. నీవులేకున్న నేను దీప్తిమంతుఁడనుగాను. నేను గళచేఁ జంద్రుఁడను. నీవు రోహిణి వగుదువు. నీవు కూడిననే యప్పటి నారూపము సంతోషమును గల్గింపఁజాలును. ఇంద్రలోకమునఁ గళచే నింద్రుఁడ నగుదును. నీవు శచివగుదువు. నీవుకూడియుం డఁగనే దేవరాజ నగుదును. నీవులేకున్న భ్రష్టరాజ్యుఁడ నగు దును. కలచే ధర్ముఁడ నగుదును. నీవపుడు భూతివగుదువు. ధర్మ కృత్యమున నీసాయమొదవదేని నేఁజేయఁజాలను. నేను యజ్ఞ రూపుఁడను. నీవు స్వాహాంశముగల దక్షిణవగుదువు. నీతోఁగ లిసినఁగాని యజ్ఞఫలప్రదుఁడను గాఁజాలను. పితృలోకమున నుండునాకు నీవు స్వధాదేవివిగ సాయపడుదువు. కనుకనే ఫల ముల నొసంగుచుందును.

నేను బురుషుఁడను.నీవు ప్రకృతివి. నీతోఁగూడకయున్న సృష్టిచేయఁజాలకుందును. నీవు సంపద్దేవివి. నే నీశ్వరుఁడను. నినుఁ గలిసినంతదనుక లక్ష్మీవంతుఁడను. నిన్నుఁగూడకున్న నిశ్శ్రీ కుఁడనగుదును. మృత్తులేక కులాలుఁ డెట్లు ఘటనిర్మాణమున సమ ర్థుఁడుకాఁడో అట్లే నేనును నీతోఁగూడక యేకార్యమును జేయఁజాలను. నేననంతుఁడ నగునపుడు నీవు వసుంధరవన నొప్పుదువు. అపుడు సర్వరత్నాలంకృతవగు నిన్ను మూర్ధమున మోయుదును. కీర్తియు, శాంతియు, భూతియు, భూతిమతియుఁ, దుష్టియుఁ, బుష్టియు, క్షమయు, లజ్జయు, క్షుధయుఁ, దృష్ణయు,

దయయు, నిద్రయు శ్రద్ధయుఁ, దంద్రయు, మూర్ఛయు, సన్నతియుఁ, గ్రియయు ననునివియెల్ల నీస్వరూపములే. మూర్తిరూపిణి, భక్తిరూపిణియు నన నీకే చెల్లు. దేహులకు దేహరూపిణివి. సదా నాకాధారము నీవే. నీకాధారము నేనే. పరస్పరాధారభూతులము మనముగుదుము. నీకెట్టిశక్తిగలదో నాకునట్టిశక్తి కలదు. ప్రకృతిపురుషులముగాన, సములము. మనయిరువురలో నొకరులేకయున్న సృష్టియేలేదు. అనిపలికి యాబాలగోపాలుఁడు ప్రాణాధికురాలగు రాధను వక్షమునందుఁ జేర్చి యిట్లు బోధించెను. ఆమెయు నాశ్యామసుందరుంగాంచి యానందించి యాహితోపదేశమునఁ గలవిలపాటు మాని సుస్థితి నొందెను.

సాధుజనులారా! భగవంతుఁడు రాధాదేని కుపదేశించిన విషయమును సావధానముగాఁ బఠించితిరి. దీనింగూర్చి పలుతావుల వ్రాసియేయున్నవాఁడను. కావున నిటఁ బెంచివ్రాయఁబూనను. కాని రెండుమాటలు వ్రాయక మాన వీలులేదు.

శ్రుతి. "నారాయణపరో జ్యోతి రాత్మా నారాయణః పరః

నారాయణపరం బ్రహ్మ తత్వం నారాయణః పరః

నారాయణపరోధ్యాతా ధ్యానం నారాయణః పరః.

యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా

అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః

అనంతమవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువం.

శ్లో. యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాః

తథా సర్వాణి భూతాని మత్థ్సానీత్యుపధారయ. ౬
సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. ౭
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్. ౮
న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు. ౯
హేతునానేన కౌంతేయజగద్విపరివర్తతే. గీత. ౯అధ్యా. ౧౦

శ్లో. ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్యం సచరాచరం
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి.
గీత. ౧౧ అధ్యా౭.

పై శ్రుతివాక్యములు, నీగీతావాక్యములు సర్వశక్తియుతుఁడగు భగవంతుఁ డొకఁడని బోధించుచున్నవి. తదాకారమే యీజగత్తనియుఁ దెలుపుచున్నయవి. ప్రకృతిభగవచ్ఛక్తియనిహితము తెల్పుచున్నవి. సర్వకర్త, సర్వదేవతామయుఁడు, సర్వాంతర్యామి భగవంతుఁ డొక్కఁడే సుఁడీ యని హెచ్చరించుచున్నవి. ఏదేవతను బూజించినను నన్నుఁ బూజించినట్లే యని భగవంతుఁడే గీతోపనిషత్తునం దాజ్ఞాపించియున్నాఁడని యుద్ఘోషించుచున్నవి. ఇట్టులుండ వాదప్రతివాదములుచేయుట, నాదేవుఁ డెక్కుఁడు, నీదేవుఁడు తక్కువ యనుట, వెఱ్ఱితనముగాక మఱేమిటి? వాదములుచేయుటగాక యితరదేవతల వచింపరానిపలుకుల దూషించుట వారిపూర్వజన్మకృతపాపఫలమనుటకన్న నింకేమనఁజాలను.

అట్టివారికింగల వ్యర్థాభిమానమును దొలఁగించి దేవతాసమత్వ మూచిత్తమున నలవడఁజేసి కాపాడుమా సర్వేశ్వరా యని దిన దినము, శ్రీపరాత్పరు నభ్యర్థించుచున్నాఁడను. ఎవ్వరుగాని దేవతాదూషణము చేయ వీలులేదు. అందుఁ బాపము గలదు. భగవత్తత్త్వ మిట్టిదని మనమెఱుంగఁజాలము. మనమెఱింగినవి షయము పరమాణువువంటిది. ఇట్టి యల్పజ్ఞానమున దేవతల నాక్షేపించుట ముంగొంగున నగ్నిని బిగియఁగట్టినట్లుగాక మఱే మి? శ్రుతులు స్మృతులుపురాణము లితిహాసను లనునవన్నియు బహుమతముల బోధించును. కాని యేకత్వమును దెల్పుచుం డును. భక్తుఁడుసద్బుద్ధిచే వానింబఠించిన నొక్కరీతిగా నన్నియు సారమును దెల్పును. పట్టుదలంబూని యేదో సాధింపఁబూని పఠించినవానిని గోతిలోఁబడఁద్రోయును. కావున భగవద్రూప మునొక్కదానిని మది దృఢపఱచుకొని సేవించి తరించుటకన్న నుత్తమమార్గము వేఱొకటి గానరాదు. శరణాగతపరిత్రాతకదా సర్వేశ్వరుఁడు. ఇదియొక్కటియే యిందుఁ దెలుపఁదగినది. ఇఁకఁ దరువాతికథకు మరలెదను.

## రాధాదేవి చింతింప శ్రీకృష్ణుఁ డూఱడించుట.

*రాధాదేవియు శ్రీకృష్ణమూర్తియు నిదురించిరి. ప్రభా శాలియగు శ్రీహరి మేల్కాంచి రాధికనునిద్రనుండి మేలుకొలిపి, చేలాంచలమున నామెమోమునుగ్గై చేసిమందమందమృదూక్తుల

*ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండమున నఱువదిరెనిమిదవయధ్యా యమునుండి గ్రహింపఁబడినది.

నిట్లు పలికెను. ప్రాణేశ్వరీ! బృందావనమునఁగాని, రాసమండలమునఁగాని, గోకులమునఁగాని, చందనకాననమునఁగాని, చంపకవనమునఁగాని విహరించుచుందుము. నీచెలికత్తియలంగూడియించుక కాలమును గడపుము. ప్రతిగ్రామమందును గ్రామాధిష్ఠాతృదేవతలు గలరు. నీవు రాసమండలాధిష్ఠాతృదేవివి. కొలఁదికాలము విశ్రాంతని గోరుచున్నవాఁడ.? గృహమునకుం బోవలయును. ముఖ్యముగాఁ జేయఁదగినకార్యము కలదు. ప్రీతిచేనేనాకార్యముచేయఁబోవ ననుజ్ఞయిమ్ము. నీవు నాప్రాణాధికురాలవు. నాప్రాణములు నీయందే యున్నవి. ప్రాణి నివదలి ప్రాణములెందుండఁగలవు? నీవే నామానసము. సంసారవాసనయు నీవే. నీకంటెఁ బ్రియమగుపదార్థము లేదు. శంకరునికంటెఁ బ్రీతిపాత్రమవు నీవే. శంకరుఁడే నాప్రాణములు. ఇది ధ్రువము. నీవు ప్రాణాధికురాలవు. అని పలికి రాధికనాలింగనమున నలరించి పోవ నుద్యమించెను.

శ్రీహరి కక్రూరాగమనము మదిఁదోఁచెను. సర్వజ్ఞుఁడు కావునను సర్వకార్యసాధనమున నాతురపడుచుండువాఁడగుటను మధురానగరగమనమున నెన్నియో తాఁజేయఁదగుకార్యములు నెఱవేఱునని యూహించెను. ఇట్లు శ్రీగోపాలకృష్ణమూర్తి ప్రయాణముచేయునూహ గలవాఁడగుట నెఱింగి రాధాదేవి తనను వదలిపోవునన్నయాతురమున హృదయము కంపింప దీనవదనమున నిట్లుప్రార్థించెను. శ్రీకృష్ణా! శ్రీపతీ! వ్రజమునకుఁ బోవవలదు. ఇపుడు నీమనస్సు వేఱుగా నుండినట్లు

తలంచుచున్నాను. నీవు నన్ను వదలిపోయిన దో నాసౌభాగ్యము పోవును. నన్నిందునునిచియెందుఁబోయెదవు? గంభీరమగుశోకసాగరమున నేను మునుంగుదును. విరహవ్యాకులనై దీననై నిన్నే దిక్కుగా భావించుచునుండు నేనుగృహమునకుఁ బోనొల్లను. చందనాదికాననములకును బోనొల్లను రేయింబగళ్లుకృష్ణా, కృష్ణా యని గానముచేయుచు నిందే యుందును. ఏయుద్యానమునకుం బోనొల్లను. కామసాగరమునుజొచ్చి నిన్నే కోరుచుఁ గళేబరమును వదలుదును. ఆకాశము, ఆత్మ, చంద్రుఁడు, సూర్యుఁడు, నెట్లో యట్లే నీవు నావస్త్రాంచలమునఁ గట్టివేయఁబడితివి. అట్టి నీవిపుడు నాయందు నైరాశ్యము నొందితివి. దీనవత్సలా! ఇది న్యాయమా. శరణాగతురాలనై దీననైయున్న నన్నువదలుట ధర్మముకాదుసుమా. ఎవనిపాదారవిందమును బ్రహ్మవిష్ణుశివాదులు ధ్యానముచేయుచుందురో, అట్టినిన్ను మాయాస్వీకృతగోపాలవేషుని మత్సరినగు నేనెట్లు తెలిసికొనఁగలను? నే నేమే నపరాధసహస్రము లొనరించినను క్షమింపుము. భర్తవని నేనేమియన్నను, లేక యభిమానముచేత నేనేమన్నను క్షమింపుము. నా గర్వము శకలములై పోయినది. నామనోరథము దూరమైనది. నా యదృష్ట మెట్లున్నదో యెఱుంగను. ఇంక నేనేమని విన్నవింతును? గర్గాచార్యులు చెప్పినమాటలు వింటిని. నీ మాయచే మోహితురాలనైతిని. నాస్థితి నీకుఁ జెప్పఁజాలను. ప్రేమముచేతను, భక్తిభావముచేతనుగూడ వచింపఁజాలకున్న దాన.

శ్రీకృష్ణా! నీవు నన్నువదలిపోయినచో నపకీర్తి పొందు

చుపుసుమీ. నీపుత్రపౌత్రులు నశింతురు. బ్రహ్మకోపానల మూరకపోదు. నిన్ను వదలినక్షణము యుగశతములుగాఁ దలంచెదను. ప్రాణనాయకా! క్షణకాలము వదలఁజాలని నేను శతాబ్దములు వదలియుండఁజాలుదునా. ప్రాణముల నిలుపఁగలనా. అనిపలికి రాధికాదేవి కోపమున భూతలమునఁ బడియెను. మూర్ఛనొందెను. చేతన వదలినట్లుండెను. శ్రీ హరియు మూర్ఛితురాలగు నా రాధికంగాంచి కృపానిధి కావునఁ జేతనగల్గఁజేసి యొదఁగదియించి పలువిధములగు యోగపద్ధతుల నుపదేశించి శోకమును శకలములుగా నొనరించి బోధించెను. అయినను రాధ శోకమును వదలఁజాలకపోయెను. సామాన్యవస్తుపరిత్యాగము మనుజులకుఁ గష్టముగఁదోఁచును. దేహాత్మవిశ్లేషము కష్టముగఁ దోఁపకుండునా. కావున నాదినము శ్రీహరి వ్రజమునకుఁ బోవఁడయ్యెను. రాధంగూడి సరోవరప్రాంతముల కరిగెను. విహరించెను. అపుడు రాధ దుఃఖమును వదలెను. ప్రాణనాథుంగూడి పుష్పశయ్యపైఁ బరుండి హాయిగా కాలము గడపెను. భగవంతుఁడామెమదిఁ గలవిచారమును బాపెను.

## బ్రహ్మాదులు శ్రీకృష్ణుని దర్శించుట.

* నారదమునీ! తరువాతివృత్తాంత మతివిచిత్రము. పరమ పావనము, అతినిగూఢమునగు. కావున దానిం జెప్పెదను. భగవంతుఁడు రాధాదేవిని సంతృప్తింజేయందలంచి మరల

* ఇది శ్రీకృష్ణజన్మఖండమున నలుబదితొమ్మిదవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

సకాముఁడయ్యెను. సర్వకార్యచతురుఁడు కానఁ జతురురాలగు రాధాదేవియొద్దనుండి యానంద మనుభవించుచుండెను. సరస్వతి చతుష్షష్టికలలయం దెట్లు విదగ్ధయో రాధాదేవియు శృంగారసరస్వభూతయగు. కామశాస్త్రసాగర యని యామెను వర్ణింతురు. పితృమానసకన్యయనియు, శంభుశిష్యురాలనియు, శతకల్పాంతజీవినియనియు, వేదవేదాంగనిపుణయనియు, యోగనీతివిశారదయనియు, నానారూపధారిణియనియు, సిద్ధయోగినియనియు, రాధను బెక్కుమంది మునివర్యులు వినుతింతురు. జగన్మాతయని రాధికకు విఖ్యాతనామము కలదు. ఆ మహాదేవి శ్రీహరింగూడి సంతోషాంభోధి నోలలాడుచుండెను. శాస్త్రవిహితశృంగారభావములఁ బ్రాణేశ్వరు నలరించెను. ఆజగన్మాతంగూడి శ్రీహరి పరమేశ్వరుఁడు రాసరసోత్సుకుఁ డయ్యెను. సుఖనిద్ర చేయుచుండెను.

ఇట్లు లుండఁగా లోకపితామహుఁడగు బ్రహ్మయు శంకరుఁడు శేషాదిదేవతలంగూడి భగవంతునిం గనుంగొన వచ్చిరి. బ్రహ్మయు నందఱింగూడి నమస్కరించి సంపుటాంజలియై సామవేదోక్తస్తుతిరాజమునఁ బరిపూర్ణతముఁడైన భగవంతు నిట్లు వినుతించెను. జగదీశ్వరా! సర్వదేవవందితచరణారవిందా! నిర్గుణా! నిరాకారా! స్వేచ్ఛామయా! నీకు నమస్కారములు. భక్తానుగ్రహము నీధనము. శాశ్వతత్వము నీమహిమము. ఈ గోపవేషము మాయావిలాసము. మాయ నీయధీనము. సర్వకాంతా! సువేషా! నితాంతజ్ఞానానందా! పరాత్పరా! ప్రకృతిపరా! సర్వాంతరాత్మరూపా! నిర్లిప్తా! సాక్షిస్వరూపా! వ్యక్తా

వ్యక్తా! నిరంజనా! భారావతరణనిపుణా! కరుణార్ణవా! శోక సంతాపహారకా! జరామృత్యుభయాదిహారణా! శరణపంజరా! భక్తానుగ్రహకాతరా! భక్తవత్సలా! భక్తసంచితధనా! నీకు నమస్కారములు. ఓ మహాత్మా! ఇవియే వందనములని తదేక ధ్యాననిరతుండయ్యె.

నారదా! ఇది బ్రహ్మకృతస్తుతి. సత్ఫలప్రదము. తరువాతి వృత్తాంతమును వినుము. బ్రహ్మ యట్లు ముహూర్తముండి మరల భగవంతునకు నమస్కరించి యిట్లు పలికెను. ఓపరమా నందకారణా! నందనందనా! సానందా! నిత్యానందా! లెమ్ము. లెమ్ము. నందగృహమున కరుగుము. ఈబృందావనమును వద లుము. సుదామునిశాపమును స్మరింపుము. అది శతవర్షనిబం ధనముకదా. భక్తశాపానురోధమున శతవత్సరములు ప్రాణే శ్వరిని వదలుము. మరల నీదేవింగూడి గోలోకమునకుం బోవం గలవు. నందమందిరమున కేఁగివచ్చుచున్న యక్రూరునిం గనుం గొనుము. అక్రూరుఁడు పితృవ్యుఁడు, అతిథి, మాన్యుఁడు, ధన్యుఁడు, విష్ణుభక్తుఁడు, ప్రభువు. ఆతనింగూడి మథురానగ రమున కేఁపు డరుగుము. అందు శివధనుర్భంగ మొనరింపుము. వైరివీరులం బొలియింపుము. దురాత్ముఁడగుకంసుని జంపుము. తండ్రిని దల్లిని సంబోధింపుము. ద్వారకానగరము నిర్మించుట, భూభారమును హరించుట యను నీ రెండుకృత్యములు త్వరగా సాగవలయుఁగదా. వారాణసిని దహింపుము. శక్రసదనమును జీకాకుపఱుపుము. యుద్ధమున శివుని జృంభణమాపుము. బాణ

భుజభంజనము చేయుము. రుక్మిణీహరణమును గావింపుము. నరకుని బొలియింపుము. పదాఱు వేలమంది గోపికలఁ జెట్టఁబట్టుము. ఓకమలాక్షా ! ఈ రాధాదేవి నిపుడు వదలుము. సత్వసద్మమునకుఁ బొమ్ము. మహానుభావా! లెమ్ము, లెమ్ము. నీ కార్యములన్నియు సుఖముగా సాగుఁగాక. ఈ రాధాదేవి మేలుకొనక ముందే లెమ్ము. అనిపలికి భగవంతు ననుమతినొంది దేవతలం గూడి విరించి తనలోకమున కరిగెను. అనంతుఁడు శంకరుఁడు తమతమలోకముల కరిగిరి.

భగవంతుఁడు బ్రహ్మవాక్యము నాదరించెనన్న యుత్సాహమున దేవతలు శ్రీహరిపైఁ బూలవానఁ గురియించిరి. అచ్చరలాడిరి. గంధర్వులు పాడిరి. కంసు నృశంసుని హింసింపుము. తల్లిదండ్రులకు బంధమోక్షణము ననుగ్రహింపుము. భూభారమును దొలఁగింపుము. అను నశరీరవాక్కు వినఁబడియెను. సర్వజ్ఞుఁడగు నీశ్వరుఁ డీసూచనలన్నియు నెఱింగి భగవతియగు రాధను వదలి మెలమెల్లన లేచెను. మందమందగమనములఁ గొంతదూరము తిరిగిచూచుచుఁ బోయెను. తనశయ్యకుఁ జెంతనున్న చందనకాననమున నించుకసే పుండెను.

రాధాదేవియు ముహూర్తకాలము పరుండి మేల్కాంచెను. తల్పమునుండి దిగెను. ప్రాణవల్లభుని జూడఁజాలకపోయెను. హాప్రాణేశ్వరా ! ప్రాణవల్లభా ! ప్రాణచోరా ! ప్రియతమా! యెందున్నవాఁడవు? అనియించుక వెదకెను. మాలతీవనమునఁ దిరిగెను. అందు క్షణమూరక కూరుచుండెను. మరల

లేచి నలుదెసల వెదకెను అలసి క్షణము భూమిపై శయనించెను. క్షణము విలపించెను. గట్టిగా క్షణము రోదనము చేసెను. నాథా! నాథా! రమ్ము, రమ్ము అని యెలుఁగెత్తి పిలిచి పిలిచి మూర్ఛిల్లెను. విరహానలజ్వాలలఁ బరితపించెను.పచ్చిగడ్డిపట్టుల మృతినొందినదానివలెఁ బడియుండెను. అచ్చటికి వేనవేలుగోపిక లరుదెంచిరి. కొందఱు చామరముల విసరిరి. చందనపంకమును మైనిండఁబూసిరి. అందొకప్రియసఖి యామెను వక్షమునఁ జేర్చుకొనియెను. నిశ్చేతనయై యున్న రాధను జూచి భీతిల్లి రోదనముచేసెను. పంకజదళములను దడిపి పఱచి వానిపై నామెను బరుండఁజేసెను. శ్వేతచామరముల విసరిరి. చేలాంచలములఁ గొందఱు చెంతఁగూరుచుండి విసరిరి.

అచ్చట శ్రీకృష్ణమూర్తి సాక్షాత్కరించి ప్రాణవల్లభను జూచెను. గోపిక లిపుడు రావలదని వారించిరికాని నవ్వుచు రాధచెంత కేతెంచెను. అపరాధ మొనరించినమనుజుఁడు రాజభయాదులవలనఁ దత్తఱపొంది భటులచేఁదీసికొని రాఁబడిన నెట్లుండునో అట్లు మదిఁజంకకు రాధచెంతఁ గూరుచుండి భుజాంతరమున నిడుకొనియెను. తెలివివచ్చునట్లు చేసెను. హితవాక్యముల బోధించెను. రాధయు మూర్ఛనుండి మరలెను. ప్రాణవల్లభుని గన్నులారఁగాంచెను. మనశ్చింతలఁ బాఱఁదోలెను. విరహజ్వరమును వీడెను. కాంతు నాకాంతావతంసము కౌఁగిలించి మనశ్చింత నెడఁబాసెను. శ్రీహరియు నామెఁ బ్రేమచే మన్నించెను. రాధను జేరఁదీసికొనియెను.

లేకున్న రాధిక జీవింపదు. కాన శీఘ్రంబ యామె నోదార్పుము. మది నూహించి చేయఁదగువిధమున నాశ్వాసింపుము. స్త్రీహత్య రాకయుండఁజూడుము. ఇట్లు రత్నమాలచెప్పఁగా విని నవ్వి శ్రీమాధవుఁడు హితమై పరిణామసుఖావహమై సత్యము నగురీతి నిట్లుపల్కెను. నేను సర్వేశ్వరుఁడనైన నఘటనాఘటన సమర్థుఁడనైనను విధిని మార్పఁజాలను. సకలబ్రహ్మాండముల యందు మర్యాదను స్థాపించితిని. దానిచే దేవతలుమునులునరులు కర్మముల నాచరించుచున్నవారు. ఈ రాధాదేవికి సుదాముని శాపమున నాతోటివిచ్ఛేదము శతవర్షములు గలుగఁగలదు. దీన మా యిద్దఱదాంపత్యమునకు విచ్ఛేద మొదవదు. జాగ్రదవస్థయందుమాత్రమే నాతోటివియోగము గల్గును. నావరప్రభావమున స్వప్నమున మత్సంగతి కలిగియుండును. శోకచ్ఛేదార్థమే యాధ్యాత్మికవిద్య నుపదేశించితినిగదా. ఈ గ్రంథను బోధింపుము. వెతనొందవలదనుము. నేను నందమందిరమునకుఁ బోవుచున్నవాఁడను. అనిపలికి జగన్నాథుఁడు నందమందిరమున కేగె. చేడియలందఱు రాధను మేలుకొల్పిరి. శ్రీహరియు గోకులమునకుంబోయి తల్లిదండ్రులకు నమస్కరించెను. తల్లితనయుం గౌఁగిటంజేర్చుకొని నవనీతము నొసంగెను. తల్లి యిడినవనీతము దిని తాంబూలచర్వణ మొనరించి జగన్నాథుఁడు తల్లి చెంత నుండెను.

మహాశయులారా! బృందావనచరిత్రము నించుక వ్రాసి ముగించితిని. భగవంతుని యిచ్ఛాశక్తియు ననపాయినియుం

నగు రాధాచరిత్రము మరలఁ గొంతకాలమునకుఁగాని వీరు వినఁజాలరు. భూభారహరణప్రవృత్తి నాదరించిన భగవల్లీలలే యిఁక వ్రాయఁబడును పరమపవిత్రమగు రాధాచరిత్రమును జక్కఁగాఁ బఠించితిరి. కొందఱు పండితమ్మన్యు లీకథలు కేవల కల్పితము లందురు. విననేమి? మనకేల యీ సంశయము. ఎన్ని యోపురాణములు రాధావిలాసమును దెల్పుచున్నవి. బ్రహ్మా వైవర్తము, బ్రహ్మాండము, పద్మపురాణము, దేవీభాగవతము లోనగునవి రాధామహిమమును విశేషించి తెల్పుచున్నవి. శ్రీకృష్ణావతారమునందు రాధాచరిత్రమునకున్న యంత ప్రా ముఖ్యము మఱేచరిత్రమునకు లేదని నమ్ముఁడు. నారదపురాణ మున రాధాసహస్రనామాదులు గలవు. ఇంతియగాక గర్గసం హితయందు శ్రీ రాధికాచరిత్రము గలదు. ఇన్నిపురాణము లిట్లు వాకొనుచుండ రుక్మిణీచరిత్రమే ప్రధానముకాని రాధా చరిత్రము కాదనువారివిజ్ఞానము నేమని వర్ణింపవచ్చును? ఆపక్ష పాతము మనకు వలదు. భగవంతునిపత్నులలో నొకరియందు శ్రేష్ఠత్వ ముపపాదించు నజ్ఞానము మనకుండఁగూడదు. ఇఁక నీ కథాసారమును నీతిని జిత్తగింపుఁడు.

శ్లో. "బ్రహ్మాండేషు చ సర్వేషు మర్యాదా స్థాపితా మయా,
తయా కర్మ ప్రకుర్వంతి మునయశ్చ సురా నరాః."

అనువచన మీ యధ్యాయమునందే కనుపట్టెడు. ఈ యర్థమే శ్రీభగవద్గీతోపనిషత్తునందు

శ్లో. "యశ్శాస్త్రవిధిముత్సృజ్యవర్తతే కామకారతః,

న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి."

అని యుపదేశింపఁబడినది.

భగవదాజ్ఞయే మర్యాద యనంబడు. దానిదాఁటు శిక్ష్య ముకాదు. తదనుగుణముగా నొనరించినకర్మములే ఫలప్రదములు. మహాత్ములవాక్కు వ్యర్థముకాదన్నది యొకమర్యాద. ఆ మర్యాద భగవదాజ్ఞయే. దానిని భగవంతుఁడు పూర్వఁగలఁడుగాని యట్లు చేయఁబూనఁడు. తాను తనభక్తులు పడరానికష్టములు పడిననుబడుఁగాని మర్యాదను నిరర్థకముగాఁ జేయఁడు. రాధాదేవి భగవత్పత్ని. అందు ననపాయిని. సుదాముఁడు భక్తాగ్రగణ్యుఁడు. ఆతఁడు శాపమొసంగెను. శతవర్షములు భగవంతుఁ నెడఁబాసియుండుమనియే యతఁ డిచ్చినశాపము. ఆశాపఫల మనుభవించుట తనప్రియురాలికి మిక్కిలి కష్టమని భగవంతుఁ డెఱుంగపోలేదు. కాని యాకష్టమనుననైన నంగీకరించునుగాని తనచేసినమర్యాదను వ్యర్థముచేయఁడు. ఇదియే భగవత్కృత్యము.

"శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే,
ఆజ్ఞాచ్ఛేదీ మమద్వేష్య స్స మే వధ్యతమో మతః."

అన్న సూక్తి వినఁబడియెడిని. ఇది లోకానుగ్రహార్థమే యని యెఱుంగవలయు. భక్తుల కపరాధముచేసిన నెట్టివారికేఁ గష్టములు గలుగకమానవన్నసూక్తిని సార్థకముచేయుట భగవం

తుని యుద్దేశము. కాఁబట్టియే రాధాశోకమును నివారింపఁ బూనక తనదారిని బోయెను. దీనింబట్టి భాగవతాపచారము మిగుల ననర్థావహమని యెఱుంగుటయే బుద్ధిమల్లక్షణము. భక్తపరాధీనుఁడు భగవంతుఁడు తన కపచారముచేసిన నోర్చునటగాని భాగవతుల కపచారముచేసిన నోర్వఁడని పెద్దలందురు. ఇవి రెండును సమానమని నాయాశయము. ఏ కర్మముగాని భగవత్కృతమర్యాదకు విరుద్ధముగా నొనరించిన నిష్ఫలమగుటయేగాక యొకప్పుడు దుష్ఫలముకూడఁ గల్గును. కాఁబట్టి భగవదాజ్ఞారూపములగు శ్రుతిస్మృతుల ననుసరించి కర్మములఁ జేయఁదగు. కాఁబట్టియే "అవిధినా కృత మకృతమ్" అను సూక్తి ప్రఖ్యాతిం గాంచెను. ఇంక నీ విషయమై వ్రాయక ప్రస్తుతప్రస్తావమునకు వచ్చెదను.

పాఠకులారా! ఇంతదనుక భగవంతుని బాలక్రీడలు బృందావనవిహారము తనయనంతమహిమమును బృందారకులకు నందాదులకుంజూపుట. రాసేశ్వరింగూడి రాసమండలవిహారము సల్పి తనసేవార్థమై జనించినగోపాంగనల కపారానందమును గల్గించి తత్సేవాభాగ్యమును గల్పించి వారిని గృతకృత్యలనుగా నొనరించి బ్రహ్మాదులు ప్రార్థింప దానిసంగీకరించి సుదాముని శాపఫల మనుభవింప రాధికఁ బరిత్యజించి నందమందిరమున కేతెంచెను. ఇఁక భగవంతుఁడు భూభారహరణమునకుం బూనును. దానికి నాందీముఖముగా నక్రూరగమనము చెప్పఁబడును. అక్రూరుఁడు పరమభక్తుఁడు. భగవద్దర్శనార్థ మరుదెం

చుచున్నవాఁడు కావునఁ దచ్చరిత్రమును వినిపించెద. అవధరింపుఁడు దానికి ముందొక్కమాఱు శ్రీకృష్ణనామమును జపింపుఁడు. పరమేశ్వరా! మా యపరాధసహస్రముల క్షమియించి సద్భక్తిని దాస్యము ననుగ్రహింపుమని ప్రార్థింపుఁడు. ఇఁక నవ్వాలికథం బఠింపుఁడు. దానికిఁ దొలుతఁ బరమభక్తుఁడగు లీలాశుకమహాకవిశ్లోకమును బఠించి తదుక్తరూపమును మది నిల్పి ధ్యానింపుఁడు.

శ్లో. వందేమురారేశ్చరణారవిందద్వంద్వం దయార్ద్రీకృతశైశవస్య
వందారుబృందారకబృందమౌళి మందారమాలావినిమర్దమౌళి.

కర్ణామృతము. 3 ఆ. ౧౫ శ్లో

## అక్రూరసుస్వప్నవర్ణనము.

* బృందావనవంద వ్రజములవార్త లట్లు నిలిపి మధురానగరమున నక్రూరునివృత్తాంతమును విచారింతము. కంసుని

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున డెబ్బదవయధ్యాయమునుండి, బ్రహ్మ శ్రీభాగవత విష్ణుపురాణ హరివంశగర్గసంహితలనుండియు, విశేషాంశములం జేర్చి వ్రాయఁబడినదని యెఱుంగనగు. అక్రూరుఁడు మధురానగరమునుండి శయనమై వ్రేపల్లియకుంబోయినట్లు శ్రీమద్భాగవతమున నున్నది. శ్లో. "ఉషిత్వా రథమాస్థాయ ప్రయయౌ నందగోకులమ్." అని మూలము. మహాకవి పోతన యక్రూరుఁడు బృందావనమునఁ గృష్ణబలరాముల దర్శించినట్లు వ్రాసెను. బ్రహ్మపురాణమునందు నెనుబదిమూఁడవయధ్యాయమునందుఁ బదునెనిమిదవ శ్లోకమునందు "అక్రూరో గోకులం ప్రాప్తః కించిత్సూర్యే విరాజతి" అని యున్నది. గర్గభాగవతమునందు మధురాఖండము మూఁడవయధ్యాయము

యనుమతినొంది యుద్ధవునితో భాషించి, యక్రూరుఁడింటికిం బోయి సుఖనిద్ర చేసెను. ఆరేయి మహాత్తరప్రమోదమున నుత్తమ మిష్టాన్నమును భుజించి సకర్పూరతాంబూలచర్వణముచేసి పరిమళోదకమునాని సుఖార్హశయ్యాతలంబున శయనించెను. పురాణశ్రుతిసమ్మతమగు సుస్వప్న మాతనికిం దోఁచెను. తెల్లవాఱుజామున వాద్యధ్వనులు చెలరేఁగనితఁడే రోగహీనుఁడు, బద్ధకేశుఁడు, వస్త్రయుగ్మసమన్వితుఁడు, సుతల్పశాయియు, సుందరాంగుఁడు, చింతాశోకవివర్జితుఁడు, నైతానుండినట్లు తోఁచెను. అప్పుడు కిశోరవయస్కుఁడై శ్యామసుందరవిగ్రహముగలిగి, ద్విభుజము లలరార, మురళింగేలు

నందు "రథారూఢస్తతో౽క్రూరః క్షణాన్నందపురం గతః" అని కన్పట్టెడిని. విష్ణుపురాణమునందు బ్రహ్మపురాణశ్లోకమే కన్పడియెడి. విష్ణుపురాణము బ్రహ్మపురాణము మాఱురూపమే యని యీవఱకే వ్రాసియున్నవాఁడఁగదా. హరివంశమున విష్ణుపర్వమునందు నిరువదైదవయధ్యాయమునందు "శంసద్భిస్స్యందనేనాశు ప్రాప్తో దానపతిర్వ్రజం, ప్రవిశన్నేవ పప్రచ్ఛ సాన్నిధ్యం కేశవస్య సః. రౌహిణేయస్య చాక్రూరో నందగోపస్య చాసకృత్ =అని యున్నది. శ్రీకృష్ణజన్మఖండమునందు బృందావనమునుండి శ్రీహరి వ్రేపల్లెకు వచ్చినట్లున్నది. ఇదెట్లు సమరసముచేయవచ్చునన్నప్రశ్నమునకు నందాదులుండున్న నదియే నందగోకులమని యర్థమని చెప్పిననదియే సమాధానముగాన దీనింగూర్చి పెంచివ్రాయనక్కఱయుండదని నాభావము. ఇంతియగాక శ్రీకృష్ణజన్మఖండమునం దొక్కచోట "ప్రవివేశ హరిం స్మృత్వా పుణ్యాం బృందావనం వనమ్" అనియున్నది. కాఁబట్టి గోపకులున్నతావు గోకులమని వ్యవహరింపఁబడునని, విహారస్థానములన్నియు బృందావనభాగములని వ్యవహరింపఁబడుననియు మనము నిశ్చయించుకొనుట గొప్పతప్పుగాదు.

దామరందాల్చి పీతాంబరధారియై, వనమాలావిభూషితుఁడై, చందనోక్షితసర్వాంగుఁడై, మాలతీమాల్యశోభితుఁడై భూషణరాజివిరాజమానుఁడై సద్రత్నపదకములుగలహారములు వక్షమున నలరుచుండఁగా మయూరపింఛచూడము ముద్దులుగుల్కు సుస్మితము వక్త్రమున కొకవింతచెలువు నీనఁ బంకజలోచనములచ్చెరువుం జూచువారలకుఁ జేకూర్పనుండు నొకభూసుర బాలకుం దొలుత గాంచెను పిదప మనోజ్ఞరూపము తగి యుండఁ బతిపుత్త్రులు కూడనుండఁ బీతవసనమునుగట్టి మణిమయభూషణము లొప్పారఁ బ్రజ్వలత్ప్రదీప్తహస్తయై శుక్లధాన్య మొకహస్తమునఁ గనంబడఁగా శరత్కాలశీతాంశువక్త్రము వెలయఁ జిఱునవ్వు మోమునఁ గనంబడుచుండఁ బ్రసన్నత మోమునఁ దోఁచుచుండ నలరు నొకయంగనామణిని జూచెను. వెంటనే యొకబ్రాహ్మణోత్తముఁ డగపడియెను. ఆభూసుర గ్రామణి శుభాశిషము లొసఁగుచు నవ్వు మోమున నుండెను. తరువాత శ్వేతారవిందము, రాజహంసము, తురగము, సరోవరము చిత్రితస్థలము, పుష్పఫలభరితములగు నామ్రనింబనారికేళకదలీప్రముఖవృక్షములును గనఁబడియెను. ఆపిదపఁ బర్వతమునం దున్నతనను శ్వేతసర్పము గఱచుచున్నట్లు తోఁచెను. ఆమీఁద వృక్షమునందును గజముపైనను, దురగముమీఁదను నొకపైనను దానున్నట్లు తోఁచెను. మఱియొకప్పుడు వీణావాదనము నొనరించుచుఁ బాయసమును దినుచున్నట్లును, దధిక్షీరయుతాన్నమును భుజించుచున్నట్లును, అపుడు తాను బద్మ

పత్రమునఁ గూరుచుండినట్లు నాతనికిం దోఁచెను కృమివిట్సహి తమై తనయంగ మున్నయట్లు, తానేడ్చుచున్నట్లు, మూర్ఛిల్లి నట్లును దోఁచెను. శ్వేతధాన్యము, శ్వేతపుష్పములు తనకరముల నున్నట్లు గానవచ్చెను.చందన మలందుచున్న ట్లొకప్పుడుకనఁబడి యెను.ఒకప్పుడు ప్రాసాదమునందున్నయట్లును,మఱొకప్పుడు తరుణ మున సముద్రమునం దున్నట్లును, శిరస్సు ఛేదింపఁబడినట్లును, దేహమునిండ దెబ్బలుతగిలినట్లును,దుర్గంధము మేనునుండి వెడలు చున్నట్లు నూహించెను. అనంతరము రజతమును, మణిని, బరి శుద్ధకాంచనమును, మౌక్తికమును, మాణిక్యమును, జలపూర్ణ కుంభమును, సవత్సయగు సురభిని, వృషభేంద్రమును, మయూ రమును, శుకసారసహంసచిల్లఖండజనపక్షులను, దాంబూల మును, బుష్పమాల్యములను, మండుచుండునగ్నిని, దేవతా పూజను, బార్వతీప్రతిమను, శ్రీకృష్ణప్రతిమను శివలింగమును, బ్రాహ్మణబాలికను, బాలికను, సుపక్వఫలితకృషిసమలంకృత భూమిని, దేవస్థలిని, రాజేంద్రుని, సింహమును, వ్యాఘ్రమును, గురువును, దేవతను, గనుఁగొనెను. అక్రూరుం డిట్లు సుస్వప్న మును గాంచి మేల్కాంచి యహర్ముఖోచితకృత్యములఁ దీర్చె ను. స్వప్నవృత్తాంతము నుద్ధవుని బిలిపించి తెలిపెను. ఉద్ధవుఁడు పరమానందభరితుఁడయ్యెను. కృతార్థుఁడవైతి వోయక్రూరా! యనియెను. నీపుణ్యమేమని వర్ణింతునార్యా యని సంతోషా శ్రువుల విడిచెను. దేవగురుపూజసల్పుమా యని యుపదేశిం చెను అక్రూరుం డట్లేచేసెను మనఃపంకజమున శ్రీకృష్ణపాదార

విందముల నునిచి ధ్యానించెను. పెద్దలయాశీస్సులతో బయలు దేరెను. అతనిదివ్యరథము శుభనిమిత్తములతో నడువసాగెను.

## నారదశ్రీకృష్ణసంవాదము.

*అక్రూరవృత్తాంతము నించుకవదలి గోకులప్రాంత వృత్తాంతమును బరిశీలింతము. గోకులప్రాంతమున శ్రీకృష్ణుఁడు కేశివ్యోమదానవుల వధించినపిదప నారదముని యేకాంతమున నున్న శ్రీకృష్ణపరబ్రహ్మమును దర్శించి సంతోషమున నోట లెలుంగకయుండియు నాత్మజ్ఞానసంపన్నుఁడు కావున నిట్లు విన్నవించెను. జగన్నాథా! అచ్యుతా! కేశిదైత్యుఁడు విలాసముగ నీచేఁజంపఁబడియెను. వీఁడు దివిజులకును క్లేశప్రదుఁడు. స్మృతి నొందనుత్సుకుఁడై యుండెను. అట్టివాఁడు నీచేతఁ దెగిపోయెను. దుష్టుఁడైనను స్వర్గమునకుంబోయెను. ఈయవతారమున నేయేసత్కర్మము లాచరింపఁదగునో వాని నెఱింగించుటకు నాకుతూహలము గలదు. నీకవి తెలియనివని కాదు. నాసంతోష మిట్టిదని విన్నవించుచున్నవాఁడను. ఈతురగాస్యుఁడగు కేశిదానవునకు దేవతలును భీతిల్లుదురు. వీఁడు కేసరములు విదలించినపుడు, హేషారవము గావించినపుడు, వియద్వీథిని విలకించినపుడు దేవతలు వడఁకుచుందురు. జనార్దనా! అట్టి యీకేశిదానవుఁడు

* ఈవిషయము బ్రహ్మపురాణ శ్రీభాగవతములనుండి సంగ్రహింపఁబడినది. శ్రీభాగవతమునఁ గేశిదైత్యునిఁజంపిన పిదప వ్యోమాసురుని వధించుటనుఁ బూర్వ మీవిషయమున్నది. బ్రహ్మపురాణమున వ్యోమాసురవధవిషయ మిట లేదు. భేద మింతియే యని తెలియునది.

హతుఁడయ్యెను. కేశిదానవుని వధించితివిగాన నీవు కేశవనామ మునఁ బ్రఖ్యాతినందఁగలవు. నీకు మేలగుఁగాక! నేనిఁకఁ బోయి వచ్చెదను. ముందు కంసయుద్ధము కాఁబోవును. నేఁటికి మూఁ డవదినమునఁ గంసవధకాలమున నేను నిన్ను దర్శింపఁగలను. ఉగ్రసేనతనయుఁ డగుకంసుఁడు సమిత్రుఁడై చంపఁబడఁగా జగద్భారావతరణముకొఱకు నవతరించిన నీ వెన్నియోకార్య ములు చేయఁగలవు. వానినెల్ల నేత్రోత్సవముగాఁ జూడఁగ లను. అనేకయుద్ధములు సాగును. రాజులంద అన్యోన్యజయే చ్ఛల నుందురు అపుడు నీవొనరించుయుద్ధములఁ జూడఁగలను. నీవు పరమేశ్వరుఁడవు.జ్యోతిస్స్వరూపుఁడవు. వాసుదేవుఁడవు. అఖిలాధారుఁడవు. దైత్యసంహారార్థ మవతరించితివి. సాధువుల రక్షింపవలయును చాణూరముష్టికులు, కంసుఁడు, మదహస్తి మూఁడవదినము నీచేఁ జంపఁబడుచుండఁ జూడఁగోరుచున్న వాఁడను. పిదపఁ బంచజనమురనరకాసురవధముఁ జూడఁగోరె దను. పారిజాతమును హరించుట, ఇంద్రునకు గర్వభంగముచే యుట, వీరకన్యకలఁ బెండ్లియాడుట, వీరశుల్కాదులందు సామర్థ్యమును గనఁబఱచుట, నృగమహీజానికిశాపముక్తి నను గ్రహించుట, ద్వారకానగరమున నివసించుట, స్యమంతకమణిని దెచ్చుట, మృతపుత్త్రులఁ దెచ్చియిచ్చుట, పౌండ్రకవాసుదేవు నణఁచుట, కాశీనగరమును దహించుట, దంతవక్త్రచైద్యాదాన వుల నధ్వరమునఁ బొలియించుట, మఱియు ద్వారకానగరమున నివసించి నీవుచేయు నద్భుతకర్మజాలముల నెన్నియేని చూడఁ గోరుచున్న వాఁడను. కాలరూపుఁడవగు నీవు కౌరవపాండవసం

గ్రామమునఁ బార్థసారథివైయనేకాక్షౌహిణులఁబోలె యుంచుటఁ జూడఁగలను. తత్తత్కార్యానుసార మాయాకార్యములు సాగుచుండ నిర్లిప్తుఁడవై సాక్షిమాత్రుఁడవై సర్వకార్యకర్తవై యలరు నిన్ను సదా సేవింపఁగోరుచున్నవాఁడను. ఆత్మమాయావినిర్మితాశేషవిశేషకల్పనుఁడవై స్వాశ్రయుఁడవై సర్వగుణభూషితుఁడవై నిరంజనుఁడవై యుండు నీకు నమస్కరించుచున్నవాఁడ. శ్రీదాస్థ మీమానుష్యదేహమును దాల్చితివి. యదువృష్ణిసాత్వతుల నుద్ధరింప నిటఁబుట్టితివి ఇఁక సెలవందుకొనియెదను. మహాత్మా! నీ నామస్మరణము చేయుచు స్వేచ్ఛగాఁ జరించెదను. సుప్రసన్నుఁడవు కమ్ము. కృతకృత్యునిగాఁ జేయుము. ఇఁక సెలవిమ్ము. పోయివచ్చెద నని నారదముని హరికి నమస్కరించి యంబరమార్గమునఁ బోయెను.

పూజ్యులారా ? ఈ విషయమునఁ బ్రకృతకథకేమిలాభమని ప్రశ్నింపవచ్చును. మనుష్యులకుఁ దెలియని కార్యములన్నియు మహర్షులకుఁ దెలియుననియు, జ్ఞానదృష్టి వారికిఁ గలదనియు, నారదాదిమహర్షులు చేయు ప్రతికార్యము లోకోపకారమునకేఁ యగుననియుఁ దెలుపుటయే యీ గాథకు ఫలము. భూభారహరణమునకై యవతరించిన శ్రీకృష్ణపరబ్రహ్మమునకుఁ దాఁ జేయఁదగు కార్యములన్నియుఁ దెలియక యుండునా. మనబోంట్లకుఁ బెద్దలు త్రికాలవేత్తలన్న విశ్వాసము గుదురుటకై యీవిషయము వ్రాయఁబడినది. ఇఁక లోపల వదలినకథాభాగము ననుసరించెదను. ఇచ్చట శ్రీకృష్ణమూర్తి యజ్ఞాగమనమును గోరుచు నేమియునెఱుంగనట్లుండెను నందాదులు కుమా

రులఁ జూచుచు సుఖముండిరి. ఇందెవ్వరికిని గాని శ్రీకృష్ణుఁడు కంసుని హింసించునని తెలియదు. గర్గాచార్యబోధమువలన నందునిమనమునఁ శ్రీహరి సామాన్యబాలుఁడు కాఁడన్నయభిప్రాయము కలదుకాని యది శ్రీకృష్ణమాయాసమాచ్ఛాదనమున సదా తోఁపకుండును. కాఁబట్టియేకదా భగవద్గీతలయందు,

"దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే."

౭. అ౧౪. శ్లో.

యన్నవాక్యమును భగవంతుఁ డుపదేశించెను. కావున భగవత్సేవచేసిననే తప్పఁ దన్మాయను దాట శక్యముకాదు. గర్గాచార్యప్రభృతు లెంద ఉపదేశించినను మాయాసమాచ్ఛాదితులుగాన నందాదులు శ్రీ హరి పరమపురుషుఁడని భావింపఁజాలక పుత్రప్రీతితో నాదరించుచుండిరి. కాని వీరెల్లఁ గృతకృత్యులే యని యెఱుంగఁదగు. భగవంతు నేవిధముచేనైన దర్శించినను, దలంచినను, బూజించినను, వాంఛితార్థము లొసఁగూడు ననుట నిక్కము. కావున భక్తులారా! శ్రీకృష్ణపరబ్రహ్మము నారాధింపుఁడు. ధ్యానింపుఁడు. నామపారాయణము చేయుఁడు. కలియుగమున నింతకంటె నిరుపమానమార్గము వేఱొక్కటి గానరాదు. మఱియొకపర్యాయ మీమాటనే తెలుపుచున్నవాఁడను. ఇదియ మనవిధి.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీకృష్ణావతారతత్త్వమున గోపికాజన్మవృత్తాంతసంకీర్తనమను నైదవప్రకరణము సంపూర్ణము.



శ్లో. ఆర్ద్రావలోకితదయాపరిణద్ధనేత్ర
మావిష్కృతస్మితసుధామధురాధరోష్ఠం,
ఆద్యంపుమాంసమవతంసితబర్హిబర్హ
మాలోకయంతి కృతినః కృతపుణ్యపుంజాః.

కృ. ణా. ౧ ఆ. ౬౭

శ్లో. సుకృతిభిరాదృతే సరసవేణునినాదసుధా
రసలహరీవిహారనిరవగ్రహకర్ణపుటే,
వ్రజవరసుందరీముఖసరోరుహసారసికే
మహసి కదాను మజ్జతి మదీయమిదం హృదయమ్. ౩ ఆ. ౮

శ్రీకృష్ణకర్ణామృతము.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినో భవంతు.

శ్రీ శ్రీ శ్రీ.





ఆ రాధాదేవిప్రాణసఖి యొకర్తు కలదు. రత్నమాల యని యామెనామము. విదగ్ధురాలు. సర్వపూజిత. ఆమె యపుడు శ్రీహరిఁగాంచి నీతిసారముగా నిట్లు పలికెను. ఆ వాక్యములు కడుంగడుమధురములు. మహానుభావా! శ్రీకృష్ణా! నావిన్నప మాలకింపుము. పరిణామసుఖావహమగు నామాట నించుక మదిఁ జేర్పుము. అది హితము, సత్యము, దంపతులకుఁ బ్రీతికారణము నగు వేదపురాణవిహితనీతిసమ్మతము. లౌకికవ్యవహారప్రశస్యము. యశస్కరము. బంధువులయందుఁ దల్లియుఁ దోఁబుట్టువు నెట్లో! యట్లు స్త్రీలకుఁ బ్రాణనాథుఁడు ప్రియబంధువు. పుత్త్రుఁడందఱికంటెఁ బ్రియతిదాయకుఁడు. పుత్త్రునకంటె భర్త మిగులఁ బ్రీతిదాయకుఁడు. శతపుత్త్రులకంటె మగఁడు ప్రీతిపాత్రుఁడను నీతి సాధుసమ్మతము. రసికవతంసములగు కాంతలకు భర్తకన్నఁ బ్రీతిపాత్రుఁ డొకఁడు లేఁడు. కాంతవలెనే భర్త విదగ్ధుఁడయ్యె నేని సుఖమునకుఁ బారమే లేదు. అట్లు కానిచో విషతుల్యమే. గోపాలా! అసత్యమగు నీ సంసారమందు దంపతులకుఁ బరస్పరమైత్త్రియే సుఖముగఁ దోఁచునది. పరస్పరసమత్వము కుదిరినచో నది కాంతాసౌభాగ్యకారణమగు. *ఏయేమందిరముల దంపతులకు సమత్వము లేదో ఆగృహముల నలక్ష్మి నివసించు. వారిజీవితము నిష్ఫలము. సమ్మతుఁడగుభర్త దొరకియుండియు

* దంపత్యోస్సమతా నాస్తి యత్ర యత్ర హి మందిరే, అలక్ష్మీస్తత్ర తత్రైవ విఫలం జీవనం తయోః. సుస్వామినాం విభేదశ్చ పరం దుఃఖం చ యోషితాం, శోకసంతాపబీజం చ జీవితం మరణాధికమ్. అని మూలము.

నతనికి భేదబుద్ధికలిగిన నది మఱింతదుఃఖము గలిగించునదగు. దానికంటె మరణమే మేలు. జాగ్రత్స్వప్నములయందు భర్తయే భామినికిఁ బ్రాణములు. ఇహపరలోకములయందుఁ బతియే గురువు. కావుననే నీవు కనఁబడమిని రాధిక మూర్ఛిల్లెను. పచ్చికనేలపై నట్టె పడిపోయెను. శీతలజలముల నేనే చల్లితిని. దాననించుక యాశ్వాసము కల్గినది. ఓ కృష్ణా! ప్రాణేశా ! యనియే పిల్చుచున్నది. క్షణము విలపించును. క్షణము మూర్ఛిల్లును. విరహానలజ్వాలలం దనువు తపించుచున్నది. శ్రీకృష్ణా! ఇపుడు పరీక్షింపుము. లోహపాత్రముకాల్చిన నెట్లుండునో యట్లే లలనామణికోమలాంగము తపించుచున్నయది. సర్వకాలసర్వావస్థలయందిపు డీమె మృతతుల్యగనే యున్నది. సుస్థితియందుండువారు సర్వప్రపంచము విష్ణుమయముగాఁ జూచుచున్నవారు. శీతలజలములఁ గమలములు పుట్టును. నీటిపైనవి తేలియాడుచుండును. అవి పాన్పుగా నొనరించినను నిద్రపట్టకున్నది. ఎన్నిశీతలోపచారము లొనరించినను రాధిక యూఱడిల్లకున్నది. రాధాదేహస్పర్శమాత్రమునఁ బంకజము శుష్కతనొందుచున్నయది. స్నిగ్ధపంకజదళములు తత్తనువుసోఁకినంతనభస్మప్రాయము లగుచున్నవి. చందనము పొడిపొడియగుచున్నది. చంపకసన్నిభవర్ణముగల పదార్థ మేదియైనను గాటుకరంగుగలదగుచున్నది. ఈపరితాప మిట్టిదని వర్ణింపఁజాలకున్నదానను.

అనినంత మఱొకరత్నమాల శ్రీకష్ణునిదాపునకుఁబోయి యిట్లు విన్నవించెను. మహాత్మా! కృపానిధీ! నీయనుగ్రహము